# పండరీ భాగవతము

[ద్విపద కావ్యము]

రచన

పుట్టపర్తి నారాయణాచార్యులు

ప్రతులకు
పుట్టపర్తి నారాయణాచార్యులు
కడప.

# పీఠిక

''మీా రేదియు పెద్ద గ్రంథమేల వ్రాయలేదు? ఇది చాల యేండ్లుగా – చాల మంది నన్ను వేసిన ప్రశ్న ప్రశ్నవేసిన వారే కాని–నా యుత్తరము విన్నవారే లేరు ఈ ''పండరీ భాగవతము'' వ్రాసి దాదాపు ముప్పది యేండ్లకు పైగా నైనది ఇరువదివేలకుపై చిలుకు ద్విపదలను వ్రాసియున్నాను కాని వీనిని గడ్డకు తెచ్చుకొను మార్గము కాలము గడచుకొలది–నా నిరాశ యెక్కువైనది, నిరాశతో వ్రాతప్రతి యందుపేక్షయు బెరిగెను ఆ ద్విపదలలో గొన్నిటిని చెదలు దిన్నవి కొన్ని నీటిలోఁ దడిసిపోయినవి ఇప్పుడు ప్రచురించిన ద్విపదలు యీా ప్రమాదములకుఁ దప్పి నిలిచినవి కొంద రీ రచనలను ద్విపదలని చప్పరించిరి వారికి చేనేమి బదులిత్తును? ఛంద పద్ధతిని జూచి రచనలపై రాగ ద్వేషములు పెంచుకొనువాడు– రసిక బ్రువుడు – అంతే

తెలుగు దేశములోని ప్రకాశకులు నన్ను దోచివేసిరి నే నిప్పటికి వ్రాసిన పుస్తకములు వంద కాని, వానితో ప్రకాశకులు ధనవంతులైనారే కాని – నా దారిద్ర్యము పోలేదు కాగా పోయిన సంవత్సరము – ఐదారు పుస్తకములు స్వయముగా వేసితిని వానిని కర్చుపెట్టుకొనుటలో కడపజిల్లా కలెక్టరుగారైన వి చంద్రమౌళిగారు యెంతో తోడ్పడిరి వారి యుదార హృదయమునకు నా నమస్కారములు జిల్లాపరిషత్తు డిప్యూటీ సెక్రటరీగారైన యానంబాక వెంకటేశ్వర్లుగారు సాహసముతో నాకు సహాయపడిరి వారిది వెన్నవంటి మనసు సెక్రటరీగారు తోడ్పడిరి కడపజిల్లా పరిషత్తు చేర్మన్ సూర్యనారాయణరెడ్డిగారు యీా ప్రయత్నమునకు తన చేయూత నిచ్చిరి పై యిర్వురి యుపకారమును స్మరింతును

అనంతపురం జిల్లా డిప్యూటీ సెక్రటరీగారైన పులికల్లు రామచంద్రపిళ్ళెగారును, విద్యాశాఖాధికారిణి కుమారి నంద్యాల లక్ష్మిదేవమ్మగారును, పుస్తకములు కర్చుపెట్టుకొనుటలో సాయ

పడిరి అనంతపురము-కర్నూలు-కడప మండలముల యుపాధ్యాయు లందరును దోడ్పడిరి కర్నూలు జిల్లా శాఖాధికారి అనుపూరు నాగ భూషణరావు నాకండగాఁ నిలిచెను వీరందరు నా కింతకుముం దొనర్చిన యుపకారఫలమే - యీ గ్రంథప్రచురణము

సాహిత్య అకాడమీ కార్యదర్శి దేవులపల్లి రామానుజరావు గారు నాకుఁ జిరకాలమిత్రులు సాహితీపరులు ఉదారులు వారు అకాడమీ పక్షమున మొదలు ''పండరీ భాగవతము'' నకై వేయి రూపాయలు మంజూరు చేయించిరి మరల నా కష్టములు చెప్పికొనగా సాహసించి రెండవ వేయి నిప్పించినారు వారికి నా నమోవాకములు అకాడమీ అధ్యక్షులు డాక్టరు బెజవాడ గోపాలరెడ్డిగారు నాకు చేసిన సాయము మరువరానిది వారి సహకారము లేనిచో అకాడమీ సాయము లభించి యుండెడిదిగాదు వారికి నా నమస్కారములు

సహృదయ కవి వై సి వి రెడ్డి నా ''పండరీ భాగవతము'' వ్రాతప్రతిలో నుండగనే పలుచోటుల చదివి దాని ప్రచారమునకుఁ దోడ్పడెను అట్లే మరికొందరును బాసటలై నిలచిరి వారి యుప కారమును మరువ జాలను

సిండికేటు (అనంతపురం) బ్యాంకు మేనేజరు నంద్యాల వెంకట సుబ్బయ్య నాకభిన్న మిత్రుడు అతనికి నిండు దీవెనలు దీనిలో కొంత భాగమును తిరుపతి దేవస్థానము వారు'సప్తగిరి'పత్రికలో చాల కాలము ప్రచురించిరి వారికి నా నమస్కారములు మా పాఠశాలలో నున్న వాటికిన్ సర్వాంగ సుందరముగ 'విఠలుని' బొమ్మ గీచి యిచ్చినాడు వానికి నా యాశీర్వాదములు శ్రీ ధనికొండ హనుమంతరావుగారు యెన్నో కష్టముల కోర్చి గ్రంథమును సుందర ముగ ముద్రించి యొసగిరి వారికి నా మనఃపూర్వక నమ స్కృతులు

ఇది భక్తి కావ్యము జరుగగల సర్వమునకును విఠలేశ్వరుని దయయే ప్రధానమై నడిపించును

''పుట్టపర్తి''

# విషయసూచిక

—o—

# పండరీభాగవతము
## (పుండరీక చరిత్ర)

ఓంకార వనజ పీఠోద్భాసమాన
శంకారవాత భక్తజనహృదాసీన
సవికృతసంధాన సతి సుఖాధాన
సవగుణగణహీన, సకలప్రధాన
విశ్వవిధాన , సంవిత్సుఖతాన
విశ్వసమాధాన విశ్వావధాన
విశ్వప్రదీప, విశ్వేలప్రతాప
విశ్వైకరూప, విభిన్నోపతాప
నీశ్వరవినుత మునీశ్వరహృదయ
ఖాస్వన్నభోంగణ బాలార్కమూర్తి
బోధావతారు, దుర్వాదనికారు
బోధైకసారు దుర్బోధ్యప్రకారు
గళిత వికారు విక్రమకళాధారు
సలలితశృంగారు - శమితాపచారు
క్షుంత రాక్షసవీరు సరసవిహారు
విపుల యశోహారు - విశ్వవిస్తారు
నాగమశాసార హంస నిధ్యాన
సాగరామృతము గోపీగణోరోజ
గంధిలవక్ష - వికచనేత్ర వనజ
బంధుర నీల దివ్యకటాక్ష పాత
సంచాలితామరీ సముదయ - విబుధ
సంచకుః గటితటీ సనదేశ హస్త

సకల ప్రశస్తు, శాశ్వతు, నజు, సగుణు
చక చక స్మృదుహాస చంద్రయోత్ఫుల్ల
లలిత గండస్థలు లావణ్యమూర్తి
ఫలితావతారునిఁ బండరినాథు
సన్మన్నిధానంబు, నతి భక్తిఁ గొలిచి,
విస్మయావహమూర్తి విమల సత్కీర్తి
విదళితార్తి సంవిత్పరిస్ఫూర్తి,
మద భరాలసనేత్ర మంజుల గాత్ర
పద్మసుందరవేణి, పద్మప్రదాత్రి
పద్మనాభుని రాణి, భావించి వేద
సద్మీకృతాంభోజ సముచతుర్వక్త్రి
త్రిదశ భాగ్యవిధాత త్రిభువనతాత,
సదమల మునిజాత శరణప్రదాత
భక్తసంచయ పేత, భవభయత్రాత,
సక్తమానసమున శతధృతిఁ దలఁచి—
కవికుల మానస కలహంస భావ
నివహమాల్యాంచిత నీరదపార
దావదాత శరీర సఖిల పవిత్రి
పావనగాత్రి, నళినసమాన నేత్రిఁ
జంభశాసన నిలింపవిభూష,
శంబరాఽజ్ఞాన, పంకహరాఽభిధాన
జ్ఞానప్రదాయిని, జ్ఞానైకమూర్తి
మౌని నిధ్యాన సభోదీరదమ్ముఁ—
దొలి మునుకుల నేర్పి కల కలఁ బలుకు
జిలువారు చిలుకతోఁ జెలఁగెడు దానిఁ
గవి సహృదయశాఖ్య కనకహర్మ్యమున
నివసించుదాని ఫణియచెక్కు. గిట
పలికించుదాని షడ్జ్వలసామసక్తి

లలితహస్తాబ్జ పాటల కాంతిఁ జేసి
తన యక్షమాల కౌస్తుభ నింపు దాని—
వనజగర్భుని తపఃఫలము మచ్చిత్త
ఫలకంబునను నిల్పి భారతీదేవి—
నెలవంక పూవు మిన్నేటి నెట్టెంబు
కుదురాకభోగులు మృదుల కటాక్ష
మధుర నేత్రములు వామాంగాయమాన
వామాక్షి వాసుకి వలయంబు - హస్త
భీమ త్రిశూలమ్ము వృథు సర్పరాజ
పట్టబంధం - బౌపపరిణైన వగవు
నెట్టన ధరియించి - నిబిడానుకంప
పొడవయి నిల్చిన పోల్కిఁ జూపట్టు
మృదురూపు లోఁ జూపు నిది పరీక్షించి,
నాయావలకు గీము నా చేయు నోము
నా యూర్పు నా చూపు, నాదు జీవనము
నా సకలంబైన నగవుల బరణి
నా పవిత్రి వినీత నా కేశమకుట
మణిఘృణి వేష్టిత మంజుల పాద -
నణిమాదివిద్యా మహౌషధ కలిత
కేళి భ్రూమధ్యస్థలీలోలమూర్తి
బాలికజన మతి భ్రమకరి యోగ
విద్యావిధాన సంవేద్య మునీంద్ర
బోధ్య ' సహస్రార పుష్కరకోధ్యఁ
కుండలినీశక్తి, గుహానిఁ జాముండి
ఖండేందుధర మనః కమల సౌరభము
మద భరాలసహాస, మంజుల భూష
మదిరావిఘూర్ణిత మృదితాక్షి మంజు
శింజాన మంజీర చిన్మయమూర్తి

గుంజావిభూషిత, కూట మాతంగి
మరకతశ్యామ, మన్మథరాజ్యలక్ష్మి,
గిరిరాజపుత్రికఁ గీర్తించి మ్రొక్కి—
తక్కిన దేవతాతతికి సద్భక్తి
నెక్కొన దలపించి నిటలంబు వంచి—
రామగుణగ్రామ రమ్యకాంతార
సీమ విహార రసికులైన యట్టి
వర కపీశ్వర కవీశ్వరుల భావించి—
యరుదార వేదమ్ము లటు విభాగించి
జగతికి నొసఁగి సాక్షాద్విష్ణుఁడనగ
నెగడి - పంచమవేదముగ వెలుంగొంద
భారతమ్మొనరించి భాగవతమున
సారవేదాంత విజ్ఞానమ్ము గుప్పి
కృతకృత్యుఁడయిన సుకీర్తి, మౌనీంద్ర
నుతమూర్తి, సంవిద్విధుత మనుజార్తి
విమలు "వేదవ్యాసు" వినుతిఁ గావించి—
కమనీయ కవితా వికాసంబులకును
నవ వసంతంబైన నానార్థ భవ్య
కవికులగురు వచోగతిఁ గీర్తి సేసి—
భాస-సౌమిల్లక-బాణ దిఙ్నాగ
భాసుర శూద్రక ప్రముఖ సత్కవుల
లలితవాణీ తమాలతికాటవీల
పులకాయమాన వాక్పుష్పుల నెంచి
ధరణీతలముఁ బూత మొనర్చు కొఱకు
భారతీదేవి పుంభావమ్ము పూని
పుట్టినట్టుల, రసమూర్తియై బిరుదు
గట్టిన కవుల సంస్కారమే కదల
రచన సేసిన మహారచక కోటికిఁ

ప్రచుర నాటక కర్త "భవభూతి" నెంచి
"ప్రవరసేనా"దిక ప్రాకృత సుకవి
నివహంబు మదిలోన నిలిపి కేల్మోడ్చి—
తులసీ పవిత్ర భాషల రామపూజ
సలిపిన [1] తులసి కంజలి ఘటియించి—
పుడి గంటము బూని పండరీశ్వరుఁడె
పసగొని లిఖియింప భక్తి క్రమముగఁ
గవిత లల్లిన పూత భవులఁ జిద్గగన
రవులఁ [2] దుకా ది సత్కవుల సేవించి—
తొలుదొల్తఁ దెలుఁగునఁ దొలకరివేఁ
బలుకు గోయిల గ్రొత్త పగ వస్తు కవిత
నక్షర రమ్యత నఖిల సూరులును
బక్షంబు సేయంగఁ బలికిన యట్టి
భట్టారకుని —నిరవద్య పాండిత్య
పట్టభద్రుని గుణభద్రుఁ దలఁచి,
తెలుఁగు కొలంబు నోములు పండఁ బుట్టి
తెలుఁగు బల్కుల తీపి తెట్టువ గట్టఁ
దలుపు వెన్నెల చల్లఁదనము లేఁజిగురు
నెఱపిన జిగి ప్రియాతరుణాధరంపు
జవి మలయానిల సారసౌరభముఁ
జెవి కింపయిన విపంచికల క్వణన
మొకచోటఁ గూడ భావుకులు తూగాడ
నకలంకమగు కైతలల్లిన యట్టి
నిక్కంపు యోగి, నిర్నిద్రానురాగిఁ
"దిక్కనామాత్యు" నాదృతిఁ గీర్తి సేసి—
మల్లికాపరిమళం బల్లి కొన్నట్టు

1 తులసీదాసు
2 తుకారాముడు మొదలైనవారు

అల్లి దెప్పెర అల్లనల్లన పిదప
కరణి - రచన సేయు ఘనుఁడు ప్రబంధ
పరమేశ్వరు"నకుఁ దన్నున మంజలించి—
యవికలావేశ విత్తాఢ్యులై - దేశి
కవితఁ బరిమళం బవఘళింపంగ
జానఁ దెన్గునఁ గూర్చి చనిన కళా ని
ధానుల - శివకవితతిఁ బ్రస్తుతించి—
పలికిన పలుకెల్లఁ బరమేశునెదుట
నిలిచిన దీపంబు కళికగా వెలయఁ
దలడింప విమతపంక్తులు వచోధాటి
కలఘు కవిత్వంబు లల్లిన శాస్త్ర
పరిణాహా గంధబంధురుఁడైన పాల
కురికి సోమున' కేటికోళ్ళు చెల్లించి—
దిననాథు సవతు నాచన సోమనాథు
మనమునఁ బలు మెచ్చు మలయంగ నొప్ప—
రాజాలకును గృతిరత్నంబు నీక
రాజరాజగు రఘురాము శ్రీ చరణ
వలయంబులో మాటి, వలగొన్న మేటిఁ
దలఁచి 'పోతన్న' స్వతంత్ర మానసుని
మరి యద్యతన కవివరశక్తి రక్తి
గుణుతించి - భావి విజ్ఞులఁ గుస్తరించి
భక్తుల దాసుండ భక్తుల లెంక
భక్తుల పడిగాపు భక్తిజీవనుఁడ
భక్తిగోత్రుండ - సద్భక్తి వంశ్యుండ
భక్తిచాపల్యుండ భక్తిబంధుండ
విదితాష్ట భాషా కవిత్వ నిర్మాణ
మదబంధురుఁడ కళా మహాత రాహవ్య
సేవధి - నవధాన చిత్రచణుండ

భావుకు లెల్లరుఁ బ్రమదంబు నొంది
'భళి భళి' యని మెచ్చ భక్తకుటుంబ
ములు దల లార్చి కన్నులను మోడ్పంగ—
భక్తభండారంబు పండరీశ్వరుఁడు
రక్తి దుల్కాడ సంభ్రమితుఁ డావేళ
మున ఘల్లు ఘలు ఘల్లు మని వలయములు
వినదింపఁ బ్రేంకణంబునఁ జూప రసము
యమకంబు గమకంబు - నమరిన జాతి
గ్రమ వాతాన్వయముఁ గారకముల సొంపు
పదులలోఁ దూగు నానుడులలో బాగు
నడకని గతియుఁ, జొప్పడినట్టి మితియు
ధ్వని యలంకార, ముత్తమ శైలి, పాక
మనవద్య మౌచితి యర్థవిన్యాస
మప్పుడప్పుడు గుప్పు గుప్పున వెడలి
ముప్పిరిఁగొన జేయ మోదంబు వివిధ
కోటికి రచియింతు ఘోర దుర్జన్మ
పాటన ప్రవణుఁడౌ పండరినాథు
గుణపరీమళములు గుబులుకొనంగ
నెనిమిది దిక్కుల నెంతయు వేడ్కఁ
బరమంబుఁ బండరీ భాగవతమ్ము —
నరు దరు దనఁదగు నా పురాణంబు
నకు మొదలెట్టి దన్ననుఁ బవిత్రంబు
సకల మునీంద్ర సంశ్రయమైన యట్టి
నైమిశంబనెడు గణ్యారణ్యమందుఁ
దామస రహితులు దత్త్వవిజ్ఞాన
సహితులు సమ్మోద మహితులు - సుజన
విహితులు మునులెల్ల విశ్వేశ్వరునకు
శాశత వేదవిద్యాస్వరూపునకుఁ

బ్రీతిగా సత్రంబు వేల్వఁ దొడంగి
గుమి గూడి విష్ఠంచి విమల పురాణ
సముదయ గూఢార్థ సముపేతు సతి వి
నీతుఁ దోషిత బుధవ్రాతు విఖ్యాతు
సూతునిఁ జూచి విస్ఫుటవాక్యములను
వని రిట్టు లో సూత! వినయాధినేత!
మునిజన గీత! మా పున్నెంబు వలనఁ
గలిగిన దీనాడు గలిమలాపహము
దిలకింపఁగా భవదీయ దర్శనము—
నీ వెఱుఁగని యట్టి నిఖిల పురాణ
భావంబు లెవ్వియు లేవు రూపింప
వ్యాసాదులగు మునీశ్వరులును నీవు
భాషింప వలతురు బహు ధర్మములను,
గావున మాపై నీఁ గనికరం బుంచి
వే వివరింపుము విస్ఫుట ఫణితి
దైవతక్షేత్ర తీర్థమ్ములు పరమ
పావనంబు లయిన తావెద్ది గలదొ!
అని యిట్లు మునులెల్లఁ దమఁగూర్చి యడుగ
వినమితమస్తుడై వనజోపమములు
గరములు మొగిచి-ఎంగళజటా భార
పరిణతశిరు, వారిధరనీలదేహ
కాంత కాంతిచ్ఛటాఽఽకలిత దిగంతు
దంతుర మృగచర్మధరు, మహాశాంతు
దండమండితు, మహోద్దండ పాపౌఘ
ఖండన కుశల తీక్ష్ణ కటాక్షపాతు
పాత్యవతేయు నిశ్చల భక్తియుక్తి
మత్స్యవహాతుఁ జేసి మనసారఁ దలఁచి
చిఱునవ్వు మోమున బెరయంగఁ బలికెఁ

పరమ పూరుషునకుఁ బ్రాణంబులార!
మునులార! విజ్ఞాన ఘనులార! పూత
తనులార! శాంత్యైకధనులార! కర్మ
పరులార! పరనయాకరులార! ముక్తి
తరుణీ స్వయంగ్రాహ ధరపుణ్యులార!
చనవు సేయుటెగాక సకల విజ్ఞాన
మునకు నాశ్రయభూతులనఁ జనునట్టి
మీ యెఱుంగని యది మేదిని గలదె!
నాయందుఁ గృపసేసి నన్నడిగితిరి
ధన్యుండనైతి హస్తమ్ములు మోడ్చి
మాన్యులు మీకెల్ల మఱి మఱి మ్రొక్కి-
పండరీశ్వరునకు భక్త్యైకధనున
కండజగమనున కతి ప్రీతి నెఱిఁగి
విపుల ధర్మవ్రాత విజ్ఞాతయైన
యుపగత కల్మషుండైన, విష్ణ్వంశ
మైన వేదవ్యాసుఁ డర్థితో నాకుఁ
దాను బోధించిన తత్త్వంబు వట్టి
పలుకుదు వినుఁడు సకలనాకిమౌళి
విలసిత నవరత్న వితతి పీరంధ్ర
రోచిర్విభాస విరోచమానాంఘ్రి
యాదాంత మన్మథుం డాదిదేవుండు
ప్రమథాధినాథుండు ప్రమథరూపుండు
ప్రమథిత రాక్షస ప్రభుకోటి కోటి
తాలక్తకాక్త సవ్యపదుండు విధృత
శూలుండు కలిత కంకాళుండు కాల
కాలుండు శాత్రవాఁధీలుండు భయద
ఫాలుండు-సంవర్తలోలుండు భువన
పాలుండు రమణీయలీలుండు భరణ

శీలుండు శ్రితదేవజాలుండు నీల
కంఠ ఘంటానాద కంపితాఘుండు
లుంఠిత భక్తార్తి, లోలార్కనేత్రుఁ
డతిదృప్త పరితృప్త వితత ఎకాద
సుతుఁడు రక్షఃపరివృతుఁడు హృత్కోణ
గతుఁడు మహర్షిసన్నుతుఁడు భక్తాఘ
ఘాతుఁడు వేదాంతసమ్మతుఁడు నందీశ
కృతచాటు వచనుండు హతవికారుండు
సతత శుభంకరుం డతులిత మూర్తి
భూతిభూషితుఁడు విభూతిశోభితుఁడు
భూతభావనుఁడైన భూతేశుఁ డెపుడు
కృపతోఁడ సాక్షాత్కరించి భక్తులకు
నెపమింత నెట్టక నిర్వాణ సుఖము
నెట్టన దయసేయు నట్టి యాకాశి
దట్టుదు మునులకుఁ దలమానికంబు
శైవాగమాచార జటిలుండు నిబిడ
భావనావిగళిత భవుఁడు నిపీత
జలధి గాంభీర్యైక జలధి యగస్త్య
పెలువాఱుచుండెడి సిద్ధాశ్రమమునఁ
దనపత్నితోఁ గూడ ఘన తపోనిష్ఠ
జనుపడ నిష్ఠించి దినములు గడప
వింధ్యమహీధ్రంబు వంధ్యగర్వమున
నాంధ్యంబు గ్రమ్మిన నఖిల లోకైక
దీపకుండైన యాదిత్యునితోడఁ
బావనిశ్చయమునఁ బంతంబు పూని
పెఱుగంగఁ దొడఁగినఁ దఱుగంగఁ దొడఁగె
పరమ భూసుర విధి ప్రణిహితాచార
ములు గాల గమనంబు దెలియని భానఁ

గళనేది జగతి భాస్కరరుచుల్మాపె
రిక్కలు రాలె విదుక్కలు దూలె
దిక్కరుల్ మ్రొగ్గె, దిగ్భిత్తులు వ్ర[illegible]
జలధులు దొనఁకె, భువలయంబు వ[illegible]కె
బలిలోకమున సర్పకులపతి దనికెఁ
గళవళపడసాఁగెఁ గంది ఘాతములు
కలగుండు వడసాగె గ్రహమండలంబు
దలసూవ కదఁగె సదాగతి వింధ్య
కుల మహీధరకూట కోటి ఢీకొనఁగ
ఖంగు ఖంగున దిశాకరుల కర్ణములు
భంగంబు నొందంగఁ బలుమఱు మ్రోపె
బ్రహ్మాండ భాండ మా పట్టున బెగడి
బ్రహ్మాది దేవతావరులు-ఊచ్చవడి
తమలోనఁ బెనవడి తమ తమకైన
క్రమమున యోచించి గణిలిజిఁ బడుచు
వారును వారును వైకుంఠమునకుఁ
బాఱి మెత్తనిపాన పరియంకమందుఁ
బవడించి దేవతా ప్రమదలు కమ్ర
నవనవోత్సాహ స్తనంబులు నిక్క
వీచోపులిడఁగ సంవిమ్మూర్తులైన
వాచంయములు రెండు ప్రక్కల నిలిచి
తన చెన్నుపైఁ గనుల్కవములు నిలిం
కొని చిత్రముల విధంబునఁ బొల్చియుండఁ
గనక గర్భతనూజుఁ డనురాగ భరిత
మనమున గాత్రమ్ము మహతిలోఁ గలిం
యావేశ వివశనాట్యమ్ముల తోడ
భావించి భావించి ప్రస్తుతింపంగ
నిత్యముక్తులు సమున్నిద్ర మానసులు

ప్రీత్యతిశయమున రెండు కన్నులను
నానంద బాష్పంబు లావరింపంగ
మేనులఁ బులకలు మిక్కిలి నొదవ
మోడుపుఁ జేతుల మ్రొక్కుచునుండ
వాడి చూపుల వింత వాలకంబమర
లలిత ముల్గటి మండలములు చలింప
ఘలు ఘల్లుమని మేఖలలు నినదింప
సరములు నిక్కఁ జూపఱకుఁ గాయ్యొక్కఁ
దరుణ గండస్థల ధరితస్మితములు
దిక్కుల వెన్నెల్దీవింప జేయఁ
జక్కని దెక్కులు విక్క లయాను
గతిగాఁగఁ జలియింపఁ గ్రమపాదమ్ము
లతి మనోహరరీతి వచ్చరలెల్లఁ
బ్రెక్కణమ్ముమఁ జూవ శ్రీదేవిగనుల
నెక్కొన్నచూపులు వీలముల్గఱియఁ
దన పాదముల పై పుదగఁ గూరుచుండి
యనువుగాఁ బరిచర్య లాచరింపంగఁ
గొలువు దీర్చినవానిఁ, గోటిసూర్యులను
జాలుకవ పేయు కాంతులు గలవానిఁ
బొడమూపధాకున్న బొడవులవాని
గడలేని వాని-నెక్కడ నున్నవాని
గుణములు లేకున్న గుణములు వొంది
గుణవోశి ఘాయలఁ గురియించు వానిఁ
గలిగియులేని సకల లోకములను
గలిగించి-వెలిగించి-మలగించువానిఁ
జిక్కి చిక్కనివాని నొక్కటి వెలుఁగు
నెక్కటి-బగుతుల-దిక్కైనవాని
విడుదఁ గన్నులవాని మదురాజానేలు

నడుమున గనుపట్టు వసనంబు వాని
నెగు భుజంబులవాని నెమ్మొదాలంపు
నగల నవ్వులగల వాతెఱవాని
జిలుగు దప్పటివాని శ్రీవత్సకాంతి
కలకల లాడు వక్షః స్థలివాని
వెడఁద కౌక్కిలివాని-విశ్వవిశ్వములు
గడుకొని రక్షించు నెడగలవాని
సరిలేనివాని నిశ్చల మైనవాని
సరగఁ జెక్కులజాలు జవ్వాదివాని-
భువనంబు లేవియుఁ బొడలకమున్న
భవుకాలి గజ్జెలు పలుకకమున్న
జలధులు సర్వంబు నెలయకమున్నఁ
గలయంత జగతిఁ జీకటి రాకమున్నఁ
గమలంబు బొక్కిటఁ గదలక మున్నఁ
గమలోదరుఁడు శ్రుతుల్గఱపకమున్న
వటమున్న వటమున్న వటమున్నమున్న
వటపత్రశాయియై బొటవ్రేలి నోటఁ
జవుకుచుఁ దానొక్క శిశువు పోలికను
భువనంబులను బండి నవ నవ రీతిఁ
దనలోనెఁ దానవ్వి, దానికినవ్వి
తనరూపె దాఁజూచి, దానికి నవ్వి
తనపల్కె దావిని, దానికి నవ్వి
తనచేత దానెంచి దానికి నవ్వి
నవ్వుపుట్టుకఁ జూచినవ్వి క్రీడించు
నవ్వి శ్వకారణు నఖిలాఁఖి గమ్యు
వేదాంత వేద్యు, సంవిన్మూర్తి, భేద
వాదాఽవిషయు, భవభేదన ప్రవణు
విశ్వేశు, విశ్వాత్ము, విశ్వైకనిలయు

శాశ్వతానంద సంశ్రయు గుణాఽతీతు
సగుణు నిరంజను నిగడితభక్తు
నిగమాగ మాధీను సగణితకీర్తి
నవ్విష్ణుదేవుని ననలారఁ గాంచి
చివ్వ నఁగరములుపేర్చి మస్తములు
వంచి వందించి గీర్వాణ సంఘంబు
లంచిత మగుభక్తి నాత్మలు గరఁగఁ
బులకలు దనువులఁ దిలకంబులొత్త
నిలుచున్న, నపుడింద్ర నీలాచలంబు
చఱుల నెక్కొన్న చందురుని వెన్నెలల
తెఱఁగున నవ్వువా తెఱఁ గ్రందుకొనియె
నవ్విష్ణుదేవున, కద్దానిఁగాంచి
యువ్విరించి దలంచి యఖిలగీర్వాణ
గణము నివారించి, కమలాక్షుఁగాంచి
వినయ మాధ్వీకమిశ్రణమున మివులఁ
జవిఁగొల్పువాక్య పంచయములఁ బలికె
భువన పావనమూర్తి! పుణ్యైకవర్తి!
సదమలకీర్తి సంవిదిత లోకార్తి!
మదవినివర్తి! సమ్మద పరిపూర్తి!
జయభక్త మందార! జయదుష్టదూర
జయ జగదాధార! జగదేకవీర!
జయ నిత్యకల్యాణ! జయజనత్రాణ!
జయఫాల దృగ్వాణ! సద్గుణాఽధీన!
జయవార్ధి పుత్రీశ! శమితాఽఽసురేశ!
జయభవ భయనాశ! జయసుప్రకాశ!
జయ మహోత్పలనేత్ర! జయఘుచారిత్ర!
జయ నీలపృథుగాత్ర! జయమోక్షసూత్ర!
జయభక్త సంరక్ష! జయకృపాఽధ్యక్ష!

జయ సురశత్రు ఖండన దక్ష వీక్ష!
విమల మౌనీంద్ర సంవిన్మూర్తి! గనుము
గమనీయ తరములు గన్నులనెత్తి
మమ్ము నీ వారిని మా తొలివేల్పు!
నెమ్మనంబులు మోదనిర్భరముల్గాఁగ
దేవాది దేవుండ! దేవతా వళికి
నీ వెరక్షకుఁడవు మావెతలెల్ల
నీవెగాకింకిట నిలుకడె గాఁగ
నేవాఁడు విని తీర్పనెక్కాటి గలఁడు?
ఆలకింపుము వింధ్యమత్యావ లేప
లోలమై త్రిభువన పాలకుండైన
దివస నాథునితోఁడఁ దెగమచ్చరించి
భువనంబులన్నిటి (భౌరినాత్ర) మించి
గగనంబు దూటి ఖగణులోక మొరసి
తగ నాకలోకంబుదాటి సత్యంబు
వెనుకకుఁ దన్ని నిర్వేలప్రకాశ
మునను వేధోండంబు మొనపదట్టించి
పెరిగిన దీని యచ్చరులకు నింకఁ
దిరుగ భూములులేవు దివసనాథునకు
గమన మార్గము లేదు_గగనంబునందుఁ
గ్రమమైన గ్రహముల గతులునులేవు
వెలుఁగులేదింక భూవలయంబునందుఁ
జెలఁగవు భూసురావళి నిత్యకర్మ
ములు మారుతాంకూర చలనంబులేదు
నిలయెల్ల నీరువోయినది లేదొక్క
ప్రాణియుఁ బ్రాణంబుతోను సంవర్త
మీనాడె దోచివచ్చిన దోదేవ!
యునేమి గావింతు నింక నా సృష్టిఁ

గావిత్తువో! లేక కన్నులు మోడ్చి
పవళించువో! లోకపాలకుండవో!
కవిసిన చింత్యంబో! కమలాధినేత!
దయసేయు మనివంత దైవతలోక
భయ నివారకుఁడైన పవనాయతాక్షుఁ
దల్లిన మొగమెత్తి పుల్లంబులైన
మొల్లలు సల్లినపోల్కి-దయార్ద్ర
ములు గటాక్షమ్ములు నిలిపి-పన్నీరు
చెలువొప్పనంతటఁ జిలికించినట్లుఁ
బలికె నీగతి జాలిఁబడనేల తల్లి
నిలుచునే నాదైవ నియతి వింధ్యమ్ము
పెరిగినంతటన? భూసురకోటి పేగిఁ
బెరుగంగనిత్తునే! యరసితి మున్న
ధరణీ ధ్రగర్వంబు దలఁగు నపాయ
మరుగుండు నా యాజ్ఞ, శిరములఁ దాల్చి
నా యగస్త్యునికడ కాతండు ప్రీతి
మీ యాపదలు దీర్ప మిన్నక యిపుడ
యని యిట్లు వచియించ నఖిలాగమాంత
వనజవనారుణుండనఁ బొల్చినట్టి
యక్కమలాక్షుని కజుఁడు గేల్మోడ్చి
తక్కొన్న భక్తి వందన మాచరించి
కదలిన వెనువెంటఁ గదలిరి సురలు
మదులు సమ్మదమున మదియించి మొదల
నంత సురశ్రేష్ఠు డఖిల గీర్వాణ
సంతతితోఁ గూడ చరసరఁబారి
శర్వుండు దయతోడ సాక్షాత్కరించి
సర్వుల నిజ జూట చంద్రమః కిరణ
నికర నిష్యందిచంద్రికలతోఁ, దరుణ

వికచాబ్జ నిభనేత్ర విగళితాఽపాంగ
ములను, శారీరకమలములఁ జిత్త
మలముల నడఁచి నిచ్చలును రక్షించు
నట్టి వారాణసి నప్పుడు చేరి
చెట్టు చెట్టున వ్రేలి చిందిల్లు కాని
గోవణంబులఁ గాంచి గుప్పెడుదా?
భావజ సంహార ప్రస్తుతి గీత
వినదంబులనుఁ బ్రతిధ్వను లీనుదాని -
మిను గప్పుకొను హోమమేచక ధూమ
తతిచేతఁ బాప సంతతిఁ దోలుదాని
సతి ముగ్ధ మునికన్య కాంతలమ్ము
లందునఁ బండి రోమంథమ్ము సేయు
సుందర మృగసత్త నందమౌదాని—
వటుజన స్వాధ్యాయ వర్ణంబులెల్లఁ
బరియించు శుకమ్ము పత్రిల్లుదాని
నలువొప్పఁగా మహిమ్నస్తోత్రములను
మలియు నిందిందిరంబుల నొప్పుదాని—
ఖగ గర్వ నిష్కుట గళితపీవార
నిగదిత జీవకాంతియయిన దానిఁ
బరమ పవిత్రతలోపాముద్రపైన
చరణ చిహ్నముల, సుభద్రమైన దాని
మునిగీయమాన వేదనినాద నిభృత
తమ సమీర తరంగ తతి వీచుదాని
సిద్ధాశ్రమముఁ జేరి, చిరతపోయోగ
సిద్ధ కాంతిచ్ఛటాఽఽబద్ధాఽపఘనుని
శాంతి కరండ నిశ్చల నేత్రదృష్టి
తంతు సంధానితోత్తమ కుటీతలుని
రుద్రాక్ష భూతి వినిద్ర ముద్రాఢి

ముద్రిత కృతిత సంపూతావయవుని
లలిత కిపాల పాటల జటాగ్రంధి
కలిత హేమకిరీట కాంతిపై భవుని
ప్రతిశివనామ సంభవదార్ద్రిపులక
ప్రతతిని గూహిత వత్స ప్రదేశు
ప్రతిశివనామ సంభవదార్ద్రిహాస
వాతచంద్రికా వితానిత పురోదేశు
ప్రతిశివనామ సంభవదార్ద్రిబాష్ప
వితతి ముక్తాశితలిత హృదాకాశు
ప్రతిశివనామ సంప్రభవదుత్సాహ
గతి తరంగిత కాయకాంతి విశేషు -
ప్రతిశివనామాంకురితర పావేశ
గతనై జ రవకంఠ ఘంటానివేశు
లోకైక ధన్యు, త్రిలోకాఽభిమాన్యు
భీకరమన్యు, నిర్భీక చైతన్యు
విగత మాలిన్యు సంవిద్భాగ్య గణ్యు
న గణితపుణ్యు, దయైక శరణ్యు,
ప్రమథస్వరూపు, నిర్మథితోపతాపు
ప్రమిత చంద్ర కలాపు, ప్రమదదాఽఽలాపు
బరమ శివాఽఽచారు, భయద హుంకార
భరచలిత విమత భాగ్యవిస్తారుఁ
బంచాక్షరీ మంత్రపరు, లలాటాక్షి
వంచితమధుర శివాఽఽకారు, ధీరు
నయ్యాగస్త్యునిఁ గాంచి హ స్తద్వయమ్ము
చయ్యనఁద నశిరస్థలినిఁ గదించి
మ్రొక్కుచు నిల్చె నిరూపింప నీడు
దక్కువెక్కువయను తారతమ్యంబు
బరమపవిత్ర శాంభవపై ధదీక్ష

పరుదారఁ బొరయని యట్టి తేజమ్ము -
గనులెత్తి చూచె నగస్త్య యక్కమల
జుని మఱి దక్కిన సురసమూహమ్ము -
వెలఁది వెన్నెలతేట గిలకొట్టినట్టి
యెలనవ్వుఁ దలుచు తెప్పల మస్తరించి -
ప్రవిమల భక్తినం గతపులకాళి
కవచిత తనుఁడౌచుఁ గడువడిలేచి
తొడరి లోపాముద్రతోఁగూడ నజుని
యడుగులఁబడి తక్కనమరప్రవరుల
కెరఁగి పాద్యాది సత్క్రియలుగావించి
సురుచిరదర్భ విష్టరములయందు
నుపవిష్టులనుఁ జేసి, యొక్కంత ప్రౌఢ
విపుల సల్లాప సద్విధి పేదదేర్చి
వినయ, మానతమైన తనువందు, నిదుఁద
కనులందు మృదుగళ ధ్వని యందుఁ బొందు
పడగ రూపెత్తిన బత్తియుఁ బోలెఁ
గడఁగి బ్రహ్మను గాంచి కలశజుం డనియె,
వందనం బిదె చిదానంద! గోవింద
నందన! సురబృంద వంద విధాయి!
శరణంబు లోకార్తిసంహార! మోహ
హర! యోగిదహర పుష్కరమధ్యవర్తి!
చిన్నశరీ శోభశృంగారరూప
వెన్నెలకోలు! నిర్వేలానుభావ!
యేటికోళ్లు! గుణత్రయోద్ధస్వరూప!
కూటస్థ! వేద నిష్కుట పరభృతమ!
పంచతన్మాత్రరూపా! నమస్కార!
మంచిత కర్మేంద్రియాతీత! పంచ
బుద్ధీంద్రియాతీత!—భూమ్యాదిక ప్ర

సద్ధ భూతాఽతీత!—సద్ధిస్వరూప!
విషయస్వరూప! నిర్విషయ! విజ్ఞాన
విషయ! మోక్షానంద విషధి! భవార్తి
విషబాంగలిక! పూత! విశ్వాఽప్రతర్క్య
సన్నుతమూర్తి! విజ్ఞానసంపూర్తి!
సుషమాపరిష్కృత! శుద్ధకర్మాధ్వ
తోష స్వరూప! నిరీషణ! ముక్తి
భూషణ! సందేహదూషణ! భక్త
పోషణ! భక్త్యబ్ధిపూషణ! దుష్ట
భీషణ! శ్రుతితతి భాషణ! లోక
తోషణ! మునితపస్సుందర ఫలమ!
యాశావ్యమయ్య! మీ యాగమనంబు—
బహుతపంబులనైన, బహుళయాగాది
విహితనిష్ఠలనైన విధి బద్ధయోగ
మహితశ్రమలనైన, సహరహరుదిత
బహుజపంబులనైన, భక్తిమార్గముల
నైనఁ దాంత్రికములనైన, త్యాగముల
నైన, వ్రతమ్ములనైన నిట్రులను
నైన, పునశ్చరణంబులనైనఁ
గానరానట్టి లోకదగల నీవు
పొడసూపితివి ముందుఁబొడవయి నేడు
గడముట్టె నాపుణ్యకర్మంబులెల్ల
గంగసంగువు పై నీఁగడుకొని పాఱు
భంగిగానయ్యె సర్వేశ్వరాగ్రూప!
జలధికిఁ బాద్యపూజావిధానంబు
సలిపి, యొప్పింపంగఁ దలమగునేమి!
దినకరునకు నికర్తనునకు దీప
గణములచేఁ దృప్తిఁ గలిగింప నగునా!

కొండంతదేవునకును బ్రయత్నమునఁ
గొండంత పత్త్రిరిఁ గూర్పఁగాఁగలమ్మోక్షి
యఖిలస్వరూపున కఖిల శక్తికిని,
నఖిలనిదానున కఖిలైకకర్త
కీ నీకు మా సాయమెంత! మాశేము
షీ నిపుణతయెంత! చేసెడు భక్తి
యెంత! చూపెడు శ్రద్ధయెంత! సన్నిష్ఠ
యెంత! శక్తియదెంత! యెంత మాకూర్మి!
యౌపచారికముగా నడుగుచెగాక
బాపనివర్తి! సద్భావప్రవర్తి!
యడుగుచున్నాను, నాయడుగునీదొసఁగు
నిడఁబోలదయ్య మీయెడను, నియ్యెడను
బాలచాపలముగా వగచి—సత్కరుణఁ
గిలించి—బదులివ్వఁ గృతమతి నగుదు—
వినవచ్చునో మీరు విచ్చేసినట్టి
పని! వినఁదగునేనిఁ బ్రార్థింతుమిమ్ము
సెలవిండు! నాసేయుసేవ గల్గినను
దలఁదాల్చి యానతిఁ దలకూర్తుననుచుఁ—
దరువాత నరఎణోదఁరుడు—విజ్ఞాన
పరిపూర్ణుఁడగు ఘటభవుఁడన్నయట్టి
నుడువులు—పెఱతేనె మడువులు—కూర్మి
పొడవులు—దనహొర్తి తొడవులు—నెఱిక
కడవలు—వినయంపుఁబడవలు—శ్రుతుల
మడవలు—దుష్టపొప్పడ నాలకించి—
యెనిమిదికన్నుల నినుపారి మిపులఁ
దనుపారు జూపులఁదనవు వీక్షించి—
చెలువొప్పనప్పుడ చేయప్పళించి
బలు మొగంబున నిట్లు బలికె విధాత—

పరమర్షి! రమణీయతర వినయమునఁ
బరిగుప్తమై జ్ఞానబంధురంబైన
నీయుక్తి పేశల నీరదాఽఽవాత
మై, యింపువింపు సుధాంశునిరేఖ
వలె, నఱగప్పనత లిరుల వెనుక
వెలుఁ గావులనమ్ము విరిగుత్తివోలెఁ
గరము మాచిత్త మాకర్షించె—జ్ఞాన
భరమెల్ల నిమఁజేరి చరితార్థమయ్యె—
అదెచూడు! సమ్మీలితాక్షుడై, దీన
వదనుఁడై కూర్చున్నవాఁడె జముండు—
హుతవహుండదెగాంచు! వితతకీలుండు
గుత గుత యని లోనె కుములుచున్నాఁడు—
శక్రుఁడాతండె! నిర్వక్ర విక్రముఁడు
నాక్రమితుండయ్యె నలజడి చేత—
వరుణుఁ డాతండె నిష్ఠురపాశుఁ డిపుడు
పెరపేది—మినపేది—నరయుచున్నాఁడు
యాతుధానుండదే యటుసూడు! శోక
పీతప్రభుఁడు—కప్పువీటఁబోయినది
పవనుఁడవ్వాఁడె తీవ్రావ మానమున
నెవమించుచున్నాఁడు నిట్టూర్పుఁ బొగలు
వాఁడె కుబేరుండు! వనట యంతయును
గూడు గట్టినమూర్తి—గూరుచున్నాఁడు
వలిగిన చంద్రమః కళగల్గి—మత్త
మిలవంచె వీణామఁడీతఁడే సుమ్ము!
మఱిసిద్ధసాధ్య కిన్నరవర ప్రముఖు
లిరఁగెలంకులవీరె! యిరుమల జడిసి—
మునులెల్ల వీరె చిద్ఘనులు పవిత్ర
తనులు—క్రియానిష్ఠ దళిత మానసులు-

వీరెల్ల నీప్రాపు వేడంగఁజేరి
వారిట పెద్దగా నమ్ముఁ గీల్కొల్పి—
యిందఱుపకార మిపుడు నీ వలన
సంధిల్లవలె లోక సౌఖ్యంబుగూడఁ—
దరువుల ఫలములు దనుపారిపండఁ
దరువులు ఋజియింప దొరకొనునేమి?
జలదంబునందు నీళులు పెచ్చుపెరుఁగ
జలదముల్ద్రావునో జనములకిక!
సజ్జనుల్గావించు సర్వతపమ్ము
లిజ్జగముల పేమమిచ్చించి గాదె!
యటుగాన జగములకై నట్టిసేగి
పటుబుద్ధి! నీవనివారింప వలయుఁ
బరికించితివొ లేదొ! పరమర్షి! వింధ్య
ధరణీ ధరమ్ము భాస్కరునకు నలిగి
యంతబ్రహ్మాండమ్ము నావరించినది
చింతింపు మొకదారి పెలఁప వింధ్య
మదముదూలింప నమరులఁబాలింప
ముదము పెక్కువజగమ్ములను దేలింప-
లోక హితంబైన యాకార్యభరము
వీఁకున గాని ఎఱవీఁకు లేకుండ
నిర్వహించెడువాఁడు నీవు దక్కంగ
సర్వదేవతలకు సకలైకనేత
వాసుదేవునకు నెవ్వరుఁ దోచలేదు
ప్రాశితజలధి! దబ్బఱమాటగాదు
దనుజారి పనుపుచేతనె సురౌఘమ్ము
మునులు-నీ సాహాయ్యమును గోరివచ్చి
రెటులైన నీ కార్య మీడేర్పవలయు
కటకీకృతశ్రుతి! కమలనేత్రుండు

పనిచిన సమ్మతింపక యుండనగునె!
మునిశిరోలంకార! బోధావతార!
యన నంతఁగల శిష్యుఁడల్లంత ప్రొద్దు
విమజాచి మమజాచి కమఁగవమోడ్చి
యోచించి వేఁడి నిట్టూరుపు పుచ్చి
యాచితంబైన కార్యంబు సాధింపఁ
దనచాలుటయు నిందుధరుఁ బాఎపోవఁ
దనచాలమియుఁ దెల్పు తలఁపులోఁ గలిగి
యగుమలో భావశిక్షై పట్టి యిట్టి
యగచాట్లు వారింప నగుమ శ్రీ విష్ణు
నా పతియొనరింప నా మహాదేవుఁ
దేనన్ను నియమింప నింకనొండేమి?
గాని శాపంబివ్వఁగాదు వింధ్యమున
కేవిష్ణు దానిచేనింతు నాయోర్మి
క్షమలేని తపము నిక్కము నితయందు
రమలినచిత్తులై పట్టి సంయములు
మఱి వయమ్మునఁ జెప్ప మాన్పింతునన్నఁ
దరముగా దతిదర్పదశి తచిత్తులకు
సామంబుహోవ్య భజనమౌను-గానఁ
బాములవలెఁ గఱువకయున్నదైన
విషము గుప్పెదువన్లి బుస కొట్టవలయు
నవలార నే నిప్పుడా వింధ్యశిఖరి
కడకేగి' యోనత్స! నరుసంగఁజాలఁ
బొదవెక్కుడగుటచే పడిఁదగ్గుమన్నఁ
దగ్గునాతఁడు భయంబగ్గలింపంగ
నగ్గిరీంద్రముఁ జూచియనవలెనింక
నసఘ! దక్షిణ దేశయాత్ర గావించి
పునెమఁ బండించినేఁబోదునో యేమొ

వారాణసికిని నా వచ్చెదు వటుకు
నీ రీతినే యుండు మీ నియమంబుఁ
దప్పితివేని దగ్గ మొనర్తుగావ
మప్పుడ యొసఁగి యటంచు నేమఱల
రారాదు నెనుదిర్గి వారాణసికిని
నీరీతిగా నెఱవేఱు మీ వ్రతము
గాని ప్రాణములంత ఖండేందుధరుని
నేను బాయఁగనోప నిను నమ్మగాని '
యని పల్కిన యగస్త్య వటిపీఠపేం
సమజగర్వుఁడు గాఢవాత్సల్య మొనరఁ
బలికెనీగతి సుధాకలిత వాక్యములు
కులపతి! విజ్ఞాన జలధి!-ఈ కిట్లు
సామాన్య మానవ సాదృశ్యమొనర
నీ మాటలాడంగ నెట్లు సెల్లినది
వైరాగ్యమున సర్వవాంఛలు గోసి
ధీరులై -వడివన్నవారు మీవంటి
వారెమోహము నొంద ధరణి నింక
నేరు మోహాదుల నింకింపఁ గలరు!
యా పశుపతి యఖిలాంతరస్థుండా!
వ్యాపకుండేకత్రవర్తి దానగునా!
యొకసారి నీ మది యోచింపనయ్య!
సకల విశ్వాత్ముండు, సకలాఽధినేత
సకల హృద్గృహవాసి, సకల విషయుఁడు
సకల చిన్మయమూర్తి, సకల కారణుఁడు
లేనట్టి తావెందు లేదంచు నేఁడు
నేను గ్రొత్తగఁ జెప్ప విశ్వమింపుదునా!
వెలి చూపుఁగాక లోపలిచూపుఁ బూని
తిలకింపు నీ చిత్త జలజంబునందె

వెలుఁగుచునుండు నిప్పులు దీపకళిక
వలె మానితానంద వనకోకిలమ్మ-
అది గాక జగములకైన యాపత్తు
మదిగదింపకయు సామాన్యుల యట్లు
స్వార్థమ్ముఁ బూనిన సకలమునీంద్ర
సార్థమ్ము నిన్ను నేసరికతోఁ గనదె!
తీర్థభూతుఁ డవింత దెలియంగలేవా!
స్వార్థమ్ముకంటె పరార్థమ్ము ఘనము
గదలి రావయ్య! లోకములెల్లఁగంది
ముదమేడినవి వింధ్యమదమునఁ బెగడి-
నిఖిలలోకమ్ములు నీయశోగరిమ
సుఖితులై గీర్తించ శుభసమయమ్ము
దనకుఁదావలచి ప్రాప్తముగాఁగ నేర'
వనెదవె! చాపల్యమున కోహటించి
జడునట్లు శ్రోత్రైక శరణుడైనట్టి
మృడునకు నీవని మిక్కిలి సేవ
యని యిట్లువన జాతశమ జాతుఁడంతఁ
బినుపడ విజ్ఞాన వాదమ్ముసేయు
ఘటసంభవునకు వణంపదబాష్ప
పటలమ్ము జటిలమై బర్వెఁగన్దోయి
నాఖింగునొకచేత నల్లనఁదుడిచి
జావదిగ్ధములు వృదాకుదీర్ఘములు
వదుపులుగట్టి నిశ్వాసముల్వెడలఁ
బదరవాకేలి-దుఃఖమ్మృదితమై నిలుపు
కళనేద గాద్గద్య కలితవాక్యముల
జలజసంభవునితో నరి' మీ యనుజ్ఞ
సేకొంటి ననిరెండు సేతులుమోడ్చ
వాకొకసులు మహానందంబుతోడఁ

దలలనల్లార్చిరి ధాతయుఁ బ్రేమ
విలసితంబగు కంట విధుశేఖరునకు
నమఁగై నమునిఁ జూచియార్య! మేనింకఁ
జనియెద మన్న వాచంయమిశ్రేష్ఠుఁ
డల్ల ననల్లార్చె నక్షిద్వయంబు
నెల్ల దేవతలతో నేగెవిరించి
పదపడిమౌనిలో పొమ్రుదఁగాంచి
మదిదుఃఖ వివశమైయదవదలాఁడఁ
గనుఁదోయి దృష్టనాకట్టి జలమ్ము
దనకరమ్ములు రెండు దలఁబూన్చి పలికె
 వినినావొ లోలాక్షి! విధుసూనుజాణ
తనము మాటలయందు. దైవతగణము
దయసేఁ వచ్చిన దానికారణము?
నయవిశారదులెల్ల నా కాకసులను
దిష్టఁగాఁ దప్పించికొన్నారు దాము-
నన్నేరికొన్నారు నాతి! యిప్పనికి-
సకలలోకాధీశులకు విబుధాళి
కొక కొండ మచ్చర ముడివింపు చెంత!
దురితరాక్షస మహత్తర కంరదళన
ఖరకోటి, హరికోటి, వరశతకోటి
శతకోటి సమసుదర్శనమున్న దివిజ
తతిపాలకునకు నా దామోదరునకు
సాధ్యంబుగాలేదొ! విధ్యగర్వంబు
వంధ్యవిక్రమమున వారించుకొంటకు?
సాధ్యంబుగానల్లె చపలాక్షి! ఎద్ద
సాధ్యాదులగు వియచ్చరనికరంబు
బదుగుబాపనిఁ జేరఁ బంపించినాఁడు
మదువంగనేల విష్ణునిపాడియింత!

నతని యానతి దాట నర్హంబుగాదు
సతి! నాకుఁ బార్వతీపతికి మిత్రుండు
హరిహరు లిరువు రేకాకార మనుచుఁ
బరమార్థ విదులైన పురుషుల హితవు
గావున—విష్ణునాజ్ఞను శివునదిగ
భావింపవలె ముని భావిత రీతి
వారాణశీశ్వరుఁ డీ రూపమునను
సారసనేత్రి! యాజ్ఞ నొసంగినాఁడు
నామదిలో నేమి నలుసుదోచినదోఁ
సోమార్ధధరునకుఁ జూడవే బోటి!
నేటికిఁ గాశికా నిర్మల భూమిఁ
జోటులేదని నాకు సూచించినాఁడు
నని యట్లు పవపెడు తనభర్తఁ జూచి
వనితావిభూష లోపాముద్ర భర్తృ
చరణయుగధ్యాన పరతంత్ర వృత్తి
ధరణి జనించిన దాక్షిణ్యగుణము
ఫాలస్థలము గిలుబాడెడు పలక
జాలమ్ము నొకచేత సవరించికొనుచు
నొకవైపుఁగను బొమ్మనున్న మితంబు
సకియ గావించుచు క్షణము యోచించి
యోచనానంతరమున నొక కొంత నవ్వి
వాచంయమిని గాంచి వచియించె నిట్లు
సకలవిజ్ఞానైకశరధి! గాంభీర్య
వరిధి! ఏ వెఱుఁగని బహు ధర్మములను
నే నెఱుంగఁగ నేర్తునే! యేటిమాట!
కాని నా దొక్కటి గలదు విన్నపము
వారాణసీపురిఁ బాయఁ జేయుటయె
యారాజశేఖరు సభిమతంబైన

జంకనేటికి! జంకిసాధించుకేమి?
యంకమై నిలువంగ నగునా భక్తులకు?
పరమేశ్వరుని మనోభావమ్ము నెదిరి
తిరుగంగ నెవ్వారు దిట్టలు గలరు?
అదిగాక జగములకై పట్టి వేగి
వదలింపలేని తపంబు పన్నదుగ
ఫలహీనమందుచు పరుల దుఃఖమ్ము
నలతిగాఁ జూతురే! యధ్యాత్మవిధులు!
వినఁబడఁగాలేదొ! వింధ్యపర్వతము
ఘనమదన్ని పెరిగిన మిక్కిలి భయము
దముఁ బొదివిన దుఃఖదళిత చిత్తముల
శ్రమఁజెంది ఘోషించు జనుల రోదనము!
గదలలేదొకపిట్ట గాలియుఁగూడ
మెదలలేదిటులున్న మేదినిపైని
బ్రదుకంగ నోపుదురా! మర్త్యగణము!
కదలుము వేవేగ గర్వాంధ వింధ్య
పర్వతాటోపమ్ము భంగింపఁజేసి
సర్వలోకములకు శాంతిదానమ్ము
గావింపు నీ చేయు గహనతపమ్ము
గావింపు నేఁడు నిష్కలుష! సార్థకము
విశ్వసంపూజయే విశ్వేశుపూజ
విశ్వాత్ముఁడతఁడు సంవిదితవిజ్ఞాన!
యింక నుపేక్షింప నెంత కిదౌనా!
శంకింప నేటి కి సమయంబువందె
బదఁడు పోదమ టన్న భార్యవీక్షించి
యదవదమైనట్టి యాత్మనాకింతఁ
గుదుటపఁ గొనితెచ్చి కులపతి యంత
సుదతి! నీ విజ్ఞానసూచకంబులగు

మాటలలోఁ గొంత మదిదేరుకొనియెఁ
బాటిగాఁ గొందు నీవాక్యమ్ము-బదము
నేఁడ ప్రయాణమై నియతినటంచుఁ
గూడియుండెదు వటుకోటి రావించి
తనతోడఁ గదలంగ వసుమతి పేపె
ముని గొందఱిని దక్క- మునికుమారకుల
నచటనే నిలచి నిష్ఠాంచితు లగుచు
నచలిత తపము సేయఁగ నానపెట్టెఁ—
దమయాశ్రమము వీడి తరలుచున్నాఁడు
నమితాఽమరేశుండు-శమదమరిక్థుఁ
డ య్యగస్త్యుం డను నా వేడివలుకుఁ
జయ్యన నెవరేగి చాటివవారో!
మునితతిశోకమహామచే, ఘనవింధ్యగర్వ
జనితదుఃఖ మొకింత చవిచూడనట్టి
యయ్యాశ్రమములోని యఖిల జీవాళి
యయ్యవసరమున నలమటఁగుందెఁ—
బారి మేయదు చింత గూరి సారంగి
మోర పై కెత్తి మబ్బులఁ దిలకించెఁ
గరము ముడ్చినది కుంజరము-కిసాల
పరివార మల్లన భక్షింపఁబోదు-
మూగవోయినది-సమ్మోదంబుతోడ
రాగంబు వాడదు భ్రమరాంగనయును
తెక్కలార్చదు మెడ నిక్కించి శవదు
వెక్కలి మ్రోఁగమ్ము వెట్టెఁ గిరమ్ము
సరసులలోనున్న సరసిజపంక్తి
విరహాదిగ్ధమ్ము-వాతెఱవిప్పలేదు
దలలార్పలేదు పూవులు మయూరములు
లలితపింఛచ్ఛత్రముల వార్పలేదు-

దరుణిలో పాముద్ర దయతోడఁ దాన
యరసి రక్షించిన యట్టి పల్లీ వి
తానంబులెల్లఁ జింతాధీనములయి
దీన దీనంబుగాఁ గానుపించినవి
యంత నగ స్త—భార్యామణి, దాను
సంతాపహృతకాంతి సంతానుఁడగుచు,
జనకునికై వడిఁ దమఁజూచికొనుచుఁ
దనవెంట వచ్చు గొందఱు పటూత్తముల
తోఁ బయనింపంగఁ దొడఁగె నా రాజ
పీఠంధుఁడగు శివుసేవల విడచి
వాసవప్రముఖ దివ్యాఽభికాంక్షితము
కాశీనివాస సౌఖ్యాతిశయమ్ము
నెలతాల్పు నెవరుఁజూపులలోని చలువ
బొలవంబు—శ్రీయన్నపూర్ణాకిపాల
కరవిలసద్రత్న కంకణక్వణన
భరిత భిక్షాదానపరమసౌఖ్యమ్ము
దలఁపునఁ బాతె న త్తపసికి—మదినిఁ
గులిశంబుఁ గొని తెగ గ్రుమ్మినట్లయ్యె—
వణకంగఁ దొడఁగెను దనువెల్లఁ దనకు
దనికిఁ గంఠమ్ము గద్గదమయ్యె—బిట్టు
విలపింపఁ దొడఁగెను విశ్వేశుగుఱిచి
తలిఁ బాయు బిడ్డవిధంబున నతఁడు—
బలుకరా! నాతండ్రి! ప్రమథాఽధినాథ!
పలుకరా! నావాఁడ! భక్తవిధాన!
పలుకరా! పార్వతీపతి! చిదాకార!
పలుకరా! వాసుకివలయ! భూతేశ!
భూతభావన! ప్రాణభూత! భక్తకుల
తాత! సత్రాత! శీతాంశుమౌళి!

భవరోగహరణ! దైవతగణశరణ!
శివమూర్తి! విధుతార్తి! చిదచిదానంద!
పదికోట్లు ప్రమథులు బలసి వేష్టింప
పదిశివంభవుల యుతాయుతుల్గొలువ
నసురు లసంఖ్యాతులై చుట్టియుండ
విషమపిశాచులు వేవేల్గొలువ
భారంబుగాలేదా! భారమై నావా!
యేర దయామూర్తి! యేనొక్కరుఁడను!
రక్షించఁబోనన్ను శ్రీక్షణుండెప్పు
దక్షిణమగు దయ నన్ను నమ్మకము
నేలపాలుగఁజేసి—యీలాగు నన్ను
నేలరా! నా తండ్రి యెడబాపినావు!
వారాణసీపురిఁ బాపుటకన్న
ఘోరాసిఁ గొని నాదు గుత్తుకఁ ద్రెంపఁ
గూడదా! తలఁబొడఁగూడదా! యిట్లు
పీడింపనేలరా! విషజకోటీర!
యన్నపూర్ణాదేవి యమృతహస్తమున
నన్నంబు పెట్టంగ నఖిల చింతలను
బాసి—సుఖంబున్నబదుగు—నాపై ని
పేసితిభారమ్ము—వేయఁగారానొ!
పీసుతులందొక్కనికి వారుగాక
పీనరన వసింప నేనె బాహ్యుఁడనొ!
ప్రళయకాలమునందు, భయదహుంకార
వలయవిఘూర్ణితాఽచలసముద్రాది
గళితలోకాళిపై—ఘనకరాషేవ
ముల దిక్కులను మీటి—వలయంబులందుఁ
బిడుగులు నినదింప బెడిదంబుగాఁగ
నడుగులనిడి—తాండవారభటమ్ముఁ

గావించు నీకును—నావింధ్యమదము
ద్రోవంగరాదయ్యెనో! విరూపాక్ష!
నీవుగావలెనేమి! నీయాన యున్నఁ
గావలుండగు వింధ్యుఁ ద్రోవఁగాలేదా!
ధీరుఁడై నట్టి వందీశుఁడొక్కరుఁడు?
మారమారకుఁడ! ప్రమథకుమారకుఁడు
కాఁడా! యొక్కండు కైలగర్వమ్ము
దూలింప—జగములఁ బాలింప నిపుడు
పరమూర్తి! నే నేడ దొరకితి నీకు!
నెరవునఁ జూచి మోపెత్తించు కొఱకు!
పోయివచ్చెదనయ్య భుజగభూషణుఁడ!
పోయివచ్చెదనయ్య! పూర్ణేందుధరుఁడ!
పోయివత్తుమ గృపాపూర్ణ! పురారి!
పోయివచ్చెద నన్న పూర్ణాధికారి!
నీ యిల్లు దాటించి నేఁడు ద్రోఁతివి
నీ యాన నికరానులే! యమనియమ!
నా పీడ సోఁకదులే నీకు నింక
కూనపై దాక్షిణ్యగుణము మానితివి!
పోయివచ్చెద నన్నపూర్ణ! మాతల్లి
నీయింట వసయించి—నీపెట్టువన్న
మును భుజించెడు పున్నెమును నోచలేదు
నను వెడలించెనే! నాగారి నేఁడు—
నీపై నఁ జెప్పవే! నిఖిలపవిత్రి!
భావజారికి నాదు పరిదేవనమ్ము!
వినవా! వినండా! చందనగంధి! నీకు
ననుఁగూర్చి యేటికే న్యాయనిష్ఠురము
లుడువుము—శివునకేఁ గడయైతి నింక
దొడుకొన నెవ్వరితోనేమి నాకు!

మఱవకువే నన్ను గిరిరాజపుత్రి!
మఱల నిన్గను నవసరము లేదమ్మ!
కాలభైరవ! క్షేత్రపాలక! నెవరుఁ
దాలిచి—నీపైన దయసేయవయ్య!
కైవల్యమణికర్ణికా! మణికర్ణి
కా! వచ్చెదను దల్లి! కనికరంబుంచు
మునిజనలక్ష్యంబ! ముక్తిమంటపమ!
నను మఱవఁబోకు మనమ్మునయందు
దుర్గ! వశీకృతభర్గ! దత్తాఽప
వర్గ! నే నికఁ బోయివచ్చెదనమ్మ!
లోలార్క! నీమొగసాలలో శాంతిఁ
దాలుచు పుణ్యంబు దప్పిపోయినది
కుక్కుటేశ్వర! నీకుఁ గొదలేని వేయి
మ్రొక్కులు ననుమఱవఁబోకయ్య! తండ్రి!
వరకృపాకర! దండపాణి! నీ చెలిమి
మఱవను! ప్రేమనే మఱెదవోయేమొ!
వెడలించితివిగాని—యెదఁదలోఁ బ్రేమ
వెడమాకకోయి! గాశీవిశ్వనాథ!
వెడలివత్తును ఢుంఢివిఘ్నేశమూర్తి!
యెడవిస్మరింపకు మెపుడు నాతండ్రి!
గంగ! యభంగతరంగ! నతాంగ
సంగశృంగారిత! సకలైకధాత్రి!
జలపక్షికుల కల కల మృదురాగ
కలితమనోజ్ఞ శీతలజలభరిత!
నీయంకతలముపై నిలచి—తానమ్ముఁ
జాయక కావించు పరమభాగ్యమ్ము
దీఱిన దీనాఁడు—దీర్చినాఁడమ్మ!
యారాజకోటీరుఁడతి దయాపరుఁడు!

పోయివత్తును మఱవఁబోకమ్మ! సౌఖ్య
దాయకి! యేనాఁడు దరిసెనం బగునొ!
గలహంస! నాతోడఁ గదలిరావమ్మ!
పిలిచిన వచ్చెదవే! నెమ్మినుండి!
కదళికాకాంతార! గదలిరావోయి!
యెదవెతారమున నీవేల వచ్చెదవు!
శ్రీవిశాలాక్షి! విచ్చేయు నాతోడ
నీవేలవత్తు! గాశీవిభుఁడాఁ
వటుకనాథా! నీవు వత్తువా! స్వామి!
యెటువత్తు నందువో! యీపురిఁ డాఁ
హరపదవివశమస్కరులార! దోడఁ
బర తెంతురా! యేలవత్తురు మీర
లని యిట్టులేడ్చుచు నలజడితోడఁ
బనివినమాటయే పనవుచు సారెఁ
దల మల్చిచూచుచుఁ దద్దయుఁ బాద
తలములు వడకంగ నిలుచుచు నిలిచి
కూలఁబడుచు భూమి సోలుచుఁ దాల్మి
దూలుచుఁ దవదైన లోలాక్షిపైని
నొఱఁగుచుఁ బ్రాణమ్ములురుగ కోటీరు
చరణస్థలంబునఁ బరిజుట్టి నిలిచి
తను తనుమాత్రుఁడై తరలె మునీంద్రుఁ
డనుసరించుచు రాగఁదనభార్య-వేద
పురుషుని వెనువెంటఁ బొల్పెవలార
నరుదెంచ శ్రౌతక్రియామూర్తి వోలె
లలితపాటల జటావిలసితమూర్తి
కులపతి యీరీతిఁ గులపత్నితోడ
నెల్లదైవతముల కేటికోళ్ళిచ్చు
చెల్లతీర్థమ్ముల నెలమిఁ గ్రుంకుచును

వనములు దాటి పర్వతములు దాటి
ఘనసరిత్తులదాటి జనపదంబులను
దాటి లోకాపావన తత్పరత్వమునఁ
దాటింపకేపాటి వడిఁ బ్రయాణమ్ము
సవతికాలమున వింధ్యాఽద్రితృశలమఁ
బసపడ దరిఎవఁ బర్వతేంద్రంబు
దూరంబునందుండి ధారుణీతల వి
హార కౌతుకమదిప్రేరేప రూపు
వడఎ యేతెంచు శబ్దబ్రహ్మవోలెఁ
గడుమించుమునిని వెక్కనుఁబూతమైన
వాక్కుమఁ గొని లోపాముద్రఁగాంచి
నెక్కొన్న భక్తిచే నిలువు వణంక
వణఁకుఁ దనువునందుఁదొనకంగఁ బులక
లమరాగ మది గొంత యద్భుతం బింత
సంతసం బొక గొంత సరళత గొంత
వంతయుఁ గొంత నంతంతఁ బొంగార
నేపార మానవరూపంబు దాల్చి
యాపుణ్యునకు నెదురై వచ్చి నిలచి
వినయంబుతోడుత వినతి గావించి
తనకరంబునఁ జల్లికొని పదదూళిఁ
గరముల మార్గంబు గానుఎంపుచును
వరమునిఁ దోడ్కొనివచ్చెదు నపుడు
జలజల రాల్చెఁ బూవుల లతానివహ
ములనల్ల లేఁతగొమ్మలు దూగియాడఁ
బింఛగుచ్ఛమ్ములు విప్ప నర్తించె
నంచితగతి మయూరావళి, ముందుఁ
బలికెఁ గోయలనదువులు రక్తగాత్ర
ముల నెత్తి పికాసమూహమ్ము వోలె

మారుతాపూరిత మంజులవంశ
వారమ్ము మ్రోసె నవార్యరీతిగను
జలధరమ్ములు సితచ్ఛత్రమ్ము లగుచు
నలసంబుగా వెంటవంటి యేతెంచెఁ
జమరీగణంబు పుచ్ఛ సుమగుచ్ఛముల
రమణింపఁగాఁ జామరలు వీవఁ దొడఁగె
నీరీతి రాజోపచారంబు లొనర
ధారుణీధ్రముతోడఁ దపసి యేతెంచు
చును దప్పనటు నేలబోలి కూర్చున్న
వనజాతనేత్ర లోపాముద్ర గూడ
నధరశుక్తికనవ్వు లల్లలనాడ
నదిరిపాటున నేల నధివసించినది
మునిశేఖరుండంతఁ గనుబొమ లెత్తి
యనె వింధ్యశిఖరితో ననఘ! యుత్తుంగ
తనుఁడీవు దుర్బల తపసిని నేను
నిను గమియింపగా నేరఁ గావునను
సామాన్యశైలంబు లీమహి నొప్పు
నేమంబుతోఁ గ్రుంగు వేళకు నిపుడు
గాదంటవా! నే నగస్త్యు సుమ్మంచు!
నాధారుణీధరుం దల్లలనాడఁ
జేతమ్ము దుఃఖసంపీడితుఁడై గడు వి
నీతుఁడై శాపమ్ము నెత్తిపైఁ బడునొ!
ఎడుగుపోలిక యని భీతిల్లి మౌని
కొడఁబడి తనగర్వ ముత్తుత్తగాఁగఁ
బేరిమి విడచి కుశీరంబు వోలె
ధారుణిఁ గ్రుంగె దుర్వార తపోధ
నులకు నసాధ్యంబు గలుగునే! పుడమి,
జలజాప్తుఁ డంతఁ దీక్ష్ణకరాళి వెరయ

నలువుగా గగనాంగణమ్మున మెఱసె-
బలభేది ముఖ్యదేవాళి విమాన
పదగతులై బిట్టు బలికిరెన్మంద్రుఁ
జదలు మార్మ్రోయంగ సాధునాదంబు
అప్పుడగస్త్య వింధ్యాద్రి సభక్తి
వప్పనం బొనరించి నట్టి సేవలను
గైకొని-శిరమంటి కరము దీవించి
నాకిత నీదక్షిణాశకుఁ బోవ
వలయును దీర్ఘయాత్రలు దీర్చుకొంటకుఁ
గులమహీధర! సముజ్జ్వలతుంగదేహ!
నావచ్చువంతకు నీవిట్లె యుండఁ
గావలె నామాటఁ గాదనకుండ
నని ధీరముగ నన్ను నాపల్కు-ఁ గూడఁ
గొనియె శాపభయమ్ము గూరి వింధ్యమ్ము-
యీరీతి వింధ్యమహీధరాఽహంత
దీరిచి దయఁజూచి ధారుణికైన
నెగులు దప్పించి మునీంద్రుండు వింధ్య
నగపతి సాగనంపఁగ పక్షికులము
లటవీస్థలములెల్ల ననువదింపంగ
జటలు గుణించుచు నరిఁజనుదేఱ
వెడలి నానాతీర్థ వినరముల్గనుచు
మడఁతుకతో స్వామిమలసేరి-కార్తి
కేయు నజేయు దైతేయ భిదాయు
కాయు-సత్పురుషాఽనపాయు వీక్షించి
సర్వాంగములతోడఁ జాగిలి మ్రొక్కి-
సర్వసభక్తి నీశ్వరునకమంగు
మునినిల్చినంత-సమ్మోదంబుతోడఁ
దన బాహునిబిడ బంధమ్మునయందుఁ

గదియించికొనె నీలకంఠ వాహనుఁడు-
తదుపరి భామినీ తతి తరళమ్ము
పరమపవిత్ర లోపాముద్రగూడఁ
గరము భక్తినిమ్రొక్కెఁ గార్తికేయునకు
నాతిథ్యమునఁదీర్చె నా దంపతులకు
నాతతనుతి గిరీశాత్మజుఁడంత
మునిఁజూచిపలికె శంభునికుమారుండు
దనతోడనొక కొన్నిదినములుగడప
లెవ సని-కులపతి వల్లె యటంచుఁ
దలనార్చి-మనము సాంద్రానందమొందఁ
బ్రతివాసరంబు తీర్థాది మాహాత్మ్య
మతి చతురతను సన్నుతిసేయ చెప్పఁ
దొడఁగె మహాసేనుఁడదకుపతోడ
జడదారి వినుచుండ-సతితోడఁగూడి-
యొకనాఁడు గార్తికేయుఁడు దనతోడ
నకలంక తీర్థమాహాత్మ్య వర్ణనము
సలుపుచునుండెడి సమయంబునందుఁ
గులపతికౌతుక కలిత చిత్తమున
దేవసేనావిభుదృఢభక్తిఁగాంచి
యీ విధంబునఁబల్కె- సిద్ధ విజ్ఞాన!
యీ వెఱుంగనిగాథలేవియు లేవు
భూవలయంబునఁ బరుడు నీకెవ్వ?
రొక్కటి సందేహమున్నది నాకు
నిక్కంబుగాఁజూడ నీవు దక్కంగఁ
దెలియఁ జెప్పఁగ నలంతులు మఱి లేరు
విలసిత వేదార్థ వేత్తలౌ వార
లది యేమటందువో! యనఘ! యాధరణి
సదమల తీర్థముల్వెలుఁగఁగలవు

మూర్తులు గలవును మోక్షదాయములు
గీర్తనీయమ్ములు క్షేత్రముల్గలవు
గాని-తీర్థంబున్న కడమూర్తిలేదు
కానము క్షేత్ర సంకలిత తీర్థమ్ము
మీరెండుఁగలిసిన నెనయదు మూర్తి
యారయ నదియున్న నమర వీరెండు
నొకచోటఁ దీర్థమత్యున్నతిఁగాంచు
నొకచోట దైవతంబొవరుఁ బెక్కువను
నమరు నొక్కట క్షేత్రమధిక మాహాత్మ్య
విమలమై యీగతి వివిధప్రదేశ
ములు దమయంతనఁ బొలుచుచు నుండుఁ
గలవి యేకడ మన్కి గానంగరాదు
దైవత క్షేత్రతీర్థంబులొక్కటను
నీవసుధాస్థలినెనసి-మాహాత్మ్య
కలితంబులై నెడగలదొ! యెఱుంగ
వలయునో శరవణభవ! దీనిఁదెలిసి
చిరకాలముగ నున్నయరగలిదీర్ప
మనుదుగ ననిమునియన్నంతఁగన్న
లఱమూతవెట్టి-మిన్నంకవీక్షించి
ధరణీతలము గాంచి యరసి దిక్కులను
యోచించి యోచించి యోరంతప్రొద్దు
దోచక యామౌనితోఁగుమారుండు
పలికె మునీ! మంచిప్రశ్న వేసితివి
దలఁపున నేమియుఁదట్టంగలేదు
బదులు నాకునుఁగూడ నిదివందియమ్మొ
పదపద బోదము ప్రథితవిజ్ఞానుఁ
దైవ నాజనకుని యంతికంబునకు
దీనావనప్రతాప దీనుండు దాన

మనసందియమ్మునమాన్ప వీక్షణమ
యని కుమారుండవ్వ నతులవీరు
గుదిగొనె మౌనికిఁ గోటి భావములు
మదిఁజిత్రదిరిగె గద్గద భరాక్రాంత
మగు కంఠమునమండి-యపుడూర్పుతోడ
నిగుడెఁ గానిమ్ము' నునిష్ఠురవాక్కు-
గదలెఁ గుమారుండు గై సేసి యంత
ముదిర నీలంబైన మదదిగ్గజిహ్వ
నెక్కి యిర్వంకల నిందీవరాక్షు
లక్కజంబుగఁ జామరాళి వీవంగ
శివపరిచారికల్సెలువొంద భావ
భవుపడగలు-దమ్మపడి గముల్పట్టి
మదమత్తకుచ విజృంభణముతో యక్ష
నదమలాంగులు ఎతచ్ఛత్రముల్పట్టి
ఎద్ధసాధ్యాదులు ఎద్ధులై వినయ
నద్దులై-సాహోనినాదముల్సేయఁ
గిట కిట మని కౌను లటునిటుఁ దూఁగఁ
బటు కళత్రమ్ముల భారమ్ముతోడ
ఘలుఘల్లుమను మేఖలలతోడఁగూడి
పలుక వీణెలవలె గిలుకు మెట్టియలు
నొక్కింత వగలును నొక్కంత ఎగ్గు
నొక్కింత మదవృత్తి యొక్కంత దాల్మి
యొక వింతశృంగార మొదిగింప నమర
వికసితవదనలు విమలకర్పూర
పరిగంధిలములైన బాగాలుబూని
యరుదేర మనవిజారాధ్య దేవతలు
శౌలయు గుగ్గులు ధూపములును దిక్కుల
ముల్ఁదన్న-రత్నమంజులహసంతికలు

గొని యక్షకాంతలు మునుముందు నడువఁ
గనుల వెల్వడు నల్లగలువలు నింద్ర
నీల భృంగారువిశాల రోచులను
మేలంబులాడ-విస్మేరంబుతోడ
నొకయెడ మదదిగ్గలుద్వృత్తి రాగఁ
చకిత శారకటాక్షజాలమ్ము-గండ
ఫలకకాంతులు గూడఁబడి యొక క్రొత్త
బొలుపునఁ బరిపరంబుల నాక్రమింప
జలదవేణులు గొందరలసయానములఁ
గులుకుచు బుక్కాముగొంచును రాగఁ
బలు పాపతలచుట్ట లెలమి గుల్కంగ
వెలఁది వెన్నెల పూవులలర మస్తముల
నొసలి మిక్కిలి కన్నులెసఁగ-ముమ్మొనల
నపలాకు శూలంబులభ్రంబు నొరయఁ
బునుక తమ్మంటులు బుమకపాత్రములు
గనుఁగవలకు విందుఁ గావించుచుండఁ
జర్మాంబరంబులు మర్మరింపంగఁ
గర్మసంహార! కాలకాల! గిరీశ!
హర! మహాదేవ! యంచాఉఉర్భటింపుచును
బరిజట్టికొనిరాగఁ బ్రమథనాయకులు
దేవతానివహంబు దివినుండి గాంచి
యీ విభవంబున కిచ్చలోఁగరఁగి
ప్రస్తుత విదులు విన్యస్తాంజలులయి
స్వస్తవాదమ్ములఁ బ్రస్తుతింపంగ
వీరిఁబోవు కుమారుతోఁగూడ
పారలిబారుండు సర్వమునీంద్ర
వారవంద్యుఁడు వెంట వటుసమూహమ్ము
గూరిన భక్తిదన్గొలుచుచురాగఁ

పైనమ్మైవచ్చె లోపాముద్రతోడ
దీనాఽవన వ్రతాఽధీనుఁడగస్త్ర
దరిసరంతట వారు ధవళకూటౌఘ
పరిచుంబితాంబరుఁ బ్రమథనాయకున
కనుఁగు మామఁద్రిలోక వినుతుని, మౌని
జనశరణుని, దేవవనితాముకురము
మేనామనోహరు మేదినీధర వి
తానంబులకునెల్లఁ దవయాజ్ఞ పూవు
దండగాఁమన్న యతంద్రప్రతాప
మండితు తుంగవినూన సంశోభి
దేవతాపరిబృఢసేవితు విబుధ
భావితు హామవంతు పటుప్రభావంతు
నాతుషార మహీధ్రమందు విశాల
శీతలకైలాస శిఖరంబుపైనిఁ
గొలువుదీర్చిన వానిఁ, గోరుభక్తులకుఁ
దలమున్కలుగ వరంబులనిచ్చు వాని
ముక్కన్ను గలవాని మ్రొక్కువేల్పులకు
దిక్కు రక్కసుల మర్దించెడు వాని
వాడని తలపూవువానిఁ బెక్కువకుఁ
గూడలి మునులు గొనియాడు వానిఁ
జిక్కి చిక్కనివానిఁ, జిన్మయాకారు
నెక్కటి ఋషులకు నెక్కివవాని
వెల్ల తత్తడివాని నల్లమందెల్ల
మొల్లమై యనుకంప బొలిచెడువాని
గిరిజామనోహరు-నురగ భూషణుని
సురరాజవందితు శోభితాకారుఁ
గనుగొని తమవెల్లఁ గమలుగా విమల
మనమెల్ల భక్తి నమ్మర్దంబు గాఁగ

వెలయఁ గుమారుండు వినయంబు దొలఁకఁ
దలవంచి పాదముల్దాఁక సర్వాంగ
పరిరంభణముసేఁ పార్వతీశ్వరుఁడు
శిరముమూర్కొని కురుల్వెన్నుగాఁదడవి
చెక్కుగీటిమఱల నక్కునఁజేర్చి
చిక్కని నెనరుననివఁజూచియనియె
  వీఁడె నీసూనుండు వెలఁది! బృందార
కేడిత విక్రమాఽఽహా తహా తవహాఁడు
వీక్షింపు మనినంత విశ్వేశ్వరియును
నక్షీణవాత్సల్యమమరఁ గుమారుఁ
గృతనమస్కారు సన్నుతగుణాఽఽధారు
వితతసంవిద్భారు, విగతవికారు
లోకైకధూరు నాలోకించి ప్రేమ
దూఁక బాహులతోడనాఁకట్టికొనియెఁ
దదనంతరం బిందుధారి దూరమున
మది మదిలో లేక నలఁగుచున్న
వాని నోడికలెత్తు బాష్పముల్గలుగు
వానిఁ, దానమ్మిన ప్రమథేశుపైనఁ
గోపంబుఁదాపంబుగుదిగొన మోము
సూపక తారాడుచున్నట్టి వాని
మునినగస్త్యునిజూచి ముసనవ్వు పెదవి
కొనలందుఁ గనులందుఁ గొనలుసాగంగ
ఈశుండు వాత్సల్యభూషితుం డగుచుఁ
జేసన్నఁగను నన్నఁజీరె నీ గతిని
  రార! నా భాగ్యమందారభూజంబ!
రార! శైవపురాణ రమణీయభావ
సార నీరధి! జగత్సంరక్షణాఽఽతి

వారసన్నుత! మదాభరణ! నాయూర్పు!
రార బ్రహ్మాది నిర్జరశోకభేత్త!
కాశికాపురినీవు పొందనగోలె
నీసమంబైనను వేడుకలేదు
నీరూపు నాకంటనిలువనిగోలె
యేరూపుగూడ నాకిందుకేలేదు
నీపల్కు చెవులధ్వనింపనిగోలె
యేపల్కు వినరుచియింపదు మదికి
నీతనుస్పర్శంబు నిలచినగోలె
యేతగులముగూడ నింపదుసుమ్ము
యీ నాఁడు వీక్షించి తింకమద్వృత్తి
మానసం బానందమయమయ్యెనోయి!
భక్తులఁజూడనిభవుఁడు సంతోష
రిక్తుండటంచుఁబాఱి మునీంద్రుఁగమిచి
గరుపారుమేను నిర్గతమోదబాష్ప
భరితనేత్రములునై పరిపూర్ణకరుణఁ
బరిరంభణముసేసి బాలేందుకుంద
పరిభూషితంబైన శిరమునువంచి
మునివరుమస్తమ్ము మూరుకొన్నంతఁ
దొసకెఁజంద్రునిమండితోరమ్ముగాఁగ
నమృతకణావళి యతిరమ్యహేమ
కమలసువాసనాకలిత జలమ్ము
మనమందఁదనువందు మధురశీతలము–
మునినాయకునకంతమొల్లమౌ చిత్త
వృత్తి తాపమ్ము శరీరతాపమ్ము
నత్తమిల్లిన సమ్మదాఽఽపూర్ణుఁడగుచు
నటరాజపాదవందన మాచరించె
నిటలతటంబును ఘటియించి–మౌని

పదపడివచియించె ఫాలలోచనుఁడు
మృదుమధురంబుగా మిక్కిలివగపు
గూరినప్రతిఁజూచి గుణధాముల్రోక!
వారాణసీపురిఁగాచితినంచు
ఖేదమ్ము నొందకు-మేదినికైన
బాధలఁదీర్చుచే బహుతపఃఫలము
ధనము సంపాదించి-తానునుఁదినక
పవరుచు నొరులకివ్వకవృధాఽఽయాప
కలితుఁడై చెడిపోవుకాపురుషునకుఁ
దులయగుఁ దపములు దొడ్డగాఁజేసి
దానిఫలంబు దీనాధరక్షఁ
బూనిపెచ్చింపక ముక్కురు తలఁప
నిగమాగమంబుల నిశ్చితంబిద్ది
యగునుఁ గార్యము జగదారాధనంబు-
భక్తులేనాప్రాపు భక్తులేప్రోపు
భక్తుల విడనాడి బ్రదుకంగఁజాల
నొక్కక్షణం బిదియున్న సత్యంబు
నిక్కంబు దాపంగ నేరనునేను-
కాని జగమ్ముల కష్టమ్ముదలఁచి
నే నియమించితి నిన్ను శ్రీవిష్ణుఁ
డను పేర నీవిరహంబునయందు
మనము నాపేగి నీకన్ననోయన్న!
గరువంబుగన్గప్ప క్రమమునుఁదప్ప
పెరిగినవింధ్యంబు పెంపునుఁ దెంపు
మాయించి జగములమాయదప్పించి
యాయరుక్కునకుమార్గమమరఁగావించి
యతికృతార్థుఁడవై తివడల నేలింక!
మతికెక్కె నీభక్తి మానితంబగుచు

సంతసపడుమంచు శర్వుండు మునికి
వంతఁ దొలంగించెఁ బార్వతీదేవి
పరమపవిత్ర లోపాముద్రదనర్చ
సరససంభాషణాచాతురిఁ దేల్చె—
తరువాత ఖండేందుధరుఁడునుఁ బ్రమథ
పరివారమిర్వంక బలసి నిల్వంగ
గిరిరాజపుత్రి సంబరమున నొక్క-
యురురత్న పీఠిపై నుపవిష్టగాఁగ
నందీశుఁడెదుట సానందుఁడై నిలిచి
మందస్వనంబున మనవులు సెప్ప
యక్ష రక్షఃపిశాచాదులు—భక్తి
లక్షింపఁగార్యముల్గల వేమొయనుచుఁ
గాలభైరవుఁడు క్షేత్రాల భేతాళ
జాలంబుతోఁ స్థలి సంరక్షసేయ
మగరాలజిగి—లీల మిగులుముత్యాల
జగిలెపై నుంచిన శార్దూలచర్మ
పరిశోభితంబైన పరమాఽఽసనమున
సరసనితంబినీచామరాఽఽలోల
కుంతలాందగుచునుఁ గొలువొప్పఁదీర్చి
కాంతస్మితమ్ము వక్త్రమునఁదొల్కాడఁ
దనయు మహాసేనుఁ దన కుడివైపు
దనరు హేమాసనంబున నున్నవాని
వీక్షించి—దంతవళక్షచంద్రికలు
నక్షికాంతులు మొత్తమై దిక్కులెనయఁ
బలికె మహాసేన! ప్రధితాఽభిధాన!
లలిమిఁగా పామిమలనున్నయట్టి
పరివారమునకెల్ల భద్రంబెగదర!
దురుసుబిద్దండ! యెవ్వరితోడనైన

సద్భంబుగాఁజెప్ప పుచ్చఁగారాదొ
వచ్చెడువార్త రవంతముందుగనె!
యున్నదున్నట్లుగా నలికిపడ్డట్లు
కున్న! దూకెదు దానికన్నవ—వచ్చి
తైన నేమాయె—నీ యరుదెంచినట్టి
దాని—కేమైన నిదానంబు గలదొ!
తెలియఁజెప్పుమటన్నఁ దలవంచి సుతుఁడు
పలికె—వార్షికమేఘలలిత మంద్రముగఁ
దను నగస్త్యుం డడిగిన ప్రశ్నవిధము
దనకుఁ దోపమియు—నాతండునుఁ దానుఁ
దనపాలదానికు త్తరమును దెలియఁ
జనుదెంచినట్టి యాచాడ్పును—నంత
సకలజ్ఞుడైనట్టి శర్వుండు—హాస
వికసితముఖుఁడౌచు విశ్వైకమాత
దెసఁజూచి పలికె వింటివె సుతుప్రశ్న
మనదృశాంగి[1] భవదభ్యర్థితంబు
నదిగాదె! యిప్పుడ ముదముతోఁ జెపుదు
మది సంశయమ్ములు మఱుగిపోవంగ
నవధానమున వినుండని కనుల్మూసి
శివుఁ—పండరినాథు శుద్ధరూపంబు
మనమున ధ్యానించికొని—మహానంద
జనిత పులకసంఘ సంభిన్నదేహుఁ
డగుచుఁ బల్కెను శంభుఁ డాదికాలమున
నగణితవిక్రముం డఖిలగీర్వాణ
గణధూమకేతువ ఖర్వగర్వుండు
జనియించె డిండీరుఁడనెడు రాక్షసుఁడు
వాఁడుగ్రతపముచే బ్రహ్మనొప్పించి
వాడిమిగల భుజబలము గాంక్షించి

పడఁ యసహాపీయవర్తనం దగుచుఁ
గడు నిడుమలు గూర్చెఁ గలిఁ ధారుణికి
నప్పుడు బ్రహ్మాదులైన దేవతలు
గుప్పునఁ బాలి వైకుంఠమ్ము దరిసి
కమలాక్షుఁ గనుఁగొని—తమ గోడు దెలిపి
నమితులై నీ శరణం బని వేఁడ
నెలనవ్వు పెదవియంచుల గిలుకాడ
దళితాబ్జ మధుర నేత్రంబులయందుఁ
గరుణామధువు దొట్టఁగా—మురవైరి
యరసి దేవతల నిట్లనియె భయమ్ము
విడువుఁడో సురలార! విశ్వదుఃఖమ్ము
పొడమిన నద్దానిఁ బొడ వడగించి
తిలఁచుటే మా పని దీనికై యింత
దెలుపంగవలయునే దీవత నిట్లు!
డిండీరుఁడను రక్కసుండు లోకములఁ
జెండించి బాధింప శరణంబు గోరి
వచ్చితి రవ్వాని వర్తనంబులను
మచ్చరంబును మాకు మదికెక్కినవియు—
యడగింతు మేమింకఁ బుడమి జనించి
యడఁబడి బడనేటికయ్య మీకిట్లు—
పొందు నిశ్చింతగా నుండుండు మీరు
డిండీరుఁ, డీపైని డింకినయట్లె
యని యిట్లు వచియింప నతని వాక్యములు
విని దేవతలు మహా వినయసంభృతులు
ధృతసమ్మదులు పరిష్కృతదుఃఖు లగుచు
నతిపేస మగిడిరి నాకంబు గుఱిచి—
సకియ! యత్తఱిని శ్రీ చంద్రాభిధానుఁ
డొక రాజు నమగూర్చి యుగ్రతపంబు

కలిసిన యా తేని సంతతసష్ఠఁ
గలికి! లోకమ్ము లాకులత నొందంగ
నాతఁడె నేను ప్రత్యక్షమై నిలిచి—
యాతని వీక్షించి యడుగుమా! కోర్కె'
యన్నను—శ్రీచంద్రుఁ డత్యంత వినయ
సన్నమితాంగ డై శర్వ లోకేశ!
శ్రీమహావిష్ణు సదృశు నొక్క పుత్రుఁ
గామించి తీ కోర్కె గాదనకుండ
నిమ్ము నాకన్నఁ గానిమ్మురా వత్స!
యమ్మహావిష్ణుం డ, యాత్మజుం డగుచుఁ
జనియించు నేటికి సందియపడగ?
నని పల్కి వచ్చితి నతివరో! నేను
డిండీరు నసురుని ఖండింపఁ బూను
పుండరీకాక్షుని పుడమి పుట్టుకకు
నా వరమొక సాధనంబయ్యెఁ జంద్రు
దేవేరి కడుపులో దీపితంబయ్యె
నా మధు మథను నంశావతారంబు—
కామిని కంతటఁ గమనంబు దగ్గె
నెఱితొను బలుపెక్కె నరుచులు నిక్కె
విరిసెను గోర్కులు వేవిళ్ళు బెరసె
వీరీతి ధృతగర్భభారయై, వికచ
పారసాక్షి నవమాసమ్ములు మోసి
కనియె నంతటఁ గుమారునిఁ బూర్వదిక్కు
గనివట్లు - భాసరకరుని - శ్రీకరుని—
వినియె శ్రీచంద్రుండు విమల పీయూష
మున కెనయగు దన పుత్రజన్మంబు
మిక్కిలి సంతోష మిన్నంది సెనుతీ
కెక్కి యాచారసమీహితులైన

ధారుణీసురుల నాదరముగఁ బిల్చి
వారికి దురగాది వస్తుసంపదల
నవ్వారిగా నిచ్చి యంతన లోక
యవ్వసుధావతి యన్యులై నట్టి
వారికి నెల్లను వాంఛితంబుల న
పారంబుగా నిచ్చి ప్రమదంబు నించి-
కడు ముదంబున మల్లికార్జునుం డనుచు
నిడె సుతునకు నామ మెడద నుబ్బొంగి—
పుత్రుండు దృఢతరగాత్రుండు — కీర్తి
పాత్రుండు. క్షాత్రవదాత్రుండు. కమల
నేత్రుండు సాగ్ధకళత్రుండు సుజన
మిత్రుఁడే నస్తమోఽమిత్రుండు పెరిగెఁ
గ్రమముగా శ్రీచంద్రు ఘనపుణ్యజాల
మమరరూపయి నిల్చినట్లు ధారుణిని
తరుణచంద్రునిఁ బోలు తన తనూజాతుఁ
దౌలపుఁ జుక్కలతోడఁ బురుడించు నట్టి
యాడు బాలకులతోఁ గ్రీడించునపుడు
వేడుక బొంగార వీక్షించి తాను
గావించినట్టి దుష్కరతపంబెల్ల
నీవిధిగా ఫలియించె నేఁడనుచు
జల జల రాల్చు శ్రీచంద్రుండు బాష్ప
సలిలంబు వనజాక్ష చరణపాద్యంబు—
ప్రేమసరస్సులో వికసించినట్టి
హేమాంబుజము మితి యెన్నంగరాని
మురువుల తొలిచెంకి మోక్షగంధమ్ముఁ
బరగించు సరి క్రొత్త పన్నీటి చెంబు
వల్లవింపఁగ లోక భాగ్యంబులెల్ల
మల్లికార్జునుఁడు క్రమమ్ముగా నెదిగి

కరితురగాది శిక్షలయందు శాత
కరవాల చాప సక్రమములయందు
వితత ధనుర్బాణ విద్యలయందుఁ
బ్రతిలేని నృపధర్మపద్ధతులందు
పక్షివాణీకల్పనాఽఖ్యానసమందు
పక్షిణచాతురి నార్జించి మల్లి
కార్జునుం డమిత విక్రముఁడంచు నించె
నర్జునకీర్తి దిగంతమ్ములందు——
నొక్కనాఁ డాఖేటనోద్యుక్తులైన
యొక్కటి వీరులు నిరువంకలందుఁ
బరగి సేవింప శబరులు మృగవ్య
పరికరంబులతోడ బాలభానునకు
జోడైన మల్లికార్జునుఁడు దా వేఁట
లాడంగ నేఁగె మహారణ్యమునకు
నదియ డిండీరుని యావాసమగుట
మదదురుద్ధరుఁడైన మానుషాదుండు
కలిగిన యాయుల బలము వీక్షించి
చెలరేగి పిల్లి-బెబ్బులి వోలె నార్చి
రూక్షకేశములు విదుచి-మహాఘోర
వీక్షణమ్ములఁ జిచ్చు పెటులాడ నుంద
నెవ్వరురా! నేటి కివ్వనంబునకుఁ
జివ్వనఁ జనుదెంచి వేగి గావింత్రు
నేరరో కాక డిండీరుఁ డీ వనము
పేరినాఁడని గర్వచిక్కణ చిత్త
లడగింతు పిబొంగు, నడకింతు లోక
మడబిడివని దిశలదరంగఁ బలికి
పదపదంబునయందుఁ బ్రతిపదింవంగ
నదనదీ సహితమైన వసుధాతలము

చనుదెంచి యాఖేట జనులున్నచోటి
కనుపమరోషరూక్షితుఁడై నోరు
చప్పరించుచ్రుమింగఁ జనుదెంచునంత
నప్పుళికాళను నల్లంత దూర
మునఁ జూచి మల్లికార్జునుఁడు రోసమ్ము
పెనఁగొన నోరోరి! మనుజాద! నిలుము
నిలుమనుచు నైహ స నిభృతమైనట్టి
బలువింట నరివోసి కులిశమ్మువోని
బాణమ్ముబరఁగింప వాని చర్మమ్ము
నేనియు ఖేదింపఁగా నోపదదియు—
పదపడి డిండీరుఁడ దలంచి-తనకు
నెదురుగా నిలువంగ నిన్నేండ్లకొకఁడు
గలిగెఁబో! యనుట్టు కలిగెనయేని
నిలువునఁ జెండాడనే! యన్నయనము
బలువిడిగిఁటికొనఁ బరిసరస్థలిని
నెలకొని నాల్గుదిక్కులు బారసాచు
నట్టి వృక్షంబొండునెట్టన పెఱికి
యాట్టలమగు రోసమెనయంగఁ దాఁకు
దెంచిన భ్రూకుటిదీర్ఘ చాపంబు
నంచాలితములొక్క-పారిగ వంగ
వానిపట్టిన వృక్షఖంగమ్ము సేసె
బాణంబుఁదొడి భీమబాహు విక్రముఁడు
మల్లికార్జునుఁ డంత మానుషఖాది
యుల్లంబు నూత్నశౌర్యోల్లసనంబు
వొందంగ మైపెంచి-పొరినిగర్జించి
గంధసింధురమట్లు గదిసి వేళొక్క-
వృక్షంబు విసరిన నాక్షణమందఁ
బ్రక్షీణముగఁ జేసె రాజసుతుండు

నడుగడుగున యందుఁబడమి గ్రక్కదలఁ
గడు బెడిదంబు హుంకారంబుతోడ
డిండీరుఁ డంతటఁ జండించి బాహా
ఖండనంబునకుఁ బైఁబడవచ్చునంతఁ
గుండలీకృత చాపదండుఁడై శౌర్య
మండితుండై నట్టి మల్లికార్జునుఁడు
పదిఁబది గుదులుగా బాణంబులేయ
వదలించెనవియెల్ల హస్తమాత్రమున
నా రక్కసుఁడు గృపాణంబూచిపైవ
వారణ రాజం బవారణరీతిఁ
దరు శాఖనాడుచు విధంబున నాడిచి
దురుసునద్రుంచె మద్దురముశూలమ్ము
నఱువుళ్ళు సేసె హస్తాగ్రమ్ముతోడ
వటిముటిపీరీతి నాయుధచయము
దానవుఁదాకి కృతఘ్నునియందు
మానుగాఁగావించును మహోపకార
మట్లు వితథమైన నా రాజపుత్రుఁ
డెట్లు సంపఁగఁగాంతునే వీని ననుచుఁ
దలపోయుచును లోహదండమస్వేర
వెలయుగదాదండమలవడఁ బట్టి
యంకించి విసరిన నర్కసహస్ర
సంకాశదీప్తుల జదలఁదన్నంగఁ
చిటచిట మఱుముచుఁ జటులాగ్నికణము
లటునిటుఁ జెదరంగ నలుగులపుట్టి
యఖిల దిక్పాలకు లాక్రోశభరిత
ముఖులయి దిక్కులమొదలకుఱుక
దిగ్గజంబులు ద్రగ్గ దిక్కులు ద్రెగ్గ
నగ్గిరులుమదగ్గ వసురులుత్రగ్గ

జలధులు దెరల నాకులు వెఱవఁ జలఁ
గళవళపడి యహాకులపతి బెదర
నరుదెంచి డిండీను మరణసాధనము
శిరమునఁ బడిన, నుప్పరమునకెగసె
జల్లున రక్తమ్ము సంధ్యారుణమ్ము
మొల్లమై విబుధులు మోదింప మృత్యు
నలినాక్షిదాల్చుశోణమణి వితాన
కలితమైనట్టి ముక్కఱయునుబోలె
నాదెబ్బతో శిరమదరి దుర్గర్వ
మేదిన డిండీరుఁడిలమీఁదఁబడుచుఁ
దనశక్తి దళియింపఁ దగినశౌర్యమ్ము
ఘనవిష్ణునకుఁ దక్కఁ గలుగదెవ్వరికి
నగునీతఁ డఖిలలోకావనశీలుఁ
డగణితశక్తియైనట్టి వైకుంఠుఁ
డని తలపోసి యయ్యభవునికరుణఁ
దనుఁగ్రమ్మికొన్న దుర్దమ మాయదలఁగఁ
గరయుగమ్మును మోడ్చి శిరమునువంచి
హరిహరి యని చరణాబ్జముల్పట్టి
దేవ! దేవాతీత! దివ్యావతార!
భావనందనవనపవన! బ్రహ్మాదు
లకుఁ గానరాని దుర్లభుఁడ నీవొక్క
వికట రాక్షసుఁజూడ వేడుకపడితి
వెంతయద్భుతము! నాదెంతయదృష్ట
మంతమ్ము నొందనీ హస్తంబునందు
నిఁకఁజింతలేదు నాకెప్పుడోవచ్చె
నకలంకమోక్షమనంత! నీవీక్షఁ
గరుణాబ్ధి! కామపాక్రాంతుండ నాకు
మణినీకు మఱలించి యొఱుకనిచ్చితిని

ఘనయోగివర్యులకవిలియుఁజేర్చి
మనహరి! నీకెంత మరుఁగురా! యనుచు
వినుతింపఁ దొడఁగిన విశ్వేశ్వరుండు
దననిజరూపంబు దయతోడఁజూపె
యోయిదానవ కోరుమొక్కవరమ్ము
నీ యభిమతమేమి! నెఱిదీర్తు నన్నుఁ
బలికె డిండీరుండు పరమసౌందర్య
జలధి! నా కన్నులు ఫలియింప ముందు
నిలిచికొంటివి వెన్నెలల ప్రోవ! మునులు
జలవాయుభక్షులై యలఁగుల నొందఁ
గనరాని నీదు పొడగంటి ముక్తి
వనితాన్వయంగ్రాహ భాగ్యమ్ము గంటి
మృదుపదనూపురీకృత వేదనిచయ!
కొదయున్నదే యింక మదికి గోరంత!
యయినఁ గోరుమటన్న నడుగక యున్న
దయఁద్రోఁప నటు లౌనొ, దానికి వెఱతుఁ
గోరికొందుమ దేవ! ధీరాఽనుభావ!
దారుణంబగు నీగనాదండమునకుఁ
జిక్కి నే మోక్షంబు పేకొంటిఁ గాన
నిక్కాననమునకు నిడుము న ష్టంబ
పట్టి గదకుఁ బెట్టి నట్టి యభిఖ్య
కట్టింపు మిచట శృంగారమ్ము గాఁగ
నగరమొక్కటి యందు నగధారి! నీవు
నెగడి భక్తులనెల్ల నిత్యానుకంప
రక్షింపవలయుఁ దీర్థం బొందు నెఱి
పక్షీంద్రవాహన! ప్రథితంబు గాఁగ
మన్నామమున నను దన్మధ్యంబునందుఁ
బన్నుగా నాపైనిఁ బరఁగిన యట్టి

గదఁ బ్రతిష్ఠింపుము కలికాల పాప
గదఁ జిక్కి యెవ్వఁడేగాని యా తీర్థ
మున మున్గి యాగదమొగిఁ గౌఁగిలింపఁ
దనపాపమెల్ల ను దలఁగంగవలయు
నిదియ కోర్కి యటన్న నిందిరాజాని
మది మెచ్చి యిచ్చితి! మహిత విచార!
చనుమంచు దేవతాజనము లాశ్చర్య
మునఁ జూడ వైకుంఠమునకును జనె
దళితపాపుఁడు, లోహదండమన్పేరు
చెలువొప్పఁ గానన సీమకుఁ బెట్టి
పురిగట్టి భాగ్యసంభరితమ్ముగ దివిజు
లరుదందఁ బై పేర నద్దానిఁ బిలచి
తీర్థంబు నిర్మించి ధృతి భవతాప
నార్థంబు దనగద నందుఁ దాఁచి
మల్లికార్జునదేవుఁ దల్లన మగిడె
ఫుల్లాబ్జనిభనేత్రముఁ జూచి దేవ
తలు జయ జయ నాదములను గావింప
సెలయుచు ఖచరులు సేవించిరాఁగ
నని యిట్లు గఱకంఠుఁడతి భక్తి లోక
వినుతమౌ వైకుంఠ విక్రమగాథఁ
దెలియంగఁ జెప్ప వెన్నెలలు పాండఁ
దలపూవు గదలాడఁ దలవల్ల వార్చి
పలికెఁ బార్వతిఁ జూచి యలికులవేణి
కలిమలాపహము, శ్రీకాంతు జన్మమ్ము
దెలిపెనేగద! దీనిఁ దెలుపఁగారాదు
కలితగర్వులకు బాపులకు రాగాంధ్య
లలిత న ర్తనులకు గలిసేవకులకు
జలజాక్ష పాదపూజా వర్జితులకు

నక్షీణమైన రహస్యమ్ముగాఁగ
రక్షింపవలెసుమ్ము - రమణీయగాత్రి!
యధికారులగు వారలాకాంక్షసేయ
నిది సెప్పకున్నచో నెనయును బాప
మని వచియించిన నార్య సంతసము
గనఁదోయినాన, నోంకారపంజరున
కంజలించినఁ గుమారాదులు గూడ
నంజలించిరి భక్తి నఖిలేశ్వరునకు
ననియిట్లు సూతుఁడభ్యర్థితంబైన
వనజనాభుని పురావర్తనం బెల్ల
మునులకు నెఱిఁగింప మనములఁ గరఁగి
యనిరి సూతునిఁ గాంచి యతిధీనమేత!
జ్ఞానవిఖ్యాత! కర్ణామృతంబైన
యా నలినాక్షుమాహాత్మ్యవర్ణనము
వినఁగ వినఁగ మాకుఁ దనివోవలేదు
వినిపింపు మీ వ్రతవిధి గృతార్థముగ
నన నవ్వు డా సూతుఁ డతులముల్లాన
మెనయ దేవాది దేవున కంజలించి
యీ రీతి వచియించె సారవిజ్ఞాన
పీరధులార! మునీశ్వరులార!
వినుఁడంతఁ బార్వతి విభుఁగాంచి-మధుర
వినయకుంచితనేత్ర వనజయై పలికె
పావనచారిత్ర! భవలతాదాత్ర!
భావితవారి! దుర్విభావ్య మాహాత్మ్య!
పాండురంగం బంచుఁ బ్రథగల్గ హేతు
వుండెడుఁబో! యొక్క టుజ్జ్వలంబగుచు
నా కారణంబేమి? యది వివరింపు
మాకాంక్షగల్గిన దాదరింపంగ

ననుచు వర్ధించిన నహారాజభూషఁ
డనుపమంబై నట్టి యనుకంప నొదలఁ
బలికెఁ బార్వతిఁజూచి ప్రాణపదంబ!
విలసితంబుగ నది వినిపింతు వినుము
లోహదండపురంబులో వసయించు
నీహావివర్జితుం డిందిరారమణ
పదభక్తబుద్ధి నిర్వైరుఁడజ్ఞాన
గదవిహీనుఁడు దయాపదచిత్తుఁ డఖిల
భూతసమ్మతుఁడు సంపూర్ణసంతుష్టు
పీతపాపుఁడు భక్తవిహితధర్మాఽను
యాయి యాతిథ్యసంధాయి-సమ్మద ని
ధాయి సజ్జనులకు-దాక్షిణ్యవార్ధి
యవునవునని జను లభినుతింపంగ
నవ నీసురుఁడు జహ్నుఁడను పేరు గలిగి
యాతని సతికి సాత్యకియనునామ
మాతలోదరి పతికనురక్త పరమ
కరుణావికస్వర కమనీయ భర్తృ
చరణవిధ్యావతత్పర-మంజుమూర్తి-
యనుభవించిరి వార లర్థకామమ్ము
లనుగతికమ్ముగా నాత్మధర్మమున
కిట్టులెంతయొ కాల మేగెనే గాని
పుట్టలే దొకఁడైనఁ బుత్రుండు వారి
కా కొఱద దప్ప సాత్యకి మదియందు
నే కొఱంతయుఁ గూడ నిసుమంత లేదు
గమనించినాఁడు కాంక్షావివర్జితుఁడు
కమలాక్షి మదిలోన గలిగిన కొఱఁత
జహ్నుం డెఱుంగని చాయగా భావ
నిహ్నవం బొనరించి నిలుకడతోడ

నున్నాఁడు సాత్యకియోర్వలేదింకఁ
దిన్నఁగా నొక్కనాఁ డన్నవ పలికె
పతిదేవ! లోకసమ్మతము నాదైన
మతినున్న కోర్కె నీ మనమునయందు
భావింపఁగాలేదో! భావింపనైన
నాశావిహీనండ నై నట్టిదాన
పరకుసేయవా? కా! సుపుత్రముఖము
నరయు నంతకు నాకు నానందమేది?
చెప్పఁగా నెంచితి జీవితనాథ!
యెప్పుడో నీతోడ నీ చిన్ని కోర్కె
చెప్పనివ్వదు పాడు సిగ్గింతవఱకుఁ
దప్పదీ నాఁడు యథార్థంబుగాఁగఁ
బలికితి నాదగు వరము మన్నించి
కులభూషణం బొక్క కొడుకుఁ గావింపు
నాయందటన్న సన్నుతవాణి నవ్వి
మాయావిహీనుండు మధురాంగి కనియె
నిజము పల్కితివీవు నీరేజనేత్ర!
సుజన పూజితుఁడొక్క సూనుండు వలయు
గమనించినాఁడ నీకాంక్ష నేనాఁడొ
గమనింపవట్టులే గడపుచున్నాఁడ
సకలైకనాథు నిచ్ఛాప్రకారంబు
సుతముఁ జేకురును వచ్చును మానవులకు
వలవని కోర్కెల వలఁబడి శాంతి
దలఁగి సర్వేశ్వరుఁ గొలువంగ మఱచి
వితథంబుగాఁగ జీవితమును గడప
సతి! యది ముష్కర జన్మకారణము
చను యదృచ్ఛాలాభసంతుష్టి మాని
జననిసుతంబైన సారమార్గముగఁ

పుత్రుండు లేడంచుఁ బొగులకు వనజ
నేత్రుఁడున్నాఁడ యన్నిటికిఁ దా కుదురు
నని యిట్లు బోధించు దన భర్తఁ గాంచి
వనజాక్షి మఱి యేమి పలుకక యుండెఁ
గాని చిత్తంబులోఁ గాంక్ష రవంత
మానలే దుగ్రమమ్ముగా నది పెరిగె
మఱి యొకనాఁడు సుందరి భర్తతోడ
నెఱిగించెఁ దన కోర్కె సరసమృదూక్తి
నానాఁడుగూడ విజ్ఞానబోధనము
చే నతివకు శాంతి చిగురింపలేదు
మఱి యొకపరిఁ జెప్పె మగనితో నతివ
దఱుగని యిచ్ఛ నాతఁడు దుష్ట వాగడె
పలుమాఱుఁ బనవుచు బడఁతి జహ్నాండు
పలుమాఱు విజ్ఞాన వాదమ్ము సేయుఁ
జెప్పెదుకొలఁదియుఁ జిగురొత్తెఁ గోర్కె
యప్పురంధ్రికి నింక నడగింప రాఁక
యేకాంతమున నుండి యేడ్చు న వ్వెలతి
యా కంటి నిటలో నగవదుఁ గోర్కె
యూరుచు మాటికి నుసురుస్సురమచు
నీరేజముఖి దాననినదించుఁ గోర్కె
పలుకక మౌనంబు పలుపును మగువ
పలుపు మౌనంబులోఁ బలుకును గోర్కె
శకునంబు లడుగును సకియ యా యడుగు
శకునంబులను దొడ్డ శకున మిఁకోర్కె
వ్రతములు పెట్టు సువ్రత దాను బట్టు
వ్రతములకెల్లఁ గారణమిదే కోర్కె
కనులనుఁ గోర్కె నెమ్మనమునఁ గూర్కె
తనువునఁ బులక సంతతులలోఁ గోర్కె

పలుకులకు నొనంగు బదులనఁ గోర్కె
తలఁపులలోఁ గోర్కె గలలెల్లఁ గోర్కె
నిలువునఁ గోర్కెలై నెలతఁ యున్నంతఁ
దిలకించె ధవుఁడు గోర్కెలబందియైన
తన ప్రియురాలి నల్లన యిట్లు పలికె
వనితా! నేనెంత చెప్పినను నీ మనసు
శాంతింపలేదు నిచ్చాఽధీనమగుచు
ఎంత పీడఁగలేదు ప్రతిభావమందు
నినదించుచుండె సుతునిదైన కోర్కె
తనుమధ్య! పుత్రుకై తపము సేయుదము
హరిఁ గూర్చి యాదేవు ననుకంపతోడ
సురుచిరగుణుఁడైన సూనుండు వొడమఁ
గాక లోకవుఁబాడిగా సుతుఁ బడయ
నీకును నాకుఁ జన్నె! యంచు నొడువఁ
దల నార్చి మోదించెఁ దరుణి తపమ్ము
ఫలియించి పుత్రుండు గలిగిన యట్లె
యాపైని దంపతు లఖిలేశు గుఱిచి
తాపమ్ము దలఁపక తపము చరింపఁ
దొడఁగిరి నిష్ఠావిధూ నశరీరు
లెడపక జనులెల్ల దెంతయుఁ బొగడ
పలిలంబు గ్రోలినపతి యొలగాలి
పలుపు భక్షణవి నిశ్చలత మగండు
మగఁడు జలము గ్రోల మానినీమణియు
వగరుశారాకులఁ బ్రాణమ్ములోము
దినముల తరబడి దీనఁదేది మఁగడు
తనుమధ్యగను దెర్వ దనువమద్యావ
యోగంబునందుండి యోరన్నినాళ్ళ
బాగు బాగని సురల్ ప్రస్తుతింపంగ

సలసలఁ దెరలు నెండలను జహ్నుండు
అలఘు పంచాగ్ని మధ్యంబున నుండి
తపమొనర్చిన లతాతన్విపీతువుల
నెపము వెట్టకయు చన్నీటిలో మునిఁగి
కావించుఁ దపము నిష్కలుషుండు వాఁడు
గావలెనని యొంటికాలిపై నిలచి
కరములు మొగిచి యాకాశంబు కేసి
యరుణు వీక్షించుచు నటు నిష్ఠ బట్టి
నలివేణి చిటచిట నలియు నిప్పుకలు
వెలయుహసంతిక దలపైని బూని
పంచేంద్రియమ్ముల వశములై చిదియఁ
బంచవాయువులను బంధించిమించి
యొంటికాలనె నిల్చి యుగ్రతపంబుఁ
బంటింపకొనరించుఁ బదునాల్గు భువన
ములు నబగుబలౌ చుఁ జలియింప దేవ
తలు శబలిత భావతతు లౌచుపోల
నీగతిఁ దంపతులెవలేని తపము
సాఁగింపఁగా వారి సద్భక్తిమెచ్చి
వ్యాసాంబరీష రుక్మాంగదాదులును
భాసురముఖు లిరుప్రక్కలఁ గొలువ
ఖగరాజు నతమస్తకన్యస్తహస్తుఁ
డగుచు సన్నాహాయై యాజ్ఞ నీక్షింప
సముచితరీతి విష్వక్సేనుఁడావ
గమనింపఁ గరబంధకలిత శస్త్రిందు
ధృష్టస్తనాఽఽభోగలిష్టంబుకోడ
నష్టఽద్ధులు చామరాళి వీవంగ
మణిమయ కింకిణీ మంజీరకాంతి
గణవికస్వరపాదకమలయుగ్ముండు

కనకాంబరాఽఽకీర్ణ ఘంటికా ఘటిత
ఘనస త్తకీశోభి కటిచక్రతలుఁడు।
దర సుదర్శన గదాదండ కోదండ
వరనందకోద్భాసకరచతుష్టయుఁడు
కౌస్తుభశ్రీ కాంతకాంతి సంయుక్త
నిస్తుల వక్షః ప్రణిహిత చందనుఁడు,
ముకురోపమిత చకచకిత కపోల
వికసత్సుధాస్మేర విమలితాళుండు
కరుణాధరాఽఽపూర్ణక్రమసద్భక్త
నర మోక్షసుఖవై జననలోచనుండు
సతతలక్ష్మీ ద్విజక్షతగుచ్ఛ విచ్ఛు
రితవక్త్వ బింబౌష్ఠయుతహ సన్ముఖుఁడు
చంచరీకమసార సారాఽలకప్ర
పంచదూషిత తుంగఫాలభాగుండు—
పరమభక్తాఽఽలోకతరుణ చకోర,
పరివారహృత్సుఖంకరలపనుండు—,
అకలంక కంకణహార కేయూర
మకరకుండలశోభి మహనీయమూర్తి,
పొడసూపె నెదుట నా పుణ్య దంపతుల
యెడఁద నిండిన భక్తి పొడవైన యట్లు,
వారు జపించు దివ్యము మూలమంత్ర
మారంగ మానిసైయై నిల్చినట్లు
వారి యదార్థ్యవిశ్వాసమ్ము రూపు
గూరి కోరిక లేలికానవచ్చినట్లు,
వారి మానసహర్మ్య వరదీపకళిక
ధారుణిఁ బొడతెంచి దయవెల్గినట్లు
వారి సహస్రార వనజబంభరము
నేరుగాఁ బొడమి ఝుంకార మిచ్చినటు

వారి కలలఁ బూతవట్టిన కోర్కె
కోరిక లివ్వంగఁ గొమ్మ సాచినటు
వారి సర్వస్వమ్ము వారి ప్రేమమ్ము
వారి నిష్ఠాపూర్తి వారి తపస్సు
ఫలియించినది ముందు నిలిచిన దరులు
జిలికించినది వింత వెలుఁగు పూన్చినది
రమణీయ పీనదీర్ఘములౌచు భక్త
శ్రమమడంచెడు బాహుశాఖలతోడ ,
భుజశాఖలందునఁ బొలుచు పండ్లైన
యజపూజితం బాయుధావళితోడ ,
తళుపు వెన్నెలల దిక్తటులఁ గుప్పించు
వరిలేని హాసగుచ్ఛమ్ములతోడ,
హాసగుచ్ఛమ్ముల నందంద బొలుచు
మాసరంబగు దృష్టి మధుపాళితోడఁ,
దలఁచు భక్తుల కోరికలను గొల్లలుగ
లలిఁ దీర్చు విష్ణుకల్పకము దోచినది
యాతని జిహ్వఁ దత్యాయతానంద
శీతలహృత్స్వము పేతుఁడై, తెప్ప
లత్తి విలోకించె నిందిరారమణు
హత్తిన భక్తి యుద్వృత్తిమైఁ బొదల
నావిలోకనముతో నప్పుడు గుప్ప
లై వఱుగొనె దృష్టు లాత్మేశుపైని,
వనజంబునకుఁ జుట్టు భ్రమరించు తేంట్ల
యనువునఁ జుట్టిన నతని పాదమ్ము,
లతని యంఘ్రుల దోయి వలరారు మధువు
నతిప్రేమమునఁ గ్రోలి యటనె చొక్కినవి
కటిమండలం బంతఁ గదియఁ బాఱినవి
కటితటంబున యందు ఫలుఫల్లు మనుచుఁ

బలుమాఱు పలుకు గంటల యెలపాట
చలువల బొలపంబు బొలయఁ దూఁగినవి—
వక్షస్స్థలంబును వలచి పాఱినవి
వక్షోనివాస శ్రీవత్సకాంతులకుఁ
గసులను జీకటుల్ గ్రమ్మిన వోలె
వెనుకాడి యచటనే విరిసి నిల్చినవి—
యధర బింబమ్మున కంత దూకినవి
యధరబింబములోని యరుణాంశుతతుల
కనురాగభరితమ్ములైనవి వోలెఁ
దనివిదీఱక యచ్చటనె పెనఁగొన్న—
వచ్చ వెన్నెలఁ జిల్కు పట్టి యా నగవు
ముచ్చటపడి యాన మొనసి నుగ్గినవి ,
చంద్రకాంతిమ్ములై సాంద్రానురాగ
తంద్రమ్ములౌచు న త్తఱిఁ గరఁగినవి ,
పలుకులు పలుకంగవలచె జిహ్వందు
పలుకులు-పలుకులై భావబంధములఁ
గరఁగి కన్నుల నోడికలుగ నిల్చినవి ,
చరణంబులను దాఁక జరగెను జిహ్వ
కరములు, బెనుమత్తుగ విసఁటోలెఁ
దరము దప్పనవి ముద్రతి సొక్కి సొక్కి—
యీరీతినే యుపచారంబుఁ దీర్ప
నేరక యువకుఁడై నిలుచున్న వానిఁ
బులకలు గులకరంబులు గాను స్వేద
కలితమౌ కుంచిత కాయంబువాని
నిలువెల్ల భక్తియై నిలచినవానిఁ
దలఁపెల్ల నావఁ జిత్తడిగొన్నవాని
మనమెల్ల నిభృతసమ్మదమైన వానిఁ
దవకన్న వేఱు నమ్మనివాని జిహ్వ

వుసఁ గాంచి కరుణ యుబ్బొంగు కన్నులను
దనుపార విచ్చి-శ్రీధాముండు పలికె
బళిర జహ్నుకుమార! బళి భావధీర!
బళి చిత్సుఖాధార! పాపకురార!
బళి గళితవికార! బంధనిస్తార!
బళి గుణమందార! భక్తికాసార!
కోరుకొమ్మోయి నీ కోరిక యేమి
గోరెదవో యన్న కోటిబాలార్క-
కాంతులు దనఁ గప్పఁ గమలెత్తి యతుల
దాంతులైనట్టి వేదాంతులకెల్లఁ
గనఁగప్ప తిరుగు శ్రీకాంతునిరూపు
గనఁగానఁగాలేక కడలొత్తికొనెడు
గరడులతోఁ బైనిఁ గవయు సుధాబ్ధి
తెఱఁగువ దూకు నా పరమపూరుషుని
పలుకుల మునిఁగి దిక్కులు దోచకుండి
తెలిసి కొంతవడికిఁ-దలవల్ల యెత్తి
పలికె జహ్నుండు జూపులఁ జిత్తమునఁ
బులకిత కరయుగంబుల నంజలించి
యెల్ల కోరికలకు నెల్లపీవగుట
నల్లలితాచార! చక్షులు పండ
నిన్నుఁ జూచిన యప్డనిండికొన్నదిర
పన్నుతరీతి నిద్భాప్రపంచంబు-
మఱియడుగఁగ నేది వరము దక్కినది
సురుచిరదేహ! నా చూపులు నీదు
పాదపద్మమ్ములపైఁగూర్కనిమ్ము
నాదైన హృదయం బనవరత మవిధిఁ
బోకుండ చిత్సుఖాద్భుతమైన యట్టి
శ్రీకాంత! నీప్రాఁపుఁ జేరఁగనిమ్ము

నాకరములు శుభాకరములై భక్త
లోకమ్ములకు శుభాలోకమ్ములై స
నకసనందనముఖాఖిల విజ్ఞాని
నికరసుఖాధాన నిపుణంబులైన
తావక పదములఁ దరిసి పూజించి
సేవించుటందె మచ్చికఁ జెందనిమ్ము
నా పదమ్ములు వేదనాదావతార!
నీపూజకై వస్తునివహంబుదెచ్చు
టందె చరించెడునట్లు గావింపు
నందనందన! సుధాకంద! గోవింద!
బృందారకానంద! విమల! ముకుంద!
చందనానిల మృదుస్పర్శలకన్న
సుందరీపరిరంభ సుఖములకన్నఁ
జందు చందురువారు చంద్రిక కన్నఁ
జల్లనై యనితరసౌఖ్యంబుఁ గూర్చి
యుల్లంబు సొగియించు నున్నతంబులగు
తావక కథలు మోదంబునఁ బాడ
నే! వక్త్రమునకెప్పు డిచ్చగావింపు
నీవు లేనిది నన్ను నిలుపకు మోయి!
భావంబునకు నీవె పట్టుగా వోయి!
యని యిట్లు భాషింప నరవిరికంట
నమకంప దొలుకంగ నాజహ్నా శిరము
నిమిరి తథాస్త ని ధీరవీక్షణుఁడు
తమిదొలుక నగవులు దరళింపుచుండఁ
దరళాక్షి నపుడు సాత్యకిఁ జూచి పొలఁతి
వరము గోరుము త్యాగభరితమైనట్టి
నీ తపోనిష్ఠకు నెదలోన మెచ్చి
ప్రీతి నచ్చితి నన్నఁ గ్రీగంట్లయందు

లలిత లక్షాభంగములు వాని వెన్క-
దులకించు గోర్కెయుఁ దోఁబూచు లాడఁ
  గొడుకు గావలె ననెఁ గోమలి, మడఁతి!
కొడుకునిచ్చితిఁ దీఁకొను మనుపలుకు
వినవచ్చె వార్షకవనద నినాద
మున కెనయయి పొత్తి మ్రొక్కి కన్నెత్తి
చూచెఁ జూచెడులోన సొగసులనెల్ల
నాచికొన్నయది-శ్రీనాథురూపమ్ము
గమలకుఁ జాటయ్యెఁ గడలెల్ల వెలసె
వనజాక్షిమదికి ఫక్కున నవ్వినట్లు
అప్పుడు జహ్నుఁ డయ్యతివనుఁ గాంచి
తప్పుచేసితిగదే! తపమెల్ల నేలఁ
గలిపితి గదవె! నాకై వట్టి నట్టి
ఫలమంతయును వితవరచితి గదవె!
పొరపాటు పడితివే! మఱచితిగదవె!
పోరిని విజ్ఞానంపుఁ బుట్టుమాల్చితివె!
భవబంధములు మాన్చు ప్రభుఁడు నిల్చుండ
భవబంధములఁగూర్చు వరము గోరుదురె!
విషయాఽతిగుండైన విభుఁడు నిల్చుండ
విషయ సుఖంబుల వెలఁది వేఁడుదురె!
వేదాంతవేద్యుఁడౌ వెలుఁగునిల్చుండ
బాధాకరము లోక పథము గోరుదురె!
మునిజనంబుల మనోధనము నిల్చున్న
మనసు మరులుగొన్న తనుజుఁ గోరుదురె!
మోక్షంబొసఁగు పరమూర్తి నిల్చున్న
మోక్షంబు విడిచి యేమోగోరికొంద్రె!
యున్నదే యమృతంబటన్ననుఁ గఱుదు
తెన్నులు విడనాడి మన్నడుగుదురె!

మందారవాసన ల్మలయుచు నున్న
సుందరి! దత్తూర సుమము లాశింత్రె,
దెలిపీరు విలఎల్ల పెలలఁ బోవిడిచి
ఖలముల కెండమావులను జేరుదురె!
నా దురదృష్టమో! నీ దురదృష్ట
మోదందడిగి! నిట్లు పుత్రునడ్గించె
రమ్మికనంచు నారమణితోఁ గూడి
యమ్మహాత్మకుం డటగూరి లోహ
దండపురమ్మును దడయక చేరె
వండజయానఁ దా నర్థించినట్లు
సుదతీశిరోమణి-చూలుదాల్చినది
మది మదిలో లేదు మగువ కానంద
మదిరాఽనుభూతితో-మగనికిఁగూడ
మది మదిలోలేదు మాయాఽనుబద్ధ
కింసార సంసార నంసక్తివదలి
కంసారి సేవింపఁగాఁ దప్పెనదు-
కడచెఁ దొమ్మిది నెల ల్పదఁతికి నంతఁ
గడుపు భారంబయ్యె గమనంబు దగ్గెఁ
జెక్కులు దెలుపెక్కె, నెక్కె శ్రమంబు
దక్కను రుచులు గాంక్షలు మేర మీఱెఁ
జన్నులు బలిసె నిశ్వాసముల్వెలసెఁ
గన్నుల సుఖకాంక్ష గలవయ్యె వళులు
గనుపడవయ్యె-విచ్చిన బొన్నపూవు
కెనయైననాభి యంతన బిరుపెక్కె-
సకల గ్రహంబు లుచ్చంబై నగతులు
ప్రకటించు నొకనాటి ప్రాభాతవేళ
మందమారుతములు మలయశైలేంద్ర
చందన గంధ సంబంధమ్ముతోడఁ

జలువలై ఘోలయుచు-సకల లోకముల
కలఁతలఁ బోకార్చు నట్టి కాలమునఁ
గనియె సాత్యకి యొక్క కనకాఽవదాత
తనుఁడై నవానిఁ జక్కని కుమారకునిఁ
గొడుకు గల్గెనటంచుఁ గొండంతలయ్యెఁ
బడఁతియానలుగాని భగవత్పదాఽబ్జ
సన్నిహితేంద్రియ సంచయుండైన
తన్నాథునకు సమ్మదంబేమి లేదు
వారు వీరనుఁ జుట్టుఁ జేరి ధన్యుఁడవు!
ధీర! ఘోరంబైన దృఢతపం బూని
వనజనేత్రుని దొడ్డ మనసున కెక్కి
తనుజుఁ గాంచితి వంచుఁ దనుఁ బ్రస్తుతింప
మస్తక విన్యస్త హస్తుఁడై దుఃఖ
గ్రస్తుఁడై-యూర్పు లక్కజముగఁ జిమ్ము
తన ప్రియపత్ని చిత్తాబ్జంబు జ్ఞాన
వనజాఽప్తకిరణ సంస్పర్శంబుచేత
నెన్నండు విరిసి శోభించునో! యాన
లెన్నండు గోయునో! యింక నటంచుఁ
దలపోయు పుట్టిన తనయు చిత్తమ్ము
కలిపాపబంధ సంగ్రస్తంబుగాక
భగవంతునందు సద్భక్తిచే విరిసి
నెగడునో! నెగడదో! యగనంచు వందు
నా జిహ్వ విట్టుల ననవరతమ్ము
నోజ వేవేలుగా యోచించికొనుచుఁ
గలగంచుఁ-దనపుత్రుఁ డిలపైని సుగుణ
కలితుఁడై-నెత్తమ్మివలె విరియంగ
వలె నంచు శ్రీపతి పాదమ్ములందు
లలితపూజాకమలంబిట్లు వ్రాల

వలె నంచు-మధుధార వనజంబు, భ్రమర
కులముల రప్పించికొనునట్లు మధుర
గుణములచేత సజ్జనుల గణంబు
బనుపడ రప్పింపవలెనంచు సూర్య
కిరణసంపర్కంబు నెఱసిన యంత
విరియు తమ్మియుఁ బోలె-విజ్ఞానకాంత
మతులఁ గన్గొనినంత నతుల సద్భక్తి
నతిపేశ మోదమందగవలె నంచుఁ
దమ్మిలో తేఁటులు దమకర్ణికమ్ముఁ గ్ర
మమ్మునఁ జొచ్చెడు మాడ్కి-లోకమునఁ
జరియించుచున్న నేమఱక శ్రీకాంతు
చరణయుగ్మమ్ము లాసక్తి భజింప
వలె నంచు, మనమున దులలేని తలఁపు
తెలియించికొని చెవి కింపుగుల్కంగఁ
బుండరీకుండని పుత్రునిఁ బిలిచెఁ
దండిరి విజ్ఞాన ధన ధనదుండు.
పుండరీకా! యని పుత్రునిఁ బిలచె
వండజయాన సాత్యకి దన కమల
వెలుఁగులు గ్రుమ్మంగ పెల్గుల వెనుక
వలిరేఁగుచుండ నానందబాష్పములు
పుండరీకా! యన్న పూర్ణనామమ్ము
నిండు గొంతుకతోడ నినదించె దిశలు
పుండరీకా!' యన్న పూర్ణనామమ్ము
ఖండ సంప్రీతితో ఖగములు నాడె-
'పుండరీకా! యన్న పూర్ణనామమున
మండితగతిఁ దరుల్మస్తమ్ములార్చె
'పుండరీకా!' యన్న పూర్ణనామమ్ము
గండరోమాంచముల్గ్రిమ్మకొనంగ

ఘోరు ఘోరుమటంచు ఘేరులు మ్రోయ
పౌరసంతానము ల్సవిగొని పలికె
పుండరీకా! యన్న పూర్ణనామంబు
దండివేడుకతోడ దా నాలకించి
యసదృశవాసన లలమికొనంగ
మిస మిస మధుధార మేదినిఁ గురియ
జల జల రాల్చెఁ బూవులఁ గల్పకములు
దల లార్చి యార్చి మిన్నులతోటలందు
ఘలు ఘల్లు మంచుఁ గంకణములెల్గివ్వ-
చలిత ద్విరేఫమంజులకైశ్య యగుచు
చలితాబ్జకుచములు చలిత తరంగ
లలితాంచలము, సముచ్చలిత చక్రాంగ
కుల కలకల సముజ్జ్వలసారిహార్య
కల నిక్వణమ్ములు చలితాబ్జ నాళ
కరములు-నెఱ బోటుగమ్ములు గురియ
పరమూర్తి-దిక్కుంభ భరిత సత్కీర్తి
జగదేకధాత్రి యిచ్చానంప్రదాత్రి
గగనవీథులసు గంగమ్మయాడినది
కలకంఠ కలకంఠ కులములఁ బోలి
లలిమీఱ నస్వరః కలకంఠులెల్లఁ
బాడిరి వల్లకీక్వణనము ల్మీఱ
నాడిరి మేఖలట్గాడి మ్రోయంగ—
పుండరీకునిదైన పుట్టుకలోన
గండరించెనో లోక కల్యాణమెల్ల!
కమలెత్తుదునుఁ జూడఁగా నేర్చె శిశువు
గనులందుఁ గలువల కాంతులే దూయ
పెలవులువాఱ నవ్వులు నేర్చె శిశువు
నెలవగవుల వెన్నెలే గిలుబాడ

తలనెత్తి చుట్టుప్రక్కలఁ గాంచె శిశువు
దులలేని పీలాల యలకలే దూఁగ
కరరుహంబుల నానఁగా నేర్చె శిశువు
కరరుహంబుల సుధాకణికలే చిమక
పదముల నల్లార్చుటదినేర్చె శిశువు
పదపద్మములఁ డాలె బయలెల్లఁ బ్రాఁక
కలకల మని కేకినలు పెట్టె, శిశువు
లలిత వీణానాదములె పలుకంగ-
నలకలు మదుటిపై నటు నిటుఁ దూఁగఁ
గళనించు బాలు వక్త్రమ్మును గాంచి
నపుడు పున్నమ వచ్చినట్లు భావించు
నపగతేతరభావ యా మాతృదేవి
కర కంకణమ్ముల కాంతులు బయల
నెఱయ శిశువు కరనీరజంబులనుఁ
గదలించినప్పుడు కాంతకు దిశలఁ
గదురు సూర్యుని వేయికరములే దోచు
పలికించు సారెముద్దులుగార జనని
పలుకును జిలుఁగుచూపులలోనె నాఁడు
గిలిగింత పెట్టును గెరలింప జనని
సుఖపుగ నవ్వుఁ గన్నులతోనె నాఁడు
శిశువన్న నా తల్లికి- శుభంకరుండు
వసుదేవసుతుఁ డిడ్డ వాత్సల్యభరము
బాలుఁ డటన్న నా ప్రమదకు భువన
పాలకుం డిచ్చిన వజ్రాల మూట
పట్టియటన్న నా పడఁతికిఁ గనులఁ
గట్టిన విమల మోక్షానందభూమి
కూన యటన్న నా గోతికి జన్మ
మూనిన జ్ఞానవిద్యా నిధానంబు

యొక తనూజుఁడు దన కుద్భవంబందె
నికలేదు మఱఁతి, కీ రేదు లోకములఁ
గోరఁ దగినదేది కోరిన కోర్కె
గూరె సర్వేశ్వరు కారుణ్యమహిమ
రార! నా చనవుల రతనాల బరణి!
రార! నాకనులఁ బొంగారిన కోర్కె!
రార! నా జీవన రమణీయదీప!
రార! నా భాగ్యంబ! రార నా జియ్య!
రార! నా యింట వెల్గారు చంద్రుండ!
రార! నా హృదయ కాంక్షారామ ఎకమ!
రార! నాయూర్పు! రారా! తపఃఫలమ!
రార! రారా! యని రమణీయనేత్ర
యెలుఁగెత్తి సుతుఁ బిల్చు ఎలుపులో భక్తు
దెలుఁగెత్తి హరిఁబిల్చు సొలపులే దోఁచు
నెలుఁగెత్తి సుతుఁబిల్చు ఎలుపులో వగలు
దలకొన్న ప్రియురాలి ఎలుపులే దోఁచు—
నెలుఁగెత్తి సుతుఁబిల్చు ఎలుపులో కరుణ
బొలయు గద్గద నాదముల తీరు దోఁచు—
నెలుఁగెత్తి సుతుఁబిల్చు ఎలుపులో హృదయ
తలము గప్పునది వాత్సల్యమ్ము దోఁచు—
నెలుఁగెత్తి సుతుఁబిల్చు పిలుపులో వాని
వలవనే బ్రదుకు దశా భయమును దోఁచు—
సర్వ రవంబులు సంఘీభవించి
యుర్వర పుట్టెఁ దానొక్క సూనుండు—
నిడుదఁ గన్నులు మూఁ నిదురించు నపుడు
గడలేక చూచు నప్పడఁతి గుమారు—
మినుకుఁ గాటుక పెట్టి కనుదోయి బెరుగు
వని యందు రేపాటి యయ్యెనో! చూడ

వలె నందుఁ గమలు చేరలఁ గొల్చు నెల్లఁ
దెలవవ్వ నవ్వు వెన్నెలఁ దానుఁ గరఁగి—
నడుపాడఁ దొడఁగెఁ గన్నయ్య కోమలికి
నడుపాడఁ దొడఁగె నానాకాంక్షలు హృది—
పలుకంగ నేర్చెను బాలుండు సతికిఁ
బలికెఁ గాంక్షవల్లకులు మధురముగ—
నాడంగ నేర్చె సాత్యకికొడు కంత
నాడె నామెకు హృదయంబునఁ గూడఁ
బొరుగిండ్ల కెల్లనుఁ బో నేర్చె సుతుఁడు
వరగాత్రికోర్కె భువలయమే జూచె—
నీరీతిఁ బెరిగెఁ గుమారుండు తరుణ
మార రూపుఁడు కూర్మి మరువంపు మొలక
యంతట నక్షరాభ్యాస మహమ్ము
శాంతియుక్తుండైన జనకుండు దీర్చె—
నుపనీతుఁ గావించె యుక్తకాలమునఁ
గృపతోడ సర్వశక్తి, నిగమమాత,
గాయత్రి బోధించెఁ గలిమలాపహము
నా యాత్మజునకు బ్రహ్మసుబోధ దండ్రి—
చదివించెఁ గొమరుని జహ్నుండు వేద
మధిక శ్రద్ధాయుక్తి నతఁడు వల్లించె
వల్లించు టననేమి! వరుసగా వచ్చె
నెల్లవేదములు దాపే వాని వలచి—
పదశాస్త్రమందు దుర్వారనై కవాద
పదము వాక్యమ్మున పరమ ప్రమాణ
మందు వైశేషికమందు సాంఖ్యమ్ము
నందు యోగమ్మునయందు ననేక
మంత్ర తంత్రాది కర్మమ్ములను స్వ
తంత్రుఁ డయ్యెను జహ్నుతనయుఁ డప్పాట

స్మృతులెల్ల నేర్చె విశ్రుత ధర్మశాస్త్ర
తతినెల్ల కెదికె, సంతతనిష్ఠతోడ
నుపనిషత్తులు పార మొనరించె లోక
విపదంబుధుల దాట విజ్ఞాననౌక
నలరించు వేదభాష్యమ్ములు చదివె—
లలితమౌ వాని కొనలు దాఁకె వివిధ
మహిత పురాణముల్ మదినాకళించె
మహావిద్భుతుం డెందు మఱిలే దనంగ—
గానంబు, జంత్ర విధానంబు, తాన
మానప్రధానముల్ మర్దళప్రముఖ
చర్మవాద్యమ్ముల మర్మముల్ నేర్చె
మర్మజ్ఞుఁ డితఁడే మఱిలే దనంగ—
వివిధ నృత్యంబుల వేత్తయై వెలసె
వివిధ కళలయందు విశ్రుతుం డయ్యె—
పుండరీకుండన్నఁ బుండరీకంబు
పండితులకు మహా ప్రతిభాప్రభావ
విరచనాదరులు కవీశ్వరతతికిఁ
గరపుర్ధిఁ బుండరీకము పుండరీకు
డెల్ల సభలయందు నెసఁగెను సాంధ్య
మల్లికామృదుల నిర్మలమైన కీర్తి-
యెల్లగోష్ఠులయందు నెసఁగెను సుకవి
తల్లజుం డనెడునుదారయశస్సు
సకల సంగీత సంస్థలయందు వెలసె
నిఁక–పుండరీకుని కెనలేదటంచు
సకల నాట్యవిచార సందర్భములనుఁ
బ్రకటమయ్యెను వాని బంధురకీర్తి-
చిన్నతనము–మిన్ను దన్నిన బుద్ధి
సమున్నత రూపంబు–సదమల యశము

వినుత సదాచారవిధి వినయమ్ము
గనుఁగొని-యిటువంటి ఘనుని నల్లునిగఁ
బడయు భాగ్యంబు మాపాల నున్నదియొ!
బొడఁగనవలె నని భూసురు లెంద
రెందరో కన్యల నివ్వఁ గౌతుకము
నందడిగొనఁగ విచారించుచుండ
నఖిల భూసురమణియైన జహ్నుండు
సుఖవృత్తి నొకనాఁడు శుద్ధ విచారఁ
దన ప్రాణసతిఁ గనుఁగొని-కుమారునకు
ననురూప బాంధవ్య మమర వీక్షించి
పరిణయం బొనరింప భావంబు గలదు
అరసి చెప్పఁగదె! నీ యభిమతం బన్నఁ
గ్రీఁగండ్ల వేయి కోర్కెలు గుమిగూడ
నా గజగమన మందాఽలసరీతిఁ
 గానిండ నుచుఁ బుత్రుఁ గనుఁగొనె వాని
మౌనమేయందు సమ్మతముఁ జూపించె
నంత జహ్నుండు విద్యాసముద్రుండు
శాంతచిత్తుఁడు-సదాచారవ్రతుండు
గులమును, రూపంబు, గుణమును గలిగి
సలిత లక్షణోజ్జ్వలయగు నొక్క-
కన్యాలలామమ్ము కాంత సౌభాగ్య
ధన్యను వీక్షించి తన కుమారునకుఁ
బరిణయ మ్మొనరించె బంధుజాలమ్ము
వరుని బాలికఁ గాంచి పరమ సమ్మోద
భరితులై పార్వతీ పరమేశ్వరులకు
సరియంచుఁ బలుమాఱు సంస్తుతింపంగ
నత్యంత మధురభావమ్ముచేత
సాత్వికచిత్తంబు శబలితం బయ్యె

వర వధూవరులు సుందరహాసములనుఁ
బరిజనంబు లంటి సాష్టాంగమ్ము సేయ
తరువాతఁ గొన్ని వత్సరములు గడువ
పురుషపుంగవుఁడైన పుండరీకుండు
నవయౌవనోద్భిన్న నవ్యలావణ్య
ప్రవిమలతను యష్టిఁ బరగెడు దాని-
శాతశారకటాక్ష జాలమ్ముచే న
చేతనునకు మరు ల్చిమ్మెడు దాని
లలిత గండస్థల ఫలకమ్ములందుఁ
జెలఁగెడు శోణకాంతులు గలదాని
నలకావళీ పరికలిత నిటాల
తలముచేఁ జంద్రుఁద్ర స్తరిసేయుదాని
నరుణమై యాన నాఽఽభరణమైనట్టి
తరుణాఽధరమ్ముచేఁ దగ నొప్పు దాని
మదదిగ్గ మాతంగ మల్లకుంభములు
చదియఁగఁజాలు కుచద్వయి దాని
ననుభవించెఁ గుమారుఁ డానందసాంద్ర
మనముతో వికసిత వనజంబుఁ దేటి
యనుభవించినయట్టు లత్యంత ముదము
బెనఁగొనఁ జక్రంబు పెంటి జక్కవనుఁ
గలిసినయట్లు ఎచ్చిలర తీచ్చుఁ గొని
చలపట్టి మదనాగ మొలపెడునట్లు
కాయంబు గాయంబు గలిపి సర్పమ్ము
నోయన సమరతి నొనరించునట్లు
ఈరీతి సుఖములఁ గూరి యాత్మజుఁడు
సారసనేత్రి స్నుషయును గృహమ్ము
జీవవంతము సేయఁగా వీక్ష సేసి
భావమ్మునను బొంగెఁ బడఁతి సాత్యకియు

నిటులుండ నొకనాఁడు విటమనఃపేటి
పటు మన్మథాఽఽగమ పాండిత్యపాటి
రతి సుగంధితకాటి రతిరాజకోటి
తత క్రమ కటిపీరి, తారుణ్యఘోటి
పువువిల్తుదైన యాఁబవబాణ మఖిల
భువనైక మోహన పుణ్యఫలమ్ము
హృదయముల్దాటి యా వృతవల్లవులకు
వదరక, బెదరక, యలజడి లేక
లలిత విభ్రమకళా లతికయ పోలెఁ
కొలసంబు సూపు మిన్కుల మెఱ్గుపోలె
మదనడిండిమ మూను మదహస్తి పోలె
పదనైన వలరాజు వంకిణి పోలె
పొలపు గ్రమ్ముఁగ వచ్చు కలహంస పోలె
పొలసు లార్చుచు నొప్పు గల మీను పోలె
కడి పోని వలతేని కిడు దండపోలె
వడపాడు ప్రత్న రత్నశలాక పోలె
వెలయంగ నిఱుచున్న వెన్నెల పోలె
వలు గ్రమ్ము-జవ్వాది వాసనపోలె
రమణీయ మగు సాంధ్యరాగమ్ము పోలె
కమనీయ మగు కన్నె కలయును పోలె
తొలి రతిలో వింత పొలపును పోలె
కలరాగమునఁ గ్రొత్త కళయును పోలె
సమరతిలోని యుత్సాహంబు పోలె
క్రమహీన మతిత విభ్రమరేఖ పోలె
స్పష్టంబు గాఁగ-నస్పష్టంబు గాఁగ
నిష్టంబుతోడ నమీహాత భావ
ములనుఁ గుప్పించుచుఁ గిలకిల మనుచుఁ
దలిరుఁ గోయిల పదువులు పోలె గంట

ఊలియంగ మేఖలాకలితముల్, దిశలఁ
బొలసాడఁ జూపులు, పూలనవ్వులును,
మదవృష్టి గురియంగ-మదనాభిషేక
సదమల జలకుంభ సదృశంబు లైన
జిలుఁగు గుబ్బలు-నాణి గల ముత్తియముల
బలుహారములు స్రుక్క-వగలును విక్క-
నా విటులకు మనోహరమైన తమ్మ
తావి గల్గిన తావి మోవి చలింప-
కరకంకణంబులు గల కంఠములనుఁ
బరఁగింప రతికళాప్రౌఢ ప్రబంధ
ములు-పద్మముల దోయి వలఁదిన తొగరు
జిలుఁగులత్తుక, తావి నెలకట్టు గట్ట
నిలపైని వస్త్రంపు నెఱికలు దూల
వలయము ల్వలుకంగ ఘలు ఘల్లు మనుచు
వివిధహస్తంబులు వివిధ భంగిమలు
వివిధ తాళంబులు వెరవునఁ గూర్చి
వివిధ ప్రబంధముల్ వెలయించి మించ
చవినించి యొక్కతె చక్కెరబొమ్మ
చదురు సూపుచు నున్న సభనుఁ గూర్చున్న
చదురు లెల్లరు మహాశ్చర్యంబుతోడ
బాళి దువాళింప వశము గాకున్న
నా లేమ నెనువెంట నంటు చిత్తముల
నల్లవో! మృదుగాత్రి! యవు కళాధాత్రి!
యల్లవో! సుఖదాత్రి! యల్లవో! యువతి!
బాపురే! పీయూష పరిపూర్ణవరం!
బాపురే! మదమత్త పల్లవమహామ!
బాగు బాగని పెద్ద వలుకుచుఁ దాల్మి
వీఁగుచు మదులలో లోఁగుచు ధైర్య

మూగుచు పులుపుట్టి తూఁగుచుఁ గదియ
నేగుచు నెఱకొంగు లాగుచు బాళి
సోలుచు నుండంగ శుద్ధచిత్తుండు
పాలితాచారుండు బహుశాస్త్రవేత్త
కీర్తి సత్పరివేషమూర్తి విజ్ఞాన
పూర్తి మహాస్ఫూర్తి పుండరీకుండు
పుండరీకాక్షునిఁ బూజింపఁగొఱకు
మండితసద్భక్తి మధురఁ దాలయము
వంకఁ బోవుచునుండి బలవద్విధాతృ
సంకల్పబలమున-జనసమూహమ్ముఁ
గాంచి తద్వీక్షణకాంక్ష నెన్దిరిగి
పంచాస్త్రనిభుఁడు సభాస్థలిఁ జేరె
చేరిన యంతటఁ జేరిన జనము
ధీరుని సుగుణమందారుని-పుండ
రీకునిఁ గాంచి-యుద్వృత్తిఁ బోవిడిచి
వీకున నల్లంత వెనుకకు నొదుగ
విరిసెను మునుము-సుందర నీలవేణి
తరుణ ఘనశ్రోణి వరమృదుపాణి
చకిత చకితనేత్రి సౌందర్య సార
ముకురంబు, విభ్రమ నికరంబు గూడఁ
గ్రీఁగంటితోఁ బుండరీకునిఁ జూచి
యాగునవ్వున నవ్వినట్లుగా నవ్వి-
కటకాముఖము వట్టి పటముష్టిబంధ
ఘటనంబుతోడ- మత్కుటశాతకార
మగు దృష్టిఁజిమ్మి నాట్యాంతరంబందు
నగవుల బరణియై బిగువుఁ జన్నులనుఁ
గ్రుమ్మెడు గతి ముద్దుగుమ్మ దగ్గరుచుఁ
గమ్మకస్తురి వింత కడిపుమ్మటంచుఁ

గ్రమ్మఁగ నఱజార్చి కఱదున కొంగు
బొమ్మల నల్లార్చి బోయిన దాని
యెదమేని నెత్తాని సుడిసిన ధైర్య
మెదలిన యెదనున్న యెద నెడలేక
మరుఁడు లేఁ దలిరాకు కరవాడియైన
కరవాలు మాఁ యక్కటికంబు ద్రోఁ
కరించి మించి యగ్గలిక నివేక
ధరమెల్ల నొక వ్రేటఁ బడిపోవ నఱకఁ
జిడిముడిపడి మ్రోడుపడి బేలుపడి నె
గడుపడి తొడఁబడి తడఁబడి వెఱఁగు
పడి పెనుబడి చెఱఁబడి వెడగుపడి
వెడలఁబడంగనే నెరవును దప్పి
యతినేల విక్రమమైన మోహమ్ము
మతిగ్రమ్మ తాపమ్ము మనసును గ్రమ్మఁ
ఘోరంబులగు నేడియూరుపు లొప్పదల
ఘోరమైనట్టి వికారముల్మెదలఁ
గన్నులఁ జీకటుల్లప్పుడునుండ
వన్నలినాక్షి మాయాజాలమునకుఁ
జిక్కిన చిత్తంబు పేరుపరాక
స్రుక్కి నాట్యంబెల్లఁ జూచి యద్దాని
యన్నువ నవ్వును నన్నువ నడుము
నన్ను గ్రమ్మించెడు నట్టి లేఁ జూపు
తొగరువాతెఱ, జిగి దొలఁకుఁ గుచంబు
లగణిత మదదిగ్ధమైన సుశ్రోణి
నిటలఫలక వత తుక్కటిలాలకములఁ
గుటిల చంద్రునిఁ గేరు కొమ్మ నెన్నుదురు
పెడఁదఁ గన్నులు జొత్తు లడరుఁ జెక్కిళ్ళు
తొడవయి కోఁకిరుఁబోలిన నాన

యచ్చొత్తినట్టులై యాత్మలో నిలువ
నచ్చపలాక్షి యొం దాఁచికొనుచుఁ
దారి గృహమ్మున జేరెఁ బుండరీకుండు
సరసవాక్యామృత సంసేచనమున
నెదురుగాఁ బఱతెంచె నెలనాఁగభార్య
పదముల మృదుగతి వలయంబు లులియ
చిఱునవ్వు నవ్వె నెచ్చెలిఁ గాంచి భర్త
యఱమనస్సేనిచ్చె నానవ్వులందుఁ
దలఁచు నేదియొ బరధ్యానంబుతోడఁ
దలవంచి, తలనెత్తి తనలోనె వాఁడు
నవ్వించెదు నేదో యాకాశమందు
గుప్ప చూపులు-గుంపు గొన్న తుమ్మెదలు
పలుకఁ దాలో నేమొ! బలికిన యంత
నళుకు నెవ్వరును విన్నారేమొ! యనుచుఁ
గన్నీరు గార్చుఁ జిక్కఁగ భార్య బొంచి
కొన్నదో! యని కొనగోటనే చిమ్ముఁ
జిట్టమిడుచు నింకఁ జిక్కెలే యనుచు
గుట్టు రట్టుకనెక్కు నెట్టాకొ! యనును
నంతలోననె నవ్వు, నంతలో మూర్చ
నంతలో పెటఁగందు నంతలో మిడుకుఁ
బలుకఁడు భార్యతోఁ బలికింపనైనఁ
బలుకు పలుకవట్లు పలవల గాఁగఁ—
జదువఁ డేదియుఁ గాని చదివినవైన
మది మదిలో లేక మఱవునఁ జదువు
వాదంబు సేయండు వాదింపనైన
ఖేదంబుతోఁ బ్రతివాదికిఁ జిక్కు
మలుకు పెన్నెలలకు నళుకుఁ గోయిలకు
బెళుకు నారామ సంకులవాయువులకు—

వీకీతిగా బాళిగూరి యావార
వీరజాక్షిని మది నిల్పి యికెట్లు
బారంబు లేక యా వలరాజు ముందు
దీరి మార్గము జూవ దీనాస్యు దగుచు
నొకనాఁడు దుర్వచనోద్యుక్త ఖండ
నికర నిబిడితంబు నిష్ఠురద్యూత
కలహపరాయణ కలితమ్ము నార్ద్రి
పలఖండతోరణాఽఽవళి పరీవృతము
తాంబూల నిష్ఠీవతారకితమ్ము
శంబరశత్రు వసంత హర్మ్యమ్ము—
కాదంబరీ పూతిగంధజుష్టమ్ము
సాధుసంవాద ప్రసక్తి దూరమ్ము—
కుక్కుటనాద నిషిద్ధకర్ణమ్ము
కుక్కుట కలహ సంక్షోభసంజాత
రణబద్ధ దుర్విటాఽఽ రావసంకులము—
ధన పరిగ్రహణశ్రద్ధాయుక్తజరఠ
మాతృనానావిధ మధుర పల్లావ—
మాతత పావన్యపాఽఽస్థావతలము
చోరైకనిలయమ్ము- సురతాఽతిరేక
ఘోర గదాఽఽక్రాంతవారాంగనంబు
నటనటీజటిలమ్ము-పటుకామశాస్త్ర
పఠన పారవయుక్త భవనాంగణమ్ము
నానావిధాఽఽతోద్యనాద కాంతంబు
నానావిధవిలాస నవ్యకామాఽస్త్ర
పద్మశమ త్తాంగనా సంచయాంకితము
వదిలమ్ముగా వేశవాటిలోఁ జొచ్చి-
నావేళయందు బాహ్యేశింధమందు
నావెలంది యలంది యమిత లావణ్య

పేవధి యగుఁ గుచసీమఁ జందనము
తావిపూవులు జుట్టి తమకంబు మెట్టి
చెలువారు నుదుటిపైఁ దిలకంబు పెట్టి
జిలుఁగు పైరాణిపూవుల చీరఁ గట్టి
కులుకు గుబ్బలకుఁ గొంకుమఁ గొను పడఁక
గిలుకు మెట్టెలు జిలిబిలిగ గిలుక్క-
గిలుకు మవంగఁ బంజాలకమ్మల జిగి
తలిరులఁ బూయఁ జెక్కు-లదోయిపై ని-
నిడు తమంగొనల నాగెడు కటాక్షములు
దడఁబడి త్రెవ్వినదండలై పొదల
నందంద ముత్యాలచందమై క్రొత్త
యందంబు జిమ్మ స్వేదాంబుకణంబు
లలమిన నిట్టూరు—పలసభావంబు
నలఁతి ఎగ్గును ద్రోసి తలమూపు నిచ్చ—
రతికాంత రణకాంత రమణీయమైన
వితము వోలింప—మున్నత కుచంబులకు
నెత్తు వచ్చెదు నంచు నెంతయుఁ గిన్క-
హత్తినవోలె—హస్తాబ్జంబు తోడ
బంతిగొట్టుచు నున్న బయకారి—యంత
లంతలఁ బుండరీకాక్షునిఁ బుండ
రీకునిఁ గ్రీఁగంటఁ గ్రీడగాఁ జూచి
సాకూత మృదులహాసము కావి పెదవి
యంచుల నొదిగి—ముత్యము వోలె నాద
మించు విధాన- నాకుంచితగ్రీవ
రమణీయమైన వక్త్రంబుతో-జడయు
భ్రమియింప మదమని రథచక్రమట్లు
మణిమయమేఖలా మధురకళత్ర
ఘనభారవహన దుఃఖ భరాహతమ్ము—

గమనంబు గడు చెన్ను గలిగింప—గర్వ
తుముల కుచద్వయి దొనఁకఁ గంకణము
లెలుగింప—వలయంబు లలియ జార్పైట
వెలయ వెన్నెల గాయఁ దల మల్చిచూచు
చూపులలోనె యా సొబగుని హృదయ
మావొత్తి తెగఁ గ్రుమ్మి—యటు మాయమైన
తనువెల్లఁ గన్నులై తడయక చూచి
మనసెల్లఁ గోర్కెలై మఱపుట్టి నిలచి
తలనార్చి వంకబొమ్మల నార్చి—తళుకుఁ
దళుకు తెప్పల నార్చి తత్తర పేర్చి
నడికొర్చి తన నడపడి దీర్చి—యిల్లు
వడి నార్చి పుండరీకుఁడు లోని కేఁగి
నిలువ జరద్విపంస్థుల పరిరంభ
నిలయ కార్కశ్యవంచిత సమాలంబి
కుచయుగ లాలాక్త గురుదంతనాన
నిచిత కాదంబరీ విస్ఫురగంధి
పలిత శిరస్క—విఫలితాతిహాస
జలపూర్ణనేత్ర—దుర్జన్మనికార
గతి—సమాశ్రితవిటతతి—వేశ్యమాత
యతనువ కెనయైన యా పుండరీకుఁ
జేవెలుంగునఁ గాంచి—చిత్తఱువెనయ
నా వెఱ మార్చి—భాగ్యము భాగ్యమనుచు
నటు నిటుఁ జూచి—మాయాయత్నపటు వి
కటహాసమున నెద గంపించుచుండ
రండు రం డీనాఁడు—రాజీవగంధి
పండు—ఘటించు— నా భాగ్యంపుఁ బంట
యెట్టిది నాన, మి మ్మీక్షించె నోటు
పట్టి—యీనాటికి ముట్టదు గూడు

సుదతి దాఁకదు మూర్కొనదు పూవుఁ, బెదవి
గదుర రేయెండ నవ్వదు—చదురాడ
దాడఁ జూడదు నడపాడదు సఖులఁ
గూడదు—మఱుమాటలాడదు దిగులు
వీఁడదు నొక పాట బాడదు- వీణె
బోడిమి గుల్కంగఁ బూనదామిమ్మొ
గములను జిత్రించికొని వగఁ జక్క
వనవుచున్నది జింగఁ బాసిన పెంటి
కడకు నేటికి నేను గారింప నెటులొ
గడి యొక్కటి గొని సాపడి-యొక యింత
గయి పేఁకొవి నిన్నె గనుల నిల్పికొని
కయికొన్న దా కందుకం బేమి పాలు
బోఁక మా బాబులు పున్నెంబు పండ
వాకిటికే నేఁడు వచ్చి నిల్చితిరి!
రండంచు నా దండి పుండరీకుని న
ఖండమౌ మర్యాద గలయది వోలెఁ
దోడుకొనిబోయి. నొప్పడిన కప్పురపుఁ
గిడు వాసనలు గ్రమ్మి ఘుమ్మనుచోట
మత్తరిత్తల నున్న మొత్తకాశముల
చిత్తరుపులు మత్తు హత్తించు చోట
వాసనావాసిత పర్యంక రత్న
భూషలై విటమనస్తోషంబు లగుచు
లలితపల్లవ తామ్రములు-యావకాక్త
ములు బాద ముద్రలు గంచోట
శయనమందిరమున సంస్థితుఁ జేసి
యయ్యగారు వచ్చినా రతకేల రావె
యోలమ్మ' యని ఎల్వ-నొకనైపు నింత
దూలిన పైటతో లీలపై మరుని

బటువు బిల్లలఁ బోని పాలిండ్లు సుంత
పుటమార పైఠిణీపూపైక దన్ని
నిడువాలు గల కీలు జడతోడ-బడుగు
నడుమడు గడుగున వడకంగ వడిగ
బిలిబిలి నవ్వు చెక్కుల దూఁగ-వచ్చి
తలుపోరఁగా నిల్చి తరుణి వీక్షింప
నా వెన్నెలలవాఁక యలమినఁ జిత్త
మావేశమును గాఁగ నతిప్రయత్నమునఁ
గుదియించుచున్న దుర్మదమనోజాత
విధుత ధైర్యునిఁ గాంచి వేశ్యానవిత్రి-
యొకచేత నిలుచున్నయువిదఁ జూపించి
వికటహాసమున నీ విధముగాఁ బలికె
  ననుభవించితిమి మేమును జాలి బాళి
చినతనమునఁ గాని చిత్రమీమరులు
కనివినికాన మెక్కడ నీజగాన
మనసుమార్చితిరేమొ మరులుమాతంగి
దినిఎంచి మంతర తీరత మిచ్చి
యనరాదు గాని మాయమ్మితో నవఁగి
పెనఁగంగఁ గోరి యా పెదసెట్టిగారు
  మనసు వచ్చిన యన్నిమాడల నిత్తు
నీ పొందు నిమ్మ ని నిలుపున వేడ
పావ-నీ పొందానవడి మతి దప్పు
చూడ దాతని సుంత చూపుల ద్రిప్పు
మాడ లెన్నైన్నను మరులున కెచ్చె?
చెప్ప చూచితి నెంత జెప్పిన నిన్న
దప్ప యోచింపదఁ దలిరాకుఁబోఁడి
వగకాఁడ! నీకునై వగఁజిక్కి తనుకఁ
దెగ కన్నులందు నిండుగ నీరు నించి

నీవు వత్తువా! యంచు నీవున్న దిశకుఁ
దీవెలు వాఱించి తెలుప జూపులను-
వెలితిత్రోవలు గాంచి-పెదవి చిట్లించి
కళవళపడును జక్కవ పక్కి వోలెఁ
చూడుమా వీణియ గోడు మన్నెల్ల
గూడు గట్టెను కొనగోరు దాకించి
పలికింపలేదు తంత్రులు సంచుపాట
వలె వేయలేదఁ గోయల మూగ వోవ
వచ్చితివింకలే? వగలాఁడి కడకుఁ
దెచ్చికొన్నది నిన్ను తెగ తఎయించి
చిలుక గోరంకలవలెఁ బూవుఁదాని
వలెఁ బాలు నీరునువలెఁ జందమామ
వెన్నెలవలెఁ బెనగొన్న కోర్కెలనుఁ
గన్నెయు నీవునుఁ గలిసి వేయేండ్లు
మనియుండవలె నంచుఁ దనబిడ్డఁ జూచి
కనుఁగవ నవ్వ చక్కఁగ నిష్క్రమింపఁ
దేనె బూసిన వాలు బోని యా వేశ్య
దా -నిజమైన కాంతాకమ్ము-మరులు
గలిగినయదివోలెఁ గపట బాష్పములు
గలిగిన కనులఁ, జెంగటికి నేతెంచి
కలహంస పోలిక నిలిచి యున్నాళ్ళు
లలచి యీ నాటికి ననుకంప గలిగి
యరుదెంచితిరా! యంచు ' నంతలోపలనె
కరకంకణమ్ములు గడు రవళింప
మెఱుఁగుఁబోఁడియు వాని మెడఁ గౌగిలించి
తఱచుఁ జూపులనుఁ జిత్తమ్ముఁ గ్రుమ్మనఁ
గరమెత్తి తున్మాధ గణలతో నెనయు
నెఱకురులనుఁ దీర్చు దరయుచు దానిఁ

బలికె మించులమూట! బన్నీటితేట!
గులుకుచూపుల చాన! కోర్కెలకోన!
తొలిచూపులోనె నా వలపెల్ల దోఁచఁ
గలిగిన చెలి! నిన్నుఁ గనుల వీక్షించి
యింటికేగితిఁ గాని యిం దదేదియునుఁ
గంటికి నీ మూర్తి గనులకుఁ దట్టి
పడఁతిరో! నీ వేలు జడతోడు అవిక
నడఁగని గుబ్బలయాన నీవలఁదు
ఉత్తుకసాక్షిగా లలిమీఱఁ గన్ను
లెత్తి వీక్షింప లే దిల్లాలి నేటి—
కడుగవే! యీ గుండె గడియార మలఁత
బడనేల! దాఁ జేయు ప్రతిచలనమునఁ
బలుకు చెవ్వరి పేరొ! పద్మాయతాక్షి!
నిలుపనివ్వని కోర్కె నిలువునఁ బట్టి
పడికివి వెఱచి—రాఁజాలకపోతి
మెడబంటి యయ్యో నిక్కడికిఁ దావమ్ము—
యాలపించిన నింక నాపలేదంచు
బాల! యీనాఁడు నీపాలికేతెంచి
తని పుండరీకుండు దన యెద హత్తి
కొనియె వామాక్షిని గుబ్బచన్నులను
హత్తించె వామాక్షి గుత్తంబు గాఁగ
నత్తరుణుని బిరుసైన గుండెలకుఁ—
బలుకు లుత్తరములు గిలకిల నవ్వు
లొలయించుటలు గోపములు చీదరించు
టలు దనిముద్దులు వళుకులు జళుకు
లలరుట తెచ్చిన యాలింగనములు-
నింతలో మదదృప్తకాంతాకుచాత్త
కాంతకుంకుమ సదృశంబైన కాంతిఁ

చేరఁ బశ్చిమ ధరా ధరశృంగమందు
వరుణుండు నిలిచె సంధ్యాకాల సూచి
పుండరీకుండు పూబోఁడి మైపూఁత
గందరించెడు నెద కంపువోఁ గడిగి
చపలాక్షి వగతోడ సొఁగసంపుచును
గృప దప్పుదురె! యంచు నెచ్చరింపంగ
నళుకుచు నులుకుచు నా ప్రముచ్చు గోర
దలఁకుచు నెటొ దొడ్డిదారి వీధిఁ బడె
నిటఁ దండ్రి దనకొడు కెన్నఁడే గాని
పటుబుద్ధి యలువీడి బైఁటవోవండు
బోయిన వోరంత ప్రౌఢుండదేమొ
సాయంతనంబైన సరగ రాఁడంచుఁ
జింతించుచుండంగ నింతలో బుణ్య
వంతుండు దయసేసె వరకుమారుండు
వాయనా! సాయంతనంబైన సంధ్య
సేయవుగాకేమి! చిత్తంబు శాంతి
నుండునే గద! యెట్టులుండిననైనఁ
దండిరి! నెఱవౌనె ధర్మలోపంబు!
పండితుఁడవు క్రియాపరుఁడ వీవిట్లు
బండనైతివి—నగుబాటు గల్గెదునొ!
యని యన్న నొక గొంత నణిగియా వార
వనితావిలాస సంపదలె భావించి
కొను చెల్లొ సంధ్యవార్చెను బుండరీకుఁ
డవనేల! ధర్మక్రియాసక్తి దలఁగె—
నమృతపూర్ణంబైన యట్టి ఖాండంబు
రమణీయ యౌవనరాజ్యాఽధినేత్రి—
పొలఁతి యేతెంచి—కన్నులఁ బెదవులను
జిలుకు నవ్వులముందు నిలిచె నా భర్త

దల యెత్తి చూడండు తల్పంబుపైనిఁ
దల ద్రిప్పుకొని వండె-కలిలమానసుఁడు—
వెడవెడ గన్నీరు వెడలంగ—మనసు
దడఁబడ ధృతి గీడు వడి పరితాప
భరమునఁ బ్రాణేశుఁ బలికింపఁ బోయి
యరవాయి గొని యూర్పులదర, నవ్వాని
చరణపీఠంబున శిరముంచి వండెఁ
దరుణి యల్లుచునఁ జింతాతంతువులను—
దెలతెలవాఱె—దిక్కులఁ బక్కిగుంపు
లెలుఁగిచ్చె—విరులు మూతులు విచ్చెఁగాలి
హెచ్చె జగంబెల్ల నెలమి గుల్కంగ
నచ్చపలుండు వేదాధ్యయనంబు
సలుపుచున్నాఁడు స్వరసంచయమ్ము
జలిబిలి మ్రోయు-వన్నెల వెలయాలి
మొలనూలి జలుఁగు గంటల మ్రోఁతతోడఁ
బులకలు గ్రమ్మంగఁ బోలించికొనుచు
ముగిసె భోజన మంతఁ బుండరీకుండు
ముగుద యందిచ్చు తాంబూలంబు నమలి
కనుమూసికొనెఁ దన కమలఁ గన్పడియె
మనసిజ రాజన్య మదహస్తి వోలె
నలసాలసములైన యాలోకనములఁ
జెలువు బండించి దిక్కులనెల్లఁ గందు
కము నాడుచుండిన కలికిరూపమ్ము—
తమకమంతటిలో నెదలమీఱె-దర్ప
కుఁడు కో యనుచు నార్చి వడి వాలుబూవి?
జడిపించి పేర్చి నెవ్వడి నెదఁ గ్రుమ్మె—
మఱునిమునంబె భూసురకుమారకుఁడు
బరుగిడి పానింటఁ బ్రత్యక్షమయ్యె—

మిడిగల వజ్రంపు మిసుకుఁ గమ్మలను
గడియము ల్కిపులఁ జొక్కపు హారములను
ధరియించి గుజరాతు జరబాజు చీర
నెఱికలు మీగాళ్ళ నెఱసి యాడంగ—
మొనలు నిక్కిన కుచమ్ములు గంబుకంఠ
మును—మందచలితము ల్ముద్దులు గురియఁ
గలహంసవలె వచ్చి కన్నుల కాంతి
పలువరుసలకాంతి పరిఢవిల్లంగఁ
గై దండ యొసఁగి చక్కఁగ శయ్య జేర్చి
యాదినంబును వింత యందము ల్నెఱపె
సంజకు విలు పేరె సరసవతంసుఁ
డంజాచు సంజాచు నానాఁడుఁగూడ
జనకుఁడు బ్రశ్నించె జాగేల ననుచుఁ
దనయు ఖారం బసత్యముతోడఁ దీఱె—
మఱుదినంబునఁగూడ మధ్యాహ్నమందు
సరిగ సానింటఁ గాపురమయ్యె— రోయా
వెలఁదియు వివిధ మాయలను విలాస
ములను మత్తెక్కించెఁ బండరీకునకు—
సంగ దట్టపుఁ గాంతి చెంగలింపంగ
సంగన దెలిచీర నలరారఁ గట్టి
మువ్వంక దీరి, సొంపుగ నిలుచుండి
నవ్వుఁ బరీరంభణం బొనరించుఁ
జెంగావి ధరియించి—చుంగులు దీర్చి
రంగారు మేలిముసుంగు ధరించి—
మొలకట్టు జిలుఁగు గంటలు మ్రోయ వచ్చి
తెలిగన్ను లఱమూసి కిల కిల నవ్వి
వలిపంపు పైక చన్నుల గదిమించి
కులుకు గద్దువహస్త జలజంబుఁ జేర్చి

నిలచి నా వగకాఁడ! నీకుఁ జిక్కితిర
నిలిపకొమ్మనుచు బొమ్మల వింత నవ్వు—
జడదీర్చి విప్పి క్రొమ్ముడి గయిసేసి
యడిగెదు నిది మేలొ! యది మేలొ! యంచు
సరిగ తైక సడల్చి చనుకట్టు గట్టి
యరసెదు నిది మేలొ! యది మేలొ యంచుఁ
దిలకంబు దుడిచి యిమ్ములఁ జుక్క బొన్చి
యలరించు నిదిసొంపొ! యదిసొంపొ! యనుచు
విరిదండలను బాణిసరులనుఁ బట్టి
యరికట్టు నివివర్తొ! యవి వర్తొ! యనుచు
నుదుట గండమ్ముల నదిమి ముద్దిడుచు
నదిగొప్పొ! యిదిగొప్పొ! యనుచుఁ బ్రశ్నించు
నెద బిట్టు గ్రుమ్మి పయ్యెద దీసి కనులు
గదిసి ముద్దిడి మోవి కఁవొవ నడుగు
నది యోగొ! యిది బాగొ! యని లతాతన్వి
గొదలేక చెక్కుఁ జెక్కునఁ జేర్చి కమల
నఱ మూసి తల యూచి యతితి బాహువులఁ
బరిరంభణము సేసి ప్రశ్నించుఁ దరుణి
యది బాగొ! యిది బాగొ! యంచు నీ రీతి
మదన సామ్రాజ్య సమ్మదమునఁ జిక్కి
జహ్నునిసుతుఁడుండ జనులలో విరిసె
జహ్నుకుమారు నిచ్ఛా ప్రవర్తనము—
నా చెవి కీ చెవి కంటి తండ్రికిని
జూచాయఁగాఁ దెల్సి సుతువర్తనమ్ము
దలమీదఁ బిడుగు చిటిలినట్టులైన
పలితశిరస్కుండు పావిత్ర్యమూర్తి
యలపరించుచును సాత్యకిఁజూచి—'పరము
ఫలియించెఁ గాంచితే! వారకాంతలను

మరఁగినవాఁడు గుమారుండు కందు
నెఱఁపె గులంబున నిష్టురవలన
'ఏనాటి' కని పల్కి యిలపైనిఁ గూలఁ
దా నమ్మనేరక చాన కోడలిని
లక్షింప బాష్పజాల మ్ముబుకంగ
నక్షీణ పతిభక్తి యమరిన వనిత
యిది కాద గిట్టక యెవ్వరే బలికి
నది గాక నా ప్రాణనాథుండు సుగుణ
శేవధి యనుచు వచించె నాలోన
భావజమదమత్త భద్రగజంబు
నడతెంచెఁ బుండరీకుఁడు—దిక్కులందు
నడరిన సంజ ఛాయల విలోకించి—
వానిఁ గాంచినయంత మానస మధిక
దూనమై దీనమై తోయజనేత్రి
చూచితే! నాయన్న! చూచితే దండ్రి!
జూచితే! యతివేల సుగుణమందార!
గిట్టనివారు ని న్నిట్టట్టు బలికి
రట్టు దెచ్చిరి—ప్రేమరాశి యైనట్టి
మీ తండ్రి యిలఁ గూలి మిడుకుచున్నాఁడు
నా తండ్రి! నిజమని నమ్మి యా వాదు—
వాదంబులందు నిజ ఛేదింపలేక
సాధింపఁ జొచ్చి రీపడుచు గల్పించి
త్రిమ్మటకాంద్రేమి దేఖనో! వీటి
గుమ్మమ్ము వదలకు—కోట్యవవాద
ములకు నే బదులిత్తుఁ దలనెత్తి నిలిచి—
కలదు ధనమ్ము పుష్కలముగా—విద్య
గలదు సురాచార్యుఁ గలవంగనైన
గలదు రాజ్యమ్ము—గలదు విలాస

ములకెల్ల నెల్ల-ముద్దులగుమ్మ-బోలఁతి—
కలరింటఁ దల్లిదండ్రులు-గాపురంబు
నిలుప బాగోగులు నిర్ణయింపంగఁ
గలుగ విదేమి నీ కిలపైని గొడుక!
పరదేశముల నుండి పండితుల్వచ్చి
పరికించి నీ ప్రజ్ఞ బ్రస్తుతింపంగ
నా రాజు నీ రాజు యంచన కాన్క
లారఎ నీ తండ్రి యతి మోదమంద—
యఖిల శాస్త్రమ్ముల నభ్యాసమునకు
సుఖితులై నినుఁ గొల్చు చుండ శిష్యులును—
బందుగు లెల్లరుఁ బరితోషమంది
యందంద నినుఁ గూర్చి యంకింపుచుండ—
నరుదొంద నొక్క మహారాజు వోలె
వరపుత్ర! గొల్వు దీర్పఁగవలెఁ గాక
యాయింటి కీయింటి కరుగంగఁ బోలు
నా! యెల్లవారు ని న్ననదుగాఁ జూడఁ
బోయితి బో! యింత ప్రౌఢుండఁ దగున!
నాయన! చిన మిదే వడవడి దగును!
జూడుమా! నీ తండ్రి గోడంచుఁ గనుల
నోడికల్గొన్న బాష్పోదకములను
బలికిన తల్లి విభ్రాంతుఁడై జూచి
తల వంచి లజ్జ చిత్తము నాచికొనఁగఁ
బరణంబులకుఁ బక్క సాగిలి మ్రొక్కి
పరితాపమున నిట్లు వచియించె సుతుఁడు
బోనులే తల్లి! యెప్పుడుఁగూడ నింక
రానివ్వలే! యిట్టి రట్టు లొక్కటియుఁ
గనుల బాష్పమ్ములుం గ్రమ్మ నేఁడునకు

నను వలంపకు మంచు నాతి, సంతుష్ట
యయ్యె సుతుని గాంచి యనియె జహ్నుండు
న య్యవసరమందు నలమటఁ జిక్కి
కొడుక! లోకపు నడవడి చాల దుడుకు
గడు నేర్చి యొడలెల్లఁ గన్నులు గలిగి
నడచినఁ దప్పవు నలువు లెన్నుటలు—
వడుచుఁ బ్రాయంబు తోఁపదు మేలుఁ గీడు
నవనవగాఁగఁ బ్రచారమైనదిర!
వలిగాని మాట వత్స! పురంబునందు
నినుఁ గూర్చి-నే వింటి నిన్ననే దాని
ఘనపెల్ల మంది-చుమ్మలు జూటైనయ్య!
సామాన్యమనుజా నాచారంబునందు
నేమి గన్పట్టిన నెవ్వరుఁ గూడఁ
గన్నువేయరుర! యోగ్యత గలవాని
కున్న లోపంబెంత చిన్నదే గాని
పదిమంది గుమిగూడి, వ్యాకృతులల్లి
యది సత్యమంచు సిద్ధాంతించి దాని
జాటించెదరు బహుజనుల వాక్యమ్ము
పాటికెక్కువ దండ్రి! ప్రతియొక్కరుండుఁ
బ్రతి దాన సత్యనిర్ణయము చేయంగఁ
బ్రతినఁ బూనఁడు-దానఁ బని గూడ లేదు
నదిగో! పులి యటన్న నిదె తోఁక యనెదు
చదురులు లోకంపు జను లెరంచికొమ్ము—
బుండరీకుఁడు దొడ్డ మిండఁడై-సాని
మండల మరఁగెనటో యంచుఁ బలుకు
చున్నారు వారిపైఁ గొన్న రోషంబు
కున్న! రవయు వొడఁగూడదు లాభ
మది లోకపథము గార్యం బాత్మకిక—

మది నెంచికొనర! యీ మాట లటుంచు
జనకుమాటలకుఁ బశ్చాత్తాపమంది
తననింక వెలయాలిఁ గనులెత్తియనుచు—
నెడదఁలోఁ దా నిశ్చయించి ప్రేమంపు
మదుఁగైన దన సతీమణి గుర్తించి
తొలినాళ్ళఁ బోలెఁ గోర్కెలు గెడఁ గూడ
వలెవేయ దొడఁగె విద్యల నెల్ల నతఁడు
ఇటు రెండు మూఁడునా ళ్లేగినయంతఁ
గుటిల విచార నిష్కుటమువ నుండి
యెగిరి పోయి ఎఱల నేతెంచనట్టి
ఖగమునకై పొంచి-కడువెతలొందు
ప్రబల గృధ్రంబు కరణి వెలయాలు
నిబిడ నిరాశచే నిలువునఁ గూలి
మఱల నెష్టిన భూసురకుమారకుని
మరగింపఁదలచి తా మాతతోఁ గూడఁ
దలపోసి మఱునాఁడు తగులంబు గూర్చు
కెలనంబులందు నిగ్గులు దేరినట్టి
తనమాటవట్టు కుంచెనకత్తెఁ జీరి
కొనకొని యా యింటి గుఱుతులు చెప్పి
చానతో-నంగమచ్చము లెఱింగించి
వానితో భాషించువగలెల్లఁ దెలిపి
తరుణి మాడను వంచకరునిచ్చి-కార్య
మరయుము బహుమాన మఱుపేయ ననుచు
మఱి యాన గొల్పి ముమ్మరముగా వాడి
శిరసు వంచిన యొక్క- యరవింద పుష్ప
మును జేతి కొసఁగి పంపిన నది వోయి
మును వింటి గుఱుతులు పోల వీక్షించి
తల యూచి-మానవ తనువు పేకొన్న

వలరాజుభోల్కి భోగులు చలియింప
వట యొంటిఁ గూర్చుండి-జట సెప్పుచున్న
వటుధిషణు మహానుభావు వీక్షించి
కనులతోఁ బిల్చి-క్రీఁగండ్లతోఁడుతనె
వనజాక్షి వెలయాలి వాలకంబెల్ల
నెఱిఁగించి గుఱుతుగా వరవింద మొసఁగి
సరసర నేఁగె నెవ్వరు గానకుండ
నిదురవోయిన యాస కెదికించి షరుఁడు
షదమెత్తి-విరివింట మదిగాడనేయ
నయ్యవపీసురుం డదరుచుఁ బుష్ప
మొయ్యన గ్రహాయించి యువిఠఁ దలంచి
మెలమెల్లఁ దిమ్మిరేకులు విడదీయు
చలలుగాఁ గడ_ద కలలెల్ల రేగ
పీనాఁడ బ యి దూ యింతి కై దార్చి
సూనాస్త్రునకుఁ జిక్కి శౌక్కాక యుండ
గరఁగించి కరఁగి సౌఖ్యరసంపు నిద్ద
నరుదెంతునని నిశ్చయము సేఁకొనియె
కుటిలకుంతల నిల్పికొంచుఁ జిత్తమున
వటు యిటు వార్చి మాధ్యాహ్నిక సంధ్య
సరగఁగా సేఁ భోజనము బాగాలు
గరమున యందె వెల్గఁగ-వలిపంబు
జంగాళముగఁ గప్పి సకియ వీక్షించి
యంగన యొక గడె యటు బోయి వత్తు
నమ్మతోఁ జెప్పవే యని పడఁబాఱె
నమ్మగ్దుఁ డింతల సంతల షన్న
కోడెకాండ్రెల్లరి జాడ బోలించి
వాఁడె! బోవుచున్న వాఁడు-బ్రోయాలి
నిలువీడి వెలయాలి శళుకులకోఁడి

తలవంపులనుచును దచ్చనలాడ
నంతకుమున్న మిథ్యామధ్య జేతు
లంతలు పాలిండ్ల నానించ యొత్తి
తిలదువారమునకు నిలచి యాత్రోవె
దిలకించుచున్నది వెలయంగఁ జూచి
కినుసైగఁ బెదవినవ్వునఁ దల్లిఁ దెలిప
ఘనవియోగభరంబు గప్పనవోలె
నిట్టూర్పుచున్నంత నెట్టన వచ్చె
దట్టుఁ డయ్యెడ వసుధాఽమరసుతుఁడు
కటివంక బొమలు చక్కఁగ ముడివడఁగ
సరసీజముఖి సాని చాయ వీక్షించి
కృతకబాష్పమ్ములు గ్రేటుకొవంగఁ
గృతకకోపమ్ము గ్రిక్కిఱియంగ లోని
కేగిన ననురాగమినుమడింపంగ
నాగు మాగు మటంచు నతఁడు వెన్దవిలె
పలుకదు చెలి నవ్వు జిలుకదు మరులు
గొలుపదు సేవలు సలుపదు జూపు
నిలుపదు దనపైని నిలువెల్లఁ గోప
మెలసిన సొంపులే గళ గదలినవి
గన్నుల బాష్పము ల్గదలాడ వాఁడు
కన్నియ నిద్దంపు గద్దువ బట్టి
బ్రతిమాలె దానికిఁ బలుకలేదాపె
యతి మనోహరములౌ నత్తన్వి గండ
ఫలకముల్ నివిరి-యొత్తిలి ముద్దు వెట్టి
పలుకరించెను దానఁ బలుకలే దాపె
యదరుఁబెదవితోడఁ బెదవి గదించి
మదిరాక్షి కన్నుల మధువును గ్రోలి
యెలనవ్వె-దానికిఁ బలుకలే దాపె

యలకల నొత్తి కుంతలములు దీర్చి
తలపైని నుదుట ముద్దులు వెట్టిపెట్టి
గిలిగింత లిడెఁ-దానఁ బలుకలే దాపె
మొగమెత్తి కూర్చున్న ముద్దుఁజక్కవల
జగడించు చనులు వక్షమ్మున దూయఁ
బరిరంభణము వేసెఁ బలుకలే దాపె
గరము భరంబయ్యెఁ గాంతకోపమ్ము
పుండరీకున, కంతఁ బొగిలి-త చ్చరణ
పుండరీకమ్ములఁ బొరయించి శిరము
చండి! దండింపవే క్షమియింపకున్న
మండన భూతముల్ మాటలు వలికి
పలుకకుండిన నాయువులు నిల్వ వనుచుఁ
బలవరించిన వారభామయుఁ బ్రణయ
కోపంబు నొందిన కోమలి తీవ్ర
తాపతప్తుండు బదంబులం బడిన
వగకాఁడు క్షమియింపవలయు లేకున్న
వగల నుడాపిన భావంబు నందు
నతఁడ న్న కూచిమారాదిక గ్రంథ
మత మెంచి మతిలేని మమత జొప్పించి
తగ లేవనెత్తి-లేఁ జిగురుల కావి
జిగి దొలంకెడు కండ్ల నగలించి మనసు
బలికె వామాక్షి- నేర్పుల కేమిలేర!
పలికెదు పాండిత్యవాసన ల్గ్రిమ్మ
యేవిక్షమింతు నే నింతకుముందు
గావించినవా! గ్రొత్త గావించువవియు
దొనఁగులు చెప్పరా! యొసపరివాఁడ!
గస మసఁ బడెద వాతక్షణంబునకె
విరహంబునకు-నన్ను వేలించుకొఱకుఁ

చిర విరహంబు నోర్చితివి గాదొకో!
నీకేమిలే! యింత నిడివి కన్నులది
బోఁక చన్నుదిల సొంపులగు సన్నలది
గలదుగా! కన్నియ గౌగిలింపంగఁ
గలుగరుగాక మా కిల నెవ్వరైన
కలిగినవారెల్ల గానివారల్లు
దొలఁగిన మఱి యెట్లు గలుగుదురోయి!
పైపైని వలపుల భ్రమలు—మోహంబు
జూపుదురే గాక! శుద్ధమ్ము గాఁగ
మనసులు దూఁచెడు మగవాఁడెవండు
గనుపడలేదు—నిక్కము—గాకయున్న
మఱచి యుందువె! నిన్ను మఱువంగలేని
తరుణిని—నీ వొక్క బెరవానిఁ బోలె
వనచు జంకించిన యతివ వీక్షించి
కనులార—వెరవార—మనమూరఁ దిగిచి
కవుగిటఁ జేర్చిన—కామిని కన్ను
గవ నవ్వె—వాని యంకంబునఁ బండి
నెమలి కన్నుల రంగు లమరిన దృష్టి
సముదయ మతని వక్త్రమునఁ దుల్కాడ
నిడివి కన్నులబొమ ల్ముడుచుచుఁ—గేలు
జడకొనవాని యచ్చపుఁ గపోలమ్ము
లలనల్ల ప్రేయుచు ననియె లోకమున
వలపనుకే పెద్ద వస్తువు సుమ్ము!
గడు నిర్దయుఁడు బ్రహ్మ—కడలేని యడలు
నదరించు వలపు నిప్పుడమి సృష్టించె—
నదిగాక! కామినీ హృదయంబులందెఁ
గదియించె మితిలేని కన్నీటివఱద
అక్కఱగండ! యంచామీఁదఁ బెదవి

నొక్కించి నొక్కి కై పెక్కి యిట్లనియె
జిలుఁగు సంజలమ ఱెక్కల నార్చి యేగు
చిలుకపదుపుతోడఁ జెప్పి పంపితిని—
నారె సారెకుఁ గోర్కెలూఱ నర్థించి
గోరంకలను నిన్ను గుఱించి పంపితిని—
మలయసుందర లతావలి రసజ్ఞుండు
వలిగాలితో నాదు వలపు సెప్పితిఁగ—
గగనాన నీ యింటి కడకయిపోవు
మొగులు కన్నెకు నాదు మొఱ సెప్పుకొంటి
రాలేదా! యొకరైన రమణీయమూర్తి!
రాలేదు! రాలేదు! రామ! యెవ్వారు—
అని యుత్తరం బిచ్చె నతఁ డంతఁ—గొమ్మ
దన వాలుజడ నుంచికొనిన పూ వొకటిఁ
గయికొని—ముడిపెట్టి కఱి వంకబొమలు
దయమున వాని యురమ్మున వ్రేసె—
వ్రేసిన తన యెదఁ బెనఁచె బాహువుల
నానొంబగుఁడు—మేఖలాలంకృతంబు
వలిపంబు జాఱె నవ్వొంటికి జాఱె
నెలవగ్గ చూపుల వొలపంబు జాఱె
కల కలరుతి జాఱె—కలకలాపంబు
లిల జాఱె—బర్హి మంజుల కలాపంబు
దలపించి—కేశసంతతి విడబాఱెఁ
లలిత మనోజకలాపంబుతోడఁ
బురుడించు తొడలు వదరె—ముత్తియముల
సరులను జెరలాడెఁ—శయనించె నపుడు
గనుదోయి—యలసిన తనువుతోఁ దూఁగె
వనితవక్షమునందె వగకాఁడు—ప్రియుఁడు
కలకల పక్షిగుంపులు వల్కె—సాంధ్య

జలజాక్షి దాల్చిన మొలకట్టు వోలె—
ఇంటఁ బ్రత్యక్షమయ్యెనుఁ బుండరీకుఁ
డంటిన యలంతతో—నలమరితోడఁ
దన తండ్రియెదుటఁ బడను భయం బంది
తనయుఁ డుండెను—నాఁడు దప్పించికొనియె
మఱునాఁడు భుక్త్యనంతరమునఁ దండ్రి
యరసె సుతుండేడ యరిగెనో యంచు
నెక్కడున్నాఁడు వాఁ డక్కమలాక్షి
వక్కనఁ గదియించి యలరుచున్నాఁడు—
బలికె జలజనేత్రి— పండితులందు
నిలిచికొంటివి నీవు విశదవిఖ్యాతి
గడుముదమున నలంకారశాస్త్రముల
కడగంటి వెందైనఁ గానవోగాక!
భావజ భావనివాసంబు రతుల!
సేవనీయంబేది జెప్పు మటంచు
బదులిచ్చె వాఁడు నీపెదవి వామాక్షి
పదిలంబు సురతసర్వస్వంబు మోవి—
యదిగని దొకటి నిన్నడుగుచున్నాను
జదువుల దొర! పల్కు సరిగాఁగఁ జూచి—
సొగసై—ప్రేమంపుఁ దీగెలై—మరుని
తూఁగులౌ—నీ చూపు తూపుల తీవ—
యదిగాని దొకటి నిన్నడిగితివోయి!
మది మడిఁ జేర్చి—నెమ్మదిగ యోచింపు—
సారమై నవసుధాఽఽసారమై భోగ
పారమైనట్టి నీ పరిరంభణంబు—
అదిగానిదొకటి నాయాకాంక్షితంబు
బదులుగాఁ బదరక—సరిగాఁగఁ బలుకు—
యందాల దీవి—యానందాల క్రోవి

సుందరీ! నీ నీవి! సొబఁగులదీవి—
యదిగానిదొకటి ని న్నడిగినానోయి
బదులిమ్ము—చదువులోఁ జవులెల్లఁ జూచి—
కడిమీఱు పూవులపడవయై—మరులు
మడువైన—నీదవు తడిముద్దుతన్వి!
యదిగాని దొకటి—సొంపలరు నీనవ్వు
యదిగానిదొకటి—నీ యమృతంపుమాట
యదిగానిదొకటి—నీయక్షివిభ్రమము
యదిగాని దొకటి—నెయ్యఁపుదిమ్మె నీవె
కాదోయి! కాదోయి! కై లాటకాఁడ!
వాదింప నిది శాస్త్రవాదమ్ము గాదు!
యొప్పుకొమ్మోయి నీయోటమి నిపుడఁ
జెప్పెదఁ జి త్తరువప్పుకొనంగ—
బోడిమి యడివోయి—పుండరీకుండు
యోడితి నేనన్న నువిద పల్కినది
యదిమద్య మానంద సదనంబు సుమ్ము—
గదురదయ్యదిలేని కలయికఁ దీపి
మదిరమూచూడని మంకు—లోకమున
బ్రదుకనివాఁడు—సురతవంచితుండు—
నవకిసలయఖండ కువలయఖండ
నివహమండితమౌచు నీరేజనేత్రి
కనుచూపు బ్రతిఫలించిన పాత్రఁగల్లు
ననువుగానపుడవ్వ డతివకెమ్మోవి
నొక్కి నంజుచుఁద్రావనో ఎవవాని
కక్కుఱియున్నదే! యాస్వర్గభూమి!
మా యింటిలోనున్న మదిరకు దీటు
నేయుగంబులయందునేయింటలేదు—
వదరుటగాదు—నా పెదవికిసెప్పు

మదిరలోరసము నామరులు మన్నించి
చవిచూడుమింత! యాచవిచూచునట్టి
యవసరమునఁ గ్రొత్తలై నీకునెక్కు
నావిభ్రమంబులు నానావిధములు
భావజనిధి! యేలవర్ణింపనిప్పు
డనుమతించితివా! దెత్తున! రతిసుఖముఁ
దనివి దీరఁగఁ గ్రోలు తమకంబుగలదొ!
యనినంత దానివచనమాలకించి
తనచిత్తమందు మద్యమురుచి జూడ
వాసరేకెత్తిన పక్షిబాలనము
తో సకియకుఁ దెల్పెఁ దోఁడ సమ్మతిని—
' చిక్కె రావీఁడు నాచేతుల 'కన్న
నిక్క, గతికిఁ గ్రొత్తదెక్కు గల్పింప
మదనుని తరవారి-మానినివోయి
పదములంబులయిన చషకంబులందు
నానావిచిత్ర గంధద్రవ్యవాస
నానిచితముఁ బురాణంబైన మధువు
నింపించికొని—హేమనిబిడితవజ్ర
ఖండమండితమైన తట్టలోనుంచి
కొని—క్రొత్తయొయ్యారమునఁ గొనువడఁకఁ
గనుదోయి బెళుకులు గడలప్పళింప
గిలుకుమెట్టెలుగిల్కు గిలుకనిమ్రోయ
బెళుకుకంఠమునసొక్కులు సొంపుదీర
వలవల్లవచ్చి—చేతులనున్నతట్టఁ
దలిమంబుపైఁ బెట్టి తనబాహుయుగము
బెనవైచివానికిఁ గనులలోఁ బూని
తనుఎందునట్టియాకాంక్షలఁ బదివి—
చిఱునవ్వి—చషకంబుబొఱచేతఁ బూని

మరుబాణకువజీర! మదపురస్కార!
నాతేఁడ నాసామి! నావగికాఁడ!
రే పేనికి నిజోడ! నారంతుపీడ!
చవిచూడరార! రసంబులమూల
భవనంబు—మద్యంబు భావజాకార!
యనిచీరి-మదభరేక్షణములపీడ
లెనప చిత్రితమౌటునింతమైప
మదురువు మదిరాక్షి పెదవికందించి
చదురొల్కఁగన్నులసైగ చేయంగ—
నొకగ్రుక్కఁగ్రోలుచు మొకముజిట్లింప
నకియ వాతెఱగొంత చవిచూప మరల
నొకగ్రుక్కద్రావించి చకచకలాడు
వికచగండ తలంబు వేడ్కఁజుంబించి
యొకగ్రుక్కద్రావించి యుదుటుగుబ్బలనుఁ
గికురించి యెదగ్రుమ్మి కిలకిలనవ్వి
యొకగ్రుక్క ద్రావించి యువిదయీరీతి
ముకముల నొక్కించి సురనుఁగ్రోలింపఁ
గనులెఱ్ఱవాఱ సంగములుదూగాఁడ
మనసుబారాడ-నే యమవుమఁగాక
శయ్యపైఁదూఁగినఁజయ్యన నవ్వు
దయ్యబ్జముఖి మద్యమదియుమఁగ్రోలి—
మదభరాఙలస హాసమంజులమూర్తి
యదలించిప్రియుని సమ్మదముప్రేరేప
మగవనికెలప సంభ్రమమునఁగర్ణ
యుగళతాటంకంబులుయ్యాలలూఁగఁ
గదలఁగనెఱికురుల్, వదలంగ విరులు
చెదరంగఁదిలకంబు, త్రిదుల హారములు
నటియింప వలకలు చిటులమైఁబూఁత

గటకముల్ ద్రాయ-నుత్కటముగాశ్వాస
ములు గదురంగ-గన్నులమెఱుఁగార
జిలుఁగుసూడిగములు ఘలుఘల్లుమనఁగ
రమియించునలఁత నంగములు దూఁలంగఁ
గమలాక్షి వాని వక్షముననేలందె—
గడచెను కాలంబు గన్నులు గప్పు
పడమటనీరేజ బంధుండువ్రాలెఁ
గలికిపాలిండ్లయొత్తులతోడ విపుల
నలఁగినయెద-క్రొత్తతళుకులనీన
బొలఁతినొక్కులవిగుమ్మెలు-కావిమోవిఁ
దలసూపు నగవుఁ ద్రస్తరికిఁ దన్నంగ—
నానకి మైపూఁతలంటనబైర
వానమ్ము—ఘమ్మని వాసనల్లిమ్మ
లలితాంగిపంటినొక్కులు-జెక్కులిపయి
మలయు బోగులకాంతిఁ దళతళలీనఁ
జిఱుమత్తుతోడుతఁ జరణక్రమములు
చిఱుచలియింప-భూసురకుమారకుఁడు
వడతెంచె నింటికి-నవ్వుచువెంటఁ
బడిరాఁగ—దారిఁబోయెడుకోడెకాండ్రు—
చూచెను జనకుండు సుతుని వాలకము
గ్రాఁచదేహమ్ము గక్కునమువాపమ్ము—
బలుకరింపఁదలంచెఁ—బలుకుగొంతుకనె
నలనలఁగ్రాఁగెవసహ్యమ్ముచేత—
నంతలోఁ దల్లిసాత్యకి వచ్చి యేర!
యెంతజెప్పినఁగాని నుంతయు వినవు!
గట్టినకడపెల్లఁజొట్టి వచ్చితివి
దట్టుఁడవైతివి! తండ్రి! యిప్పటికిఁ
బదవద' యింటిలోపలికని పలుఁ

బదుపుగా నాయింటిపై ట నిల్చున్న
కొమరులెల్లరుఁ దుడ్చికొనర! నీమేన
గమగమలాడు నాగందంపుఁబూఁత
నని కేరుచునుఁబోవ, నాహాస్యమునకు
మనసునఁబాములు మలఁ నట్లైనఁ
బిత్ర కంఠగర్తంబుబెకలించి కొనుచు
నతికఠోరములు వాక్యములిట్లువెడలెఁ
గులనాశనుఁడ! యేలగలిగితి వీవు!
కులగౌరవమునకు గుద్దలిఁగొంటి!
తపమొనర్చిన దానఁ దనయుండుగల్గి
తపనయైనది జీవితంబెల్ల మాకు—
మాపూర్వజన్మకర్మములు—బల్లిదము
లై పుత్రరూపంబులై గాఁపేపెఁ
బరమేశ్వరుఁడు దాను వరమిచ్చినట్లు
గరమిచ్చినాఁడు—దుష్కరప్రతీకార—
మల్పబుద్ధులయట్టు లఖిలశాస్త్రార్థ
కల్పితసువివేక కలితులై నట్టి
వారు—మారవికారవశవర్తులైన
వారిపాండిత్య మేపాటికి నెక్కు?
నాసుతుండు వివేకభూషితుండగుచు
భూసురావళికెల్ల భూషణం బగుచు
వివిధయజ్ఞమ్ములువేల్చి—లోకళు
నవిగతగతి—ఁదృప్తుఁడవునట్లుజేఁ
జ్ఞానప్రకాశుఁడై-సవితకు దీటు
గా-నిలుచునటంచుఁ గరము నమ్మితిని
గాని పణ్యాంగనా కలుషకటాక్ష
దూనవివేకుఁడై దూరితలోకుఁ
డై యిట్లవగదెచ్చు ననియెంచనైతి

నాయుల్ల మిట్టులనంత దుఃఖంబు
బొందదీదుష్టుండు-పుట్టిననాఁడ
బొందిబాసననైనఁ బురుషోత్తముండు
మననిచ్చి నాకైన మరణంబునీక
మననిచ్చి నరకయాతన లిచ్చినాఁడు
నని యిట్లు విలపించు జనకునిఁగాంచి
తనయుఁడాపానరక్త విలోచనుండు
గలకలవగుచు నవ్వులతూఁగులందుఁ
జెలి-దానుఁగోలికియిచ్చిన తెలనాకు
మడుపులతమ్మముమ్మరమైనతావి
గడలుకొవంగ నీ కరణిగద్దించె
నెవ్వరోబలికిన చివ్వమాటలకు
నివ్విధంబుననల్క-యేలయేడ్చెదవు?
నాలయధ్వజఘంట లట్లులోకమునఁ
గూళలనోళులు గొఱమాలిపలుకు
ననవరతంబువానినిఁ బాటిగాఁగ
విని-ప్రజ్ఞగలవారు వెలగట్టికొంద్రె
యింటినుండినఁ జెడు, నిలమగవాఁడు
నింటనుండకచెడు నింతియటన్న
పలుకు నేనై నృష్ట నలిఎనానేమి!
బలుకుదునోరికి వచ్చినయట్టు
లని నరనరజన్న వంతకుముమపు
దనయుఁడెన్నఁడుఁ గూడఁ దన్నునారీతి
గద్దించియెఱుఁగని కారణంబుననుఁ
దద్దయుఁ గోపంబు దాపంబు వొదల
నొకమాటఁ బలుకకయుండె జహ్నాండు
అకలంకమతి భూషణాఽఽభూషితాంగి
పుండరీకునినతి-పూవ్రాయమున

నిండినకుండలై నీటు దుల్కాడు
కుచయుగమ్ములు సారెకున్ బుటమెగయ
నవలిత ప్రేమపూజ్యంబై నహృదయ
మున భుజియించి శయ్యనుబండి వార
వనితావిలాస విభ్రమములతెఱఁగు
భావించుచున్నట్టి ప్రాణేశుఁదరిఁ
భావజు మదదంతి పాటిగానిలువ
తలనెత్తిచూచి కన్నులఁజీదరించి
తలమల్పి వందినఁ దరుణాయతాక్షి
వినయక్రమముగాఁగ విభునకిట్లనియెఁ
కనులెత్తిచూడరు గానంతగాని
నాపై ఎదేమి యన్యాయంబు నాథ!
భావాఽనుగుణమైన వర్తనలేదొ!
నాయందు! గాక దిన్నఁగలేదొ హృదయ
మీయెడ మీఽకటులేమైన నాకుఁ
జెప్పంగఁబోలదో చింతయెయ్యదియొ?
దప్పో వాక్రువ్వ? నర్ధాంగిని గానొ?
వంచికొనఁగరాదొ? వంచన దగునొ?
పంచాస్త్రనిభ! యేమి పల్క వటన్న
మదిరానిపాన ప్రమత్తుండు వార
సుదతీనిశ్శృంఖలాఽశుద్ధవిలాస
మదిరాప్రమత్తుండు మదకలితుండు
గెదికింపఁబడిన యగ్గియుఁబోలె లేచి
తలముడి వీడి శిఖులువోలె వెండ్రు
కలు వాల్గ దిక్కులఁ గంపించుచుండఁ
గలకలమని పెట్టిగా నవ్వి కోప
కలిత వీక్షణములు గన్నులఁ బొదలఁ
బలికెఁ జాలుమలేవె! పాండిత్యమెల్ల

యొఱక వోఁపతివి నీయోరంత ప్రొద్దు
నర్ధాంగివట! మోనపట! ధర్మపథ ప
పార్థకమట! నీవె యఖిల ధర్మములు
నేర్చితివో? మేము నేర్వఁగాలేదొ?
జర్చింతువో, యూడ, శాస్త్రవాదమ్ము!
దినదినంబునఁ జూచినదియెగాదొటు!
కనులార నీదుముఖమ్ము? నేదేమి
గ్రొత్తవింతలు వచ్చి హత్తికొన్నవియొ?
గుత్తులై మాకను గ్గొరగింపంగ!
నీఁకఁ జాలు ప్రొద్దు వోయినది-మానిదుర
సుకమూచికొనకుము బోదెలు పలికి
పందుకొమ్మనినంత రెండుగన్నులను
నిండిబాష్పమ్ములు నిగనిగ మెఱుఁ
లలిత గండస్థలంబుల దిగజాఱి
బొలుపారుఁ గుచములఁ బట మెగయంగ
లలితాంగి భూమితలమునఁ గూర్చుండి
విలపించుచుండెఁ గన్నులమూసె మగఁడు
గడచెను రేయి యుత్కటశోకమునను
పడఁతికి జక్కవపడతికిఁ బోలెఁ
దెలవాఱెఁ దారకావళి మింట జాఱెఁ
గలకల రుతిమీఱె ఖగగణంబులకుఁ
గమలబాంధవుఁడు లోకంబునేత్రంబు
గ్రమముగాఁ బూర్వధరంబును దాఁకె-
వానఁడు జహ్నుందు వాత్మజాచొప్పు
దాన బరీక్షింపఁ దలఁచి యుండంగ
భోజనావంతరంబునఁ బుండరీకుఁ
డాజవరాలు మనోంతరంబందు
నిలువంగ గామపంకుల మానసుండు

దళతళలాడంగఁ దలిరాకుమోవిఁ
తమ్ములపుందావి దమ్మంట్లు మెఱయ
నమ్మదమునఁబోలి యటు బ్రయాణింప
జనకుండు వెనుకనే జనె గమనింపఁ
దనయుండు దనయుండు నాతండ్రి తెఱఁగుఁ
జని చని వాఁడు వేశ్యావాటిఁ జొచ్చె
జనకునిమదిలోని సంశయం బిపుడు
సిద్ధాంతితంబయ్యెఁ జిత్తంబు మివులఁ
క్రుద్ధమై నిశ్వాసవద్ధమై మోము—
రుద్ధమై గతి యసంబద్ధుండు సుతుఁడు
సిద్ధించెఁ గలకీర్తి జీర్ణింపఁజేయ
దైవమా! యనుచు బాధావివశుండు
నావసుధాఽమరుం డఘశంకి పైని
సుతుతోడఁ బోవక శుద్ధమానసుఁడు
నతమస్తకమునఁ దిన్నఁగఁ జేరె గృహము
నటఁ బుండరీకుని వబ్జాక్షి గాంచి
తటుకున నేఁగి కైదండ యొసంగి
కెంపుముక్కుల నింపు నింపు రాచిల్క
గుంపులు జెక్కిన కోళ్ళతోఁ బాణి
గల ముత్తియముల మేల్కట్టుతో వజ్ర
ములజాలరులతోడఁ జెలువంబు గులుకు
రవలమంచమున విభ్రమము దొల్కాడ
సువిధ, వన్నెల రాజు నుపవిష్టుఁజేసి
రంగుల చిలుక, సౌరంగుగాఁ దాను
చెంగట నిలుచుండి చిఱునవ్వు బొదల
జిలువాలు చెక్కిటఁ జెయి జేర్చి మత్త
కలహంసకూజితంబులను బోలించు
పలుకుల మద్య సేవనముఁ గావింపఁ

దలఁతురో! యన్నంతఁ దరళాయతాక్షి
కలికిచూపుల కోడి కల వివేకంబు
దొలఁగి కానిమ్మ నె నెలవవ్వి వాఁడు—
చిగురుల జిగి గేలి సేయు హస్తముల
వగలాఁడి యందివ్వ వసమతి మనసు
దానిలోఁ బ్రతిఫలితంబైన యట్టి
మీనాక్షి కన్నుల మెఱుఁగులు ద్రావు
కరణిఁ దమకమెత్తి గడుఁద్రావె మరుఁడు
విరివిల్లు సారించి వేడుకెత్తింప—
బలుకులు గపురంపుఁ బలుకులు మోవి
తళుకులఁ బంటి నొక్కులు జుంబనములు—
దెలియనేలేదు ప్రొద్దులు వారి కంత
నిలచెఁ బక్షిమధర నీరేజమిత్రుఁ
డటు దనయుని మదోత్కటవృత్తిఁ జూచి
చిటిలిన మనసుతోఁ జింతాఽవధూత
భావసంతతితోడఁ బరమ పవిత్రుఁ
డా విగతవికారుఁడైన జహ్నుండు
గృహమటు సొచ్చి దుస్సహదుఃఖబాష్ప
ప్లుతనేత్రుఁడు-సముద్విగ్నమానసుఁడు
దన ధర్మగృహిణి సాత్యకిఁ జూచి పొల్తి!
మనకుమారుఁడు ధర్మమండితుం డనుచుఁ
బొరపడితిమి కాము చెఱఁ బడినాఁడు
మరగినాఁడే వారమదిరాక్షిసేవ
కులము బొలిసెఁ గీర్తి యలసె ధర్మంబు
సొలసె-పెద్దఱికంబు దలఁగె-నాకింక
వలదంటి సుతుఁగోరవలదంటి వరము
వలదంటి యీ లోకవాసనావళత
వినవుగా కట్టాక్షి! గనుము నేఁ డాత్మ

జానిఁ బొంది నీవు జెందిన మహా సౌఖ్య
మిది కలగాదు గా కెవ్వరే జెప్ప
నదిగాదు గల్పించినదిగాదు నాదు
సేవఁ గాదు నేనే సతి! నేఁడు
నాసుతు వెన్వెంట నంటి పోయితిని—
కాంచితి నీనాదు కన్నులతోనేఁ
బంచాశ్రుతఖల్లి భగ్నుండు వాఁడు
వెలయాలియింటికై వెడలిన తెఱఁగు
కలికి! వికారంబు గన్నులఁ గప్ప
యట నెన్నిరీతుల నార్జించికొనునొ
చటులపాపము వాఁడు సద్గతి దలఁగి
యేమిసేయుదు! వాని నెట్లు మరల్ప
గా మనకగు! మనకపుఁ బాముకాటు
దాకినఁ బదమి మంత్రమ్ములు గలవు
గాక వేశ్యావిషకలిత కటాక్ష
పాతమ్మునకు సేయఁ బ్రతిలేదు సుమ్ము!
నాతి! యాత్మజుఁడు మనకు దక్కఁ డింక—
తొనకు లేఁ బ్రాయమ్ము తొంగలిచెప్ప
లను దొంగిచూచెదు లలితప్రేమమ్ము
గలిగి పీయూష నిస్తులభాండమట్టు
లలరు నీ కోడలి యలమటకేడ్తు
నా? యవ్వయము జెడెనంచు శోకింతు
నా? యశముడివోవు నంచని వగతు
నా? పండితుం డయ్యు నతి హీన కామ
కాపేతుఁడై వాఁడు ధర్మంబు దప్పె
నని యాపదింతునా? యాతన ఫలము
నవజాతిఁ దిటులు సూపునె! యందు గాం
నొందుదునా? యేమియునుఁ దోచ కిటులఁ

గందితి నీదైన కందువ దోపఁ
గందించుగ వగలు జిక్కఁగ దీర్చువట్టి
చందంబు నెఱిగింపు మిందీవరాక్షి!
యని విలపింప సాత్యకి గుండె అదరఁ
దన మాతృగర్వంబు దలఁగంగఁ గమలఁ
జెనఁగొన వీరు గంపవమొందఁ దనువు
గనులెత్తి పుల్కు పుల్కునఁ జూచి యపుడు
బతికి భాషించె సంభ్రమమున గంటి
రా! తగునా మన కితరులుటోలెఁ గల్ల
నిజమని యెంచక నీతిఁ దొలంగెఁ
గుణసుందరుండను గన్నకొడుకు దూలంగ?
యే నమ్మ నేరనయ్యెద నేను గన్న
సూనుండు సుగుణనిధానుండు బుణ్య
ఖానుండు మన్మథధాముఁడై ధర్మ
దీనుఁడై-గతసద్విధానుఁడై సాని
పంచజేరునా! లోకపతి విష్ణుఁడిట్లు
వంచన పేయునో! వరమొక్కటిచ్చి!
యనుచునె దోడ నా యబ్జాక్షి గోడ
లినిఁ గాంచి ప్రేమలాలితరీతిఁ బలికె
వినకుపే యీ వాదు! వినయైకమాన్య!
కనకు వే, కొఱత యొక్కటి ధవునందు
ధీరుండు-సుగుణమందారుండు వాఁ డ
పార విద్యానిధి పరిణతబుద్ధి
నీపుణ్య ఫలము బండించినరూపు
నీపతి వేరొక్క నెలఁత గోరెడునె!
దెలియదే నీకు! నుజ్జ్వలమైన వాని
తలఁపులీ రే బూని తెలుపంగవలెనా!
చందరునందైన గందొక్క టుండు

సుందరీ! నా పుత్రు శుద్ధ మానసము
నందొక్క కొఱత యెన్నటికైన లేదు
బందెంబు సఖుడు విశ్రాంతిలో మునిగి
తలిరుబోఁడిరో! తప్పు దలఁచకుమమ్మ!
తలిరుఁ బ్రాయపుఁ బొంగు దలఁగింపకమ్మ!
యని సద్దుమడంగ నంతలో వచ్చె
ఘనుఁడు వారాంగనా కరివకుచార్త
గంధబంధురితాఽపఘనుఁడు మైరేయ
మంధరగతి—సమున్మదుడు సుతుండు—
వాని నిరీక్షించి వనితామతల్లి
మానంబు మరి యభిమానంబు దుఃఖ
తాపంబు పాపసంతాపంబు—తీవ్ర
కోపంబు మరి యనుతాపంబుఁ గన్న
కూరిమి—బీరము—నేరిమి—దావ
వేరమి యొండొంత నిబిడంబు లగుచుఁ
జిత్తంబుహత్త యుద్వృత్తి బాష్పంబు
లొత్తికొనంగఁ బెల్లొదరుచుఁ దండ్రి!
వచ్చితివా! మెచ్చువచ్చెరా! బిరుదు
దెచ్చితిలే దల్లి కచ్చిరాఁ గొడుక!
దయసేయు "మన్న నాతఁడు వెఱ్ఱినవ్వు
గయిసేయుచుండ వక్త్రమ్మున—ధనువు
వలెఁ దూఁగ దేహ మస్పష్టభాషలను
బలుకుచు దగ్గరింపఁగ—వాని వాల
కము గాంచి—వహ్నిశిఖాఽఽకృతి యగుచు
ధుమధుమలాడుచుఁ దోడ్తోడఁ గటము
లగలంగ—హృదయమ్ము బొగులంగఁ గనలు
మిగులంగ జహ్నొందు తెగడుచుఁ బలికె
నోరి కామాంధుండ! యో యభాగ్యుండ!

ఓరి దురాచారపూరిత బుద్ధి!
ఓరి లజ్జాహీన! ఓరి పాండిత్య
ఖారగర్వగ్రంధి! పరమ పాపుండ!
వెలయాలి మరగి యెంగిలిఁ గ్రింగి దుష్ట
ఫలలంబు భుజియించి—పరమ నికృష్ట
సురఁ ద్రావి యింటఁ జొచ్చెదవెట్లు' సుంత
యరగలి లేక మిథ్యాజల్పనుండ!
పుట్టక పుట్టక పుట్టినా వొకఁడ
విట్టలమగు బావమెత్తిన కొడవు
కులము పెద్దఱికంబు గూలంగఁ ద్రోచి
నలుగురిలో నన్ను నగుబాటు కీడ్చి
నా యెద దహాయించినావురా! జాలు
లే! యింక బుత్రుని లీలావిలాస
ములు నాకు నీ ముఖమ్మును జూపవలదు—
వెలయాలియింటనే వెలయుము పోయి
వరమపతివ్రతాఽఽభరణంబు శాంతి
శరణంబు, మత్ప్రియతరణంబు బుట్టి
నింటికి పెట్టినయింటికిఁ గొఱఁత
యంటనివ్వక-దొడ్డ యశము గూర్చినది
శిపురాణికెనయైన యువిద మీ తల్లి
యవగుణగ్రంధి! తత్ప్రియవిమలోదరము
జిచ్చుఁగుంపటిగఁ జేసితివి నీ మేలు
వచ్చెఁ జదువుకొన్న దిచ్చరి గొట్టు!
కడపద్రొక్కకుము మాకడుపు ద్రొక్కకుము
వెడఁగ! పెట్టును పోర వెలయాలె నీకు!
అటు జూడరా? యౌవనాఽఽదృతదేహఁ
గుటిలకుంతల నీదు కోమలినైనఁ
బలుకరా యేమిలోపమొ! గొఱయైన

యిలువడియో! గుణమెనయదో! ప్రేమఁ
బలుకదో! వన్నెలు జిలుకదో! మనసు
నలరింపదో! సేవ నలుపదో! నీకుఁ
బరులు గన్నమ్మ నిప్పుగిడిఁ గారించి
దురుసున, దిచ్చరి మరగితి నీవు
మఱచితి గామి మఱివచ్చి ధర్మ
పరుఁడవై నాయింటఁ దిరుగనేర్చెదవా!
గదలు మిచ్చటినుండి గదలని మాయ
వదలుము బొంకంగ వలను లేదోరి!
నేనఁ జూచితిఁ గండ్ల నీనాఁడు నిగత
మానుండవై నీవు మధ్యాహ్నమందు
దానింటఁ జొరఁబాఱు తరుణంబునందుఁ
గానరటంచు బొంకకుము వేఱొక్క
పాపంబుసేయ కీ పాపంబె చాలు
నీ పరసౌఖ్యంబు నిలుపునఁ గూల్ప —
నని పల్కుచునె రోష మగ్గలింపంగఁ
దనయుని దరిపెడు ధవుని వీక్షించి
కన్నని సుంగుపైఁ గనికరంబుంచి
యన్నువ సాత్యకి యడ్డంబు నిలిచి—
తఱుము జలింపంగఁ గరము శోకంబు
బరిగొనఁ గన్నుల గిఱికొన జలము—
లన్నువ నడుము దూఁగాఁడఁ, జెమ్మటలు
గ్రన్ననఁ గ్రమ్మవ క్త్రిమ్మువఁ బలుకు
లదుకులై వెడలంగఁ బదములు దూఁగ
నదవదపడి యట్టులనె నాథుఁ జూచి—
క్షమియింపు పతిదేవ! సదమలభావ!
దమియింపు గడిది క్రోధమ్ము చిత్తమున
నమరేంద్రవంద్యుఁడౌ యాదిపూరుషునిఁ

గ్రమమునఁ బూజించి కన్నాను లేక
లేకొక్క కొడుకు నా యాకాంక్షద్రుంగ
నీ కరణిని నెరియింపకు వానిఁ
జేయరో యాత్మజా లేయెడ దొసఁగు?
లీయలఁ దలిదండ్రు లెందైన నయము
భయమునఁ గొల్చి సత్పథముఁ జూపించి
కయికొనరో వారి! గవలెత్తి, తోవఁ
ద్రోతురో! గూఢిమినే తునఁ ద్రుంచి?
నీతి దప్పనవాఁడు నా తనూజాతుఁ
డొక్కఁడే గనుఎంచె మారికంతటికి
నక్కటా! యిదియేమి యార్భాటమయ్యె!
బొలఁతి యీ రీతి ధవుని నొత్తిపలికి
యలుకమాయించి యేకాంతంబునందుఁ
దనయుని దృష్టించి యనె నెన్నిసార్లు
బవవిన మామాటఁ బాటిగాఁగొనవు
వలదురా! పెలయాలి చెలిమి! సర్పంబు
ములుచలై యెవరైన ముద్దుపెట్టెదరె!
మారితో సరసంబుఁ గోరి యాడెదరె!
మూరిబోఁగ నగ్గి బొమ్మను గాగి
లింతురే! విషవరిలి ప్తపుష్పంబు
నెంతని మూర్కొందురే! మతి దలఁగి!
వెడఁగవే! యుడుగవే! పడుచవె! నీవు!
మిడుకుచున్నాఁడురా మీ తండ్రి! ధర్మ
పథ మటరా! సౌఖ్యపద్ధతి యటర!
ఖాతమటరా! గీర్తి యొఁడబాయదటర!
బదువున కీరితి సత్ఫలమటర!
చదురటరా! క్షేమసంగతియటర!
మరియాద యటర! ప్రేమపుఁదెర్వులటర!

భరమైన వయసు కావరమదిగాక!
నీవంటివాఁడు సంభావిత వృత్తి
గావించునదియె యిక్కడిది కార్యంబు!
నాకొమరుండు విజ్ఞానపూరుండు
నా కొమరుండు గీర్త్యేకల్పమండి
తుఁడు వినీతుండు సక్తుఁడు ధర్మమందుఁ
గడుఁగూర్చువాఁడు మాకని చెప్పుకొందు
నటనట నవియెల్ల నణఁగి పొల్లయ్యెఁ
గుటిల విచార! నీ కొఱగామినిపుడు
చదివితివే! యెట్టి శాస్త్రమందైన 95
నుదురుమిడుక! దండ్రినొప్పరికించి
తల్లిఁ గలంచి సుదతి గాసివెట్టి
యిల్లు గుల్లయిపోవ నెక్కడే నొక్క
పంచవఁ బడునట్టి పద్ధతి ధర్మ
మంచుఁ జెప్పర! జాత మాశాస్త్రమైన!
బంగారువంటి దా పడఁతి నీకేల
భంగింప దాని తీవ్రంబై నప్రేమ!
వలదురా! వెలయాలిపలుకులు నమ్మి
కులసతి నలగింపకుము దాని కార్చు
కన్నీరు నీ సిరిగదలించు నీదు 1700
యెన్నిక నగలించు నెఱఁగుదియించు
నగవులు బిగువులు వగలు బెందగులు
జిగిబిగి మురిపెంపు సరసంపుమాట
మురకంబు తరకంబు మురువును హరువు
విరితూపు నెఱిచూపు పీఁగును బాగు___
తిరమను కొనకు దిచ్చరిదాని మనసు
పఱదఁ బోయెడునట్టి విరిసుమ్ము కొడుక!
వినుము నామాట! బో విడుపుము చెనటి

మనసువట్టినయట్టి మరులు, నిర్మాల్య
మును బోలె-జగతిపైఁ గొనుము యశమ్ము
గనుము ధార్మికము సౌఖ్యము చవిగూడ
నని యిట్లుఁ దల్లి బల్కిన పెడపెడగ
విని యూకొనియె మనంబున కంటనీరు—
యా రాత్రి భుజియించి యా పేఁపై నిఁ
దీరని తమకంబు గూరి చిత్తమునఁ
దములంబు నమలుచే దడవుగాఁ దనదు
కమలాక్షి తమక మెక్కింతయుఁ దలఁప
కయ. జాఱుకొనె మోహగంధిల బుద్ధి
భయము నయము వీడి పండిత బ్రువుఁడు—
సాక్షాత్కరించె వేశ్యాగృహంబందు—
నక్షీణ కై తవ హాస నిర్మోక
చెనటి వేశ్యాపర్పిణి నెనరుగల్గి
దాని ఖోలిక మరఁ ద్రావించి రతులఁ
దేలించెఁ జాతుర్యధీయుక్తి బొదల—
బాల కుటిల కేశజాల సంత్యక్త
మాల గన్నులు వీటఁ దేల హస్తమునఁ
గిలించి తనదు చెక్కిలి పుండరీకు
నతి గాచికొనె ప్రతీక్షిప్రియాఽఽగమన
వతనిహాళా ప్రభాతంబునటకు—
మఱుదినమ్మున వేశ్యమాత వెచ్చంబు
భరమయ్యె రొక్కంబు దొరకదయ్యె
నని గొష్ఠేఁ బుండరీకుని దారసించి—
కని—తన వ్రేలియుంగరము నాతండు
నిచ్చె మనంబందుఁ బొచ్చెంబు లేక
యచ్చిన నేమి లేదింతయు నెవరు—
మరి రెండు మూఁడు నాళ్ళరిగిన యంతఁ

గంధము దాచెను వేశ్యకాంత నొకొక్క
చీర గావలె నాదు కోరిక దీర్ప
వేర[1] యటంచు గతించెనే యొక్క
యంగుళీయక మంత — నా వేశ్యమాత
హంగునఁ గైకొనె నడిగి చౌకటులు —
యింటఁ దండిరి బల్కఁ దెచ్చరింపఁడుమ
గంటగించును దల్లి — కమలాక్షి భార్య
గన్నీరు కావేరి కాలువై — చింత
నున్నది బలుకఁ దయ్యెవిదతోఁ దాను —
దిన దినం బది యిది యని వేశ్యమాత
దనచేయిఁ జాఁచుఁ గ్రొత్తఁగ నెళవయ్యెఁ
గితవులతోఁ దన కతి చతురముగ
మతి యాడ్చు — నక్షమర్మము దెలియంగ —
మదురువు లేకున్న మది మదినుండ
దది లభింపదు — ధనైకాయత్తమగుట
బిలువరుఁ దన్ను సఖల కెందు — వార
జలజాక్షి మరగెన న్నడిపిక్క విరిపెఁ —
గనుఁదోయి నంటనిచ్చిన యొక మాడ
దనతోడఁ బల్కి వల్కిన యొక మాడ
యనుచు నారంభించె నా వారకాంత
దనతోడ, గ్రొత్త దండనలేమి సేయ
ననువు ఎక్కఁక దొంగతనమభ్యసించెఁ
బొనుగువడ గుణంబు బండరీకుండు —
గాళ్ళు వచ్చినయట్లుఁ గ్రమముగాఁ గదలె
నెల్లభూషణములు — నెల్ల వస్తువులు
వెలయింతి యింటికిఁ బిత్రుపాదుఁడైన
యలజహ్నుఁ దేమియు ననఁడు — గర్మంబు
వశ్యథోత్తవ్యమన్వాక్యంబు దలఁచి

వశ్యచిత్తుఁడు బరబ్రహ్మంబునందుఁ
దలఁపులు జిక్కొల్పి—కలిలసంసార
ఫలములెంచక దుఃఖబాహ్యుఁడై యుండె—
దల్లి సాత్యకి—శోకదళిత—కుమారు
నల్లన బోధింతు నని యెంచుచుండెఁ
గోడలు—విరహ విఘూర్ణితహృదయ
ప్రౌఢి దప్పఁగఁ బొట్టుపొరలగుచుండె—
నిటులుండ నొకనాఁడు—కుటిలవిచార
ఘటితకూటవిలాస గణిక యా పుండ
రీకుని ధనమెల్లఁ గ్రొల్లిన విధము
నాకళించి—యెట్లైన నల వాని బొందు
విడువ నూహించి—దుర్విధఁ దన తల్లి
నడచి పాటున నెల్ల యాట లాడంగ
నెపకొల్పి—తానేమి యెఱుఁగనియట్లె
విసువక యుండ—నవ్వేకలి బ్రాహ్మణుఁడు
దినముమఁ జనుదెంచు తెఱఁగున వార
వనితాస్వయంగ్రాహ పరమ సుఖంబు
నూహించికొనుచు నా యూహలతోను
పాహాతమగు నవ్వు బరిఢవిల్లంగ-
వలెవాటు గాలి కల్లలనాఁడఁ గదలఁ
బొలయఁ గర్పూర తాంబూల వాసనలు
ఖరమైన యుద్దాల మొరపంబు వింత
యొఱపు గల్పింప న య్యారటు గృహంబు
సొచ్చువంతటిలోన బ్రచ్చుము గఱవ
వచ్చు తేచునుఁబోలి—వడిఁ బైకి దూకి
కనులు పేతులు ద్రిప్పుకొనుచును వదరు
లమఁ బోలు నిడుదలౌ జనులు వ్రేలాడఁ
బిఱుదులు గంపింప నఱబొఱడైన

గొఱుదుపండులు దోఁప బఱిఁ వెండ్రుకలు
తుఱుము సీదంగ వంకరటింకరైన
చరణముల్గదల నిచ్చలును జొల్లబుకు
బుగ్గలొ పెదవుల బుడిబుడి విఱచి
యగ్గణికామాత యదలించి పలికె—
బాగాయె లేవయ్య! బడబాపనయ్య!
బాగంబు గుప్పించి సాని నేలితివి!
నీవొకండవె యేలినావింక నొరులు
లావుగలరె యేల నీవంటివారు—
దిన దినంబునఁ గ్రొత్త తీరుగా-బూమె
లనువు పడంగ-నచ్చినవాఁడు వోలె
వచ్చి-తీసారెదు పలుకుల బేలు
పుచ్చి-మాచినదాని పచ్చిప్రాయంబు
నదవదపేఁ-యే యయ్య గగ్గానిన
నదలునో! యిఱవది యంచును జంకి
బెదరుఁజూపుల నిల్లు పీడుచే గాని
పదియాకలిచ్చిన పాపమేలేదు—
విరులు ముడ్చిన వింతయొఱపులు జిమ్ము
నరపీఱముఖి కీలుజడ-వల్ల నల్లఁ
దడవి చూచుచెగాని-దయగల్గి యొక్క-
తడవైనఁ దెచ్చితో దావిపూవులను?
గులుకు గుబ్బలఁ గీలుకొలిపనముత్తె
ముల సరులనుఁ జూచి మురియుచే గాని
కొనితెచ్చితివా! దాని కోర్కి- దీరంగఁ
జనవరి! నీవొక్క-సరమైనఁగాని—
చెలువుగుల్కు- బవంతి చీరఁగైసేఁ
తలిరాకుబోఁడి పేదండనిల్చినఁ
జొక్కి-చూపుల నిల్పి చూచుచే గాని

యెక్కటా! యొక్క గోకై నదెచ్చితివా?
ఎరిగందమును బూఁ-చెలఁగుచు నవ్వఁ
గరమూర్చి యూర్చి-యెక్కడుఁ దార్చికొనుచె
గాని-యేవాఁడైన గాని వెచ్చించి
దానికిఁ దెచ్చితో! దావిగందవాడి!
గటియించితివి లేని కలకేతవిద్య
యెటు దాపురించితో యిన్నాళ్ళబోక
కఱటి! మా యిల్లెల్లఁ గొఱిగితివింక
దొరకఁబోదుర! నీకు దొల్లింటి చూలు——
నడు నడు! నీ కల్లనగవుల బేలు
పడములే! ముందటి భంగి నటంచుఁ
దఱిమిన గుండెలో ధైర్యంబు దఱిగి
వురపురఁ బొక్కుచుఁ బుండరీకుండు
దలవంచికొనుచు-మన్మథశరభల్ల
దళితచిత్తుఁడు పానితల్లినిఁ గాంచి
ఒకసారి బిలువుమా! యొఱపులదీవి
మకరకేతను రీవి-మరులు లేమావి
తలఁపుల తావి-గోర్కెలకెల్ల నీవిఁ
దిలకించి మా నేత్రములు సార్థకముగఁ
బలికి పల్కించి-కెంపులు జిల్కునట్లుఁ
బులకించి-నెనరైన మ్రొక్కుఁ జెల్లించి
బోదుమటంచు నా భూసురుండన్న——
నాదికొనఁగఁ గోప మావేశ్యమాత
వికటంబుగా నవ్వి-వెకలి కన్బొమలు
మొకము జిట్లించి-బో బోవయ్య బోడ!
చెల్లించితివి లెమ్ము-జెల్లింపనియవి
జెల్లించెదము-నీవు జెల్లించినట్లె——
దలయేరు గదిరినఁ దలకట్టు గట్టి

చెలువ బండినది భూవలయమే మఱచి—
నినుఁబోలు దౌర్భాగ్యనే స్తంబుతోడ
వనితకే ముద్దుపెల్లుమ! దలయేరు
గాకంచుఁ గసరింపఁ-గరినాఽవమాన
శోకదగ్ధీకృత శోభుఁడై-యేమి
బలుక నోరాడక-బాష్పముల్గనలఁ
బొలయ గృహము పేరెఁ బండరీకుండు—
చేరి-దుర్వారుఁడై మారుండు-కలిశ
సారంబులగు శరజాతముల్దొడిగి
కోయంచు నెలుగించి—క్రొవ్విచేపిచి
పాయక జిత్తంబు పఱియలు సేయ—
నంగనవెనువెంట నంటిన భావ
భంగులెవ్వరుసునఁ బట్టున బరువఁ
బోలక—వానిచొప్పుననె బోవుచును
బేలయై, యా యింతి పెక్కువమెచ్చు
తవులంబు నూహించుఁ, దలఁపుఁ దలంచుఁ
బవడంపు మోవి జొబ్బవ జొఱవలచు—
మాటపొం దూహించు—మరులు యోచించు
పీటు గోటు దలంచు—నేర్పులు దలఁచుఁ
గఱివంత బొమల చక్కఁదనము మెచ్చుఁ
దళుప వెన్నెలఁ జిల్కు దరహాసమెంచు
విరిసిన నెత్తమ్మిఁ దొరయు మే నెంచుఁ
గరయుగ కంకణస్ఫురితము ల్మెచ్చుఁ
గరములు మెచ్చు శ్రీకరము లటంచు
నురము మెచ్చునుఁ బ్రభాకరమంచుఁ దావి
వలచెడు జడ మెచ్చు—నగలను మెచ్చుఁ
గులుకుఁ జన్నుల మెచ్చు—వలిపెంబులోనఁ
బటువయి శోభాప్రవాహమ్ము జిమ్ము

కుటిలాక్షి జఘనంబు గొమరు దలంచు
మొలకట్టు రవళిసొంపుల నూహసేయఁ
గలిగి లేనటులున్న కౌనుదలంచు—
రతిమెచ్చు—భావ సంగతి మెచ్చుఁ—మధుర
గతిమెచ్చుఁ గురులసంతతి మెచ్చుఁ—జతుర
మతిమెచ్చు—బంధసమ్మతిమెచ్చు కుసుమ
హతిమెచ్చు—భావసంహతిఁ మెచ్చు జాంబ
వాదృతిమెచ్చుఁ ద్రపాఽఽదృతిమెచ్చు
వాదరంబున మెచ్చు వలపత మెచ్చు
నీరీతి భావనాప్రారంబునందు
మూరిఁబోవఁగ లజ్జ—ముసుకలు వేఁ
కనునీరు నించి—వెక్కస మూర్పునించి
మోసగు పడఁగఁ గాంతి—పుండరీకుండు
విలపించుచుండంగ వినువీధియందు
జలజబంధుఁడు గ్రుంకె జిలిబిలి యరులు
గవిసె వివేకసంగతి వీడినంతఁ
గవిసెడు కామాంధకారంబు వోలె—
నిఁక నిల్వలేఁడు గాముకుఁడు మరుండు
గిఱిరించి ధైర్యంపుఁ గీలెల్లఁ దొలఁచెఁ
కనకంబు లేదింటఁ గాసైనఁ గాని—
వనజాక్షి తన ధర్మపత్ని హస్తములఁ
జెలువొందు గంకణంబులుగాక వీఁకఁ
గిలుబాడవలె వానిఁ జెలువము దువ్వి
యని చిత్తమందు యోచనసేసి యెన్న
డున లేని గొంగ్రొత్త నెనరు సంధిల్ల
దరిసి తలిరుబోఁడి తన కలికొప్పు
మురిపెంబు దొలఁకంగ మునివ్రేళ్ళఁ దడవి
యటు నిటు గొంతసే వలరించి హస్త

కటకంబు లడిగినఁ గంజాక్షి వాని
యిచ్చకంబుల నెల్ల నెఱిఁగి చిత్తమ్ము
బెచ్చుగవలవంత వ్రీలిపోవంగ
నాథ! నా హృదయాధినాథ! మద్భాగ్య
భోగంబ! యేటి కీ మునిమ్రుచ్చు విద్య
వెలయాలి కివ్వఁగాఁ దలఁచి వచ్చితివి
చిలుగు కంకణములఁ జేకొనుమిపుడ
వలదందునే! ధర్మపత్నికి మగని
తలఁపువ కన్నను దలఁపు వేఱున్నె?
యని నవ్వి గంభీరమైన చిత్తమునఁ
దన కంకణమ్ములు దడయక దీసి
యర్పింపఁ దక్కెరా! యని చిట్టమిడిచి
దర్పంబుగదురఁ గందర్పుని నింకఁ
జెంగించినట్టులే! చింతాతిశయము
భంగించినట్టులే! భామ! నీ బోదు
బోయి వలఁపుఁ జిల్కు పువ్వారుబోఁడి
మాయలపెంటిఁ బ్రేమమ్మునఁ గదిసి
దాక్షిణ్య మనురక్తి దయయు, విశ్వాస
మక్షీణ బాంధవ్య మమరినభక్తి
నేస్తమ్ము, బోరామి నెనరుఁ బ్రేమమ్ముఁ
గుస్తరింపును కల్పకోలాదనమ్ము
చెలిమి. సత్యంబు మంచితనము మైత్రి
యలరింపు నల్లాన మంతఃకరణము
చల్లదనంబు-వాత్సల్యంపుమాట
దెల్లంబు జెయ్యుల తీపుఁ జుట్టఱిక
మిచ్చకమోలాటు నెచ్చినబా!
మచ్చిగ దాత్పర్యమమతలు జూపి
యలరించి యలరి సొంపులు గుల్కు రతుల

సొలయించి సొలసి కోర్కెల నిట్టఁదేల్తు
నీ రాత్రి రతిపుణ్యమెల్ల నీయదియ
టో! రమణీ! యంచుఁ బుండరీకుండు
నతివ బదులాకైన నాగక దృష్ట
గతి శంబరమువోలె గంతి కన్మాపె
మఱలవచ్చిన భూమిసురకుమారకునిఁ
బరికించి జటిలకోపగ్రంథి వేశ్య
తల్లి వెలికివచ్చి తరుమంగఁజూడ
నల్లనఁజూపించె నా పుండరీకుఁ
డపుడు దాఁదెచ్చిన యాభరణమ్ము
గనటంబులకుఁ దొలిగని వానిఁ గనుచుఁ
గనుచూపు మార్చి కక్కసములౌ బొమలఁ
జెనకిన వంపు మార్చి గళస్వనమ్ము
మార్చి యన్నువ నవ్వు జేర్చుచుఁ బ్రేమ
గూర్చు మాటల నల్లికొని పచియించె
నాలుగుఁ జెఱఁగులు నేలెల్ల జాట్టి
గాలించినను నింకొకఁడు నినుఁబోటి
బేల గన్పడునె! యందాల వెన్నెలమ!
యేలాగు బ్రదికెదో! యీ భువిపైని!
యావిధగూఢ యమాయకురాలు
నేవిషయము సుంత యెఱుఁగ నేరదును
యిట్టి యిద్దఱ నొక్కయెడఁజేర్చె బ్రహ్మ
చట్టనఁ బ్రేమపాశములతోఁ బెనఁచి -
యెటుబ్రదికెదరో! మీ యిద్దఱు వట్టి
యటమటకాండ్రున్న యవనిపై నింక
గలకాలమును మనఁగలన నే నిల్లె!
బిలుచుచున్నది చావుకెలనఁ గూర్చుండి
సతతమియ్యదియె యోచన జేసి చేసి

మతిగుందినది నాకు మరులుకు తేఁడ!
బరిహాసమన్నదే యెఱుఁగవో! యెపుడో
బరువెత్తితివి నోటఁ బలుకుండఁగానె!
యని దమ్మ గుత్తరించిన వేశ్యమాతఁ
గని కృతార్థుండై నకరణిగా నవ్వి
పుండరీకుఁడు వెలపొలఁతి చన్గవల
దండ నానంద సాధన జేయఁదొడఁగె
నిటులుండ నొక్కనాఁడేతరి వాఁడు
జటిల పాపగ్రంథి సానింటియందుఁ
దల మొల మఱవంగఁ ద్రావి మద్యంబు 35
వశకింతయును లేక యంగంబులెల్లఁ
దూలఁ గన్నులఁ గావి దొనకంగ వచ్చి
మ్రోలనిల్చిన వంశమూలంబు తెఱువ
గుద్దలిఁ గొన్నట్టి కొడుకునీక్షించి
తద్దయువేగి చిత్తమ్ముమఁ గ్రుమ్మఁ
బలికె జహ్నుండోరి! పాపఫలంబు!
కులకులికమ! నిన్ను గుఱిచి మాకెల్లఁ
దలవంపులయ్యె నీధారుణియందు
ఫలియించె నేమితపంబు! వినంపుఁ
బండుపుట్టినది దౌర్భాగ్యమ్ము వలనఁ
బుండరీకుఁడు జ్ఞాన పుండరీకమ్ము
కులమోము వమకొంటిఁ గులవృత్తి విడచి
కులమెల్ల బూడిదఁ గలిపవేసితివి!
చదివిన చదువెల్లఁ జవిటిలో విత్తి
నదియయ్యె నేమియున్నది యమకొనఁగఁ!
గానిమాటికి నీముఖమ్ము జూపించి
మావసంబెరియింపఁగా నీతి గాదు—
తోరి! సానింటనే ప్రొద్దుబుగడప

నోరారఁ జప్పరించుము దానిమోవి
నని కసరించిన నా తండ్రిపల్కు
విని మధుపాన సంవిస్మృతచిత్తుఁ
డనురాగమున బట్టి యతనిని జనకుఁ
డనయుని ధర్మంబు దలఁగి లోఁబఱచి
మదమెత్తి ఎత్సృదేవు నదలించి పలికె
పదరెద వే లిట్లు ముది వెళ్లి యెత్తి
రజ్జినంతనఁ బెద్ద యొజ్జవై తేమి!
మజ్జారె! గ్రొత్త ధర్మముల సెప్పితివి!
చదివితిలెమ్మ మాచదువని క్రొత్త
చదువులెవ్వియు లేవు జగములయందు—
చదురుఁడవై నన్నుఁ జక్కఁదిద్దెదవా!
పదరు మీమాట దేవతలను గుఱిచి—
ముప్పూట మీచేతఁ ప్రొక్కులు గొనెడు
గొప్ప దేవతలెల్లఁ గుతిలురై యచ్చ
రల మధురాధరంబులకుఁ గావుందు
కలుచలుగారొ! నిక్కమ్ముగాఁ బలుకు
మనియిట్లు వచియించు తనయునిఁగాంచి
కనుఁగవ మిణుఁగుఱు ల్గురులు గట్ట
జనకుండదల్చె దుష్టాత్మ! దుర్గర్వ
ఫణిదంతదష్ట! దుష్పాండిత్య బధిర
తశ్రుతి! కారుణ్య దళితవివేక!
విశ్రుతులైనట్టి వేల్పులనెల్ల
నాక్షేపణము సేయునంతవాఁడవుర!
దక్షులు విబుధులు ధర్మైకజీవు
లేవిధిఁ బోయిరయేని—నన్నుతుల
గావుపెఱుంగవే కలిమలార్దితుఁడ!—
యట మిన్నుదాకిన యాతనిమేర

యెటువంటి దనుచుఁ బ్రశ్నించివరీతి
యల్పబుద్ధులు మనమావిబుధాఽఽ!
సల్పిన కార్యముల్ జర్చలుసేఁత—
పాంసులుఁడా! వారు వనజనాభునకు
నంశావతారంబులని యెఱుంగవుర!
చదివిన చదువులీసరణిఁ బండినవి
గదర! యటంచునే గన్నులనిండ
నా గుబ్బ గొన జలం బా బ్రాహ్మణుండు
దీగెదీనగతి దీనంబు గాఁగ
వేఁడువఁ దొడఁగిన నింతి పాత్యకియుఁ
బాడిదొఱంగిన పాపాత్ముఁ జూచి
వచియించె నోరి! దుర్భావపాంసులుఁడ!
బ్రచురమయ్యెను నేఁడు పాండిత్యమెల్ల
నింటిలోఁ దిరిగెడు నీశ్వరుం డితఁడు
దంటవై, తండ్రివదత్తువే! చిన్న
పెద్దయు లేదె! నా చేసిన నోము
వద్దు వద్దన నిట్లుఁ బాపమై వెలసెఁ
గపటాత్మ! ఱిచ్చొడిం గట్టినయట్లు
నిపుణత నీ యవినీతినే దెలిసి
ననుఁ దెలియనియట్లు నటియించి తండ్రి
కినిఁ దెలుపక దాచితిని దానిఫలము
గొమ్మలై రెమ్మలై కొనకిట్లుమమ్మ
హమ్మని యదలింప నుక్కారంబయ్యెఁ—
బో ఘోర! యిలాదాటి పురులు దూలంగ
నాపె వంచనె బడి యా మహాసాధ్వి
యడుగులె శ్రీరంగమై దాని వెకలి
మడుగులె గావేరి మడుగువై—యీదు
మిక భార్యయని తల్లియని తండ్రి యనుచు

మొకము జూపింపకు ముచ్చలగోర!
నావుడు వారకాంతాదుర్విలోప
భావనోపాసనా పరిభూత సకల
మర్యాదుఁడగు వాఁడు మదిరాప్రపాన
ధుర్యుండు కవకవ దురుఱుగా నవ్వి
గణికా పదాబ్జలాక్షారాగములకు
నసుపైన జొత్తునెక్కొనిన కన్నులను
ద్రిప్పుచు-నెడ నెడ రొప్పుచున్పలికెఁ
జెప్పితి లే ధర్మశీర్షంబులెల్లఁ
జాలింపుమిక నాల్గుజాలు వాగకుము—
పీలీల ధర్మముల్ నేర్వలే దొరుల—
దానట! యింటిలోఁ దారాడు దైవ
మానట! యన్నైన నేమగానేమి!
నాకేమిదక్కువైనది! విద్య లేదా!
శోకదలేదా! యపూర్వంబు రూప
సంపదలేదా! యుజ్జ్వలమైన వయసు
బొంఎరివోవదో! పువుబోంట్లుకొరె
వలచివచ్చిన నెట్టివాఁడైనగాని
తలదాచికొని-లేని ధర్మముల్ ద్రవ్వి
యింటఁ గూర్చుండునో! యీ పల్కువారు
గంటి కింపైనట్టి కలికి తా వలచి
వచ్చిన వలదంచు నెచ్చరించెదరా!
స్వేచ్ఛంబుగా ధర్మపథము జేపట్టి—
యందని ద్రమాని పండ్లకు, పులుపన్న
చందమ్ము సామాన్యజనముల వాక్కు-
లీ తండ్రి వయసులో నెన్నదేగాని
చేతమ్ము జలియింపఁదో! తథ్యముగను?
చలియింపకున్న నాతలఁపు లీగతిగ

వలవనివలల లోపలఁ జిక్కికొనునె!
తండ్రియే బుత్రుఁడై ధరగల్గుననుట
గంద్రలో! వైదికాక్షరములుగాక!
యనియిట్లు తుచ్ఛభాషణము లొనర్చు
తనయుని ధార్ష్ట్యంబు తల్లడంబున—
వలుకలే కా మాత బాష్పము ల్గ్రిమ్మ
వలిగులియై యేద్వ—నాధు వీక్షించి
వనజాక్షి యొకమాట వలికెనో లేదొ
గనలెత్తికొని వాఁడు గవిసి కొప్పువిప
నేలపైఁ బొరలించి పాలసుండగుచుఁ
దాలిమి దిగఁద్రావి—తన్నె నిల్లాలి—
నప్పుడు సాత్యకి యవమానభరము
ముప్పిరిగొన వస్త్రమును వంచి-చాల
వణకాడు కొనున వాలిక కనులఁ
దొణఁకు బాష్పమ్ములతో నొప్పుదాని
వన్నెదక్కిన యట్టి పాలిండ్లపైని
గన్నీరు బూరించు చున్నట్టి దాని—
వినముపోలిన మనోవేదనతోడఁ
గుంలి కుంలి యేడ్చుకొనుచున్న దాని
ధూళి పరిప్లుత ధూసరాంగములఁ
బొలింపరాక—యొప్పులు దగ్గినట్టి
దాని రూక్షలకతతిఁగూడి—చూడ
రాని నిటాలంబు దాని—నిట్టూర్పు
లానివదాని—మ్రోడైన వల్లికనుఁ
బోని దాని—విచంద్రమైనట్టి రేయిఁ
బోనిదాని—వితంత్రియైన వల్లకిని
బోనిదాని—గళితమైనట్టి భావ
మును దావులేదిన పూల సరమ్ము

ఘనమైన యపకీర్తిఁ గలఁగిన కీర్తిఁ
బోలినదాని నపూర్వావమాన
బాలిశమ్మగు నాభిజాత్యమ్ము వోలె—
పరవశజన మహాహంకారభార
చరణ తాడితమైన సత్కృతి వోలె—
దీనయై నిలచినదానిఁ గోడలినిఁ
దా నిరీక్షణ సేసి—తనయత్న మేమి
సాగ దీ యింట నిశ్చప్రచంబంచు
లోఁగలంగియు—నంతలో ధైర్యమాచి
మిఱుమిఱుమని చూచి సుతుని సుందరిని
గరమాచి—కనుదాటు గైకొనిపోయె
ప్రతి దినమింట సొందుటయేగాని
ప్రతిన బూనెనొ! వాఁడు పలుకనటంచు
సతితోడఁ దార్చి సమ్మతిగూడ—దాని
మతి సుమింపఁగ నొక్కమాటైన లేదు—
తెలిగంటి—దా ద్రొద్దు తిరుగుడు పూవు
వలె—ధవముఖమందె వాల్గూపులుంచి
యెటఁబోవ ననుసరించుచెగాని—కనుల
నటు జూడఁడా పొల్తి గటకటఁ బదుచఁ
గన్నీరు కావేరి కాలువై పార
నన్నంబు గుడుపదుఁ గన్నార నిదుర
వోవదు—నొక కావి పూవుమూర్కొనదు
రేవగలును శోకమై—వాదుబట్టి
నది జహ్నుఁడేమి యనఁడు మనవెల్లఁ
జెదరి లోలో నేమొ చింతించు చుండు—
నెప్పుడు వచ్చునో! యెవ్వార లెఱుఁగ
రప్పురుషుఁ డెప్పు డన్నంబు దినునో!
వతతంబు గామ శాస్త్రాభ్యాస పరత

పతినాచి—సర్వంబు మఱచెఁ బాలసుఁడు
మాయల గని—వేశ్యమాత—యా వాఁడు
చేయి సాచినది వెండికై —వాఁడు
రొక్క మెక్కుడఁ దెచ్చు! మ్రొక్కినఁగాని
చిక్కని యొక కాసు జిక్క దా యూర—
జను లెల్లరకును నసహ్యమే—బండి
గనులఁజూడక యింటి కడప ద్రొక్కింప
దాగణికామాత—యత్యంత కుటిల
యాగని కోపంబుతోఁ గఱ్వ వచ్చి—
నెటు బాలుబోవక యింటి కేతెంచెఁ
బటవుటగాఁ జింత—పుండరీకుండు—
దిన్న యన్నంబును దెలియనేలేదు
గన్నుమూసిన నిద్రగాఁ బట్టలేదు—
వెక్కి వెక్కిడ్చి యా వెలది—యిల్లాలు
బ్రక్కన నేలపైఁ బవళించినదియు—
హతచిత్తవృత్తి సాహాత్యకి—దలపోసి
సుతుఁగూర్చి—యొక మూల శోషిల్లినదియు
జ్ఞానకూపారంబు జహ్నుండు—గన్నఁ
గోవల నఱమూసి—కుండు టోఁ ద్రోసి
వేయి తెకులతమ్మి విరియంగఁజేసి
పాయక పవనంపుఁ బట్టుబంధించి
వృత్తులగదిమి—యుద్వృత్తిఁబోనదిమి
చిత్తమేకాగ్రమై—చిత్తరువెనయ
ధ్యానించు చున్నాఁడు—దళితేంద్రనీల
మానితాకారు, రమాహృదాధారుఁ
గృపతుఁ గూడలి—దేవకీ తర్ణకంబు—
చవలుండు—నిద్దుర సాలించిలేచి
మఁగికె యిలెలఁబారాడి—పడిశి

కసుమసబడి—యేమి గతిఁగానకుండఁ
జేతికందిన నాల్గు చెంబులు గొనుచు
పీతమర్యాదుండు వెలికిఁగుప్పించె—
భళిభళి యని మెచ్చెఁ బాపనిష్కుటము
సలిపినవనికి—వేశ్యాజనయాత్రి—
కొఱనెలతోసాటి—యఱనవ్వుదనికి
మెఱుఁగైన దనమోవి మెలఁత యందివ్వ
మదిరాఽసు సంధాన మదదిగ్ధుఁడగుచు
మదహస్తివలె వాఁడు మదవతిఁ బెనఁగె—
తెల తెలవాఱె—రోవెలఁది వి త్తరము
దులకింప మేల్కొల్పెఁ దొరలెచ్చరించి—
గఱికాన భంపట స్తన పరీరంభ
ఘనవైభవాఽఽక్రాంత కనదురస్కుండు.
వచ్చెనింటికి వాఁడు—వచ్చవనేమి!
రచ్చకెక్కినవాఁడు—రాకున్ననేమి!
ముగిసె భోజనమింక ముగియనిదేమి!
వగకాఁడు మఱిరెండు బాత్రముల్గొనుచుఁ
బయనమైనాఁడు—దుర్భరశోకదగ్ధ
భయపడి యెచ్చరింపఁగ—మాతృదేవి
యాపేఁత గమనింప నశ్లైయుండినది—
భోసరంబెక్కిన పుండరీకునకు
దిన దినంబును నిదే పనియయ్యె—వార
వనితయింటిని గూర్చి వలపగట్టినది—
సంపార—మీఁబాధ సైరింపలేక
మాంసలితమ్మహంమానమ్ముతోఁడఁ
దలమొల మెఱుఁగని తనయుని గుఱించి
పలికె నాతల్లి—యోభ్రష్ట, నాకడుపు
పుండుగాఁ బుట్టితి! పోనిమ్ము! పట్టి

దండుగ నీకుఁగాఁ ద త్తఱపడుట—
గలధనంబుల నెల్లఁగాఁజేసినాఁడ
వలయరుంధతి సాటియైన యాబేల
నగలన్నియును దుల్చి—తెగనమ్మినావు
తగవరి! యాసాని తడిముద్దు కొఱకుఁ—
గడుపునిండెనొ లేదా గణికకు! నెత్తు
పడినవాఁడన్యుండు పరవుడమోప
ఱతపడలేదా! సీశనితొగ్గలేదా!
పతిపత్ని పుణ్యంబు పండనే లేదా!
తఱిద్రొక్కియున్నట్టి యిరుగురుపులకు
నరఁ యేయుపచారమందింపలేదు
తొనఁకనికుండ యాతోయలి—దాని
మనసేమి యౌవన్నమాటయేలేదు—
సరివారు—చెడిపనీసరణిఁదర్కించి
పరిహాస మొనరింపబండపై సాని
ముండయాయెంగిలి మోవికై లజ్జ
ఖండించి జీవింపఁగాఁబాలుపడితి
వాసానికొంపనే యల్లాడరాదొ!
యాసు ఖోలికమాటికక్కడికిక్క-
డికిఁ జుట్టనేల!గాసుకుఁగఱపైన
పెకలిపై మావంచపెదకి వచ్చెదవు—
మది మదిలో లేక మల్లాడు చెడిపె!
యదిగూడ సానినేయదుగఁగారాదొ!
కొంపలపై నిప్పుగూర్చుట దెలియు
సంపాదన మొనర్చుఖాడలు దెలియు
మతిమాల్చువింతలొమందులు దెలియు
పతిసతుల కెడల్చు భంగులు దెలియు
ఖాకరింపులు—వింతబొకలు—మూతి

నాకుటిలలవోక నాగరికతలు—
ఛీదరింపులు—వింతఎగ్గులునెగ్గు
లాదరింపులు ద్రోపులన్నవనవ్వు—
జళికింపు నెయ్యంబుతులకింపుఁ—గల్ల
తలకింపుఁ—గౌగిలింతలనింపుఁ దెలియుఁ
దనజొల్లు విరజ గాఁదలఁచికాపున్న
తనవానికొఱక కానుదయ బెట్టి యొసఁగు
మెలపెఱుంగదా! మెఱునొచ్చులదీవి
వెలపొత్తి! యిఁకనేలవేకారపీకు!
ప్రతిదినంబొక్కొక్కపాత్రగా—దాని
వాతఁబెట్టిన నింకబ్రదుకేదిమాకు!
నావుఁడు కనులెఱ్ఱనై గోపభరము
గావఁగలేక చిక్కఁగనవ్వి—చేత
నదలించి పతుఁడిట్లు బెదరించె—మేలు!
పదరనిమ్మ నియోర్పుబాటింపనింత
వలుకువచ్చితివా! యెవ్వరిపొత్తులివ్వి?
నెఱిగాఁగఁబల్కుము—నేబుట్టలేదొ
మీయింటపతుఁడుగా—నేక్రియనైన
జేయుదు, నేవాఁడుసెప్ప వలంతి?
వినుచుండె జహ్నుండు విగతవివేకుఁ
డనయుండు—దనయుందు జననితోనాడు
బెడిదంబు, లాతనియెడఁదచీలినది
యదజడి భరమైన దామహాయోగి
యొకనిముసంబైన నూరటనొంది
యిఁకనిల్వఁ జాలఁడాయింట—సాత్యకిని?
గాంచివచించె నెక్కడిప్పుచ్చిపీకు!
పంచాస్త్రసర్పదుర్భర విషాగ్నులకు
మందున్నదే? పట్టిమమకారమునకుఁ

జిందిలపడిచెప్పు చెప్పు—యేఫలము
మూటగట్టితి? రమ్మువినోదము! వయసు
దాటిననేటి బంధమ్ములు మనకు!
కొడుకుగొడుకటంచుఁగుమిలెదవేటి
కొడుకు! దుష్టుండవీ కడుపునే దబిగె—
నేనింకగడెయైన నిల్వఁగాలేను
మానంబుదబికిన మసణమీయుంట
గాళి—మోక్షం—మృతరాస—సంకటవి
నాశనంబులకెల్ల నడుముగట్టినది—
యాశ్వాసమూర్తియా విశ్వనాథుండు
విశ్వసించినవారి వెన్నుబలంబు
నేఁబోవ నిశ్చయించితి—వచ్చితేని
నా బుద్ధివిని రమ్మ—నగుబాటుగాక
నీవు రాకున్న నేనేబయనింతుఁ
ద్రోవబట్టిన సర్వమావిశ్వనాథు
భారమే—యాకొంపఁబెట్టెదుకూడు
నేరను భుజియింప—నీరంబునైన నేఁ
ద్రావనుసుమ్మి దధ్యంబు తథ్యంబు
నావినిసుతుఁడు దిన్నఁగనవ్వి—లగ్న
మెప్పుడుంచితివనె—నింకేమియెదఁద
నిప్పులుగ్రుమ్మరించిన యట్టులయ్యె
జనకున కిప్పుడే యని యల్లుదాకెఁ
గనుఁగవ దడిగాఁగ మనపెల్ల మండి
నునునుగా జిహ్వా దపమెత్తికొనుచు
బుసకొట్టె పేడిగాఁ బుండరీకుండు—
దనతండ్రి విడిబోవు తలఁపును గూడ
మనసున కంటించికొనక హాస్యంబు
నలపు సూనుని గాంచి, జల జల రాల

నలినంబు రెండు గన్నులయందు-హృదయ
మున వేయి భావముల్ ముప్పిరి గొనఁగ
జనని సాత్యకి యుల్ల బనవె సర్పంబుఁ
బెంచినట్లయ్యె నీ పెంపక మింత
వంచించనే నన్నుఁ బరమేశ్వరుండు!
తెలుపార నెత్తిన దీపమై కులము
వెలిగించుఁ గొడుకంచుఁ దలఁపులు బూచి
నేలపై నడువంగనీక రేవగలు
నాలరి! యీ వక్షమందె బెంచితిని
ఫలితవృక్షముఁ గూల్పఁ బాలవు పాం
వలెఁగడ పాని నా భావవృక్షమ్ము
నిలుపునఁ గూల్చిన దలఁత లే దింక!
వెలయాలిఫంచనే వే యేండ్లు సేవ
సలుపుము చదివిన చదువుఁ బండించి—
తొలఁగెద మీ నాటితో మేము కొడుక!
యని కోడలిని జూచి యాయాస మొదవి
కనుదోయిఁదుడిచి చిక్కని ముద్దువెట్టి
చెక్కిలిపై నేమి చెప్పంగరాక
వెక్కి వెక్కేడ్చి యావెలఁది వన్నెంత
దిట్టకొందువా! యిట్టి కట్టడి మగనిఁ
గట్టిపోయినది రాక్షసయంచు దీన
నలినాక్షి! దోసమ్ము వాది లేదమ్మ!
గలనైన వీనమ్మ కళఁ గల్గువాఁడు
జదివినవాఁడు వంశపు వెల్గునిలుపు
నెదగలవాఁడు చూపది కెదురూప
సంపదగలఁ, దనూదానమాచార
సంపదఁజెడనీని చతురుండటంచుఁ
దలపోఁసె వాఁడ ను దామోదరునకుఁ

గలికి! నీవాక లక్ష్మివలె నుండఁదగుదు
వని చేసితిమి నేటికైన నిక్కముగ
వనిత! నీవేమొ మా పాలి శ్రీదేవి—
తనయుండుగాలేదు దామోదరుండు—
కొవరేది నా మోము పుచ్చిపోయినది
యింక నిల్వఁగాదువే! యెలనాఁగ నాకు
సుఖ దుఃఖములకైన సుకృతంబుకైనఁ
జిత్తశాంతికినైనఁ జెలిమికినైన
హత్తిన దైవమైనట్టి మగండె
పోవుచున్నాఁడట! పూఁబోఁడి! యెట్టి
వానితో నీయింట నే వసియింతు?
నదెచూడు నీ మగండావంతయైనఁ
గొదయున్నదే! వాని, కెదురేగి తండ్రి!
దుడుకు మన్నింపు మీతోయంబు ముందు
నడవడిలో నుంతనయము దగ్గింప
వని పల్కఁగారాదొ! యరవిందములకు
నమఁగులై పట్టి యాతని పాదములకుఁ
బ్రణమిల్లఁగారాదొ! పాపమో! బాష్ప
కణములఁ జరణముల్గడుగఁగారాదొ!
తండ్రికి వందింపఁ దనయుండు దోస
మంద్రె! యెవ్వారైన నవనీతలాన!
నవనీసురుండుగా భువిఁబుట్టి-వెగ్గ
లవఘటించిన యట్టిఁడై—చదువెల్లఁ
జవిటిలోవిత్తిన చందమైపోవఁ
బవలునురేలు—రూపాతీవ పాద
జలజమ్ములందు నత్తమొనర్చి మత్త
మలివిమీఱిన దోసమందురే గాని!
లలితాంగి! వాని వాలకము జూడమ్మ!

కలువోలె మొకయద్దుఁ గదలకున్నాడు—
వాఁడేలఁ గదలులే! వానిఁ బెంచినది
కోడల! యీ యిరు గురువులు గారు—
పాలఁబడ్డట్టిదే పరమాన్న మమ్మ!
పాలవంటివి రెండు వంశమ్ములమ్మ!
పుట్టినింటికిఁబోలె మెట్టినింటికిని
జెట్టరానివ్వెత సేవింపు మమ్మ!
యాడుజన్మముకన్న నడవిలోఁ బుట్టఁ
గూడును జెట్టుగాఁ గొదలేదటంచుఁ
బలుకుదురే గాని—కలకంఠి లక్ష్మి
యిలుదీర్ప నడినార్ప నిఁగ వేఱులేదు—
మగవాఁడు మగువతో మనుజుఁడై తిరుగు
మగువ వోలనిదైన మగనిదే బ్రదుకు?
చలిది నేఁతనుబోలు సౌఖ్యముల్నమ్మి
కలవంటి యీ పుట్టుకల నమ్మి—మగని
నాఱు దూఱును పేయువట్టి వారలకుఁ
దీఱునే! పాపంబు! తీపారుబోడి!
వాఁడు పాలసుఁడంచు వానిపైఁ గిన్క
గూడి నీ ధర్మంబు గోల్పోకుమమ్మ!
ధర్మంబు—పుణ్యసాధనము—జీవితపు
మర్మంబు—దీని నేమారకేయమ్మ!
యిచ్చి పుచ్చుకొవంగ నింతి! బేహరువా!
యచ్చంపు ధర్మమాధ్యాత్మికంబమ్మ!
యెన్నాళ్ళలిట్టు నటియించులే వాఁడు!
తెన్నునఁబడు—నోర్పుదింపకేయమ్మ!
యొక రెగ్గుపేసిన నొకరైనఁగాని
కొకిరింపకే—వద్దుకోవలెనమ్మ!
యేదారి యన్నచోఁ గోదారియంచు

సాధింపనింక సంసారమేమమ్మ!
బ్రదుకఁ జూతదుగాని—పాడైన—జగతి
'యదె! యదె!' యని నవ్వులాడునో యమ్మ!
మంచిదానివి! నీవు—మమత పుట్టించి
పెంచి—భర్తయెడంద నొంచికోవమ్మ!
యనుచున్నదింక సాత్యకి—జహ్నుఁడపుడె
యనువుగాదంచు దేహళి దాటినాఁడు—
దడవేమిలేదు సాత్యకికి—వేయార్లు
నడుపులు—మదిలోనె యడఁగించికొన్న
దంతమామకు మ్రొక్కెనతివ—బాష్పౌఘ
దంతురితములు నేత్రములతోఁ జూచి—
గంగాతరంగ రింఖజ్జటా జూట
సంగతుండైన యీశ్వరుఁబోలు జహ్ను
పనె నిట్లుఁ గోడలా! యారాటమేల!
వనదవ్రజంబులు వఱగొని కురియుఁ
గురియునే! యేప్రొద్దు! గుదికిలఁబడక
మఱువాటి కాకాశమార్గ మచ్చమ్మ
గాదొ! లేయెండదారాదొ! శైత్యమ్మ
బోదొ! కాలానమార్పులు సాజమమ్మ!
యొక కంచుకముపీడ—నొకటఁ జేకొనుచు
కకుదమైనట్టి యీ కాల నాగమ్ము—
వచ్చునెన్నడొ మేలు—పవరకు మింక
వచ్చెదనేఁ బోయి—వంక గౌరవము
ప్రాణంబుగా నెంచి—పద్మయుఁబోలె
మా నోము ఫలియించి—మగువలకెల్లఁ
దలకట్టుగా నిల్చి యిలఁదీర్పవమ్మ!
కలిమిలేముల మదిఁ గలఁగకుమమ్మ!
అత్తగారికి మ్రొక్కెనతివ—యుప్పొంగి

యుత్తలపా టామె—యువిదకై పట్టి
శిరము మూర్కొని యంకపీమ గదించి
కరమర్థి వాలారుఁ గనులలోఁ జూచి
తన దుఃఖమును మ్రింగికొని—చిబుకంబు
మనసారఁ దడవి—చెంపల ముద్దుపెట్టి
రణములో వెక్కుఱు రాఁకముమ్మందె
కమగల్గిపోవు వీరునివోలె—రాజ
దండనంబునకింత తత్తఱపడక
దండి ధైర్యముతోడఁ దడయక యేగు
ధీరునిబోల్కి సంసార గౌరవము
వీరనారిగ నిల్పి వెలయింపవమ్మ
యని పల్కి నడచె సాత్యకి, జహ్నుఁ దగ్ర
మునఁ బోవ నందీశ్వరుని తోడులేని
హరుఁడుగా—నా కోడ లావు విధాన
నలిచిన దవళయై—యవనిపైఁ ద్రెళ్ళి—
యే కోళమునఁ బ్రేమలేచెనో! బుండ
రీకుని కన్నుల నాఁకట్టె జలము
మలచిన జాతిలోఁ దొలసెనో! యూర్పు!
పెలుచమొగము దన్నె వేడి నిట్టూర్పు—
గాని యుద్ధమువోయి కాదంచు వారిఁ
దానయి గొనివచ్చు ధైర్యమ్ము లేదు—
మనసులో నిలు గట్టికొనిన రోపెలఁది
తొణకునవ్వుల నాపు త్రోవయే లేదు
కరుణ మిక్కుటమయ్యెఁ గాంతపై—గాని
యరుదార నోదార్చు నర్మిలి లేదు—
యలుకొలుగాఁ బుట్టె నలుకేమొ గాని
యలిలేక దుర్వృత్తు లణఁగింపలేఁడు
గుమము బడుచు నేకాంతంబుఁజేరెఁ

బోన బోన మతి దప్పి పుండరీకుండు—
మగఁడు పోయినతోనె మగనాలు గనుల
నెగదిన బాష్పమ్ము లెగఁజిమ్ముకొనుచు
వారు పోయినయట్టి దారులే చూచు
చారని శోకాన నసురుసు రనుచుఁ
దలపోయుచుండెఁ గన్నులమీద దాగు
నలకల మణి మణి యవలఁబోఁ ద్రోప—
ముందేగె జహ్నుండు—ముక్కన్ను లేని—
నందీశ్వరుఁడు లేని—నానా ప్రమథులు
లేని—జటా జూట లీలావిభూతి
లేని గిరీశుండు—మౌనాఽతి దీన
వదనుఁడై-చలనంబు లదుకక—గుఱుకు
వదలక—కీసంత ప్రదులక—జాఱు-
వడక—కీడ్పడక—తప్పక—తాఱువోక
వడు వడు వడ్గక—నలి నలి గాక
పులుగడిగిన ముత్తెములు నిట్టచూపు
లోలయంగఁ బొరపు తెప్పలమండి బొంగి
భ్రూమధ్యమున యందుఁ బొలఁతి సాత్వికియు
నా మహనీయుని యండనే నడచె
నడవకేలుండు? నామ్నాయ మాతండు
నడలని యాచార సరణి యాదేవి—
క్రతుమూర్తి యాతండు—గ్రహవునకైన
తత ధర్మవర్తిత దక్షిణ యాపె—
జగదలంకారంబు చంద్రుఁ డాతండు
జగదేకసుందరి చంద్రిక యాపె—
హరుఁబాప్ప నసువైన యరవిరి యాతఁ
డరికట్టు వచ్చంపు నడితావి యాపె
యింద్రాదులనుగూడ నెకసక్కె మాడు

నింద్రియంబులు వాహాసీశ్వరు లైగ్గరల
విషయంబుల జ్ఞానముష్టితముల్ గర్వ
రచితంబుతో సైన్య మెవరేగి రాఁగఁ
గందర్పుఁ దమ పెద్దగాఁ జేకొనుచు
మందులై యార్వురు మానవాధిపులు
తనపైనికెత్తివఁ దనివోని శౌర్య
మున వీర కేదారమును గట్టి యొఱక
యను ఖడ్గమును బట్టి మునుము జేపట్టి
వినతుల విదళించు విమలవైరాగ్య
దివ్యసంహాననాధీశ్వరుం డాతఁ
డవ్యయమోక్ష మహానందమామె
యూరిలో నున్నట్టివారు దిగ్భ్రాంతు
లైరి దామేమని యనఁగఁ నలారు!
పుండరీకునితోడఁ బండించి వీది
దుండగమ్మని పల్కు దొర యెవ్వడుండు!
వాఁడు సామాన్యుఁడా! వనజాక్షు కరుణ
గూడి జన్మం బెత్తికొన్న మర్త్యుండు
యాతని చదువేమి యలఁతియా? శాస్త్ర
జాతమ్ము వానిచే సాఁగు బొంగరము—
వాని కళాప్రీతి వాని వైదగ్ధ్య
మూనిన నైపుణ్య మానిన రచిత
తాగుణం బెవ్వారు దన మొనరించి
యే గాని పొందఁగా నిల నశక్యంబు—
కలిగిన ఫలమేమి కడసాని మఱఁగి
యెలసిన గుణమెల్ల నిల్లిగ్గులింకె—
నురగదష్టుని మేన నున్న శోణితము
సరియయ్యెఁ జదివిన చదువెల్ల గూడ—
తీగెలు సోగలై సాఁగిన దృష్ట

పూగముల్ కడకెత్తొ బోరన త్యజించి—
మనసునఁ బెనఁగొన్న మమతను గోసి
కొనకొని పుండరీకుని ధర్మపత్ని—
తఱుమ—వెన్నున దూలి తుంపెళ్ళు లాఁడ
వఱుగాను చలియింప—నటు నిటు దూఁగఁ
బయ్యెద—చెక్కిళ్ళపై జాలువాఱ
ముయ్యేఱులై బాష్పములు—చూర్ణకుంత
లములు నెన్నుదుటిపై లాస్యమ్ము లాఁడఁ
గొనరొందుచున్న కుంకుమము జలింపఁ
బన్నీరు చిలికిన పద్మమ్ము వోలెఁ
జిన్నారి వదనంబు జెవరించు చుండ—
వరగవు పెనయాడ్చిపట్టి యద్దములఁ
దొరయఁగ బోలముల్—ధూళిప్లుతములు—
కళలనేదినదొక్క-కళగాఁగ—మంచు
నెలకొన్న కమలమ్ము వలెఁ దోచి—లేచి—
తఱచుటూర్పులు మోవి దందడింపంగ
కరరుహంబులు మోడ్చి కలికి మ్రొక్కి-వది
యత్తమామలు చన్న యట్టి దిక్కునకుఁ—
జిత్తంబు ఱాయి సేసికొని—వెన్దిరిఁగి
జవ్వాది యుడిపిన జవ్వాదిపిల్లి
మువ్వంబు దఱికిన మాధవీవ్రతతి
శృతిలేని గానమ్ము మతిలేని రక్తి
రతి గూడు త్యాగమ్ము తఱుగైన భక్తి
కడిలేని సుమము చక్కని చాయ లేని
గడితంపు వలువ ధిక్కారవిమ్లాన
మైన వడంత పై యాత్మసౌభాగ్య
మానిని కృతి దీనయై పుండరీకు
పతి-జీవరత్నము చలియించినట్లు

పతి నెద్దు నింటిలోపలికిఁ బోయినది
నడచుచున్నాఁడు జహ్నుఁడు నీడవోలె
నడచుచున్నది యాత్మనాథుని బడిని
ధర్మంబువట్టి సాత్యకి హృదయంపు
మర్మముల్దన్నిన మమతఁ బోఁ ద్రోఁప
తరము గానట్టి తుత్తలలెల్ల విడచి
పరమాత్మపెనుపెంటఁ బడఁ బాలుభక్తి
భావమూర్చితుఁడైన జనుఁడట్లు మంత
దోపక తన చేయు దుడుకుతనంబు-
కడ సాని చూపు చుక్కానిగా సుతుఁడు
పడిఁ బోవుచుండె నీ భవవార్ధిఁ బడుచు
తల్లిదండ్రుల పీడ దలఁగిన కతలు
చల్లఁగా విని వార జలజాక్షి దాని
యుల్లాసమున కింత యెల్లయే లేదు
కొల్ల దక్క- వటంచుఁ గులుకులు చెలుకు
లల్లికొనఁగ మాయలబూమెలాచి
కల్లనవ్వులు నవ్వి కరిగొన్న విసము
కపటమోహము గుప్ప కనులు దేలించి
నిపుణంబు గాఁగ వాని పసంది యెల్లఁ
గరగించి యొక పాటు గనిపెట్టి వాని
బరిభవింపఁగ మండెఁ బాపంబు పొడవు
సాత్యకీ జహ్నులు శమదమయుతులు
మత్యుపహాత చంద్రముఃకోటిభూష
ణులు నిర్గతాశులు నంలితభక్తి
ఫలిత వివేకసంపత్ప్రిణితాత్రి
తులు దమ పెట్టిన యిలయెల్లఁ బంట
లొలయించి పున్నెంబు-లొలికించి కరుణ-
వార వాణిభవద్విహాంల వృష్ఘ

దూరిత లోక సంచారముల్ ఘూర్ణ
రత్నోగ్రీ నేత్ర నిర్యద్వహ్ని చిటచి
ట త్పాదపములు హరాదుచ్చలత్త
రజఃఖచితముల్ తరసదృప్తపంచ
కాక్షీణరవసమాహారముల్ ఎంహ
ఖరనఖరాగ్ర విక్షత జరద్దంతి
శిర ఆత్తమౌక్తి కాభరణముల్ ప్రస్త
రప్రసవాఽతి సౌరభ భరాకృష్ట
విప్రియాళ్యద్విషద్విపులవిషాణ
నిగ్రహోద్భిన్న ధ్వనిస్యూతముల్, స
మగ్రజాగ్రన్మదోన్మత్తమాతంగ
తుండ ఖండిత చండ కాండ శాఖాప్ర
కాండ ధ్రుతండ ప్రకల్పితోత్తుంగ
శైలభ్రమమ్ములు చకచకన్మఘవ
నీలాఽతివేల దృగ్జాలజాలక వి
హాయన చంక్రమద్ధరిణముల్, ఖీక
రాయత తమలేలిహానముల్ గహన
ముల దాటి జలప్రచండిలనదుల్దాటి
మల లుత్తరించి పల్లెలనుదరించి
జగదద్భుతాఖండ కర్మైకగేహ
నగరముల్వీక్షించి నానావిధములు
కొలవంబు గల బేడి సలపీటు—దూటు
లలిత కటాక్షజాలంబున్నై కొదల—
జలపక్షికల కల కల నినాదములు
కలహంట లలియు మేఖలతీరు గాఁగ—
వాగుబ్బు గొప్ప కల్హారముల్—కమల
వ్రేగైన కుచములరీతి పటింప
కవియ మూఁగిన బలాకావళుల్—తెల్వి

తపనైన నవ్వులకరదులై వెలయ—
మధుదిగ్ధ మత్తబంభర నినాదములు
మదనాఽతిశయ లసన్మణితముల్గాఁగ—
పాఱు పీరమ్ములు పట్టున వఱప
మాఱొద్ది స్రవియించు మదధార గాఁగ—
నెలతాల్పు కంట వెన్నెల లుదయింపఁ
దలఁపు దువాళించు తరళాయతాక్షి
రేవాతరంగిణి సేవించి—యామె
పావనంబులగు నంభస్సుల నాఁడి—
సంధ్యాకషాయభాస్వన్మందహాస
వింధ్యవాసిని భక్తి వెలయ నుతించి
వెయినామములవాఁడు వ్రేఁతలతోడ
మెయికొని చిట్టంట్లు మెఱయించినట్టి
నేలలు జూచి—గోపాలబాలకుని
కొలించికొనుచు—సేవో యూహా లల్లి
కొనుచుఁ, బాఱక పాఱు—కూర్మల చెలమ
దిననాథ తనుజాత దీవెన లంది—
తక్కనక్షత్రముద్ధరియించికొనుచు
నక్కమలాక్షి మాహాత్మ్యముల్—పులక
లొలయింప—పతము కతలు చెప్పుకొనుచుఁ
దలఁపుల మఱచి యధ్వశ్రమంబెల్ల—
యన్నపూర్ణాదేవి—యఖిలైకమాత
గన్నని సుంగులుగాఁ జూచి—తాప
సులకుఁ బియూషభిక్షలు పెట్టు నెచట—
వల భగీరథుని పుణ్యమ్ముల పంట
మధుసూదనుని పాద మధువైన దేవి
విధుశేఖరుని శిరోవీధియ న్మింట
వెలయు రాయంచ—పాపులకెల్ల రక్ష

నళినాక్షి దివిజ గంగ నిరంతరమ్ము
గలిగెఁ బుణ్యంబని కాపుండు నెచట—
కలిమలసంత్రాసకరమైన యట్టి
గౌరీమనోహరు గాదిలిసాని
వారణాసీపురిఁ జేరిరి వారు—
పుండరీకుఁడు దినంబును దప్పకుండ
గండఁడై—యా వారకాంతాకటాక్ష
ములకు జీవము లమ్మి ములుచయై తిరిగె—
చెలువపదమ్ములు జేతితో నెత్తి
యంకాన ధరియించి యలసాలసముగ
జంక కొనర్చు లాక్షారచనమ్ము—
లలిత కపోలతలమ్ముపై తూలి
కలఁగొని చిత్రకమ్ములు లిఖియించు—
నా నెత్తి కుంకుమ కర్దంబు నిలువు
నానిన కలు ద్రావు నాహా! యటంచుఁ—
గలికి కన్నులయందుఁ గాటుక నలఁదు
జిలుఁగు గ్రొవ్వెదకుఁ గంపుల పూలు ముడుచుఁ
గనుబొమ్మలందుఁ జిక్కని నవ్వు జూచి
మన ముబ్బి మేలు జన్మంబంచుఁ దలఁచు—
దానిమొగంపు బిత్తరమె మాయాబి
మైనది వాని మహానందమునకు—
వాని నెలంత యొవ్వలవను కాంతి
గానదు—జన్మంబె కన్నీటిజాలు—
అడవిఁ గాచిన వెన్నెలయ్యె జవ్వనము
ముదికాఁడు వలకందు పుండరీకుండు—
అన్నంబు వడ్డించునప్పుడే గాని
కన్నారఁ జూడండు—కసిగాటు గుడుచు—
వ్వివ నవ్వందు నవ్వితనైన

తవ్విన తల పూన్చి కవదిగా నవ్వ—
పలుకరించిన ప్రతి వలుకండు—చాల
యలఁతమై యొకసారి యంమాట వలుకు
తరళాక్షి యూర్పుల పలుపయ్యె—తుఱుము
విరుల క్రొత్తావికి వీడుకోలయ్యె—
ఎలనాఁగ పారాడు కలయయ్యె—కనులు
కలఁత నిద్దురకైన నలవడవయ్యె—
పెలుకుఱు బొమ్మంచు పెదవులపైన
కలికినవ్వులు సుద్దె గండవడంబు—
అలరు తంత్రుల వీణె మమరిన పొన్న
జలపోసనపు వీణెచాయగా—మగని
కరపద్మముల నాడఁగానైన వగలు
కలితయాటరిచేతఁ గరకరలయ్యె—
కారాకుఁబోలిన కడసానిదైన
యారజంబే తలిరాకుగా నయ్యె—
తలిరాకుఁ బోలిన తనదు ప్రాయంబు
కళలేని కారాకుగానయ్యె మగని—
కింక నెన్నాళ్ళు వేయించునో బ్రహ్మ
పంకేజముఖిఁ దీవ్రవాధానలమున!—
ఇటుఁ గొన్ని మాసంబు లేగిన—పావ
కుటిలాశయంబుల గూడు రోవెలఁది
పుండరీకునిధనమ్ములుగ్రిస్సనంత
బండతనమ్మున బరులఁ గాంకించి
యుడి దేనె యయి వంయదరని పూవుఁ
దొడరు తత్సంగతి తుదివ్రాలు వ్రాయ
వగచి తల్లికిఁ జెప్పె తెగఁజూడు మనుచు
నగవులు ముఁగించి—సొగసులు డించి
వానితో వర్తింప వలవనిఖంగి

తోన నింగితములఁ దోపఁ జేయుచును—
యింపులేనట్టి బిగింపుల—వట్టి
అంపుల—వెలిసొళగింపులతోడఁ
గాలంబు గడపన—బోలించి చూచి
జాలి బిట్టేర్చిన—బూలమ్మినట్టి
తావులనే కాష్ఠ త తివమ్ము వేళ
లే వచ్చునా! యంచు నింతలింతలుగ
కడిదప్పెఁ బుండరీకుఁడు—వారకాంత
పడివిన నడువడు—ముడిపెట్టి నాలి
కనుబొమల్ వీక్షించఁ గడు కఠోరముగ—
తనతోడ గడెయైన తామసంపదను—
వృకముఁ బోలిన యట్టి వేశ్యానవిత్రి
యొకవాఁడు బాపని యొద్దిక యింక
చాలయ్యో' నని యోరి! పావానగాడ!
బోలింప నినువంటి పుణ్యుండు లేడు—
అడిగిన రొక్కమియ్యవుగాని—వలపు
ముడివడ నిరతంబు మూతి నాకెదవు!
పసిడిలేనిదె వేల్పు పడఁతిని బోలు
మిడిమిగుల్బలది నీ వనవడు నేమి!
పామాడి! యిన్నాళ్ళు బ్రదికిపోయితివి
కామిని నీమీద కై పెక్కియుండి—
ఛీ బొమ్మ! చాలు నీ పుణ్యంబు పండె
రేపటినుండి మా ప్రాపుఁ గోరకుము—
వచ్చిన త్తైతివా! బావద నీవు
హెచ్చుకుందైన నీదే దోవ మంచుఁ
గసరి మాకిన—గుండె గడగడ వడకి
యనమింకి—నిట్టూర్పు లలమి—ధైర్యంబు
గిటుగిటనై—వంత పుట పుట వగచు

కటికగుండెది వారకాంత యా వైపు
తల సూపకుండిన—దన గోడు సుంత
దెలుపంగలేక—యుదీర్ణాఽవమాన
దళితుఁడై—యిలు సేరి—దాని పల్వంత
వలజడి వడి—రాత్రి యటువుచ్చి—మలయ
మలయ వాయువులకు మతి దప్పి—వేగు
బొలసినంతన రోయి వెలఁది గృహమ్ము
దరి జేర—వాకిటఁ దల నాన్చినట్టి
సరసీజముఖి—వాని జాడఁ బోలించి
మెఱుఁగు బోలిక యింటఁ జొరఁబాఱి తల్లి
వరుస కన్గిరిసిన—నది దయ్యమట్లు
దాపురించిన—ముఖద్వారంబునందె
యాపెదర్శనము ధైర్యము దూలపుచ్చ
గ్రుక్కిళుల్మ్రింగుచు—నక్కి త్తికొనుచు
నొక్కొక యడుగె వేయుచు వచ్చు—పుండ
రీకుని వది జూచి చీకొట్టనైన
నీకు ఎగ్గున్నదే! ని వ్వనఁ జెప్ప
నో! రాకుమంచు! నేమో యిచ్చినట్టి
గారాబుదాతవై కడప ద్రొక్కెదవు
ఖో ఖోమ్మ! వచ్చితివా! పుట్టుబ్రంగ
నా పద్ద జెల్లించి—నా నోటఁ బుక్కి-
లించిన కల్లు జిందించి నీ తలను
పంచల నున్నట్టి పెఱచలు నవ్వ
సాఁగనంపెదవంచుఁ జిందించి పలుక
మూగయై వాఁడూర్పు ముమ్మరమగుచు
వచ్చినఁ ద్రోవనే బట్టి గేహమ్ము
జొచ్చి—కోష్ఠాశ్రువుల్ జొబ్బిలు కండ్ల
నన్నంబు ముట్టక—కన్ను మూయకయు

వచ్చిన తలపోత నా రాత్రి గడపె—
మఱునాఁడు వంత దెప్పరమయి—దాని
చరణంబులకు నమస్కారణం బొనర్చి
యైన నొక్కింతసే పాత్మసుఖమ్ము
బూవంగఁ దలఁచి దబ్బున గెంటి వచ్చు
నది చూచి గణిక యే యమకంప దాకి
నదియొ చిత్తము—వాని యదవద గాంచి
తలవాకిటనె నిల్వఁ—దన తపస్సులకు
నెలవైన యా యింతి నెలమి వీక్షించి
యడుగులతోడ దురక్షరంబులను
దుడుపుమన్నట్లుగాఁ దోయజనేత్రి
పదములఫాలంబు గదియించి మ్రొక్కి
గుదిగొను కన్నీరు గుప్ప—వెక్కిడ్చి
కైపట్టి దీనంబుగాఁ జూచి యూర్పు
లావటించి వచించె నల సాంగి! నేటి
కలరింపు లేవి పూపై తినో యేమి!
యొలికి బాడిద యయ్యెనొ! వలపెల్ల
కలలెల్ల గడచెనో! కనకంబుఁ గమ్మ
వలచినట్లున్న నీ వాలకంబెల్ల
మన్నయ్యెనో నేఁడు మాయెద! పండి
యున్న నే మనసా! యీ జన్నియ గొన్న
రాఎక్యమున కెన్ని రత్నమ్ములైన
వీసమ్ము సరివచ్చునా! వదికోర్చి
కులమమ్మి—యింట శోకుల తెక్కలించి
వెలకమ్మి—తల్లిదండ్రుల విసర్జించి—
యింక పేయని దేమి యింతి! నీ కొఱకు!
అంకించు నీ తెప్ప లవ్యయానంద
మై యున్న వాకు—నీ యతివేళ విరహ

మే యుర్వి పాదైన ఛాయ దోఁచె
వదలింపకే నన్ను వలఁతిగాఁ జూచి
మదిరాక్షి! నీ మృదుపదములకైన
లలిత లాక్షారసంబులు పేర్చుకొఱకుఁ
కొలువుకాఁడుగ నన్ను గూర్చుకో! యదవ
మున బట్టమంచికో! పూవుబెత్తులను
తనికంపు పీడక—తనకలికొప్పు
నను గూర్ప మంచికో! నవ్య లావణ్య
మునకు నేడుగడైన మొగమున బొట్టు
దీరిచికొను వేళ—నేరుగా ముకుర
మారజంబుగఁ బట్టు నట్టి నా సేవ
దిలకింపవే! రోయి వెలఁది! నిరాశఁ
గలుచైన నా యూర్పు గాపంతగాని
తోపనివ్వను లెమ్ము'—తోద్తోఁ బలుకు
నా పుండరీకుని యుపదతనమ్ము
భావించి వేశ్యయు ఫక్కున నవ్వి
తావి తమ్మలమున దళుకారు పెదవి
విఱిచి— శాస్త్రమ్ములు కడముట్ట పీది
మెఱుగాఱుబోడి చిత్తరపు మనస్సు
చదుపై తివిగాక—సానికి నొక్క
మది యుండునా? యున్న మనికి సాఁగెదునా!
వతి బాఱు జలమువ కొడలెల్ల నోళ్ళ
కడిదిరూపాటీవ కొడలెల్ల మనసు
లోకమదితోఁ జూడ—నొక మదిఁ జూడ
దొక కంట జూచిన నొక కంటఁ జూడ
దది సర్వతోముఖమైనట్టి రక్తి
యది సర్వతోముఖమైన విరక్తి—
తళుకుఁ గన్నులఁ బట్టి తాళించు నవ్వు

బోలపంబు వలదు చూపులు—లేని మరులు
కన్నీరు విరహంబు కల్ల కోపంబు
పన్నిదంబులు—తాల్మి—ప్రతిమాటలును
పడియపెట్టును మాకు భావసంతతులు—
విది ముడి లేకున్న ప్రేమమ్ము లేదు—
పసిడిలేకున్నచోఁ బ్రద్యుమ్నునైన
గసిడిమాలయుఁ బోలెఁ గాల దన్నెదము—
వీడింతవాఁడని—వీని ధనమ్ము
తోడ మనికిమని—కూడదు విడువ
నని—ధర్మశాస్త్రముల్ మనసున్న యితర
జనములకే మాకు మనసులున్న—
కిలకిలఁ బోలునే గిలిగింత లిడఁగఁ
దలయేరు గాక మీ ధర్మశాస్త్రములు
జాలిమాటలు గృతజ్ఞతలు మాయెడలఁ
దాటునే? మా జార ధర్మానసంపుఁ
బోక లే వేఱు—బో బొమ్మ వే రాకఁడు
నాకుఁ గై వసమయ్యె—నీకింక విచటఁ
జోటు లే దింట నాబోటి—యెన్నాళ్ళు
కాటుక డిగజాఱు కన్నీటితోడ
కంకటిపై యుందు కళవోలెఁ బండి
యంకిలి గుడిచెనో! యా ధవళాక్షి
కై వట్టితివె గాని—కడ కొక్కసారి
భావించి సుకముల వట్టులంటితివా!
మనసరి! నీవు నా మనసు లెంచెదవు!
మనికితపాటుల మజిలుము—పసిడి
దొంఱకెనా రమ్ము! చక్కెరమోవి నొసఁగి
యరపెద నొక్క మహారాజు బోలె!'
నావుడు దీన దీనంబులై—నీటి

బ్రోవులా కనులతోఁ బుండరీకుండు
తనవైపు జూచిన—దగదింక పిలి
యనునయ మంచుఁ దా నాత్మలోఁ దలఁచి
వడపుకత్తియ గొప్ప పనియున్న వారె
వడి జున్న—వెంటనే వచ్చెను వేశ్య
మాత సురాపానమదకలితాంగి—
యాతఁ డింకేమి-యాడునో! వయము
భయమెఱుంగక యందుఁ బామును గన్న
కయివడి వడఁ బాఱి కాముకుం డచట
జాఱి-యింటికి వచ్చి-బోరన నేడ్చు
యూరార్పు లేక నిట్టూరుపుల్ గ్రుమ్మ
తను నమ్మి చెడితి నంచను మాయ మనసు
తనకను, నైన నద్దాని కూటమ్ము
రసకూటమను మదిరకు వాచె మోవి
వసపడు నెట్లని వనరు నవ్వాని
దురవస్థ జూచి-దుర్భరదుఃఖ మూచి
ధరణికి నెనయైన తరుణి యా భార్య
దరిఁజ మాటాడించు ధైర్యమ్ము లేక
తెఱఁ గేది దోపక తొఱపుగాఁ దాల్మి
యల్లంత దూరంబునందుండి చూచు—
చల్లఁగాఁ బలుకరించఁగ నెంచు సేవ
సలుపంగ నెంచు నా జాల్ముండు దాని
వల నొక్క-సారైన బఱపండు దృష్టి—
తనలోనె వాదించికొనునేమొ వాఁడు
తనలోనె భావించికొనునేమొ వాఁడు
తనలోనె యూరార్చికొనునేమొ వాఁడు
తనలోకమే భిన్నమయి-యున్న మన్న
కనులెత్తి వీక్షించి గందరువట్టు

కనుల దింపను గాని-కరము సాచండు
సలిలంబటన్న వెచ్చని యూర్పు గ్రమ్మి
చలియింపఁ గెమ్మోవి చాలు చా లం' చు
నిరసించు ఎగ వీడి నిర్నిమేషముగఁ
బరికించు రో కొ త్తి బ్రదికియేగాని
దయ్యమై పట్టి సంతతము నవ్వాని
డయ్యించుచున్నది-దగరంపు గొంట
గడచెను రెన్నాళ్ళ కడి యంటలేదు
కడగండ్ల పుండరీకుఁడు దాని వలను
కోవంగఁ దలఁచుఁ దాఁ బోయినన్నైన
కావరించినయట్టి గణికానవిత్రి
పైఁబడునే యందుఁ బ్రాల్మాలు దాని
యూబలలో వింత యంజనంబున్న
దలుపంబు పలుకు వేశ్య పురాకృతంబు
చెలిమి గతించిన కలయయ్యో పూత
పీరయ్యోఁ బడి తిండికిఁగూడ నింట
భారమైనది యెంత పనికత్తె గణిక!
ధనమూడ్చి తిన్నని తమపూడ్చి కనదు
మనికార్చి తెగడె నిర్మాల్యమ్ము పోలె—
కప్పురంబసదాడియుప్పు చేకొన్న
చొప్పున-ధర్మైకశోభిని గృహిణి
తనకుఁగానిది గాఁగ-తానేమొ వార
వనితాన్వయంగ్రాహబద్ధుఁడై గడపె—
అడిదప్ప దాయింతి యాత్మ ధర్మంబు
నెడఁదలో నే భావ మెనప చలించెఁ
బుండరీకుఁడు దన కొ త్తి భాషింప
నందఁజేరిన కాల్మి పల్లటుఁ జూచె
తనయింటఁ గారాదు తరుణేందుధరుఁడు

జనకుండు గౌరికి నెనయైన తల్లి
యున్నరుమని బోయి రోగైన తాను
దిస్సువారఁగ నవ్వు దీర్చి మొగాన
బరిహసించెఁ గాని-పాప! మంచవాఁడు
పరమాత్ముఁడగు తండ్రి పాదముద్రలకు
నవఁగని యిల్లు-త్రిప్పిన హారమట్టు
లమవు దప్పనది యీ యనరు గప్పనది
వాని మొగంబుపై పరి పరి విధుల
నాన బర్చొత్తావ మాతఁడున్మాది—
సంజకెంజాయ పుష్కరమప్పవట్లు
కంజాక్షి యా వారకాంత చిర్నగవు
భాసించు వాని భావనయందు వెంట
నీనడించి మరల్చ నెదవాఁడు మెఱుఁగు
సఎ యున్న నేమి! పాషాణాన బడి—
మిస మిసలాడు నమ్మోవి క్రొంబూఁత
లెసలారుఁదలఁపులో నెంతైన నేమి
వినమంటిన మధూళి యసువుల బాచ—
నా పొర్తి నయ్యాట లల దాని పలుకు
లా పెనఁకువలు స్వయంగ్రాహసుఖము
లెలగాలిపోలిక నలనల్లవంటుఁ
దలఁపుల లోన నాతఁడు దెప్పరిల్లు—
చూడలే దీ బాధ సుదతి నిట్టూర్పు
గూడఁగఁ బల్కు- పుల్కున జూచు వాఁడు
బలుకరించునొ యంచు పరితప్తచిత్తుఁ
డల వాఁడు నిడుదకన్నులనెత్తి పలుకఁ
దలఁపఁడు-ముందటి తన వికారములు
దలఁచి లజ్జాసమాకలితుఁడై యుడుపు
దాక్షిణ్యపూర్తి సదాచారమూర్తి

త్రీక్షణునకు బోడు తెలివికి పీడు
తన తండ్రి యుస్సురుమని బోయినాఁడు
దనపుణ్యములు కావదగ్గం బొవర్చి
నెనరునఁ జెమటయే నెత్తురగా తల్లి
తన దౌష్ట్యగాధ-చూచిన చూడవట్లు
మూరిటోయెడు నది ముగ్ధచిత్తమున
మూరిటోవాత్సల్యము-నితాంతదుఃఖ
సలిలావగాహ కశ్మలమూర్తి దావ
వలపవోయినది-పూవులతోటవంటి
యిల్లు పాడిల్లుగా నిఱుగురువులకుఁ
దల్లడంబునుగూర్చి తానేమొ మంచు
కుంచంబులకుఁ దెచ్చి కొల్వంగఁ బూను
కొంచెగాఁడునుబోలె కొమరుఁ బ్రాయంపు
వెలయాలి వలపేలఁ దలఁచె వీడెల్లఁ
గలకల నవ్వంగఁ గట్టెలు మోవెఁ
బూవు లమ్మినచోటనే-వాఁ దలఁగి
యావిద్య లన్నియు నారకూటమున
మాటిన మణులయ్యె మాటయు పసపు
నేటి పాలయ్యె నిం కెక్కడి బ్రదుకు!
తలపోత బెదరి కన్నులు మూయు వాఁడు
వలపలఁ దొరఁగు బాష్పములతో గౌరి
కెనయైవే దన తల్లి యనువుగా నిలచి
పనవిపట్టులు దోచ భ్రమప కన్దెఱచు—
ఖండేందుధరు నమగలమైన తండ్రి
యండను నిల్చి నీవా! యెట్లు చెడిపె
వై తివన్నట్లొను నా భావభరము
నాతలఁ ద్రోవ భార్యను జూచు వాఁడు
ఆమెకన్నులు ధర్మమా! యిది నీకు

పామేను గద భార్య వర్తింపఁ బురుష
వంగంబులో నట్టి నాకుఁ గన్గప్పి
భంగించి కాపున్నపఞ్చలకెల్ల
ఘంటాపథంబైన కడపానివెంట
నంటి ధర్మేతరంబైనట్టి సుఖము
ననుభవింపఁగ నన్న యటౌను వగలు
గొనసాఁగి పుండరీకుఁడు మోము హస్త
తలఫలకంబున నిలిపి నీరారు
తెలికన్నుగవలతో-తెక తెక నుడుకు
దినదినమ్మును గ్రొత్త తీరుగా వంత
మన మెరియించె చిక్కని పెలపాని
పైనున్న వలపెల్ల వలవల నయ్యె
దాని దుర్భావంబు దాని పేరాశ
దాని టక్కులు దాని తతిగొన్న వగలు
కాని వాపులు దోచెఁ గనరఁగా-నపుడు
దనయాలి మేనియందము చందమెడఁదఁ
గనుపట్టఁ దొడఁగె నిక్కపు రూపుతోడ
గవుపెన యూర్ధ్వ ప్రతిఫలితంబైన
నవరవి ముకురంబున వలె— నా వెలఁది
పలికిన జాలు దెప్పరమైన తావి
కులుకు కస్తురిపీతె గోవ కరణి—
కెరలి యావిధ గటాక్షించిన జాలు
విరవాది పొట్లంబు విడిచినమాడ్కి
యాపెక్షెదుటఁ బారాడిన జాలు
కైపెక్కి కార్మొగుల్ గదలాడినట్టు
లాపుండరీకున కాత్మనిష్ఠమ్ము
లేపున దులకించె నెల్ల భావములు—
తల్లిదండ్రులు లేక తన మనుగడకె

యొల్లఁబోయెను కాంతు లార్పులు పెదవి
వదను దలంగించెఁ బ్రతినిమేషమ్ము
ముదమేది పారాడు పుండరీకునకు—
కోరి ముప్పదిమూఁడు కోట్ల దేవతలు
తారఁల్లి యఖండ దయఁబూని యంట
నిలచినగాని కన్నులనిండ దీపె
వలతోడ నడుగడ్డునను సుధా ధార
గురియించి వాత్సల్యభరము గుప్పించి
పెరవాఱఁ దన్నోము ఎత్పదైవమునకు
సరియౌదురే! పూజ సలుపనేగాని
కరుణ జూపింపరు కలుగు నిర్జరులు—
పూజాదికమ్ముల వోరామి లేక
పాటింబుగా, దయాఽఽచరణుండు దండ్రి—
యరకాసు పేయని యట్టి నాకమ్ము
కరమర్థితో నివ్వఁ గలరేమొ గాని—
మలినంబుగాని బ్రహ్మానందసుఖము
కొలఁదులే యివ్వంగఁ గోటి దేవతలు!
వారె నోచనియట్టి పరమ సుఖమ్ము
వేరుతురే! భక్తవివహంబు కిడగ!
జనకపాదుఁడు దన చరణపీరేజ
జనిత ధరాధూళి చమరిన యంత
నదె పత్తు విదెపత్తు నమచఁ బేరెముగ
మది గణియించి బ్రహ్మానంద లక్ష్మి
ఎత్పభక్తుఁ డై పట్టి సుతుని గద్దిదుట
పతిపేఁ నిరతంబు నట్టుపుల్ డ్రొక్కు—
పదివేల యేడులు దాటిగాఁ బూని
మదిని గామాదుల మద మడఁగించి
యా త్రిమూర్తుల మెప్పులందగా నంది

ధాత్రిని జరియించు ధర్మదేవతలు
పరమర్షు లక్రాంతభావుఁడై తండ్రి
చరణముల్గడుగు నిశ్చల ధర్మమూర్తి
యగునట్టి సుతుఁడొక్కఁ డవనిపై గలుగ
నగుపాటు లేదంచు నా తపోమయుని
వరపుడ యొనరింత్రు బ్రహ్మాదులెల్లఁ
గురియింత్రు వానపై గోటి వరమ్ము—
లేయుపాయమ్మున నేమి కోసమ్ము
బాయగిల్లఁగఁ జేసి పరదైవతముల
తాతపాదులఁదెచ్చి-దత్తావధాన
చేతస్కుఁడై సేవ జేసి తరింప
వలెనంచుఁ గాంక్షించె భావంబునందుఁ
బొలుపారఁ బుణ్యంబు పుండరీకుండు—
తనపత్ని వీక్షించి తరుణానురాగ
వినివాత చిత్తుఁడై విగళితాజ్ఞానుఁ
డా పుండరీకుఁ డిట్లనియె పొలంతి!
చేపడు మోక్షమ్ము ఎద్దాన్నమట్టి
తల్లిదండ్రుల సేవ నొల్లమి సేసి
యుల్లంబులోన విద్యుల్లతాచపల
మైనట్టి పెలయాలి యరుల చేపట్టి
ప్రాణమై నను గొల్చు పరమ పవిత్ర
మైన నీహృదయంబు నచ్చనపుచ్చి
కావనివాఁడనై కడగండ్లువోయి
తిని నేఁడు కడకు విచ్చినది యీ యొఱుక—
తనుమధ్య! యెటులైనఁ దలిదండ్రులింట
మఱివచ్చి-దేవిదేవరవోలెఁ దృప్తి
పఱుపులైఁ బారాడవలె నంతవఱకు
నన్నుమిందదు నాకుఁ గన్నెర్గి వారి

మన్నన గొనివత్తు మఱలి నే వత్తు
వారాణసీపురి వారుందు రంచు
ధీరహృదయ నీకుఁ దెలియునే గదవె
పోయివత్తువ! తాల్మి బూని యొకంత
పాయక యీ గృహవ్యవహార మెల్ల
పరిదిద్దుకొని-నాదు విరహాంబు పైచి
పరమార్థ మెంచి-దెవ్వర మనకొనక
యుందుము ఎలుగుల నోర్చినా పెన్నొ
ఖందేందుపాల! యీ కాపంత తాల్మి
ధరియించి నను దేర్చు వఱపేయ కనిన
నరవిరి బాగులై దరహాసభరము
పెదవి దొల్కాడ నవ్వెలఁది వచించె
  సదమలభావ! నా సర్వంబు నీవు
నీయాన బాలింప నేర్చుటకన్న
నాయాన పుణ్యంబు నాకు వేఱద్ది!
యుత్తమామల చరణాంబుజములకు
నత్తమిల్లెడుపుణ్యమదినాకుఁగలుగ
నలదందునే! భక్తివకుఁదొచుఁగోర్కె-
లలరింపుగా నిచ్చు నబ్జ కోటీర
మలిరూపుగాదె! మా మామయ్యగారు!
చలిమలకూతురే జగతికి దిగిన
చందంబు మీ తల్లి సందేహమేల!
 —ందరగాఁ బోయి తోకానిరందు
  రల-నీయింట వారుండనై ఖఁ
  'రితతోఁ బదికోట్ల దేవతలు
  నతోడ మున్నల్లె-మనుగడ నఫల
  మటెందివల్లె నత్యంబుగాఁ జూడ
  నివ నాతన్వంగి నలవడఁ జూచి

కమల సమ్మోదమ్ము గాలువ ల్గాఁగఁ
బుండరీకుఁడు దన రెండు బాహువుల
నిండుగా జాచి పెన్నిధిని గన్నట్టు
లిఱి కౌగిలించినఁ దరుణి మేనెల్ల
గిరికొన్న పులకలై గిలకిల నవ్వె—
నాపుండరీకుని యంగంబులెల్ల
నావోయె నమృతంబునం దోలలాడి
తెలతెల్లవాఱె చీకటులెల్ల జాఱె
మలయమారుతయాన మధురిమల్ మీఱె
దెవలఁ దెల్వ్యాలు సేరె నసమెత్తి యొదలు
విస విస జాడించి బిరుసుగా పీల్గి
చాలింక మాన్మధ సంగరంబనుచుఁ
దాలిమివో ధర్మదారలు వట్టెఁ
కొక్కొరో కో! యని కుక్కుటవ్రజము—
దిక్కుడుంగమ్ములు దిగ్గుర మనఁగఁ
గంచు గీఁసగతి ఖగగణంబులును
మించి యెలుంగించె మింటిపై నేగ
దొరకొన్న దినరాజు వరదంబునందుఁ
గరదులు గొని ఘంటికలు మ్రోఁవట్లు—
తమ్మితావులు విచ్చెఁ దమకంబు హెచ్చెఁ
గ్రమ్మ తుమ్మెదలకుఁ ' గడసారి గాఁగ
జీవధాతు తాత్పర్య మొసగించి పంపఁ
గుఁగుంపులుగఁ గాముకులు మోవి సొబగు
గరువంబుపెడఁ గండ్లు గాటుక ల్పెదర
విరులు పీడంగఁ గ్రొవ్వెదజాఱ నదియు
వందమై నడపాడె నప్సరోగణము
చందమై పణ్యయోషాకదంబమ్ము—
బుద్ధి మళ్ళివయట్టి పుండరీకుండు

దద్దయు భక్తి సంధ్యావందనాది
క్రియలెల్లఁ దీర్చి పర్విన నిష్ఠ నింత
నయముగా వేదమంత్రములు వల్లించె—
శారదాకంకణస్వనములే-పదుపు
గూరెను బుండరీకుని గాత్రవీణ—
పుండరీకునిభార్య మోదబాష్పములు
నిండిన కనులతో నిజవిభుఁ జూచు
నా వొత్తి వీక్షింపు నతఁడు ధర్మమ్ము
రూపెత్తినట్లు నిరూపించి మార్పు—
లోహదండపురంబులోని జనమ్ము
దోహలితాశ్చర్యధూతమానసులు—
మాణినాఁడీవంశమండనుండింకఁ
బూరించుఁ దపము సర్వజగమ్ము వందు
నితనికోసము వేదవితతి కోటీర
వితతాంఘ్రియుగుఁడైన విష్టరశ్రవుఁడు
దమి మీఱ నూత్నవేషము దాల్చి భువన
కమనీయములు గ్రొత్త గాథలు గూర్చి
నిలుచుఁ బో వైకుంఠనిలయంబు విడచి
తలపింప నఘము మధ్యమలోకమందు
నను దేవవాక్యంబు లభ్రంబునందు
ననుపమంబగు రీతి నా గుబ్బు గొనియె—
తండిరి విజ్ఞానధనుని దేగఁ
బుండరీకుం డంతఁ బోవంగ నెంచి
చెలువకు బుద్ధులు చెప్పు-సాయంబు
సలుపంగఁ దగువారిఁ బర్పించి పిలిపి
వేగవత్తు నటంచు వెలఁది మారార్చి
తాఁ గడుకొని, కొని, దారిబత్తింబు—
నమకూలదివసమున నటు బ్రయాణించె

జనకదర్శనభాగ్యసమ్మోదితమ్ము
మన మనుక్షణము పేరణము సూపంగ—
వనజాయతాక్షి-పావనవృత్తి యగని
తెన్నులే సూచుచుఁ గన్నుల నిండఁ
గొన్నట్టి కోర్కులై కోమలి యుండె—
పుణ్యంబు పండిన పుండరీకుండు
గణ్యతైర్థిక జనగ్రామంబుతోడ
దినమున కొక కొంత తెకువ నడచు
చను దారిపెంటల కోభిల్లు సత్ర
ముల పేదదేరుచు-ముచ్చటించుచును
గొలఁది మాసములకుఁ గొఱ నెలతాల్పు
కైవల్య ధామంబు-భావనాతీత
మావిష్కృతానంద మస్తమితాత్మ
భవగర్వభారంబు ప్రమథమండితము
శివరూపమైనట్టి చిత్కళ వెలుఁగు
వారణాసీపుర ప్రాంతమ్ము సేరె—
నూరివెల్పల నున్న యొక సత్రమున
విడిస దైవికకార్యవిధులెల్లఁ దీర్చి
కడుకొని యా రేయి గడప యచ్చటనె
బోదమటంచును బుద్ధి జనింప
సాదమొందఁగ శ్రమ-శయనించి యుండె
శయనించుకే గాని నరనకు రాదు
దయలేనినిద్ర నితాంతమ్ముఁ గుపిత
మైన నాయక వలె నహరహ ప్తప్త
మానసునకు నిద్ర కేనాటి వాని
యఱనిఎ దరిపె ఘూకావళీకంర
పరుషహుంకార నిస్వానము ల్సెలఁగె
బ్రహ్మరాక్షస వేదపారవ నరవ

జిహ్వాగధ్వనులు చెచ్చెఱ పెచ్చు పెరిగె—
ప్రమథనాయక వీరభద్రాట్టహాస
ఘుమ ఘుమితము లయ్యెఁ గూలంకషములు-
చండీశతాండవోద్దండవేతాళ
తండు తమ్మట వాద్యధంధణ ల్వీరిపె
నాయవసరమున నల్లంత ఘోర
ప్రాయంబు వలిగిన పడఁతులు మూపు
రరుదెంచి రతి వికలాంగము ల్గల్గి—
కలుకుచూపులు కండకన్నులు కళలు
దళికిన పెదవులు తప్పెట మొగము 95
లిఖివన చెవులు గ్రిక్కిఱివన కురులు—
యల మృత్యుదేవి వాహ్యాళికై వెడలఁ
బెళపెళ నినదించు బిగువు నవ్వులను
పలఖండపూగీవిభాసితంబైన
ఫలితకీకస సుధాబంధురంబైన
కాళంబిధరియించు కలకలధ్వాన
చాలితాళలు వయస్యలవంటి వారు
బండిచక్రమ్ములఁ బగటించు వారి
దండిచన్నులు-చిందు దంష్ట్రిలు-కాల
పూరుషశంఖముల్ బోలు కంఠములు 2400
దారుణ హాసముల్ ధైర్యమ్ము గలఁచు
జఘనతాటమ్ములు-సంతవాకిళుల
విఘటించు నెదలు దా వీక్షించి పుండ
రీకుఁడు ధైర్యంబు ప్రదిలిన-వీఁక
వాకట్టి పూర్వపుణ్యములు గల్గినను
బ్రదుకు క ర్దీనాఁడు కాఎవ నాయు
వద వద లేటికంచెద నిశ్చయించి
గమనించు చుండె నా కాంతలు మూగు

రమిత మాలిన్యపీడఁ గృశ్యమైన
యాననంబులతోడ నల్లంత నున్న
మానితంబగు నొక్క మౌనియాశ్రమము
సేరుచు వినయసంశ్రితరీతిఁ మ్రొక్కి
దీరిచి రటనున్న దివ్యతాపసున
కాతఁడు మందహాసమ్ముతోడ
నాతతంబగు దయ నాశీర్వదించె
అంతట నా మూపు రత్యంత మోద
దంతురితాశయల్ దడయక యచటఁ
బరిచర్య లొనరింప దొరకొని రొకతె
పరక పేపట్టి యూడ్పఁదొడంగె నొకతె
కడివల్చుగందంపుఁ గలయంపిఁ జల్లె
నడుగక మూఁడవ యువిద యందంబు
లత్తమిల్లఁగ మ్రుగ్గు లందందఁ దీర్చెఁ
జిత్తరువెనయంపఁ జేతిలో మెలఁపు
వారివికారముల్ వారింపఁబడియె
దారున నొక్క మంత్రముచేతఁ బోలె
నంతట నామూపు రలతి నవ్వులను
దంతురితములు బెదవులు గర్ణములఁ
జొరఁబాఱు గన్నులు బోగ చూపులను
గరమరుదైన మొగంబులు బటువు
లైనట్టి జఘనంబు లన్నువ నడుము
లా పీలమృదుల కైశ్యములు సర్వాంగ
విస్తారి లావణ్య విభవంబు కాంతి
నిస్తులకుచములు నీరేజములకు
నన్నదమ్ములు వోనియట్టి పాదమ్ము
లన్ను గ్రమ్మించెడు నంచలఁ నడలు
నై దోప నెడఁద మహాశ్చర్యమునను

బూదోట బోలికఁ బులికింప వెంట
మొల్ల మై భక్తి వఱ్ఱిల్లఁగా నొడలు
జల్లన బాష్పముల్ జల జల రాల
బడ బడ బరువెత్తి పుండరీకుండు
కడు వేగమున వారి యడుగుల శిరము
మోపి తాత్పర్యమ్ము సూపి యాశ్చర్య
మో పుణ్యవతులార! యోరంత ప్రొద్దు
నుండి మీవృత్తంబు నల్లంబు సేర్చి
గండారపుం బొమ్మ కరణినై కంటి
నతి విశారదులైన యాకృతు ల్గల్గి
యతివలు వచ్చు టె ట్లింతలోపలనె
సురుచిరరూప సుందరు లగు టెట్టు!
లరుదయ్యె నమ్మ! మీ దైవవృత్తమ్ము
ధరణిపై నెవ్వారు జరియింపవచ్చు
తెఱఁగైన తెఱగంటి తెఱవలా! మీరు!
పరమేష్ఠి దివ్యభావన రూపమెత్తి
పరితృప్తి నడపాడు భంగులా! మీరు!
మదనుండు శాంబరీమంత్రమ్ముచేతఁ
బదను గూర్చినయట్టి ప్రమదలా! మీరు!
రతిదేవి మదనసంభ్రమహానమునకుఁ
బ్రతికృతులైనట్టి వధువులా! మీరు
శ్రీ విశ్వనాథుని చెంగట వెలఁగు
దీవియ లలనాళి దివ్యరూపములు
ధరియించి మెలపాడు కరణులా! మీరు!
శరణులారా! నాకుఁ దగఁజెప్పరమ్మ!
యీ యాశ్రమంబేది! యిందుండునట్టి
యాయతకేశ దివ్యా_నిధానంబు
దెలుపంగఁ గూడునో! దివ్యలా మీర

లల మౌనిసేవ సేయఁగ హేతువేమి?
దేవతాప్రమదలో మీ వికారములు
ద్రోపంగఁ దా నెట్టి దొడ్డ తపమ్ము
సలిపెనో! యా యోగి తెలుపరేమమ్మ!
కలువుల చెలికి హెగ్గడికత్తెలార!
యనవుడు నవ్వాని నఱగంట జూచి
తనుపారు దరహాసధాళధళ్యములు
క్రొమ్మురువులకాంతి గుత్తరింపంగఁ—
బ్రన్ననౌ చూపులు, పారాడు వాలు
గలణాలు బురుడింప కమ్రకపోల
తల కాంతి పగడాల తళుకులు జిమ్మ—
నెత్తమ్మి మొగడల కొత్తలో కుదురు
గుత్తంపుఁ జన్నులు గున గున లాడ
మూపురయం దొక్క ముద్దియ పలికె
  కావరమాచి చిక్కని వంశగౌర
వము ద్రోచి యిల్లాలివలపుల రోసి
క్రమహీనమైనట్టి గణికావిలాస
ముల నాచి తల్లిదండ్రులఁ దెగఁ ద్రోసి
పలుగాకిపై నట్టి బ్రాహ్మణబ్రువుఁడు!
యడగితిగాక మా యాత్మవృత్తంబు
నడిపెద విను మిఁకమండియే గాని
తలఁగుము పాపవర్తన మటు సూడు
మలసాలసాలోల చలితకటాక్ష
పరమ సుందరమూర్తి, వ్రజవల్లభునకు
నెరవాయు నెచ్చెలి తరుణార్కదుహిత
శమనుసోదరి యాపె సరసాంగయష్టి
యమునా తరంగిణి యటుపైపు గనుము
లలిత లజ్జాభంగదుఃఖకితాపాంగి

వలసుగా బంగారువన్నె పుట్టంబు
గట్టిన యది హేమగర్భునికైన
పట్టంపురాణి భావాంబరాలోల
రసకళామూర్తి సరస్వతి యాపె—
తనుకు లే లింక సత్యము నేను గంగ—
మూఁడు లోకమ్ముల మ్రొక్కు లందంగఁ
గూడిన పావిత్ర్యగుణ మగ్గలించి
మా మువ్వురకునైన మాన్యుడౌ నమ్ము
ధీమహాత్ముం డిందుఁ దీరిన మౌని
ప్రతిదినమ్మును దమ పాపముల్దలఁగు
మతిబాని వేలాది మర్త్యులు మమ్ము
దరిసి తానములాడి తరలెదుదాన
భరియింప బరువైన వారిపాపములఁ
గూరుసు మా కిట్టి ఘోర రూపమ్ము—
లారూపముల బాఁచి యచ్ఛంబులైన
మారూపములఁ జెంద మౌనియాశ్రమము
చేరి యీ సేవలు చేతుము మేము—
బోయివత్తుము నీదు పూర్వపుణ్యమున
బాయక మాదు రూపమ్ములు జూడఁ
గంటి వటంచు నా కాంతలు కమరు
గంటలు మ్రోయంగ కరకుశేశయము
లందుఁ, గంకణము లానందలాస్యంబు
జిందింపఁ బెదవులఁ జిఱునవ్వు లొలుక
యలవోక నేగు రాయంచలదైన
చెలువంబు గులుకఁ, బుష్పితము లై పట్టి
జంగమలతలట్లు సాఁగిపోయినవు—
పొంగులుపో భక్తి పుండరీకుండు
కరములు మోడ్చి యా కాంతలు చన్న

హరిదంతరంబుల కటు నంజలించి
కన్నుల నానంద కమలంబు లుబుక
దిన్నఁగా నరుదెంచి తెలవాఱువెనుక
నా మౌని దరిసించి-యాతని వృత్త
మేమొ! యెఱుంగ నూహించుచు తల్ప
మున మేను సేర్చి యుండిన నంతలోన
మనములు జిగురింప మాలేయ గంధ
వాహముల్ వెదచల్లి-పరితస్సుగంధ
దోహలై లా రణోద్ధూళిచయంబు
చూడఁ జూడఁగఁ దోచె సూర్యుండు జగతి
చూడంబుపై నొక్క- మూపకంబట్లు
ప్రొద్దువోవక మున్నఁ బుండరీకుండు
దద్దయునాసక్తిఁ దల్పంబువిడచి
కాలకృత్యంబులు గడువడిదీర్చి
వేగాను గుణసాంధ్య విధియొనరించి
శరదిందు కోటీరచంద్రికా స్తబక
పరిహృతభక్త తాపమహాగదునకు
గౌరీ ధవునకు-నిష్కలుషమౌ భక్తి
పేరెముల్వారంగ విమతు లొనర్చి
మునియాశ్రమముసేరి-ముక్తిసుఖమ్ము
గొనకొని కరిగట్టు కొన్నట్టులున్న
యా మహాత్ముని గాంచి యఙ్ఘ్రులయందు
తామరతంపరై తనువునయందు
వినయంబుదట్టాడ విధియుతంబుగను
దనగోత్ర మెఱఁగించి తలవంచిమ్రొక్కి
నిలచిన నామౌని యెలనవ్వుగనుల
నిలువంగవీక్షించి పెలియాలి వలపు
గడచెనా? ఎతరుఁగడగంటఁజూడఁ

కాదమె నాచిత్తంబు? పుణ్యంపుఁ ద్రోవ
సతితోడి సంగతి సహ్యమయ్యెనొ? వి
తతవిద్యల ఫలంబు దట్టెనో మదికి!
రారమ్మటంచుఁ గరమ్ములుదాచి
యేరాళముగ వాని నిఱిగౌగిలించి
యొకయాసనమ్మున నుపవిష్టుఁజేసి
మొకమున నాదరంబులు తొంగలింప—
నుండిన గరుపాఱి పుండరీకుండు
నిండినభక్తిఁ దానిత్యంబు గొలుచు
శశిశేఖరుఁడు దయసన్నిధిసేసి
సఖుఁడౌచుఁ గూర్చున్న సదువున నున్న
పరమర్షిఁజూచి యాసగిది భాషించె—
నరుల పాపమ్ములు నాశమ్మొనర్చు
దివ్యస్రవంతులు దినమును వచ్చి
యవ్యయమంగళాఽఽయతనమైనట్టి
మీ పదంబులుగొల్చి-మెయికొన్నభక్తి
పాపంపు రూపుల ప్రాచిఁటోఁద్రోచి
తమరూపములు దాల్చి తరలుచే గంటి
శమనిధి! మీ తపస్యావరివస్య
కై-దేవతలు పడిగాపులుగాయ
నాదేమిబ్రాఁతి! విజ్ఞానహీనునిది
మీరన్నయట్టులే మితిమీఱుకామ
కారంబుగను గప్పు-కంపలఁబడ్డ
కాకినై నేటికిఁ గన్నులు దెఱచి
శ్రీకరులైనట్టి శివరూపులైన
పితరులఁగానిపోవ వెతలివచ్చితిని
తతితోడ మీదగు దరిసెనంబబ్బె
నాయఘమ్ములునేఁడు పాయంగఁ గలిగె

మాయని యజ్ఞానమాలిన్యమత్త
మిల్లె ధన్యుఁడనైతి నుల్లంబునందు
నల్లన నొక కోర్కెయావిర్భవించె
మనవి సేతువ   యన్న మౌనివతంసుఁ
డను వమంబగు కూర్మియాగుబ్బగొనఁగ
సందేహమేల స్వేచ్ఛగఁ జెప్పవన్న!
విందును వీనుల విందుగా నన్నఁ
గరములు జోడించి కన్నులయందుఁ
బొరలంగ బాష్పముల్ పుండరీకుండు—
పలికె తావక నామ భాగ్యంబువోచి
ఫలిత జన్మములైన వర్ణమ్ములేవి?
ఏకాలముననైన నేమహాపుణ్యు
లేకృత్యముననైన నెనగంగఁబొంద
గారాని యే త్తెఱ గలిగె మీకెట్లు!
కారుణ్యమునఁ జెప్పఁగాఁ దగు నన్న
నామౌని శిరమల్ల నంకించి కనులఁ
గామితంబులు చల్లి కల్పకాళికలు—
దల్లని చూపులు త్రుళ్ళింతలాడ
మెల్లన వచియించె మేదినీసురుఁడఁ
పేరేమి పెట్టిన పేర్మిదానేమి!
తీరొక్కటేగాక తెలివికి గుఱుతు—
కుక్కుటుండంచు వాకొందురు నన్ను
నెక్కారణంబున నీయభిధాన
మొనరెనో! యే నెఱుంగను నాయొనర్చు
ఘనతపంబేమని గలదువర్ణింప!
నన్ని వేదంబులు నన్ని శాస్త్రంబు
లెన్నినయాదైవ   మేలోకమందు
మన్నాఁడొ   వానికేనొక్కపారైన

కన్నడించుచుఁగాని కై మోడ్చియెఱుఁగ—
కాశి, కైవల్యవారాశి యటంచుఁ
గాశి ధిక్కృత పాపరాశియటంచుఁ—
గాశి ముక్త్యంగనా కర్ణపూరంబు
కాశి విశ్వేశుని గాదిలియనుచు
బహుపురాణంబులు వర్ణింపనైన
విహితధర్మలు వేనవేలకు యాత్రి
కులు–దినంబును గోరి కోరి దర్శనము
పలువంగ నీ త్రోవఁ జనుచునేయున్న
నొక్క–పారైన నాయుల్లంబునందుఁ
దక్కొ–నియాకాశ దరిసింపఁ దలపఁ
విశ్వనాధుండెట్టి విధమునవాఁడొ!—
విశ్వేశ్వరి భవాని వెలసినవడువు
దానెట్టిదో! లేశమై ననేనెఱుఁగ—
నానెమ్మనంబు విశ్వానందమందుఁ
దేలించి–పాలించు దివ్యదైవములు
మ్రోలనే గలరట! ముక్కోటిదేవ
తలతోడ నాకేమి కెలసంబు! నరుఁడు
జలజంబు విడచి వత్తల నేటికొమనె!
యన్నంతహృదయంబునందు వచ్చెరువు
వెన్నడింపగ, మౌని విభుతోడఁబలికెఁ
బుండరీకుఁడు - మీరు ముప్రొద్దుఁ గొలుచు
దండిదైవతములు దామెట్టివారొ!
యరయంగవచ్చునే! యంచు, నాతఁడను
యరమర లేటికి! యవసరంబిపుడ
రమ్మంచుఁ జివ్వున నమ్మునిలేవ
నమ్మని వెనువెంటనరిగెనువుండ
రీకుఁడు మోదంబు ప్రదులునుల్లంబు

నాకట్టి నాశ్రమాభ్యంతరమ్మునకు—
నటవోవనొక్కటనతి వృద్ధులగుట
గిటగిటనై చూపు క్రిప్పు బలమ్ము
కేవలమాత్మజు సేవలతోన
భావంబు తనుపంగ బ్రదుకుచునున్న
వారి పంచాక్షరీ పరనైక పరుల
దారితాఘులఁ దల్లిదండ్రులఁజూపి—
యనియెఁగుక్కుట మహాముని వీరెచూడు
మనఘ! నాచేయు సత్యమపమతపము
వీరెనాదైవంబు వీరెక్కె వల్య
సారంబు సకలశాస్త్రజ్ఞత విశ్వ
నాథునిరూప మ్మనంతపుణ్యమ్ము
చైతన్యమును దాల్చిచరియించువరువు—
వీరిసేవలతోన, విశ్వంబుమఱచి
యోరంత బ్రొద్దు శరీరంబుమఱచి
యుందుననగాని పేఱొక్క మంత్రంబు
పందెంబునకు నై సబరియింపనేర!
వీరి పల్కులె నాకువిమలవేదములు
వీరిచూపులు సముద్వేలక్కై వల్య
వారాశి భంగముల్ వీరిసాన్నిధ్య
మూరాజకోటీరు నంకంబు వీరి
చరణపద్మమ్ము లేపకలమ్మునాకు"
భరమైన భక్తితోవలగొంచువారి
కాకుక్కుటుండనె నమరాఽఽవగాఽది
లోకదుర్లభ, దేవలోకంబు పన్నుఁ
గొలుచుట నాతపస్సులమెచ్చికాదు—
తలపైని నీదేవతలరణో భరము
ధరియించుదావనే-తల్లిదండ్రులకు

పరవుడ యొసరించువానిక ప్రాప్య
మైపట్టినుఖమేది! యఖిల దేవతలు
వానిదాకాలిసేవకులు కై వల్య
మవ్వాని కింటిలోనావు విజ్ఞాన
మవ్వానికడఁగంట వాడెడుచెలువ
పుండరీకా! భూమిఁబుట్టి తానేమి!
చండించిపెల యాలిసరసమ్ము నమ్మి—
కులదై వములు ఎతరులపెళ్ళనూకి
పలపల విజ్ఞాన వాదమొనర్తు,
ఖోఖొమ్ము! పితంద్రిపుణ్య లోకముల
దీపంబు తను పె త్తిదీపించు శివుఁడు
కమనీయమణికర్ణి కాఘట్టమందు
శ్రమమేదునొక్కయశ్వ త్థంపునీడఁ
బొదవు తెప్పలతోడి పెడఁదలౌకముల
గడుపూన్కి బొమ్మలనరుమఁ గిల్కొల్పి—
పెలవులయందుఁ గ్రొన్నెల వెన్నెలలను
గిలుబాడు చిఱునవ్వువెలఁది గఁగాయ—
తాను గూర్చున్నాఁడు దవములోమునిఁగి
ధీనిధి! యామౌనియానిన దీక్ష
తనకొఱకై గాదు తనయుఁడై పుట్టి
వినయంబుదొలిఁచి వేవేలబోకలను
మరగిన నీబుద్ధిమాన్పెదుకొఱకు—
పరమేశ్వరునితోన బాఎల్లుగౌరి
నీమాత యతని సాన్నిధ్యముందునని
శ్రీమహాతంబుగాఁ జెలఁగుచున్నదియు—
విడచితివేగాక పెదదారిఁదట్టి
విడచనే! వారలవిశ్వనాథుండు '—
కుక్కుటబుఋయున్నయొక్కొక్కపూట

యొక్కొక్క శూలమైయుల్లంబుకుదుప
నాతని ఎతరుల కాతతభక్తి
పాతత్యమనువొంద సాష్టాంగ మెఱఁగి
కుక్కుటునకువలగొని పడఁబాతెఁ
బొక్కుచు మదిలోనఁ బుండరీకుండు
వారాణసీమార్గవర్తియై తండ్రిఁ
జేరెదు పలికింక దీరునేవెతలు!
కాశిఁ బ్రవేశించి-కనపడ్డదారి
నానతోఁ బ్రశ్నించి యటునిటుదిరిగి
మణికర్ణి కాఘట్టమునుజేరి-కుక్కు
టుని వల్కుబడిఁగనుగొనెతాతపాదు
నాతనినవిధంబునందె గూర్చున్న
పతిఁదనతల్లి విశ్రాంతిధామమ్ము—
పులకలుదనువెల్లఁ దిలకంబులొత్త
జలజలగనుల బాష్పములురాలంగ
కదువడి నెదయెల్లఁ గంపనంబొందఁ
దడఁబడుచుండఁ బాదమ్ములు పుండ
రీకుఁడు పెవగొన్న శోకంబు వశుకు
నాకట్టుజంకు నాహ్లాదంబు—లజ్జ
పదివేల భావముల్ ప్రాముకొనంగ
మదినెల్ల—పేయనే మార్గంబుదోప
కటునిటు దిరుగ—పాత్యకిగమనించి
పుట పుటనై యున్న శోలికలాచి
తపసుతుండే' యన్నతలఁపులోఁగలిగి
చపవునఁ జేరఁబిల్చిన—పరువెత్తి
శిరమంటమ్రొక్కి నాదురుసుతనమ్ము
మఱచి—నాపేమమ్ము మదినిచ్చగించి
తిరిగి రావలెమీరు—దేవి, పితరయు

విరుల పాన్పునఁ బెట్టివరవుడిదీర్తు—
గడచిన కతలెల్లఁగడుపఁశోకమ్ము!
యెద చెలువై వీవు నింతలోఁగనలు
దెలిచె జహ్నుఁడు తపోదీక్షచాలించి
ధరణిపై దేహంబుదాల్చినయెలుక—
కనులు విప్పనతోన గడువడినేగి
జనకుపాదమ్ములు జడిగొనదడిం
పొదివి యాలోననఁబుండరీకుండు
మదిఁగూడఁ దెచ్చి యీమాడ్కి బ్రార్థించె—
జనకరూపంబెత్తి సాక్షాత్కరించి
నను దనియించెడి నాగకోటీర!
యాకాశమున కన్ననతి విపులమ్ము
పీకై వడిగ్రహింపలేక సామాన్య
మానవబుద్ధితో మదితీరుదలఁగి
కావని కన్నులఁ గామమ్ము గప్ప
పెడఁగనై వేవేల విధులఁబోయితిని
విడిముడి కొఱతునై వెలయాలిజిలుఁగు
నవ్వులనవ్వ మానంబుడివుచ్చి
యవ్వెలంది మెఱుంగులామతించుచును
శిరసుండమో కాలసేసలు వెట్టు
బరవిడి మిమ్ము నొప్పరికించి దాని
చరణ లాక్షారాగ చరితమైబ్రదుకు
పఱచనై తిని-నేఁడుభావమ్ముమాక్ష
ఎతరుల కన్నను శేషద్దిలేదు
బ్రతుకు దీర్పఁగ మోక్షపదమిడివ్వంగ
నాచేసినట్టి యన్యాయముల్మఱచి
నాచేత సేవలనందికో దలఁచి
రండు! దేవతలారా! తహిగుల్కామీకు

పుండరీకుండింక పుట్టువుమాతె
నదియొకజన్మ, మాయాఽధీనమలిన
మిదియొక్క జన్మ, సమీహిత ధర్మ
మనియేడ్చికొని చెప్పునా పుండరీకుఁ
గనులారఁజూచి కౌఁగినదయాభావ
మునసవ్విజహ్నానిట్లనె మార్గమధ్య
మున—కుక్కుటుని దవీమూర్తిజూచితివా!
యామహాతునియట్టులని తరసాధ్య
మౌ—మహత్త్వము నీవునందంగ వలయు
పదము! వేదమునేఁడ భవ్యమైనట్టి
పదముఁజెందఁగనీకుఁ బ్రాతియేమన్న!
యని పల్కనాతండ్రి కంజలించుచును
జనని పాదములకు నమ్రతిమ్రొక్కి—
శ్రీవిశ్వనాథునిఁ జేరివందించి
యావిధుశేఖరు ననుగులంబైన
శ్రీవిశాలాక్షికిఁ జేయెత్తిఁ మొక్కి
భావజాంతకు జటావాటికినెక్కు
వగలు గల్గినదేవవాహిని తెఱఁగి
విగువు నవ్వులతోన వృథు పాపములను
గడగడనడకించు కటికంటవాని
పడిగావు—శ్రీవీరభద్రుని గొలిచి
తక్కుదేవతలకు దండంబుపెట్టి
నెక్కొన్న భక్తితోనిలువెల్లవడఁక
నందలంబునయందు నాతల్లిఁదండ్రి
వందంబుగాముంచి-యతివినయమున
నడచెను పుండరీకుఁడు వారితోన
యొడలు దాల్చినభక్తి నడచినయట్లు—
ఆకలిదప్పుల నరపయవ్వారి

నేకాంత నిష్ఠతోనెలమి గొల్చుచును
దివమునకామడతిరుగానడచి
జవకుల కాయానమును దోపనీక
దండితేంద్రియవృత్తి తతశమధనుఁడు
పుండరీకుండాత్మ పురమును దఱిసె—
తలవొలమునయందె దర్శించి కొంద
రలఘువేగమ్మున నా యూరఁ జొచ్చి
పుండరీకుఁడు వచ్చెఁ బుండరీకుండు
రండు రండో! చూడరండంచుఁ బిలువ
తరుణులు-మగలును దండడిగాఁగ
బరిగట్టి యెదురుగాఁ బరతెంచు చుండ
దననాథుఁ డరుదెంచె నను వార్త చెవులఁ
దనికిన మధురసుధా ధారయగుచు
నెన్నఁ డెన్నఁడు వచ్చు నీఁకనంచు వాని
తెన్నులే సూచుచు దినములు గడపు
చున్నది-విధియుక్త శోభనాఽఽచార
సన్నయ సన్నుతచాతుర్యమూర్తి
బుండరీకునిసతి బొంగారుచుండ
రెండుకన్నులు బుల్కరింపులు దనువు
దనియింపఁ, బై పెచ్చుదట్టాడు కుతుక
మునకుఁ దాలిమి యను బెనుకట్ట వెట్టి—
తలవాకిటనె నిల్చి తరళితాపాంగ
ములతోన నాథుని ముందెర్వనందుఁ
గలువదంబులు గట్టి యొలవవ్వు ముత్తె
ములఁజల్లదయపేరెఁ బుండరీకుండు
దల్లిదండ్రులతోడ మొల్లమై గమల
జల్లించుకొన్న బాష్పమ్ములతోడ-
బొలఁతి నమ్మఁగలేదు బుణ్యంబులిట్లు

ఫలియించునే యందు నలినాక్షి నమ్ము
కుండనులేదు నాకొన్నట్టి కనులు
రెండును దీర్ఘ దీర్ఘీకృతమ్ములుగ
మొకమెల్లఁగాఁ జూచె మోక్షఫలమ్ము
లకలంక మతివచ్చినట్లున్న వారి—
సకలదేవతలయంశము లొక్క యిర్వ
ర కుటిలమానసులైనట్టి వారి
సత్తమామల నంతరానందమునకుఁ
జిత్తంబుదుఎకిల్ల శీఘ్రంబుగాఁగ
నెదురేగుదెంచి తా నిలఁ జాగి మ్రొక్కెఁ
గుదురు గుబ్బలు భూమిఁ గునియ యాడంగ
మ్రొక్కిన కోడలి ముదమారఁ గాంచి
యక్కమలాక్షి సాత్యకి మనసార
దీవించెఁ గులమేలు దేవుండు జహ్నా
నా విశాలాక్షినీపై బుండరీకు
సభవుఁగావింపు మంచాడె సతీమ
విభవమ్ము దనము దీవెన గ్రుమ్మరించి
యంత నా ప్రియపత్ని యనురాగభార
దంతురితాపాంగి దన మనోనాథు
చరణంబులకు మ్రొక్కె సరసంబులైన
జిఱునవ్వుతుంపురుల్ చిందులాడంగఁ
సత్తమామలదైన యడుగులదోయి
సత్తమిల్లంగ భక్తి యర్మిలిఁ గడిగి
తత్తీర్థమును శిరస్థలముపైఁ దాల్చి
చిత్తమ్ము చిగురింపఁ జిగురాకుఁబోఁడి
త్రోవఁ జూపించినఁ దోడ్తోడ నడచెఁ
కై వల్యకామినీ కర్ణ కల్హార
కమనీయ తరకటాక్షములతో జహ్నుఁ

దనమలిన చిత్రపాత్యకి వెంట నడువ
తల్లిదండ్రుల వెన్కఁ దా వచ్చె వారి
వల్లలితాంఘ్రు నిశ్చలదృష్టి యగుచుఁ
బొడవైన వినయంబు బుండరీకుండు
పుడమిలో నింక నా పుత్రున కెట్టి
దలఁపుమ లేదు, శ్రద్ధాబంధుదముగఁ
గలకాల మాఎ తరులఁ గొల్చి వారి
పాదమూలములఁ గై వల్యసుఖమ్ము
సాధించుచే దక్క శమదమనిధికి
దినములు గతియించె దివ్య విజ్ఞాన
ధనుఁడైన గొమరుండు దాను సాధించె
బిడిబడిఁ గ్రొత్తతపమ్ము దేవతలు
గడు వెఱఁగందఁ జొక్కపుభక్తి నిలిప
జనకుని మొగముపైఁ జూపు ల్నిలిప
తవలో నెగరఁగు శ్రద్ధామూర్తి సుతుఁడు
పితృపాదముల నిష్ఠ వీక్షించి బాష్ప
తతిపజ్జనమ్ము సంధానించుఁ గొడుకు,
జనకుండు భాషింప నరవితో నమృత
మునఁ దోఁగినట్టైన మోద సర్వంక
షంబైనహృదయంబు జలజలఁ బాఱ
నింబుగా వీక్షించు, వాతమెంచి సుతుఁడు
దల్లియంఘ్రుల చెంతఁ దలవాన్చి సుఖము
మొల్లసై రోమాంచములఁ దోఁగుఁ గొడుకు,
తెలతెలవాఱ నెత్తురు వోవ భక్తి
తలిదండ్రులకు మ్రొక్కి తత్పరత్వమునఁ
దానంబు లాడించు, దనివీఱ వారి
మానసంబులు మోదమత్తముల్గాఁగఁ
బ్రమ్మని శుశ్రూషణమ్ము సాధించుఁ

గ్రన్ననఁ దనికంపు గలిగిన పూలు
ముడుచు, నాయాసంబు గడమగా విసరుఁ
దడయక తాళవృంతమ్మును బూని
గడచెఁ గాలంబిట్లు ఘనతపోగరిమ
బొడసైన తనయుండు పుండరీకునకు
నితరుల సేవయే గతియయిపోయెఁ
బితరుల నామమే విధిమంత్రమయ్యెఁ
దల్లిదండ్రుల పూజ దనబ్రదుకయ్యె
నెల్లసౌఖ్యంబుల కెల్లఁగా నయ్యె
నేమి వచించునో! యేదిక్కుఁ జూడు
నో! మానసంబున నేమి యూహించు
నో! యెట్టిసేవఁదా నొగి నిర్వహింప
నై యున్నదో! యంచు ననిమేషదృష్టి
వఱలఁ జహ్నువుపైని బ్రమథేశ్వరునకు
సరియైన దండ్రిపై సర్వకాలమ్ము
నతిజాగరూకుఁడై యాయాసమనక
మతిసేవగింపక మాంద్యమ్ము లేక
గండరువునబోలెఁ గాపుండు సుతుఁడు,
దిండితీర్థమ్ములు దినిపించుఁ ద్రాపు
నేర్పుల రుచులెల్ల వివరించి జలము
వార్వఁగా విశ్రమింపఁగఁ జేసి యల్ల
వల్లఁ బాదములొత్తు నానందబాష్ప
పుల్లవక్త్రాబ్జుఁడై పుండరీకుండు
నిదురగూర్కిన తండ్రి నెలమి వీక్షించి
మది పొంగి యంఘ్రుల మస్తమ్ము వంచి
తల్లి డగ్గఱి భక్తి దట్టాడుచుండ
నెల్లసేవలు దీర్చు బుజామూర్తి సూనుఁ
డాకొమరుని గాంచి యద్భుతానంద

శీకరాఽఽపారంబ్బిలమూర్తి మాతృ
దేవి లోలోననే దీవించుఁ గోటి
దీవెనల్ ప్రేమంబు దీగెలు సాఁగ—
మతిఁ జొక్కి రుతి దక్కి, మధులిహం బున్న
శతపత్రముల వోలెఁ జక్షువుల్మోగిచి—
యనుకూలపతిప్రేమ కాత్మలోఁ గరఁగు
వనిత పోలికబాహ్యవర్తనల్మఱచి—
గురుదిష్ట మంత్రంబు పరశిష్యుఁ డట్లు
హరు మూర్తిఁ దనలోన నైక్యం బొనర్చి
పరమ భక్తుఁడు దన ప్రాణలింగమ్ము
విరిబోటు లేకుండ వీక్షించునట్లు—
జహ్నుమూర్తినిఁ దన పరసాఁర్ద్రచిత్త
నిహ్నాతం బొనరించి నిట్టక నిలుచు
పులకలై ముద్బాష్పకణికలై గనుల—
నలలుడిందినయట్టి జలనిధి వోలె
జలదార్తిలేని సత్సరణియు బ్రోలె
చలనంబు నేదిన పలిగాడ్పు వోలె
మూతి విచ్చనియట్టి ముకుళంబు వోలెఁ
జేత మివ్వనియట్టి నాతియుఁ బోలెఁ
పల్లలాడని యట్టితిల్లికవోలె
పల్లనిమదియింద్రియాఽఽసక్తిదలఁగి
గురుపాదములయందెగుఱుకుగానిలువ
దరముగానట్టి యాధరగల్గుపూలు
వదటికేయని భూమినొదవవిచెల్ల
వెదిగి, సాయుజ్యసంపదయుమతావు
లడరు సహస్రదళాఽబ్జంబువ్రాన్చి—
యొదఁగూడు ధూవధూమోద్గమంబులకు—
తాత పాదులపాదతలములగంది

చేతంబు నొచ్చు నన్నింత విజ్ఞాన
ధూపంబులెసకొల్పి, తోడ్తోడ ధవము
బ్రాఎంచువట్టి వీరాజనజ్యోతు
లనఁగవేడిమియంటి యుదవ దలగువా!
యనువంతవెన్నెల కనుగులంబగుచు
నలరు నాత్మజ్యోతి నళినివాళించి—
ఇలఁగగ్గలురుచులలో నేమున్నదంచు
నిరఎంచి యెన్నండుఁదఱుగ నిరుచులు
పరిధవిల్లెడు ప్రాణపదమునర్పించి—
యడరించు ప్రతిదృష్టి యాత్మదేశికుల
యడుగులకౌక దీపమై మదిఁదలఁచు
ప్రతిభావనయు నొక్క పద్మరాగముల
ప్రతిసరమై చేయు ప్రత్యుపచార
మతుల మాత్మార్పణంబై భక్తి సురభి
యతిమాత్రరక్తిఁజన్నవిఎచేవంగ
వీరేడు లోకంబు లెలమి నంకింప
నారణం బొల్కంగ నర్చించు సుతుఁడు
ప్రమదేశభక్తుండు బాహ్యలింగంబు
నేమంబు నిష్ఠించి నిఖిలసద్వస్తు
తతిఁగూర్చుకొని నిహిత్రంబుగాఁ గొలుచు
గతిఁ దండ్రి పాదముల్ గాంక్షతోఁ గొలుచు
నకలోపచారముల్ సంఘటిల్లంగ,
పశుపతి భక్తిభావాఽఽవేశదివ్య
రఎకుండు లోకతంత్రమ్మువోవాడి
యడుగగ్గువను రక్తి యావవాల్లంగ
సుడురాజకోటీర! యూర్జితాచార!
కైవల్యసుఖపార! కంధిగంభీర!
దేవాఽఽదిదేవ! భూతేశ! నమో న

మో యంచు హస్తాబ్జములు దట్టిపాడు
ఛాయగా విష్ణురూపాయ దయైక
బంధవే! మన్మనోబంధవే! జ్ఞాన
సంధుక్షణాయవిశ్వాత్మనే! జహ్ను
రూపాయ! నిత్యాత్మనే! ఎత్మరూం
ణే! ఏనాకధరాయ! నిభృతం నమో న
మో! యంచు నెలుగెత్తి యోరంత బాడి
చేయెత్తి నర్తించెఁ జెలువొల్క సుతుఁడు—
గనుమోడ్చినపుడుఁ గాంచు లోలోన
జనకునిరూపు మోక్షానందజలధి
గనుదెర్చినప్పుడుఁ గాంచుగన్నెదుట
జనకునిరూపు నిల్చిన మోక్షఫలము—
గనుఱెప్పలార్పక కను జిఱునవ్వు
దనుకంగఁ జూడ ముగ్ధముగాఁగఁ జూచు
నలఁతఁగాఁ జూచు మిన్నులు గ్రమ్మఁ జూచు
నలనల్ల జూచు నోరఁలజూచు, దేహ
మంతయుఁ గన్నులై యటునూచు భక్తి
దంతురితుఁడు గొడుక దండ్రి పాదములు—
జనకుండు భాషించు సమయంబులందుఁ
దనయున కొడలెల్లఁ దమపారుఁ జెవులు—
పితృపాదములను సేవించెడునప్డు
వాతబుద్ధి కొడలెల్లనెనయు హస్తములు—
మతపడ, జనకు సన్నుతిసేయునపుడు
మితిపెట్టరాకుండ మేనెల్లనోళ్ళు—
దలిదండ్రులకు సేవ దలకొల్పునపుడు
మెలయుఁ బో, గిలికొని మేనెల్లఁ గాళ్ళు—
పరరూపుఁడైన దండిరిఁ జూచునపుడు
మెఱయునే త్తమ్ములై మేనెల్లఁ గనులు—

దలిదంద్రుల వ్వానితాత్పర్యమతుల
ఫలమైన సాయుజ్యభాగ్యపారమ్ము—
దొలిదిక్కు జవరాలు వలిపెంబు దీసి
కలికి నవ్వుల భూమిఁగాంచకమున్న—
తొలికోడికంఠంబు నిలవంచి పొగడు
గులికించి మువ్మాఱు గూయకమున్న—
తొలికొండచఱులపైఁదొతెంచి సూర్యుఁ
డలరార రాగంబు నిలుపకమున్న—
తొడలెచ్చరించి నేస్తులఁగూడు నతుల
ముడివడు హుంకృతుల్ ముగియకమున్న—
వెలుఁగుల గనికరంబులు సోకి తమ్మి
చెలువ గ్రొన్న గవులు చిలుకకమున్న—
వొరలేని భక్తితోఁ బుండరీకుండు
పరమార్థ ఎత్పరూపభావనామధుర
మధుదిగ్ధనేత్ర పద్మమ్ములు విప్ప
తదుపరి వేగంబుదానంబు దీర్చి—
బుడి బుడి యారామముల కేగి, తావు
లడుగు పట్టగఁదేటు లంటనియావు
లందంబు దుఎకిలమందవాయువుల
గ్రందున తేకులు గదలని పూలు—
మదఁతిచెక్కులపైని మదరేఖలోలు
గడుతియ్యనగు తేనెలెడలనిపూలు—
వృంతబంధమునుండి విడివోని పూవు
లింతైన చందంబులిడివోనిపూలు
శోధించితెచ్చి విస్ఫూర్జితానంద
బోధరూపుఁడు పార్వతీధవుఁబోలు
జనకుపకుపచార సరణివేఁదీర్చి
జననికూడిగములువల్పి యుర్వరమ

మనవిష్ణులనుజేయు త్తాలభక్తి
సఫలంబుగాఁగఁ బూజలొనర్చుఁదనదు
పదఁతితోఁగూడి శాశ్వతమోక్షసుఖము
బడివొక ఎద్దించె నో జగానంచు—
జనక పాదములందు సరిక్రొత్తపూలు
మనసారనుంచుచో మాధుర్య భరము
లత్త మిల్లనిపూవులై యుండు మనసు—
హత్తుకోనుద్వేగ, మావలి వలను
దీపార్చన మొనర్చి తీపారుఁజూపు
లేపారవీక్షించి యిచ్చలోఁగరఁగు
నావేళలందుఁజీమంతై వగందు
లావహాల్లని దీవమైయుండుమనసు—
వాసనాద్రవ్య సర్వస్వముల్ జలము
లాపదులాౘడఁగాఁబోఎ తానమ్మ
లాడించునప్పుడుఁ దీవ్రానురాగమ్ము
గూడంగ జలములై గొనురొందుమనసు,
యిది స్వాదువిదివొలునిది భేషజంబు
నిది కోరికను దెచ్చినది, యంచురుచులు
పలికి నైవేద్యపూజలొనర్చునప్పు
డలరారభోజ్యంబులై యుండు మనసు—
గనులు చిత్తడిగ, శిఖాగ్రంబునందుఁ
దనిపూలుముడుచుచోఁ దావులుపోని
యలరుల బంతిగానై యుండు మనసు—
యిలపై వి సర్వాంగ మిరవొండ శిరసు
వంచి మత్పుణ్య తపః ఫలాయ! జగ
దంచితముక్తి మహాయ! సర్వాత్మ
నే నమోమహాపేయనింద్యరూపాయ
దీవానవసవ్రతానుధీనాయ పేద

పురుషాయ, సాత్యకీపరమార్ధహంస్నా
వరతనుధారిణే వాసుదేవాయ
భోమాయ-రాజీవశోభినే! దివ్య
సామోదితాయ! యంచాఽఽవేశభరము
గిరికొనఁ బ్రజలెల్లతరుణంబులందు
పరిదిప్రణామంబునై యుండు మనసు
యారీతిసద్భక్తి తోరహత్తులుగ
దూరితాఘుఁడౌనర్చు దొడ్డతపమ్ము
సర్వమానవుల కాశ్చర్యదంబగుచుఁ
బర్వెఁ దత్కీర్తి సువర్వలోకమున—
వనఁబిల్వ లేదంచువణిగెఁ బోవన్నా,
వనఁగొల్వ లేదంచుఁదనికెఁగుబేరుఁ,
దనమాతు వంకపై నట్టి యీశానుఁ
దసమంజసమ్ము, నన్నర్థింపకుండ
నాపోవుటనియుండె నాపోనియనము
రూపుకట్టినవాఁడు తీపైనవింటి
తీపులతోఁబువ్వుఁ దూపులతోనె
యేపునఁదనముల నింకించువాఁడు—
వలరాజు దనకేమివచ్చునో, లేని
యలజడి' యనినవయౌవనాఽఽభోగ
మధురిమ సీమ లున్మదకటీభార
విధుతమౌనీంద్ర సంవిచ్చిత్తలింత్ర
ఘనసార్వభౌమతుష్టారములఁ గాంత
తనువలగ్నులు మత్కథాఽఽగమాఖ్యాన
మధురిమాఽఽశయలు సుధామందహాస
నిధులు చాతుర్య సన్నిధులైన వార
వధువతీచయముతో మంతనంబాఁడె—
నదనల వేదార్థ చర్చామదర్చి

భావాతీతానందు విధాతయును
భావించి-తనుఁగూర్చి భావించువేఁత
గాదని తలపోసెఁ, గాలకంఠుండు
గాదిలిసానితోఁ గలిసియోచించి
తనుఁగూర్చి ఎఱుపుగాద నిశ్చయించి
తనమేనఁ బులకసంతతులు దట్టాడఁ
దలవంచి మ్రొక్కి నిస్తులవనమాల
దులకించునెదతోడి శ్రీయజ్ఞునకు
దేవతలెల్లఁ బ్రత్యేకాభిమాన
భావరూపతులు విశ్వాత్మకత్వంబు
వారితరం బౌనె! వామనుం డెట్లు
బారసాచిన నభః పటమంటుకొనెనె!
జలము తలమ్ము, దిగ్వలయమ్ము మేఘ
నిలయమ్ము, మారుతమ్ములు, చంద్రసూర్య
లఖిల నక్షత్రమ్ము లఖిలలోకమ్ము
లఖిల భూతమ్ములే యాత్మ స్వరూపు
నకుశరీరమ్ము, లానందైకధాము
నకుఁ, గూలముద్రుణ నవ్య సౌరభ్య
ఘనతరకల్యాణ గుణపరీతునకు
వినమిత వేదాత్మ విహగాధినాథ
వితత శిరస్ఫృత విమల పాదునకు
నతికెక్క- నారాయణునకునుగాక___
జిలిబిలి నేర్పులు చిలికించిపేయుఁ
జిలువాయనప్పుఁ దపస్సులతోడఁ గరుణఁ
దొఱయునే! దక్కు నిర్జరులట్లు, లివ్వఁ
గొఱకొఱలిచ్చునే! వరము విష్ణుండు!
సకలజీవముల హృత్సరసీజములను
వికరంబుగా నిండినిల్చిన వెలుఁగు

దానాటఁ బుండరీకా పీఠమైన
మానిత ఎత్కృపేవమదిని దాకినది
పుండరీకుని భాగ్యపుండరీకమ్ము
ఖండసౌరభములు గమియ విచ్చినది—
వేంచేసెవిష్ణుండు—వేంచేసెహౌని
నంచయానందంబు సర్వగీర్వాణ
భావనాఽవిషయంబు పద్మాకటాక్ష
పావనాఽఽ౦ మశో భా వసంతమ్ము—
వేంచేసె వన కాది విబుధహృదబ్జ
చంచరీకము-భక్తచంద్రికామంద
హాస సాభోగమాయా పరిష్కార
భాసురంబాదృత భూసురంబైన
వెలుఁగు సాయుజ్య శీతలము-మాధుర్య
ములసీమ యమకంపదౌలఁకెడుతెంకి—
శశివిభూషణ జటాశాలాఽభిరామ
విస్పృమరపాటల్య విభవంబులకును
సమబలంబగు జొత్తులదరించి శైల
తనయాస్మితాఽఽపారతారళ్యములకు
నొరవడులై యొసవరులై వగోప
తరుణులవీఁగుచిత్తరపుఁ జమ్మలకుఁ
దొడవులై యందాలమడుగులై నట్టి
యడుగులతో వచ్చెనంబుజాక్షుండు—
కాంబవోద్యచ్ఛ్రీవిడంబికంరాగ్ర
లంబమానాంశుమాలా కీర్ణపైజ
యంతితో మాలియయట్టిట్టుదూఁగ—
దంతుర కారుణ్యతరళితాపాంగ
చకచక ద్రోచియత్సవములు, చదల
వికసింపఁజేయఁ గ్రొవ్విరుల దామములు—

లలిత పీతాంబరోజ్జ్వలచారుకాంతి
కళికలు దిక్కుడుంగములఁగ్రై సేయ
జలధిజా చరణలాక్షారేఖవోలి
గలికి వన్నెలతోడి కౌస్తుభంబమర—
జగజంపు గదితంపుజలతారుచేల
నిగనిగల్మిట్టింపనిండైన యొడఁద
తీరైనకస్తూరి గీఱునామమ్ము
జాజిబొమ్మలతోఁద సాళగింపంగ—
భ్రమరక వ్రాతంబు ఫాలంబుపైని
గుమిగూడి ప్రెక్కణంబులుహవణింప—
పులుగడిగిన ముత్తెములవోలెమేన
దులకించి స్వేదబిందువులు వట్రిల్ల—
నెమ్మెదొలంకెడు గెమ్మోవిపైనిఁ
గ్రమ్మిన చిఱునవ్వు గలకలలాఁడ
మకరకుండల విభాని కరంబుమలం
ప్రకటింప గండముల్ బలియుబిరెండ—
పుంజితశింజాన మంజిమాఽనూన
మంజీరములు సూర్యమకమకపేయ
బహిరబిహాః పూర్ణుఁ, దహాపవర్యంకుఁ
దహరహరుదితుఁ, ద హస్కరచంద్ర
నేత్రుండు భవలతాదాత్రుండు వినుతి
పాత్రుండు,ప్రజలోకభాగ్యభండార
మేతెంచెఁబుటపుట నై తుందపుటము
దొంతరల్గాముద్దు దుంపెనలాఁడ
వేదాత్ముఁడై పట్టి విహగాఽధివాధుఁ
డేదిదోవకయడుగెంటపేబాల—
పనియేమిగల్గెనో! స్వామిపేంచేశె
ననిసుదర్శనమూర్తి వెనువెంటనంట—

ధీరతో దారదుర్వారఘాంకార
చారురూపము పాంచజన్యంబునదువ—
వననివయ్యెదదూఁ గన వదునెన్నడుము
వినవినగాలక్ష్మిఎరువీ కులాఁడ—
సైన్యాఽఽధి నేత విష్వక్సేనమూర్తి
యన్యదుర్దముఁడు దోర్దై సందడింప—
కంకణహుంకారఘన పరిష్కార
సంకుల సంఖ్యావి శంకటవిక్ర
మాటో పమైనగదాగ్య్రిమేపాటు
వాటిల్లెనో! యందుదూటికొనంగ—
వగ్రణాగ్రజ్జ్వాలితోగ్రమై విక్ర
మాగ్రియంబగునందకాఖ్యంబుగొలువ—
కనకకంకణ సముత్కట ఝణత్కార
ఘనఘనాఘనరవాఽఽకర్ణ వోద్భ్రాంత
వినతద్వైత్యాంగనా వేతాళ మగుచుఁ
బనివిమతార్ధమ్ము బలఁగమైయంట—
వైకుంఠవాస సౌభాగ్య సుశ్రీకు
లాకులంపడ వైష్ణవాఽఽచారయుతులు—
పంచమంగళమైన భద్రగణమ్ము
వంచించుగమన సౌభాగ్యంబుతోడఁ
బరతెంచె వేదాంత పరమ సిద్ధాంత
మరుదైవ నారాయణాఽభిధామందు—
ఆనమయమ్మునసత్యంతభక్తి
భూషితుండై వద్దిపుండరీకుండు
దవకోటి గోమయమ్మున శుద్ధిచేసి
కొవసాఁగురభక్తి ప్రముగ్గులు దీర్చవట్టి
నెలవున శోడుపీటలుబేషిఁగసులఁ
తెలవారఁగానుమ్మక్షత్రంగేనాత్ర్విచి

తనులందుఁ, దమ నందు, మనమందు, వినయ
మనుగతికంబు గానల్లనమ్రొక్కి—
ఘనసార వాసనా కలిత పీరములఁ
బనుపదభావంబు పాదముల్గడిగి—
యాజలంబమరులకైన దుష్ప్రాప్య
మీజన్మమునఁ దక్కెనింకేటిముక్తి
యను భావమశ్రాంత మాక్రమింపంగఁ
గనుదోయి జలము లాకట్టగాఁ గ్రోలి,
యలరారఁగా శిరస్థలిఁదాల్చి కావి
దొలఁకు చందనము నిగ్గులు వారఁబూన్చి
యక్షీణ పాపసంధుక్షణా కార్య
దక్షంఘ్రులకు నక్షతలువేసి మ్రొక్కి—
మొలతేర రాగంబు మొనలావులించి
యెలదేటిగములెంగిలింపనిపూలు—
గరువలిసుడిసి డెప్పరముగాఁగవియఁ
బరిగొన్న పుప్పొడుల్వ్రాలివోనిపూలు—
తరణికూటమున మేయొరలి తళోష్ఠ
మొరపెడు మధుమదంబొలుకని పూవు
లావటించుచును సహస్రనామార్చ
నావ హాతుండునై యటు సొక్కుచుండి—
ఘలు ఘల్లు మనుపాదకటకనినాద
ములు రెండు చెవులలో బోరుకలంగఁ
దలమల్పిచూచినఁ దనయెట్ట యెదుట
జలజనాభుఁడు భక్తకులసమోధనము
మొలకట్టు గజ్జెలు జలధిజాస్మేర
కలగీతముల కమక్వణనముల్గాఁగఁ
గరకంకణమ్ములు ఘలుఘల్లుమనఁ
బొరలేని సాయుజ్యముక్తిఁ గీర్తింప,

శిఖిపింఛదళ పరిష్కృతములౌ కురులు
ముఖమండలమ్మున ముగ్గినలాఁడ
నరుదైన రతనాల సరులచే వెలుఁగు
జరుసె రుమాలు చూపఱసొగియింప,
నొప్పైనసగమీగహొయలు గూడంగ
గొప్పముత్తియముల కుచ్చులాడంగ,
మాంజిష్ఠ వర్ణంపు మగజాలచేత
రంజిల్లుగలికి తురాయి దూగంగ
గరువంపుఁగడినింపు గరువుపై, మురువు
ముజియింపులగుఁ గ్రొత్తమురువులు వెలఁగఁ
జిలుగడిగినముత్తెముల జగాజగలు
ఝళిపించు పదికించు చౌకట్లుమీఱఁ,
జాలకుఁ గెంపులతోడ జోడైనగంట
సరికంఠము నయందు సరిగాఁగనొప్పఁ,—
గట్టాణిముత్యాలు గట్టినందాలు
మిట్టించునఅచట్టి మేలిల్లుగాఁగ
బుగబుగమవితావు తెగమించి యింపు
పగటు వీరాజిదువ్వటి దుంకిల్ల
వలనొప్పు వజ్రాలపంకి, యుత్తరిగె
లలిమీఱుజాతిపచ్చల చిల్కతాళి
మెఱుఁగైన గెంపులమేల్పతకములు
గరమొప్పు నక్షత్రకంఠమాలికయుఁ
బంచరత్నమ్ముల బాహాలపురులు
పంచాణములమేలి వజ్రాంగుళీయ
కమ్ములు నొనరికడియముల్ తావి
జిమ్మెడిజీవరత్నమ్ముల చేవ
రమ్ములు బిరుదుపెండెమ్ము గ్రొత్తావి
ముమ్మరించెడు పట్టుకొందుకోషాళి

ధరియించి-నడుముపైఁ గరములనుంచి
కరుణాకటాక్ష మగ్గడలసారించి
ప్రత్యక్ష మైనవప్పరమపూరుషుని
నత్యాదరంబుననభివీక్షసేఁ
తల్లిదండ్రులసేవఁ దనియంగఁదీర్చి
యల్లననరుదెంతు నంతకాలమ్ము
చెలువార నీశిలాఫలకంబుపైని
నిలిచియుండు మటంచుఁబలికిన, బుండ
రీకునిధర్మాఽతిరేకత మెచ్చి
శ్రీకాంతుఁడాశిలపై కెక్కి-నిలువ—
నాదినారాయణా! యనుపమానంద
బోధైకరూప! నంపూత మాపేదు
నడుగు సోకినదానవడఁగె నాయఘము
లొడఁగూడె నారూపమో! నిర్వికల్ప!'
యనుప్రార్థనముతోడ నమరనాయకుఁడు
గమలింపముందు నిల్పినఁగటాక్షించి—
'ఓమ్మ! దేవేంద్ర! నీపుణ్యంబువంటె
నిమ్మగానాకమ్ము నేలికొమ్మింకఁ
బాతాళమునఁదపః వథముసేకొన్న
నీతచాపల్యుఁ దౌవృత్రాఽ సురేంద్రు
వజ్రాయుధమ్మున వ్రచ్చినదాన
వజ్రకల్పమ్ము శాపమ్ము ప్రాప్తించి
శిలగాఁగఁబడియుంటి విలపైనినేటి
కలఁదురుదీరె భక్తాఽగ్రగణ్యుండు
పుండరీకుని దవమ్ములతోన ముక్తి
మండపంబయ్యె నీడిండీరభూమి'
యనియా సతిచ్చిత్తస్పృహాఽతిసేత
వినమితుఁడై మ్రొక్కి విబుధులకెల్లఁ

గొండాడఁదగినట్టి పుండరీకునక
ఖండితంబగు భక్తిఁగ్గై మోడ్చియేఁగెఁ—
గులమౌళి పుండరీకుఁడు సత్పదైవ
ములకు సంతృప్తిగాఁబూజలొడిచ్చి
విశ్రమింపఁగఁజేసి వినయంబుదొలుక
నశ్రాంతయోగ విద్యానిషద్యలకు
దొలుకనివస్తువై, యబలేనిభక్తిఁ
గరగించువారికిగడి కొమ్మటంచు
గడనకెక్కిన యట్టి కమలాక్షుఁజేరి
యడుగులంటినవాని సత్యనురాగ
భాసురంబుగఁజూచి వడిలేవనెత్తి
హాసపేశలము గావనియెవిష్ణుండు
యిలమీదఁ దొలివెల్గు మొలచినదాది
కలగొన్నయింతటి కాలంబుపఱకుఁ
బిత్పదైవతమ్ములకతిభక్తినిట్లు
సతతసేవలతోడ, సంతృప్తసలిపి
నట్టివారలులేరు దిట్టమౌ తపము
వట్టినసీయోర్మిఁబండెను నేటి
కటమట లేవికుక్కుటబోధ దివ్య
పటహమై దెసలెల్లఁ బ్రాఁకెనీయశము,
మేలువచ్చెనునుమ్ము మేలిల్లువైతి
కాలమ్ములో, బ్రహ్మకల్పమ్ము లెన్ని
గడచినఁగడివోని గడపనార్జించి—
పుడమిపైఁగల సర్వభూతమ్ములందు
నఖురూపమునమన్న యాత్మనేనగుట
గుణివాచు పివేలుగుఱుపుఁ గొలచు
కొలుపు నాకెత్తిన గొలువు గానయ్యెఁ
దలఁపూన్చి పలుకుచు చలయునవేది

వరమున్నదో! భక్తవరులకప్రాప్య
మిరవొందఁ గాన, మీరేఁడు లోకముల
ననియన్న విష్ణునియభిభాషణంబు
విని పుండరీకుండు వీనులయందు
నమృతంబు వట్టోడి, హస్తముల్మోగిచి
కమనీయరూప! నాకన్నులయందు
సతతంబువర్తించు బ్రహ్మస్వరూప
మతిమాత్రమాత్మఁ జిదాకారమగుచు,
భాసించు నట్టులే ప్రకృతియైసాత్వ
కీవతి, బురుషుఁడై గీర్తింపఁదగిన
బ్రహ్మంబు సగుణపక్షమునఁదోఁపంత్రు
నిహ్నవింపఁగనేల నిగమస్వరూప!
యామూర్తి నాకంటనాడినయపుడుఁ
గామధేనువుపాలు గార్చినయట్లు—
అనామమీమదినంటిన యపుడు
సోనలై యమృతంబు చూఱగొన్నట్లు—
నాతండ్రిసేవకై ప్రీతిగొన్నప్పు
డీతమపుషయం, దహీన సాయుజ్య
మోక్ష సుఖమ్ములఁ మూఁగినయట్లుఁ—
చక్షుశ్శ్రివాఽధిపశయన! నాకింకఁ
గోరనేమున్నది! గోరకొమ్మన్న
నేరకుండుటయున్న నిన్నెన్నకుండు
టగునో! యప్పట్టుననుకంప దొలుక
యగవడినిల్పినహంగుతో వతము
నిలిచి సద్భక్తులఁ గొలుపులు మెచ్చి
కలకాలముమఁగామ్యములఁ జిల్కావలయు
పుండరీకుని భక్తిపుష్పించినట్టి
డిండీర వనమింకఁ బౌండరీకాఖ్య

పేకొనవలె, నన్నుఁ జేకొని బ్రోచి
వాకులకందనివాఁడ! రక్షించి
వందుకుఁ, బుండరీకారనుండమచుఁ
గ్రందున నీకు సార్థకమైనపేరు
పాండురంగఁడటంచుఁ బ్రథయొక్కటబ్బుఁ
బండరిపురి లోన జాల్లుదాన,
నొకతీర్థమిచ్చోట నొడికంబుగాఁగఁ
బ్రకటింప వలయుసర్వాఽఘనిబర్హ
ణమ్ముగా నిది నాకు నెమ్మదిఁదోఁచుఁ
గమ్మనికోరికల్ గమలాక్ష! యన్న
వినిసంతసంచి యావెన్నుండు నట్ల
యనిజహృన్నసాత్యకులనుఁ గటాక్షించి
పుండరీకుని పత్నిఁ బోలఁగాఁజూఁచి
యందకుఁబిల్చి యాయమ మనంబలరఁ
బలికి యాశీర్వాదములనొంచి చెంత
నిలుచున్నలక్ష్మితో నెలమినంకించి
తమితోఁ గృష్ణావతారమ్మునందుఁ
గ్రమముగాఁ దాల్చినకళలనుబూని
కమలోదరుఁడు దక్కుకళలబ్జగించి
యమలాత్మకుఁడు దైవమానాటినుండి
పాండురంగండన్న ప్రథఁబూని సొగసు
గండరించిన రూపుగానిల్చెవాఁడు
కటితటీ విన్యస్తకరుఁడౌఁచుగరుణ
బుటమెగయఁగనున్న బురుషోత్తమునకు
ననుగుణంబుగ లక్ష్మి, యాదివైదర్భి
యమకంపదొలఁక రుక్మిణిగాఁగనిలిచె
శ్రీకాంతకృత పుండరీక తీర్థమున
లోకమ్ములో నఘాఽనీకవిస్తార

చెణములై వెలసిన సకలతీర్థములు
గనుకని బఱతెంచికలిసె నప్పాట—
పాండురంగఁడు భక్తఫలకల్పకంబు
పాండురంగండు రూపంబుపేకొన్న
వరతత్త్వమీ వాదుభావనయందు
గిఱికొన్నమూర్తి యోగిరి రాజపుత్రి!
ద్వైపెనేగద! భక్తకులమనోధనము
ఫలితాఽవతారుండు పాండురంగండు
వెలసిన విధము దజ్జలజాఽక్షుచేత
వెలయింపఁబడినట్టి విమలతీర్థమ్ము
జనితాఽఘములబాపి నమరెడుచొప్పు,
యనియిట్లు శంకరుండానందపులక
పరిమిళిత తనుండు భాషించినట్టి
పరుసన సూతుండు పరమవిజ్ఞాన
యుతులై నమునులకు నొడికంబుగాఁగ
మతపడఁ జెప్పిన, వితతసంతోష
వికసిత నేత్రులై యకలంకమూర్తు
లకుటిల భావార్ద్రిమగురీతి నంద
నందనునకుఁ జిదానందరూపునకు
బృందావనాఽఽధీరబృందాఽవనునకుఁ
దలవంచి మ్రొక్కి యమ్మలసూతుఁజూచి
పలికిరీ విధమునవలఁతు తామునులు
  మాయందఁగరుణించి మానాథుఁజరిత
దీయని పలుకులఁ దెలిపితివీవు
మామనంబులలరె మఱియొక్కకోర్కె
దీమహాత్మా! సూత! దీర్పుమయ్యదియు
చంద్రరేఖామనోజ్ఞంబుగాఁబారుఁ
జంద్రభాగానది సతతంబుఁబండ

రీపురమందు, వయ్యాపగయెట్లు
ప్రాపించెనచట నిరూపింపు" మనగ
మునులయా నతిఁదలఁబూని సూతుండు
వినయసుందరముగా వినిపించెనిట్లు—
  త్రిపురంబులందున దీపించితొల్లి
యపకర్తలగు రాక్షసాఖండలుల్ మ
దించి నాకంబుమర్దించి వేలుపులఁ
బంచారముగ విభాళించి గుబ్బేతల
గవ్విగుబ్బలఁగ్రుమ్మి, ఘనముగాఁగ్రమ్మి
ఎమ్మితులెగఁజిమ్మి చెలువుదొలంకు
కట్టడంబులు గూల్చి యట్టడుల్ దుల్చి
కట్టుగ్రముగరేఁగి కాఱియల్గూర్పఁ
ద్రిదశులందఱుఁగడు దీనులై యెపుడు
మదనాంతకునిఁద్రోవు మంచుఁబ్రార్థింప
నలికాక్షుఁడెవరేగి, యాదైత్యవీర
కులములఁగూల్పంగఁ దలఁపునఁదలఁచి
ధరణీశ లంబెల్ల నరదంబుగాఁగ
నరుణచంద్రములు చక్రాకృతుల్గాఁగఁ
దొలిపల్కు లనికిఁ గోత్రలపేయదూటి
జళికించు ఘోట్టాణములుగాఁగ విమల
ప్రణవంబుగనగోల బ్రహ్మసూతుండు
ననుచతుస్స్వరములు జానువగ్గంబు
లగపతివిల్లు పన్నగపతిగుణము
జగదేకగతియైన శౌరిబాణమ్ము
గా నడచి కఠోరకహకహారావ
దూనదైత్యాంగనా మాన సుండగుచుఁ
గల్పాంత కాలవిక్రమమూర్తి పోరు
సల్పి యాదైత్యులఁజదిపి పురమ్ము

లఱగాల్చి యమరులయాదవదల్ మాల్చి
హరుఁడుద్రిలోక శంకరుఁడౌచు వెలసెఁ—
డెంపరియైనిల్చిత్రిపురదానవులఁ
జంపినదాన దోషము సంక్రమించి—
దానిఁబాపికొనంగఁ దపముమబట్టి
మానితంబుగను భీమాశంకరి యను
తలమున నిల్చిన, నెలఁదాల్పుమేన
వెలలిన చెమట నిర్ఝరమైపొంగి
యావగయై భీకరాఽఽరావమెసఁగ
నాపన్నఖగమృగమై యావులించి
పుండరీకుని గృహమ్మును గ్రమింగరాఁగఁ
బాండురంగనియానఁబట్టి, తత్క్షేత్ర
పాలకుండై యున్న భయదహుంకార
శీలుండు మొగి భీమసేన భైరవుఁడు
గనుబొమ్మలార్చి యుత్కటముగానార్చి
వణఁకదిక్కరు, లేచి బాహుప్పళించి
గదఁబూన్చినంతన గడగడ నడుకి
బెదరియానదిరసావేశంబు వదలి
మొరయుటమాని-సుందరచంద్రరేఖ
పరుసున నిత్యయౌవనమూర్తియైన
నందనందనునింటిముందట భక్తి
కందళితానంద కలికలధ్వమలఁ
బాఱుచున్నది, పాపపంకనిష్కాన
నారూఢయైనరెండవ గంగవోలి,
దానిచెంగటనున్నభామ తీర్థమ్ము
దానమాడిన నఘదాన భణమ్ము
హరిఁజూచి శాపంబుదొలఁగినయట్టి "
హరిహయుఁడచ్చోటఁ బురము నిర్మింపు

మనిపంప, మయూఁడు దదాజ్ఞ భావించి
కనులకుఁ జెలువలు గ్రమ్మించుశిల్ప
మెసలార నిర్మించె నించుమించులను
బసరింపఁగాజేయువండరీపురము
ననియిట్లు సూతుఁడభ్యర్హితులైన
మునులకు వినిచినవిశోఁకచొప్పార
వైష్ణవభక్త నిర్వ్యాజసంస్తవన
నిష్ణాతుచేత సన్నిహితశబ్దార్థ
భావనామయుచేతఁ బరిడరీనాథ
జీవనౌషధుచేత జిరకాలజప్త
భాసురాష్టాక్షరీ పరమంత్రవర్ణ
భాసిత జ్ఞానవిభాతృప్తుచేత—
శ్రీపతిప్రతిరూప శ్రీనివాసార్య
పావనశ్రీకొండమాంబాత్మపాద
వందనామోద సంభవుచేత భక్తి
తుందిలుచేత నిర్ధూతాంధకార
పండరినాథది వ్యాంఘ్రమునిపేరఁ
బందువుగాఁ గళావరిణాహమునకు—
శారదాకింకిణీఝణఝణత్కార
పూరపూరిత శబ్దవారంబులెసఁగఁ
బలికిన పండరీభాగవతమునఁ
గులమౌళిపుండరీకుని చరితమ్ము
చెలువారుగాఁత భక్తులకుబందరువు
కలిమలాపహంమానకలి శోపమమ్ము

(పుండరీక చరితము సమాప్తము)

# పండరీభాగవతము
## (చోకామేళుని కథ)

ఆతని పంచముండందురే గాని
పాతిత్యరహితుండు బ్రాహ్మణుండతఁడు—
ఆతఁడజ్ఞానియందురే గాని
యాతతబ్రహ్మవిద్యావేత్త యతఁడు—
ఆతఁడనాచారియందురే గాని
పీతకాంతుఁడు యోగవిత్తముండతఁడు—
ఆతఁడు మలినుఁడంచందురే గాని
పూత మానసుఁడైన పుణ్యుండతండు—
అతఁడు దరిద్రుఁడంచందు రేగాని
యతనుకైవల్య రాజ్యాఽధీశుఁడతఁడు—
అతఁడు సామాన్యుఁడంచందురే గాని
యతిశయగుణుఁడు భక్తాఽగ్రేసరుండు—
వెలివాడ కడవీధి నిలచిన గాని
యిల సకలంబును వెలిఁగించునతఁడు—
సంసార బంధసంసక్తుఁడే గాని
కంసారి పదయుగాఽఽకల్పుండతండు—
పాండురంగని ప్రాణపదమైనవాఁడు
పాండురంగనిసేవ ప్రాణమౌవాఁడు—
భక్తాగ్రగణ్యుండు భక్తిజీవనుఁడు—
భక్తిప్రకాశుండు, భక్తైకతనుఁడు—
పరిహాసమునకైన బలుకఁడునృషలు
పరకాంతలన్న తెప్పలనెత్తి కనఁడు—
పరుషభాషణములు పలుకఁడెన్నండు
పరుషవర్తనుల సంపర్కసేయండు—

ఉపకారపరుఁడు ప్రత్యుపకృతిఁగోరఁ
దపచారములు సేయఁ డార్యులయెడల—
శాంతి భూషణుఁడు విసర్జితేషణుఁడు
దాంతిసంయుక్తుఁడేకాంత రక్తుండు
కరుణైకరక్షుండు పరతత్త్వవిదుఁడు
పరమభాగవతుండు పరమవైష్ణవుఁడు
పావిత్ర్యపరివేష భాసురముఖుఁడు
దేవవిప్రార్చనాధీనమానసుఁడు
దండికాక్షోద్వృత్తి, దర్ప వర్జితుఁడు
పండరిపురమున వసియించువాఁడు
మెచ్చనర్హుఁడు. చౌకామీళ నాముండు—
మచ్చలేనట్టి సన్మాన్య చరిత్ర—
యర్ణవగంభీర యార్ద్రివాక్పూర
వర్ణనీయ విచార వానియిల్లాలు—
పలుకదెవ్వరితోఁడఁ బలికెనయేని
కలుషసంహార భక్తగాథలపలుకు—
చూడదెవ్వరివైపు చూచెనయేని
చూడాశిఖండుడ ష్ణుదుకూలఁజూచు—
తలపదెయ్యదిగూడ తలచెనయేని
తలచుసురాధికాధవుని వైభవము—
నవ్వదెన్నఁడు గూడ నవ్వెనయేని
నవ్వు సంకీర్తనానందై కవళత—
మనసునందంతట మాధవు భక్తి
కనుదమ్ములంతట గాంభీర్య భరము—
చేఁతలన్నిట రంగసేవాఽభిరతియుఁ
బ్రాఁతిగవెలుఁగ నప్పద్మాయతాక్షి—
దారిద్ర్య మొకయలంకారమైయడుక
య్యారిమి రూపెత్తియున్నదో యనఁగ

నిలువడిదీర్చు నిజేశునిదేర్చు
కలహాసములనె ఎల్లలబొజ్జనింపు
వారికెన్నఁడు మనోభారమేలేదు
వారికెన్నఁడు వేడియూరుపే లేదు—
కలదు లేదనుచింతకలనైన లేదు
కలుగని దాని, కాకాంక్షయే లేదు
సుకములమ త్తెక్కి నొక్కుట లేదు—
వికటాపదలఁగ్రుంగి వ్రేగుట లేదు—
మఱువఁ గూడని భక్తిమఱచుట లేదు—
మఱువంగఁదగువాని దఱచుట లేదు —
పాండురంగఁడువారి పరమదైవమ్ము
పాండురంగఁడువారి భాగ్యైకఫలము—
వారిసంపారమ్ము పండరినాథ
కారుణ్యపూర్ణ కేదారతలమ్ము—
వారితలంపులు పండరినాథ
చారుకాంచనమయా స్థానసౌధములు—
వారిచిత్తమ్ములు పాండురంగఁడు వి
హారమ్ముసేయునుద్యాన వాటికలు—
వారిజీవితములు వరుఁడనుసూత్ర
కారుఁడాడించు గంభీరఘట్టములు -
భక్తియేజనకుండు భక్తియేజనని
భక్తియేచెలికాఁడు భక్తిసద్గురుఁడు—
భక్తియేదైవమ్ము భక్తియేరక్తి
భక్తియే ప్రాణమ్ము ప్రాణబాంధవుఁడు
భక్తిఁవీడిన వారిబ్రదుకులేలేవు—
భక్తి గాకున్న బ్రపంచమేలేదు—
వారిదాంతత్యచాపల్యమ్ము భక్తి
వారిలక్ష్యమెభక్తి భక్తియేసిద్ధి—

పాండురంగని కన్నపరుఁడంచులేఁడు
పండరిపురికన్న వాసమే లేదు—
తావి పూవియుఁబోలె తాళమ్ముగాన
మై విశ్వనాథసేవాఽభిరక్తియును
గై వల్యమట్లు నిష్కలుషమ్ము వినయ
భావమ్ము గీర్తియువలె తత్త్వచింత
వైరాగ్యమునుబోలె పరిణతంబగుచు
ధీరమౌయనురాగ పూరంబు బొదలఁ
జరియించుచుందురు శాంత్యైకపరులు
పరమభక్త్యావేశ భరితమానసులు—
విషమాక్ష వనజాక్ష భేదవాదంపుఁ
గసటు సోఁకనియట్టి ఘనభక్తివోలె—
వారిదాంపత్యమ్ముదూరితాఘమ్ము
సారవన్నిశ్రేయసైకఫలమ్ము—
పులకలు మల్లికా కలికలువోలె
నిలువెల్లఁదలలెత్తి నెట్టికొనంగ—
వర్షస్నపితము శాద్వలభూమివోలె
హర్షాశ్రువులను దేహముఁదొప్పదోఁగ—
స్వేదబిందువులు, విచ్చిన తుమ్మిపూల
మూదలించుచు, ఫాలమున బారుగట్ట
నెలుఁగురాపడఁగఁ గన్నులుమూతపడఁగ
లలితహాసంబు జెక్కులనీడఁజూడ
మేనుమఱచి చొక్కామేళ భక్తుండు
దానుగానముగాఁగఁదన్మయంబంది—
కండోలవీణపై గరములు జార్చి
పాండురంగనిగూర్చి పాడెడువేళ—
అతనిభార్య భక్త్యావేశవశతఁ
జేతంబు జల్లనఁ, జిగురింపఁదనువు

కుచ్చెళ్ళుభువిఁగుప్ప గూరయై పడగ
వచ్చెరువుగఁగాలియందెలు మ్రోయ—
పారవశ్యంబున బై టదొలంగి
తోరంపుఁగుచములుగ్రుళ్కింతలాఁడ
నడుగులుబుడిబుడి తడఁబడుచుండ
మెడను గమ్మనిసోగమెలికెలుదీర
నుదులయందున వింతనొక్కులుగూర
నడుగడుగందు నెన్నడుమువడంక—
కొప్పులో దురిమిన కుసుమవ్రజంబు
గుప్పెళ్లలిడఁగఁ, జెక్కులు పూతబాయ
తలకొనిచూర్ణకుంతలములు ఫాల
తలమున గమిచి నృత్యమ్ముసేయంగ—
నంకురిత స్వేదపంకిలంబైన
కుంకుమరేఖ చెక్కుల జాలువాఱ
సుకుమార యగు నదీసుందరి వోలె
ప్రకృతిమనోజ్ఞ దివ్యపురంధ్రివోలె
నాడును మధురభావావేశవశతఁ
బాడును పాటలోఁ బాటను గలిపి
పాండురంగనిపాదభజనంబు విడచి
యొండుకార్యము వారి కున్నదిలేదు
వారి సంసారనిర్వాహంబు భక్త
భారవాహకుఁడైన పాండురంగనిది
ఈరీతి నవసుధాధ రాఽనుకారి
వారిజాక్షుని భక్తిపారతంత్ర్యమున
దివము లానందసందీప్తముల్ గడియ
లను బోలెఁ జిటికెలోఁ, గనుమాయునంత
గతియించుచుండె నేకాంత భక్తులకు
మతి లగియించునే! మాయాఽనురక్తి!

లలిత వీణారాగవలితమౌ నెడఁద
బలిపుష్టరావంబు భావించునేమి!
రసపూర్ణకిసలయగ్రాసా కోకిలము
విసపుటాకులు గొన్ని మెసవునా యేమి!
తరుణ కల్హారగంధాఽఽకర్షితాఽళి
బురదగుంటలయందుఁ బొరలాడునేమి!
చాతుర్యవతిపొందు చవిచూచి నతఁడు
మూతి విప్పని ముగ్ధఁ బొందునా యేమి!
లలితేందుఖండకలాపని ధ్యాన
కలితుండు చిటివేల్పు కొలము గొల్చెడునొ!
పంచాక్షరీమంత్రపరనవరుండు
వంచితుండగునొ శాబరమంత్రములకు!
గరుడవాహనభక్తిగాథాపరుండు
పరికించునేమి నశ్వరచరిత్రములు
ఆర్తరక్షకకీర్తి కీర్తనారతుఁడు
ధూర్తమానవుల సంస్తుతు లొనర్చెడునొ!
శౌరి సద్గుణగణశ్రవణతత్పరుఁడు
సారహీనులకొరఁ జర్చించునేమి!
మఱవఁ డెన్నఁడు భక్తవరుఁడు గోవిందు
మఱువండు భక్తులఁ బరమకారుణ్యుఁ
డా చొకామేళున కండగా నిలిచి-
కాచికొన్నాఁడు లోకైకప్రభుండు
తన భక్తు చిత్త ముత్తలపడెనేని
తన దొరతనము రిత్తకు రిత్త గాదె!
యిటులుండ నొక్కనాఁ డేకాంతమందుఁ
గటికట విన్యస్తకరుఁడైన వాని
రంగని దనచిత్తరంగంబునందు
ఎంగారముగఁ బ్రతిష్ఠించికొన్నపుడు

మెఱుగారు తొలకరి మెఱపును బోలి
పరువెత్తె వొక్క భావమ్ము జిత్తమునఁ
దినదినంబునుగూడ దేవాలయంబు
గనులు జల్లఁగఁ గాంచఁగంటినే గాని
గుఱుతైన బంగారు గోపురంబునకుఁ
గరపుటంబులు మోడ్వఁగంటినే గాని
యిష్టదైవమ్ము దర్శించు ధన్యులకు
సాష్టాంగపడు నదృష్టము గంటిగాని
పరమభాగవతుల చరణరజంబు
గర మర్థి ధరియింపఁ గంటినే గాని
తారకమనువు సంసారబంధన ని
వారంబు, భజియింపఁగంటినే గాని
తారకనామ గంభీరకాసార
వారితరంగవిహారి హంసమ్ము
తారకమంత్ర దివ్యాంగనాహృదయ
పారమ్య నవనవప్రణయవర్ధనుఁడు
తారకమంత్ర నిత్యానందదాయి
శారదీశమనసీహారకరుండు
తారకమంత్రదుగ్ధార్ణవశాయి
తారకమంత్ర ముక్తాహారహారి
తారకాభ్యక్షరోంకారపంజరుఁడు
తారకమనువనీతరుణమాధవుఁడు
తారకైందవకలాఽఽదరశివశాతి
తారక దివ్య భాగీరథీజలధి
తారక పుష్పగంధమ్ము పవిత్ర
తారకమృదుహాసతారకితుండు
తొలివల్కు మొదవుల పలుకంచువాఁడు
చిలిపి నవ్వుల సుగంధిలమైనవాఁడు

పాలబుగ్గలఁ గళల్పండినవాఁడు
ఫాలాక్షునకు వేఱుపడరానివాఁడు
వల్లవీమాన్యై కవళ్యతోహరుఁడు
కల్లరి, చిక్కిచిక్కని మాయలాఁడు.
అర్చావతారుఁడై యమరినవాఁడు
చర్చింప దేవతాసార్వభౌముండు
వాని మూర్తిని జూచు భాగ్యంబు నాకు
వీనాటికిని గల్గ దేనాఁడు గలదొ!
గోపురద్వారంబు దాపున జేరఁ
గోపగించెద రర్చకులు పొమ్మటంచు
నాపూర్వజన్మ పుణ్యములెప్డు బండి
గోపాలదేవుండు గొలిఎంచికొననొ!
కన్నులు జల్లఁగాఁ గనుగొను నియతి
యున్నదో! లేదొ! నాకొక్కసారైన
యెన్నాళ్ళ లిటు బరీక్షించునో గాని
కన్నులు కాయలు గాచె నిప్పటికె
కారుణ్యమెన్నఁడు గలుగునో గాని
తీరని విరహంబు భారమై తోచె
నేమిసేయుదు నింక యెట్లు వేగింతుఁ
గామితంబొదఁ గూర్పఁగలుగువారెవరు!
పాలపొంగులువోలెఁ బైనెత్తివచ్చు
నేలీల నీయాసలింకింపఁగలను!
పాయక సద్భక్తవరుల రక్షించు
తోయజాక్షుఁడె నాకు దూరమైనాఁడు
హరి హరీ! యెంతటి యపచారమయ్యెఁ
దరుణార్కనేత్రు నిందయొనర్పవగునె!
తోయజాక్షుండేమి సేయునా విధికి!
చేయంగ లేదేమి చిత్తమే యున్న—

చేయునో! సేయఁడో! సేతుఁ బరీక్ష
సాయునో! డాయునో! భక్తవత్సలుఁడు—
వందునో! యెందునో! నిందుభాగ్యములు!
పాండురంగుఁడు గృపాపరుఁడౌనొ! కాదొ!
కనుగొనవలె నేఁడు కచ్చితంబుగను—
నను భావములు హృదయంబున దోఁచి—
శిరమెత్తినట్టుల చెంగున లేచి—
యవయవంబులు తూల-నడుగులు బోల
గనుగవ బ్రాల్మాల-గన్నీరు జాల
దొనకంగ నెలుఁగును వణకంగ దనుకు
దనుకంగ మోదమ్ము బెణకంగ నెదదఁ
బెనఁగొన్న వలఁపులు బిరుపీకొనర్ప—
ఎగమండి పీడి విచ్చిన కల్వపూలు
మొగముపై వెంద్రుకల్ మొనపయాడంగ—
దీనదీనములైన దృక్కులు మునర
దానమాడినయట్లు ధారలుగాఁగ
స్వేదంబు గురియంగఁ జేతులనెత్తి
యాదిపూరుషుని నాహ్వానమ్ము సేయు
వడువున-భావంబు బొడవైనయట్లు
నడచుచుఁ దనవెంటఁ గదువడివచ్చు
జవరాలితోనైన చర్చింపలేక
యవశుఁడై రంగదేవాఽఽయతనంపు
చరమ మహాద్వార సవిధమ్ము జేరి
వరధూళి ఫాలంబుపై ఘటియించి
తోరంపు భక్తి చేతోవీధి వెలుఁగ
ద్వారపాలకులకు దండంబువెట్టి—
భవరోగహరునకుఁ బాండురంగనికి
భవభావితుండైన పాండురంగనికి—

భక్తి జీవనుఁడైన పాండురంగనికి
భక్తవశ్యుండైన పాండురంగనికి—
శ్రుతి వధూసీమంత శోభాయితునకు-
శ్రుతి పథాంచిత చరిత్రోదారునకును—
ధరఁజాగి మ్రొక్కి సాదర భక్తి యుక్తి
కరములఁ గన్నీటి కరడులుబట్టి
నిలఁబడి రుద్ధమై యెలుఁగు వణంక
పలుకులు వస మతి వలవలగాఁగ
పెదవులు చలియింప పదముడువణక
వదనంబువాడ సమ్మదముతూగాడ
నెదనాన్చికొనియున్న యిల్లాలికండ్ల
నుదయించి స్రవియించు నుష్ణబాష్పములు
దలపైని బడి తారకలఁ బురుడింప—
నిలకు వాల్చిన హృదయేశ్వరిమోవు
దనపదంబుల దోయిఁబెనఁగ నిశ్చలత
బొమవడినట్టి చూపులపూలు సల్లి
తనదైవమైన రంగని కర్పణముగ—
మనసులోపలి నెగుల్మాన్పంగలేక
పలుకఁగలేక పల్కాక యుండలేక
పలవించె నీగతిఁ బరమ వైష్ణవుఁడు
యేమిరా రంగయ్య! యేమిరాజియ్య!
యేమిరా! నాభాగ్య భూమిగోవింద!
లోకంబు చీఁకటిఁబో కార్చు నీవు
చీకటి కోవలోఁ జేరినావేమి?
సకలంబు నీవుగాఁ జరియించు విభుఁడ
శోకమూర్తిలో నిల్చియున్నాడవేమి?
కొలచు భక్తుల మనంబులు రెచ్చగొట్టి
కులుకు తావుల గర్భగుడిలోనఁజేరి

దాఁగినావేమిరా! దయలేనివాఁడ!
యోగిపుంగవ మానసోర్ములలేవా!
కమలామనోజ్ఞ వక్షస్స్థలి లేదో!
తమకింపనునటావ తలిమంబులేదా
విహగ నాయకపక్ష వీధీవిహార!
గుహవంటియొక చిన్ని గుడియేమి నీకు!
మడుగు గోపురముల మధ్యలోఁజేరి
మడిగట్టికొన్నావా! మాతండ్రి! నీవు!
ఉడుకు వేదన తూగిపదు భక్తికన్న
మడుగెక్కువేమిరా! మాధవా! నీకు!
అతి పవిత్రము హృదయార్పణ కన్న
వితమైన ఎలుపీచ విద్దెలే ప్రియమొ!
యొదజీల్చికొనివచ్చు నేడ్పులకన్న
పదరెడు కైతవ వాక్యంబులితవా!
మానస్తుతులు నీకు మనసునకెక్క
వో! సర్వ భూతదయోద్రిక్త హృదయ!
నా భక్తిలోనె యున్నదో లోపమొకటి!
నా భాగ్యమందెయున్నదో లోపమొకటి!
కోపమ్ము లేదు నాకు మునీంద్రవంద్య!
లోపమేమిటికి నిరూపింపవోయి!
యేభక్తిఁ జూపెనోయీ! కుబ్జ తొల్లి!
యేభక్తి జూపెనోయీ యుద్ధవుండు!
నేభక్తి జూపెనోయీ! గజేంద్రంబు!
ప్రేతల మనసులు వెలిఁగించినావె!
నాతండ్రి యేలరా! నన్ను గన్గావవు!
యెన్ని రీతులుగాఁగ నిన్ను నొప్పించి
యున్నానొ! దయజూపవోయి! రంగయ్య!
నీవు గోపము వేయ నిల్చునా! లోక

జీవ కోటులు దయాసింధు! రంగయ్యా!
మావంతు దోషసమాచరణంబు
నీవంతు సైరణ నిజము రంగయ్యా!
తప్పులన్నిటిఁగూడ దయనక్షమించి
యొప్పులుగాఁ జూడవోయి రంగయ్యా!
శరణాగతులనేలు దొరనీవుగాక
మఱి యెవ్వరున్నారు మహిని రంగయ్యా!
శరణాగతత్రాణ బిరుదంబుగట్టి
పరికింపవేమి నీభక్తు రంగయ్యా!
కనుపింపరా! కండ్లకఱవులుదీరఁ
గనుగొందు నిందిరాకాంత! రంగయ్యా!
కనుపింపకున్న నీక్షణమందెటోయి
పనిబూని నీభక్త పక్షపాతంబు
మెఱమెచ్చులంచును మేదినియెల్లఁ
దిరిగి చాటింతు నుద్ధరత రంగయ్యా!
కనుపింపరా! భక్త కల్పవృక్షంబ!
కనుపింపవోయి! లోకైక ప్రభుండ!
కనుపింపరావోయి! కజ్జల నీల!
కనుపింపవోయి! శ్రీకామినీ కమన!
వినబడలేదా! నా వేదనాధ్వనులు!
వెనుకాడు చున్నావా? విచ్చేయుటకును!
గరుడదేవుఁడులోన గాచికొన్నాఁడా!
గరుడసాహ్యములేక కదలవో! స్వామి!
కరిమొఱవిన్నప్డు గరుడుడేమాయె!
త్వరపడి నీ యాయుధమ్ములు మఱచి
పరుగెత్తినావు కావుర! పాండురంగ!
యరమరలేల పేతుర! నాకుఁగాఁగ!
అలఁత గూరివడా! నీయంగ కంబులకు

సలకాలమూర్తి! కినలఁత మెక్కడిది!
మఖమూర్తి నిద్రనే మఱితివోయేమొ!
నిఖిలసాక్షికి నీకు నిద్రయెక్కడిది!
శరణాఽఽగతుల మమ్ము మఱచితివేమొ!
పరమ చిన్మూర్తికి మఱపులెక్కడివి!
మాన సమస్యచింతానిమ్నమేమొ!
యానందమూర్తి దుఃఖాంశసంగతుఁడె!
కనుపడనేవలెఁ గన్నులముందఁ
గనుపడకున్ననే గదలనోస్వామి!
రార! దీనాఽవనాఽఽచార మందార!
రార! శ్రుత్యంగనారసకర్ణపూర!
రార! దుర్వారసంసార నిస్తార!
రార! నిష్పారకూపార గంభీర!
రార! ధారా ధర రమణీయదేహ!
రార! నాయూర్పు! రారా! పాండురంగ!
పసిడి గజ్జెలు కలక్వణనంబులీన
రసమయంబగు వంశిరాగముల్పాడ
నెమలికన్నులగుత్తి నెత్తి పైగులుక
కమనీయ దృక్కులఁ గొటుకలొలుక
పదములు బద్మసంపదలు జూరాడ
బెదవిపై జిఱునవ్వు వెన్నెలేగాయ
కలవోలె కలలోని కఱిమబ్బువోలె
నెలవోలె నెలలోని తెలినవ్వువోలె
నిలువరా! నా ముందు నీరేజనేత్ర!
కలకలనవ్వరా! కఱి గొల్లవాఁడ!
వత్తువో రావా! యావన్నులయెడలఁ
జిత్తమున్నదొ! లేదొ! జెప్పరా! స్వామి!
పలుకరా! నా తండ్రి! పండరినాథ!

పలుకరా! నాభాగ్యఫలము! గోవింద!
పలుకరా! నాకంటిపాప! నావెలుఁగ!
పలుకరా! నాపాలి పారిజాతంబ!
తలకొనినవసుధాధార చిందెడునొ!
మదిలోని బిగువెల్ల మాయమయ్యెడునొ!
యెదలోని కడితెరలింకిపోయెడునొ!
దాచియుంచిన బిచ్చుతఱిగి పోయెడునొ!
పూచిన చిఱునవ్వు పొల్లవోయెడునొ!
యేమి నా ప్రాణంబ! యేర! కన్నయ్య!
కామితార్థములిచ్చు ఘనుఁడీవుగావా!
పలుకనే వలెనీవు బలుకకయున్న
పలికించు వఱకు నా పంతంబుసుమ్ము!
పాండురంగని నమ్ము భక్తునికోర్కె-
బండనేవలయు నెప్పటికైన సత్య
మనుచు నీగతి వివిధాఽద్భుతరీతు
లను మేనుమఱచుచుఁబనవెడువాని
నెఱిఁజూచి విస్మయభరితమానసులు
పురివారలెల్ల గుంపులు గాఁగఁగట్టి
యవునవు నద్భుతంబని యెడువార
లవనిలో నిట్టిదు లఱుదనువారు-
ఘోర! మహాత్యాగమనియెడువారు
దూరంబు నుండియే దొఁగెడువారు
పాండురంగని నమ్మి బ్రదికినవార
లుండిరే! యని నెచ్చనూర్చెడువారు
పాండురంగఁడు భక్తపరుఁడేనివచ్చి
యుండఁడేమని గ్రుడ్లనుఱిమెడువారు
పాముకాళ్ళను గూర్చి పామేయెఱుంగు
భామపాతివ్రత్యమా మెయే యెఱుఁగు

నిలకున్న యోరుపు నిలయే యెఱుంగు
జలధిగాంభీర్యంబు జలధియే యెఱుఁగు
గగనపై శాల్యమ్ము గగనమేయెఱుఁగు
నగజాతశక్తి నామెయే యెఱుఁగు
రంగనిదైన యభంగురచరిత
రంగఁడే యెఱుఁగు నిర్భాగ్యమానవులు
దెలియుదురే! యని పలికెడువార
తెలిసితి వని కలకల నవ్వువార
లగుచునాడుచునుండ నంతకంతకును
నెగచిన నవ్వడి నింగిఁదట్టాడ
ఇంతలో దేవాలయాంతర్నివిష్టు
లంతర్గతజ్ఞాను లతి వక్రగతులు
క్రోధ ధూమ్రాక్షులు కుటిలకటాక్ష
బాధిత సద్వృత్తవరులు జల్పకులు
శాంతిహీనులు లోభసంకీర్ణమతులు
దాంతివర్జితులు నితాంతాఘయుతులు
రంగపదధ్యాన పంగుమానసులు
భంగురసౌఖ్యచాపల్యరూషితులు
హరివినిందకులు బాహ్యాచారరతులు
పరమార్థ మూర్ఖులు పరమతిపరులు
దేవాలయార్చకులద్దెలిసి యపహాస
భావంబు వినమట్లుఁ బ్రాఁకనిల్వెల్లి
బిలువిడి పరుగెత్తి బయటికివచ్చి
యలజడిఁ జేయెత్తి యదలించి నిలిచి
పలుకు పల్కునఁ గ్రోధభరధూమ ధామ
దలకొన వివశులై తరటీరీగతిగ
యోరి! దురాచార! యోరి! చండాల!
యోరి! దుర్వాద గర్వోద్రిక్తహృదయ!

ఓరియున్మాది! యోరోరి! బాలిశుఁడ!
యోరికపటవేష! యోరి యజ్ఞాని!
తలకొని కన్నులు దలకెక్కె నేమి!
చిలిఁకావరము గన్నులు గప్పెనేమి!
మద్యంబు చేమేను మత్తెక్కెనేమి!
యాద్యుని సేవ నీ కబ్బునా! యేమి!
నిత్య స్వరూపుండు నీయింటికాపొ!
సత్యంబు వలుకు మనత్యవర్తనుఁడ!
నక్క చేరునయేమి నాగలోకంబు!
ముక్కిడిగనునె యామోదసౌష్ఠవము!
కుక్క కాశికిఁబోవఁ గూడునా యేమి?
కొక్కెరనేర్చునే గుప్తధర్మములు!
బధిరుండు గాన మాస్వాదింపఁగలఁడొ!
యధమాధములు ముక్తి నందంగఁగలరొ!
ఖండదుర్భాషా ప్రపంచదూషితుఁడు
చండాలువకు నేటి సన్మార్గవృత్తి!
యతినింద్యమృగపలాఽఽహారదృష్టులకు
మతిఁగల్గనేర్చునే మాధవభక్తి!
యానవజటిలదుర్వాసనాగ్రంధి
యానరోజాక్షునాహ్వానింపఁ గలఁడొ!
మలజుష్టదేహాఽభిమానకష్టుండు
మలహరునామ సంస్మరణ కర్హుండొ!
యంగనారికి దృష్టి కందనివాఁడు
దొంగప్రమొక్కులతోడ దొరకునా! యేమి!
శ్రుతివధూ స్తనముల శొక్కెడువాఁడు
పతితులమనసులఁ బవళించునేమి!
వేదాంతవాక్య సంవేద్యుఁడౌవాఁడు
వీధిజోగులఁ గూడి నెతనొందునేమి!

నిత్యసూరులయెడ నిల్చినవాఁడ
సత్యవాదుల వంటి చరియించునేమి!
యోగీంద్రహృదయానురాగియౌవాడు
భోగులకంటికిఁ బొడసూపునేమి!
నారదగానపానందుఁడౌనాఁడు
వీఁడిపాటకు వేకారునేమి
భళి భళి! నేటికి పాండురంగండు
వలచినాఁడయ్య! పలలభాదిభక్తి!
వాఁడెట్టులో భ్రమపడినాఁడ నందు
చూడనేర్చితిరెట్లు సుండు మీరెల్ల!
వచ్చునప్పుడె మీరువానితోఁగూడ
మెచ్చి పచ్చనిపులు మేఁనారేమి?
యెద్దీనె నన్నచో నిదియును కద్దు
కద్దని గాటికిఁ గట్టుండనెదరా!
వీనితో నిప్పుడు నిర్మలేశ్వరుఁడు
బూని యాభాషణములు వేయునేమి!
వాలినరతివెంట వచ్చునా! యేమి!
చాలు చాలిక యపచారవాక్యములు
తరలుండు లేకున్నదరలించు మిమ్ము
పరభయంకరుఁడైన పాండురంగండు
ఓరి చొక్కామేళ! యోరంత ప్రౌద్దు
పారంబు లేనట్టి వాదముల్ద్రవ్వఁ
దిరికెగా లేము నారమేయంబు
సేరసర్పంబౌ యజ్ఞీయస్థలమ్ము!
పూతంబు రంగగోపురమును దాకి
బ్రాఁతె! బండాలుండు బనివడి నిలువ
రంగదెవ్వట! నీదువంగడం బెవట!
సంగతి యేరీతి సరిపడునోయి!

వెలివాడలోపలఁ బలికినయేని
వెలవచ్చు నీపాటి వెలఁతిమాటలకు-
వెఱ్ఱిభక్తుల వెఱ్ఱిమొఱ్ఱియాటలకు
గుఱ్ఱఁడే మావాఁడు గోరిక పడఁగ?
సంతఁగానీ వాఁడెయైనప్పుసూత
మింతకుఁ బలుకకు మిట్టిమాటలను
గదలు మిచ్చటినుండి కదలలేవేని
గదలింతుమిపుడ నీకాళ్ళు బంధించి
యని యిట్లు బూజారులాగ్రహాయత్త
మనముల బెదరింప విని చోకామేళుఁ
డంత దిక్కుల నేత్రకాంతులు చిమ్మ
నంత శీర్షంబెత్తి యంతకాంతకున
కాదిపూరుషునకు యజ్ఞమూర్తికిని
వేదవేద్యునకు సం విత్స్వరూపునకు,
బంధకాంతక భావనాంబర మణికి,
బంధకార్యైక సంహర్తకు, నిఖిల
కర్తకు యోగవిహర్తకు మఱి య
కర్తకు, విష్టప భర్తకు మ్రొక్కి-
తనకట్టెదుట నిల్చి తఱుముచు నున్న
వనరుహభవపంకభవుల నర్చకులఁ
గరమర్థి గనుగొని-కరములు మొగిచి
శరణార్థినని నమస్కారంబుసేసి
పరమార్థగంధబంధురములు వినయ
వరణీయపీయూష పరిపూరితములు
శాంతిశీతలములు, సరసస్ఫుటములు
దాంతిపూతములు, ముక్తాప్రతిమములు
వేదాంత రాహస్యవీధిదీపికలు
బోధవారణ కర్ణమూల ఘంటికలు

తుందిలరసము లానందకందములు
సౌందర్య సౌధశిల్పమ్ములు ముక్తి
కాంతామనోహర కర్ణతాటంక
కాంతమ్ములైన వాక్యమ్ములు గూర్చి
పలికె సాయుజ్యభావానందభరము
వలువొప్పననుభవించిన పుణ్యులార!
దేవతాంశజులు, భూదేవులు మీరు
భావింప మీకన్న భగవంతుఁడున్నె?
యాదిపూరుష ముఖంబందుద్భవించి
వేదముల్ నేరిచి విపులవిజ్ఞాన
బోధకులై లోకములఁ గడ తేర్చు
సాధులు కారణ జన్మలు మీరు
మీకట్టెదుట నాయమే మాకుఁబల్కు
లౌకిక సౌఖ్యసమాకర్షితులకుఁ
దావయుక్తులకు నిర్వాపితదీప
కోపమజ్ఞానుల కురుపాపరూషి
తులకు బద్ధులకు మూర్ఖులకు మదాంధ్య
భరిత వర్తనులకుఁ, గలిసేవకులకు
బహుజన్మవాసనా పరిదూషితులకు
కహ కహ నివదహంకార బద్ధులకుఁ
జరణరజంబుల శిరసావహించి
యరిగెద మఱలుట కన్నముందుగను
నాదొక్కమనవి విన్నప మాచరింతుఁ
బాదస్థలివి బ్రహ్మవాదులు మీరు
సహియించి దయ యనుగ్రహము సేయుండు
దహతహ మదుపు నుత్తరమొందు నాకు
మాలనంటిరి నన్ను మాలనే యౌదు
మాలవానికి రక్తమాంసముల్లేవొ?

మాలఁడన్నంతనే మనుజుఁడుగాఁడో!
మాలవానికిఁ బరమాత్ముఁడు లేఁడో!
మాలని హృదయంబు మడిగట్టలేదో?
మాలని చూపులు మాలలే యౌనా?
వెలివాని కన్నీరు వెలలేనిదౌనా?
వెలివాని భక్తియుఁ గులహీనమౌనా?
సర్వభూతములందు సమముగా వెలుఁగు
సర్వేశునకు నివాసము చేయ యోగ్య
మౌనా! కాదో! యేమి మాలని మనసు
దీనావనవ్రతాధీన మానసుఁడు
దీనులందఱఁగావ దివురునే గాని
మానునే యార్తుని మాలవాఁడనుచుఁ
గడలినెల్ల జలంబు గలియునో లేదో?
గడలికి నంటునే గశ్మలమింత?
పావకుండన్నిటి భక్షింపఁడోటు
పావిత్ర్యమునలోటు వాటిల్లెనేమి?
యక్షరోచ్చారణం బందరొనర్తు
రక్షరం బంతట క్షరమాయెనేమి?
యిలపైని మలినంబు నిలిచినయంత
నలవసుధకుఁ బూజ లడుగంటెనేమి?
గాలి సర్వంబును గప్పు బత్తముఁ
గూలెనే దానితోఁ గులగౌరవంబు
సకలంబుపై ప్రభాదయముగుప్పించి
వికలమైనదియొ సవిత్రుని బ్రదుకు
పత్త్యైతవకునకు సర్వేశ్వరునకు
నిత్యరూపునకు నీ నియమ మెక్కడిది?
  కాదు కాదన్న వాక్యమ్ములు గూడఁ
గాదన్నవానికి భేదమెక్కడిది?

ధరణి సర్వంబును దాసుగా వెలుఁగు
పరమూర్తికి యేరు బందర మేమి?
తాకుటయేదొడ్డ తప్పుగానౌనొ?
తాకకయే మమ్ముఁదామున్ను సృష్టి
జేసినాడా? యేమి? జీవేశ్వరుండు?
యానకు పాదుదివ్యస్వరూపుండు
నామహా మహాదల్ప నైతిమయేని
యామూర్తి వీక్షింప హక్కు లేదేని
వానిపూజకు మేము బాహ్యాలమేని
వానిపాదమ్ములు బట్టరాదేని
వానిప్రసాదనం పాదమునకు
దీన మర్త్యులు బ్రయత్నింపరాదేని
మమ్మేల సృజియించె మహాపైనిదానఁ
జామ్మలు చుట్టు దుఃఖమ్మున వలిగి
కాలునెరదండల కన్నీట దడిపి
సోలియూర్పుల చింతగూరి సహింప
వలెనంచునో! భక్త వత్సలత్వంబు
ఫలియించునో భేదభావమేయున్న
నేకస్వరూపుఁ డనేక రూపుండు
శ్రీకాంతునకు నిట్టి చిన్న తలంపు
ఏంచునా? కరుణకు భండారమైన
పాండురంగఁడు భక్త పరతంత్రుఁడెపుడు
పారంగని యెడంద మలినంబు గాదు
మారంగమూర్తికి మడుగు లేసున్న
మావాని ప్రేమకు మచ్చయే లేదు!
మావాని లీలకు మరియాదె లేదు!
యలనాఁడు శబరియెంగిలి దినలేదా?
వలనొప్ప రంగఁడు వానిలోమైల

పెలి పులికాపుల దొలుచునాయేమి?
యాల బట్టినట్టి భక్తుల నోళ్ళయందు
నానిన రంగని నామమంత్రంబు
ధ్యానంబొనర్పంగఁ దగునయ్య! మీకు.—
మలినంబుగాలేదొ? మైలగాలేదొ?
గుణము నుచ్ఛేదింపఁగోరిన ద్రౌణి
శరమును దొడిగి రోషంబున విడువ
పఱచి యా యభిమన్యువధతి గర్భంబు
నరిది యస్త్రంబు శతారమ్మువోలె
దఱుగనుద్యోగించు తరుణంబునందు
నుదరస్థుఁడగు బిడ్డఁడో కృష్ణ! కృష్ణ!
నదయత నన్ను రక్షణ చేయుమయ్య!
శరణాగతుఁడనంచుఁ బొరిపొరినేడ్వ
మఱువక యంగుష్ఠ మాత్రశరీర
మునుదాల్చి పెనఁదూరి జననిగర్భంబు
చనవుదొలంక రక్షణముచేయండె?
రంగఁడాబొ త్తిగర్భంబున నెంత
యెంగిలి యంటెనో యెవ్వరి కెఱుక!
మనవలె నేగ్రోధమాత్సర్యలోభ
గుణములఁ జిక్కుసుక్కునె ప్రేమమూర్తి!
యగధారి కొక త్రోవ యన్నదేలేదు
పగబట్టి మీరేల పట్టి కట్టెదరు?
భక్తుల భృకుటి సేవకుఁడు రంగండు
భక్తుల శరిగాపు పాండురంగండు
భక్త నద్భక్త్యైక వశుఁడురంగండు
భక్తులతీరని బలము రంగండు
భక్తులహృదయమే భగవంతు గృహము
భక్తుల భావమే పరుని భావమ్ము

భక్త సంతోషమే పరుని సమ్మదము
భక్తునిదుఃఖమే పరుని దుఃఖంబు
భక్తుల యెదలనే భగవంతుఁడుండు
భక్తులువసియింత్రు భగవంతునందు—
ఇరువురకును భేద మిసుమంతగాన
మొఱ పెట్టియేరీతి పరికింపనైన—
చిక్కఁడు వ్రతముల చిక్కండుశ్రుతుల
జిక్కఁడు మఖముల నొక్కభక్తునకు
నిరతంబు ప్రభువు సన్నిహితుఁడై యుండు—
మెఱమెప్పులకులోఁగి మరగఁడుశౌరి
భగవంతుపై భావ బంధమ్ములేక
వెగడువేషమ్ములు వేసినయంత
దొరకదునిజముగా, దుర్లభమైన
పరముక్తి సామ్రాజ్య భద్ర వైభవము
భక్తియోగము పాప వనకుఠారమ్ము
భక్తివక్తుల కెందు బాధలేలేవు
పాండురంగఁడు వేఁడుపలుకునోలేదో
పాండురంగఁడుగాన వచ్చునోలేదో
జూడనిందొకసారి జూతును గాని
చూడాకలాప విస్ఫురితుఁడౌ వాని
చంద్రభాగా మనస్స్వామియౌవాని
చంద్రికామధురహాసము జిల్కువాని
గోధూళి ధూళిత కుంతలశాలి
రాధాస్తనాశ్లేష రతుఁడైనవాని
ఫల్గునరథజయ ధ్వజుఁడైనవాని
వల్గునేత్రముల చాపలముల వాని
ప్రేవల్లెవాడల విహరించువాని
గోపగోపీ మనోగప్తుఁడౌవాని

కారుణ్య మంజులకాంతియౌ వాని
తారుణ్య వలిత మంధరశైశవాఢ్యు
బంధు జీవక బంధుపాటలాధరుని
సింధుకన్యాపతి సింధురయాను
నదె! వచ్చుచున్నవాఁడద్దంబు దొలఁగుఁ
దధరబింబపుఁగాంతి యదిగో! ముందటను
బదముల గలకలక్వణనంబుఁ వివిగో
వదన బింబము నందు వలఁతి నవ్వదిగో
భోవని త్తురుమీరు భోసీకుఁడయ్య
భావవాగురులచేఁ బట్టంగ నిందు
శ్రుతులకందనివాఁడు చోద్యమౌవాఁడు
పతిత పావనుఁడైన పాండురంగడు
వచ్చుచున్నాఁడు నాపాలిదేవుండు
మెచ్చికొన్నాఁడు నేనిచ్చుపూజలకు
ననిముగ్ధుఁడగుచు దేహంబును మఱచి
పనవుచుండెడి వాని భక్తాగ్రగణ్యు
గనుకొని యర్చకుల్ కలకల నవ్వి
కనుఎంచినాఁడయ్యె కన్నులలోనె
రంగధాముఁడు వెఱ్ఱివెంగళయ్యలకు
సంగంబులో భక్తిబొంగి పోయినది
వినువారలున్న చెప్పెడి వారికేమి?
వననిధి మోకాలి బంటిదేయంద్రు
నడునడురా! మాం! నవ్వులచేటు
నడువీధిలో నిల్చి నాట్యమాడెదవు
ముచ్చటేమిది పీని మొవవ త్రోయుండు
రచ్చకెక్కిన నింక హెచ్చు కుందేమిఁ
యని పల్కి నడుముల సంగవస్త్రములు
బెవ పైచి బిగియించి వీరులై నిలిచి

మొదట నా యిల్లాలిఁ బెన్నెంపుఁబ్రోవు
సదమలభక్తి కాసార వరుంధ
తినిబోఁటి సాధ్విని, దేవసంభవను
దనికిన కచ్చి, ముందలపట్టి యీడ్చి
మెయిగ్రుద్దియాచొకా మీఁదని దరిఁ
వయిపయిఁబడఁదన్ని బరబర పీడ్చి
యెక్కడున్నాఁడో నీ నిక్కంపుదేవుఁ
డిక్కడలేఁడు పొమ్మి యంచుఁద్రోవఁ
గాయంబు బేచెత్తి కమిలిపోవంగ
గాయంబు లందుండి కారెడురక్త
పూరంబు జాల్గట్టి పాఱ నుచ్యాన
పారావతాంగుళి పాటలనేత్ర
పరిసరంబులనిండి బాష్పముల్ దొరఁగ
శిరమున కుంతల భరముఁవ్రేలాడ
సంగముల్సోలఁ యయ్యాలలూగంగ
భంగంబునొంది కోపంబింత లేక
బలవంతముగ నగ వెలయించి, వారి
కిల జాగ్రమొక్కి యంఘ్రుధూళిఁగొంచు
శిరమున ధరియించి షిటలమూఁరించి
మఱలని చరణముల్ మఱలింప లేక
యెక్కడె నిల్చు ధైర్యమ్మును లేక
యెక్కడే నారిగ నోరంగ! రంగ!
కనిఎంచె నీ ప్రేమ కపటమే నోయి!
పనిచేటు నీ భక్తి పనికిరాదోయి!
నగధారి!' యనిగొంతు బగులంగనార్చి
నగనిందు కొవ తన మగువపై నొఱఁగి
యువకుఁడై పేరెగృహంబు భక్తుండు
పవమానమున జిక్కియలమట బొందు

శౌరిభక్తుని జూచి నేరక యస్త
ధారుణీ ధరమందు జేరెను సవిత—
యర్చిక తతి హృద యమ్ములఁ దమము
బేర్చెనో యన బర్వె మింటఁ జీకటులు
అక్షమ పరమభక్తావజ్ఞఁ జూచి
పక్షులు గూండ్లలోఁ బారాడ కుదిగె
నీరపూవులకాంతి దారాడి మింటఁ
దారకానికరంబు దందడి వెలిఁగె
విదిత భక్తుమెద వికలింపలేదు
నదవద యైన దేహంబున నుండి
దొరఁగు శోణిత ధార దరుగనే లేదు
ధరణి ధూళిపాళి దనికిన కన్ను
గవనిండికొని, వానకాళులు గట్టు
నవమాన బాష్పంబు లాగనే లేదు
పరమార్థ భక్తిసేవలుసేయఁబూను
తరుణి చేతలు మదిదాకనే లేదు
బుడి బుడి నడలఁబైఁ బడునాసబలుచ
బుడుతల ముంగురుల్ దడవనే లేదు
ఖండితమ్మైన వృక్షమ్మును వోలెఁ
బాండురంగా! యంచు బడినాఁడు బుడమి
నెంతజేసితివోయి! యిందిరారమణ!
పంతంబు నాపైనె పట్టినావేర!
నేనుతాళుదునేమి నీ పరీక్షలకు
హీనుఁడ జడుఁడ దుర్మాన దూషితుఁడఁ
బిచ్చుక పైననా విధువస్త్రము! సుమ
గుచ్ఛంబుపైననా క్రూరాగ్ని శిఖలు!
వనశాఖిపైననా వజ్రాయుధమ్ము!
గొవలు తీగెకునానా గొడ్డలిపెట్టు!

ముసలమ్మతోడనా బంకీలజోడు!
పసవంటివారిపై ప్రబలపరీక్ష!
యవునోయి! నీవు మున్నార్జించి నట్టి
ప్రవిమలకీర్తిసార్థక మయ్యె నేఁడు!
సలలితమ్ములు తంతు సంతతుల్నేఁ
తళ తళలకు లోఁగితిఱియు కీటములఁ
జలపట్టి భక్షించు సాలీడువోలె
చిలిప చేతలమెఱుంగులఁ జూపి భక్త
కులముల మొగ్గ కన్నులు మోసపుచ్చి
వలపు లేవట్టి చేతల వలపించి
పారమ్ములేని విభ్రాంతిలో ముంచి
ఘోరదుఃఖమ్ముల క్రుంగ దీసెదవు!
నిన్నునమ్మి యొవండు నిర్వాణసుఖము
గన్నాఁడు గన్నార? గన్నార లేదు
నీవుబూనిన రమణీయ హారములు
పావనపదభక్త బాష్పప్రణంబు
నీవేణురంధ్రవి నిర్గతరవము
దావక భక్త సంతతి పెట్టుమూల్గు
నీపదంబులను క్వణించు గజ్జియలు
దావరూషిత భక్తతతిమానసములు
నినునమ్మువారల నిఖిలంబు వాదె
యని కొందు వెన్నఁడో యప్పచ్చివట్లు
యెన్ని జీవులు నిన్ను నెదల ప్రేమించి
కన్నీట నీపాద కంజాతములను
గొలిచి నీకయి సుఖంబులు బలిపెట్టి
ఫలియింపనట్టి యాశల గూరి, మిడికి
మట్టిలో నైక్యమై మాఁయయున్నారొ?
నెట్టన లెక్కింప నేర్తురెవ్వారు?

కరుణావిదూర! నీచరితంబులందుఁ
బరమాణువంత బ్రేమరసంబెలేదుఁ
నిన్ననమ్మిగృహంబు నిజపతిసుతుల
నన్నల దమ్ముల, నందఱవిడచి,
మానుగా నీయభి మానంబునకును
బ్రాణమానములు నీరాజనమిచ్చి
యున్నారె! కద! గోప యువతులు మున్ను
గన్నారె! సౌఖ్యంబు గన్నీరుగాక!
కడవచంకను బూని గాళింది జేరి
కడుమరులేర్చి నికయి కాచికాచి
తడఁబడినట్టి రాధా సతీమణికి
నొదగూడెనే సౌఖ్య మూర్పులుగాక
ధర్మవిహీన! నీ కర్మంబులందు
ధర్మలేశంబు తథ్యంబుగాలేదు——
బనులన్ని దీర్చి సంబంధమ్ములేని
మనుజాని బోల్కి భాషణములాడెదవు
ఘాతులఘాతులని లేకెవ్వరికేని
సతతంబు న పకృతి సల్పు చుండెదవు
బీభత్సమొగము దప్పించిదంభమున
సౌభద్రుఁగల నిలోఁ జంపంపలేదా?
ధరలోన గర్ణురథమ్ము గ్రుంగించి
శరముల నరునిచే సురిగింపలేదా?
తటిని శిఖండి ముందరనిల్పి ధర్మ
పరుఁడు గవ్వడికి నుపాయంబుసెప్ప
మరపదీసూను నడిగింపలేదా?
సమరంబులో గర్ణుశక్తి వద్దు
వారలెవ్వరు లేరు బార్థుబ్రమింగెదునా?
గౌరవులను దీర్పఁ గలుగువారెవ్వ

రణభయంబున భీమ తనయునిరేఁ
కొనికొని శక్తిచే గూల్పింపలేదొ?
పాండవులను మాత్రమొండుచోఁ జేర్చి
పాండవేయులను నశ్వత్థామచేత
గొఱమాలి గొంతులు గోయింప లేదొ?
యఱకాలిలోఁగన్ను నడుమగాలేదొ?
భృగుమౌని చరణముల్ బిఎకెడువప్లె
తగవరి! నీకింక ధర్మమేదోయి!
నిన్నప నేఁటికి నీప్రేమ నమ్మి
కొన్నవారినిఁ బట్టఁ గూడనుగాక!
దినమురాత్రియు నేక దీక్షతో నాదు
మనమున నమ్మి కొల్చిన గాని, నీకు
కరుణగల్గకపోవఁ గారణమేమి?
పరమాతాచరణ సంఫలితావతార!
ఈనాఁడు దర్శనం బీకున్ననాదు
మేనుదొఱంగనే మిక్కిలి ప్రతిన
యని కృతనిశ్చయుఁడై నట్టి వాని
కనుగవయెదుట రంగఁడు కాంతిపూర
పూరితసకల కుటీర భాగుండు
ధీరమందస్మితహారి నేత్రుండు
మధుకరకుల వశంకర కాకపక్ష
మధురిమసీమ సమ్మాన్యవిశంగ
వాసుఁడు భువనైక కోశోదరుండు—
శాంతదేవతా సార్వభౌముండు—
వల్లవీహృదయదీపమ్ము! కటాక్ష
వల్లవోల్లాస సంపాదిత మురళి
మురళీ సుధాభవ్య సరస వేదోండ
ఖురళికామల్లుఁ, డక్రూర విధ్యాన

వనభూమ్యనల్ప కల్పక పాదపమ్ము 5
వనమాలికాదామ వాసనాయుతుఁడు—
తెరచిరాజిన్నట్టి దేవుండు మౌని
వరతపఃఫలదివ్య పాదపద్ముండు—
ఘుణుఘుణుక్వణన సంకుల రత్నరోచి
రనుబద్ధ మంజీరు, డవ్యయానంద
ధామాంగుళీధామ దామ ప్రకల్పి
తామేయ కృతక సాంధ్యస్ఫూర్తి దేవ
కిత్తర్ణకము, రాధికాతనూవల్లి
కాతంద్రసురత రేఖాబద్ధమూర్తి
రాసవందితుఁడు—దిగ్వాసుఁడై వట్టి 10
వాసుకి భూషణు పాలిదైవమ్ము
పరతత్త్వమెదుట సంభ్రమమున నిల్చి
కరములు దట్టి చౌకాపీఠుబిలువ
నిలువెల్ల పులకల వీలములు రేగ
తలఁపెల్ల నానంద తరళంబుగాగ
మొగమెల్ల నగవులు మొనఎకొనంగ
వగవెల్ల గరువంపు వగలుగారంగ
గన్నులు నిలువెల్లఁగప్పు కొనంగఁ
గన్నులఁ గన్నీరు కాల్వలుగట్ట
శ్రవణముల్ మెయినింత జనియించి నిక్క 15
శ్రవణంబులను సుధా స్వనములు మ్రోయఁ
బదములు నిలువెల్లఁ బరిధవిల్లంగఁ
బదములలోఁ దొట్రు పాటు సంధిల్లఁ
గరములు నిలువెల్లఁ గవిఎకొనంగఁ
గరతలంబులు సముత్కటత చలియింపఁ
జలితాంగములు క్రమవలితముల్ గాగ
వలవంబులో మాత్సఖావముల్ రేఁగ—

గాలిలోఁ దిరిగెడు కరణిగాయంబు
లీలపమ్మదమున దేలియాడంగ
పరిఫుల్లనేత్రముల్ గిరగిర దిరుగఁ
దిరుగు కన్నులవెంటఁ బ చుట్టఁ గాంతి
మదియెల్ల సంతోష మదమునఁదూగి
కదలి కదలకపైని గద్దకట్టంగ
వవనియంతటను బ్రహ్మానందవార్ధి
కవిసి నృత్యముసేయు కరణిదోపంగ
ధరణి సర్వంబును దానయైనట్లు
ధరణిసర్వముగూడఁ దామగానట్లు
దనదన్నభావమే దఱఁగినయట్లు
దనదన్నభావమే బెనగొన్నయట్లు
దానెరంగనియందు లీనమైనట్లు
బూనిరంగఁడు దనలోనె యున్నట్లు
దఱఁపులంతంతకు మెలికెలు దిరిగి
తలమీది వేగ తంత్రములొచు నడుగ
దనచుట్టునొకవేయి తరళ తారకలు
గమగొనలందు నవ్వెవయించి చూడ
తనమేన వేయి సౌదామనీ లతలు
గనకవ వెలుగుఁలఁ గదగి ప్రాకంగ
తనయెద కత ఘనాఘనములు విరిసి
కొనకొని యమృతంబు గుండలగురియ
చూచి కాంతుల దారి చూడగాలేక
పూచిన భావముల్ దాచుకోలేక
పలుకఁగఁబోయి పల్కులు గొంతులోనె
గలకలనది యించి గద్దకు రాక
నిలువెల్లవణక చేతులు దాచి యాళ
ఫలియింప నాథ కృపారిజాతంబు

పదములు గమిచి పేరెదహత్తికొంచు
వదలింపకొనరాక బాహులుబిగిచి
పడియున్నవానిని భక్తాగ్రగణ్యు
గడుశాల్మి మొగమునఁగళలీనుచుండఁ
గనులందుదొరఁగు శుభాశ్రులఁ జెప్ప
లనువప్పళించుచు లసమానపులక
కంటకి తాంగియైకాంతుని యడుగు
లంటిఎల్లఁగ వంక మందున దాల్చి
కమలుగూర్కొన కసుగందులపై పు
గనుద్రిప్పయెదనెడఁగను దున్నదాని
నిజనాథచరణ పీఠణపు తమైన
రజము ఖాంచు శిరస్థలిదాని
మనసు మాయనిదాని, మానసకైశ్య
మును జీర్ణ చీరయుఁ బూనినదాని
బతిసేవసేయుటే వ్రతమైనదానిఁ
బతిజీవలకు మేలు బంతియౌదాని
దరుణి, చొకామేళు ధర్మపురంధ్రిఁ
గరమర్థిగనుగొని పురుషోత్తముండు
చిలిప నవ్వుల నిగ్గుచెలఁగియాడంగఁ
బలికె నీగతి భావబంధురంబుగను
మెలఁత! నీభక్తికి మెచ్చినావమ్మ!
వలయుకోర్కులు బిండవచ్చినానమ్మ!
వరణీయమగు బ్రహ్మపదవి గోరెదరా?
వరసుఖాకరమింద్ర పదవిచేకొంద్రా?
ధనదునకున్నంత ధనముగావలెనా?
వననిధికున్నంత వసుమతీరాజ్య
భరముగోరెదరా? వేగిరము వచింపు
పరమర లేక మీయాపదీర్చెదమ?

పరమ భక్తులుగోరు వరము చెల్లించు
పరిపాటి మాప్రాణ పదమైన దబల!
యని పల్కువదనంబు నడ్డంబుద్రిప్పి
మనసులోపలియనస్మృతి బాం భక్తి
పరిమళభారబంధురములు తృప్తి
సురుచిరములు ప్రేమ సుఖశీతలములు
వైరాగ్యవాటికాప్రసవగుచ్ఛములు
ధీరతాగుణ పరిస్ఫోరకంబులగు
పలుకుల నీరీతి వచియించెఁ బడఁతి!
తొలి మినుకులుగూడ వెలకట్టలేని
నీచేతలకు టీక నిర్మించుటకును
నాచేతనౌనా? నానాచిత్రవృత్తి
వెలయింతువెన్నియో వింతవేసములు
చిలికింతు వెన్నియో చిన్నెలు వన్నె
లలరింతువెందరో యార్త భక్తులను
పలికింతువెన్నియో భాషణంబులను
నీమాయలకు జిక్కి నెగడులోకములు
నీమాయలను దాట నేరరు సురలు
నాకథయే భ్రాంతినాశావతార!
లోకమ్ములందు నాలోకమ్ముడింది
చీకటియాక్రమించినవేళలందు
నేకమై వెలుఁగు నీకిచ్ఛ జనించి
సృష్టించితివి లోక చిత్రనాటకము
నష్టస్వభావంబు విష్టపాధార!
జెడును బిడౌజుండు జెడుపరమేష్ఠి
జెడును లోకములు గిర్వాదు గుబేరుండు
జెడనివారొక్కరే జీవేశ! నిన్ను
విడువ నేరని భక్తవీరలోకమ్ము!

పారదరసపరి ప్లవమైన సుఖము
గోరదు నీభక్తకోటియెన్నటికి
నీపదపంకజ నిర్మలధ్యాన
తాపారభంగదోలాపారవశ్య
సరససౌఖ్యమ్ములేశ మంటోలునెట్లు
ధరణి వైభవములు దత్త్వస్వరూప!
పన్నేటిజాళలు బన్నిలోభింప
నున్నావు ఫలమేమి? యోపాండురంగ!
సాతుల కిల ప్రాణనాథుఁడే సర్వ
మాతని భావమేనా తలఁపోయి!

మెచ్చి భక్తకు శాంతి నిచ్చిన నాకు
వచ్చినట్లే సర్వవరములు తండ్రి!"
తదనంతరంబ భక్తావన పరుఁడు
సుదతి పల్కెడి ధీరసూక్తులకలరి
తలపోసి తలపోసి తడవకు మెచ్చి
కలగనుచున్న చొక్కామేళు జూచి

లేవవోయీ! దివ్య భావైకసంగ!
లేవవోయీ! భక్తిలీలానుషంగ!
పరమభాగవత శేఖర! యంచునొడిని
కరములదట్టి లేపె రమాధవుండు
తొలితాకు గురిసిన తొలకరివానఁ
బులకించు నిలువు గన్నులె మొగమెల్ల
మైగనుంగొని యంతరానందమునకుఁ
బ్రాఁకిడవేరవి బాలకత్వంబు

దలకొని వెట్టులో దొలఁగించి నిలిచి
సలలితమగురీతి సాష్టాంగ మెఱఁగి
నేనునేనని ముందు నిలిచి చూడంగ
బూనెదు దవతలంపులు బిగ్గ బట్టి

విషయంబు, నయమున వేకారితనము
దనవాఁడనె స్వతంత్రతనిష్ఠురతయు
భక్తియు ప్రేమ సంబంధంబు నిండు
రక్తి సంభాషణా సక్తియుగూడి
పదపదంబున యందుఁ బరువుపెట్టంగ
పెదవులే నవ్వులై వికసించ సాధు
వరుఁడు చొకామెళ భక్తుండు పలికె
కరుణగల్గినదేవ! కంజాతనేత్ర!
వెలవచ్చెనేమిరా వెఱ్ఱి పాటలకు
ఫలమిచ్చె వీనాఁడు గులహీనభక్తి
కడజాతివాని యా కాంక్షగుర్తించి
గడపద్రొక్కితి వేర కమనీయదేహ!
యరుణాంబుజముల కొయ్యారమ్ము దిద్దు
చరణముల్గండెనో! నమపెనో స్వామి!
కరుణకై సర్వంబు మఱచెదునిన్ను
పరమపూరుషునింతవఱకు రప్పించి
కొన్నాను నేనెంత క్రూరుఁడనోయి!
యన్న! నాయఘమున కవధిలేదోయి!
తరసదుర్గంధ బంధురమైనదాన
నరుణశోణిత రక్త ధరణియౌదాన
విశసితమృగ చర్మ ఎతున మౌదాన
బహుకరోటివ్యూహ భరితమౌదాన
మైరేయపాన దుర్మత్తచండాల
ఘోరపరస్పరాక్రోశమౌదాన
కలుషవశాచి కాకరమైనదాన
వెలివాడలోనెట్లు వెడలివచ్చితివి
శ్రుతిపతి హృదయసంస్తుతుఁడై నవీవు
పతితుల ప్రేమకు వలచినావేర!

శ్రుతిశిరః కోటీర శోభియౌ నీవు
గతిలేనియింటికిఁ గదలినావేర!
భవమనశ్శయ్యలఁ బవళించు నీవు
భవబంధితునిఁ జూడవచ్చినావేర!
కలిమి పొలంతి చూపులఁదేలు ఱేఁడ!
గులకరానేలను నిలిచినావేర!
తలఁపులతోట కావలినేవెలుంగ!
తలపోఁతలకుఁ జిక్కి దక్కినావేర!
నానావికస్వరనాదాఽవతార!
నావోటి పాటకు మానసంచితివా!
కామితపూర్తి! సత్కారుణ్యమూర్తి!
నామూఁగ నోములు ప్రేమించినావా!
జలధికైనను దెలియలికట్టగలదు
కలుషమారకము నీకరుణకు లేదు
స్వామి! పెద్దైన దర్శనమబ్బెఁగాని
యేమి నీకాతిధ్యమే నివ్వఁగలను!
బిడుగు పచ్చడమైనఁ బరువంగలేదు
గుడిసెలో నిన్నెట్లుఁ గూర్చుండఁజేతు!
నర్చింప నొక పుష్పమైననుఁగాన
నర్చ్య స్వరూపున నర్చింతు నెట్టు!
అని దీనవదనుఁడై యలజడినొందు
దనభక్తుఁగనుఁ గొని దామోదరుండు
భక్తాగ్రగణ్య! సద్భక్తిపై నున్న
రక్తి నా కితరమార్గములందులేదు—
పరమభక్తికి నేను వశుఁడౌదుఁగాని
బిరికింపఁదద్భిన్నవర్తనంబులను
రమ్ము మోదము దేవళమ్మున కనిన
సమ్మోదమున నేమ చమకితమునగ

మెలఁతఁగన్గొనెఁ జౌరామీళభక్తుండు—
దెలిగన్నుఁగవయందుఁ దులకింపఁగాంతి
వనజసంభవుని బొడ్డునఁగన్నవాఁడు
కమలాకుచ స్థలాఽఽశిల్పమౌవాఁడు
శమదమయుతులైన సంయమీశ్వరుల
భావపుష్పమ్ములపై వ్రాలుదేఁటి—
భావజహరమస్త భాసురంబైన
జలముగన్నట్టి యంఘ్రులవాఁడు గొల్ల
చెలువలఁబ్రోచు వంశ్రులవాఁడు దివ్య
మురళీనినాద భాసురుఁడు శ్రుత్యంత
తరుణీవిదగ్ధతాతాత్పర్యపాద
ధూళిరక్షితలోకపాళి దుర్జ్ఞేయ
కేళీ నందవ్రజకీర్తి సౌరభము—
దేవర్షి విమలవీణావాద్యగీతి
కావార్థిశయనించు గంభీరమూర్తి—
శాస్త్రాఽనుగత సదాచార దుర్వార
నిష్ఠాంశ విదళిత నిఖిలచావల్య
దివ్యవైష్ణవ భక్తి దీక్షాఽధ్వనీనుఁ
దవ్యయప్రేమభరాపూర్ణాఽవతారమ్ము—
పరభావధన పరాశరపుండరీక
కరిరాజ మునిరాజ ఖగరాజ, రాజ
రాజితప్రముఖ పీరాజితచరణ
రాజీవుఁ దతి శిరోరచితముఖాఽగ్ర
ఖండితదశకంఠ కంఠఘంటాప
థుండు—దుర్లంఘ్యపాథోధి గర్వాంధ
కారతిరస్కార కరినహుంకారుఁ
డారబ్ధమాన సేవాఽఽసక్త హనుమ
దాదివానరతోషణైకనిరాకు

లాదివ్యదక్షిణాఽపాంగరోచి
యఱవిరి చూపులు విరియఁబూఁదేనె
పెరవోని నగవులు పెదవిపై జేర
నిరువురకునుఁ జుట్టుదిరిగి మొగిడ్చి
కరయుగమ్ములు నమస్కారంబుసేసెఁ
బ్రమదాశిరోమణి భక్తునిల్లాలు—
యమృత నిర్వాణాఽఽప్తరస్త నిదివె
నలపూలు గురిపెడి నాఽవనశీలి—
యలపాండురంగనిఁ గొలుచుభక్తులకుఁ
బడయంగ రానట్టి వరములు గలవె!
పడఁతి! నాజన్మకుఁ దొరవునీవందుఁ
బలికెఁ జొకామేళ భక్తుఁడిల్లాలిఁ
దెలివవ్వ బొలసె బొమ్మలయందునతికి—
వైళమరమ్మ! బోవలె ననుచున్న
శ్రీలాలితాకారు జిత్తమ్ము దెలిసి
కనుసన్న సేసెఁ జొకామేళు మఁదతి
గనుసన్నతోడనే గదలెభక్తుండు—
భక్తునివెంటనే పాండురంగండు—
ముక్తిలీలావతీ మోహంకరుండు—
నీరాడఁ గన్నుల నిలచినతరుణి
వారిబాయలగనంబడు నంతమేఱ
దెలిచూపుమల్లె పూవులఁ బూజసేసి
పులకరించెదు జిత్తమున వెన్కమఱలి
యానందమే లోకమై పాడుచుండె
దీనాఽవనాఽఽధారుదివ్యగీతములు—
పరమ భాగవతుండు పరమేశ్వరుండు
నరిగిరి చీఁకటు లల్లినదారి—
సనకాదులకు మనోధనమైనవాఁడు

ఈరేడు లోకంబు లేలెడువాఁడు
వారిజాక్షుఁడు వెలివాడలో లలిత
చరణముద్రలువైచి చనియెడువేళఁ
దళితోడలేచి యొక్కఁడుఁగాని బూజ
సేయఁబోవర మోహజీర్ణబుద్ధులకు
సాయుజ్యశక్తియేచాడ్పునఁగలుగు!
పులకించె భక్తుండు చలివెల్గువెన్న
లలసోనయగుఁగమలాధవుస్పర్శఁ
దళిరించెహరియు భక్తస్పర్శచేత
నిలపులకించె నీయిర్వురి చరణ
రాజీవములు సోఁకఁబ్రతిని మేషమ్ము
తేజస్స్వరూపముల్ దివినున్నతార
కలు నేత్రములు విచ్చి కనియెననంత
ఫలదమవ్వటి భగవద్భక్తలీల
నీరీతి నాలయద్వారమ్ముసేరె
వారిజాక్షుఁడు భక్తవరునితోఁగూడి
విరిసెడుఁబువులట్ల విచ్చెవాకిళులు
బరమేశ్వరునకు దెప్పరమైనదేది!
యమలవిజ్ఞానదివ్య ప్రభానిచయ
తము ఘోరసంసారతారకమగుచుఁ
గొమరొందు నాగర్భగుడిలోనఁజేరి
యమరంగఁ బ్రతిమలోనైక్యమైనిలచి
భాసించె నీగతిఁ బండరినాథుఁ
డీషల్లసితహాసభూషితాధరుఁడు
ఫలియించె నేఁడుగోర్కులవంట! భక్త
కులదీప! చూడరా కులదైవతమ్ము—
పాండురంగఁడెనీకు పరవుదమోసెఁ
పాండురంగఁడు భక్తపాశైకవర్తి"

యనియెచ్చరించిన నళినపీఠు
దనువున కమృతసేచనముఘటింపఁ
పాండురంగా! యంచుఁబడియెఁబాదముల
యండ నవ్వాఁడు, దేహమువిస్మరించి—
కలలఁ బోలిన భావములు చిత్తభూమి
నొలుకంగఁగడిచిన దోరంతప్రొద్దు—
ప్రమదా మదోల్లాసపాణింధమంబు
రమణీయ రతిరాజరథపతచ్ఛత్ర
మమరనాథాంతః పురాంగనా లలిత
సుమరజః పరిపూర్ణ శుద్ధమంజూష
వాసవాశాకై శ్యభరపారితథ్య
ప్రాశీనాంధంతమోవార్ధి తంద్రికినిఁ
గన్నుల ఫలమైనగాదిలిసుతుఁడు
మిన్నను గొలఁనిలో మించురాయంచ
కించిదారుణ్య సమంచితపాండ్య
చంచలాఽక్షి దంతసమకాంత కాంతి—
దళిపవెన్నెలఁబంచి ధరణిపాలించి
యపువపునితఁడంబు జాసనుండనఁగ
సరియైన సన్మార్గ సరణిచేమించి—
భువిగీర్తి వించి విస్ఫూర్జితుండగుచుఁ
బ్రాయంబుగై ప్రాలి పడమటిచఱులఁ
గాయంబు జార్చెదాక్షాయణీధవుఁడు—
చందనాఽచలసముజ్జ్వల పుష్పవల్లి
కాందోళికాతల్ప హర్షాఽతివేల
రతిమల్లి సుఖసుప్తరాజత్కిరాత
వితతవక్షః కూట విభ్రమాఽఽమోద
తతిచేత ఘుమఘుమాయితమౌను శబర
శతపత్రదృక్పరిష్వంగ సమ్మోద

మదభారవిహ్వల త్పదమౌచు పీచె
మదిగగుర్పంగఁ జేయుమలయమారుతము
దెలతెలవాఱె దిక్కులఁ గాంతిపేరెఁ
దలఁగెరిక్కలు సొదల్దాచి త్రిభంగి
నెలఁగించెఁగుక్కుటంబులు ఱెక్కలార్చి—
కొలఁకులలోని కల్వలుమూతిముడిచెఁ
గలకల నదియించెఁ బులుఁగుల గములు
నెలకొనెఁదమ్ముల నిండుగౌతుకము
ముగురుమూర్తులకునుమూలమౌవాఁడు
జగతీ నతికిఁదెల్వి నపరించువాఁడు
మొగుడుఁ దమ్ములఁజిక్కుమగతేఁటిగముల
వగమాన్చి ఝుంకార పరిపాటిఁబూన్చి
శార్వరమగ్నవాసరరమాశ్రీల
సర్వతోవ్యాప్తిఁబిసాళింపఁజేఁ
చక్రవాకాంగనాసంచయమ్ములక
వక్రసమ్మోదమ్ము వరదాన మొసఁగి—
కాంతిదారిద్ర్యదుఃఖాఽఽక్రాంత హరిదు
పాంతంబులకునెల్లవసువులగురిసి—
ఖరరహర్యక్ష కేసరకాంతికాంత
వరమయూఖమ్ములవాఁడు శ్రుత్యంత
కామినీ కమ్రమేఖలవోలు మేని
గోములవాఁడు దన్గొలుచు భక్తులకు
దివ్యమాహేయి దుర్దినభేది హవ్య
కవ్యాత్మకుఁడు జగత్కారణంబు గర్మ
సాక్షి మందేహాదిరాక్షసవ్యూహ
విక్షేపణుండక్షి కౌక్షేయమూర్తి
జగతీ సుపర్వనిష్ఠాపూర్తి పూత
నిగమతమందు సన్నిహితధామైక

ధాముండు గర్వాణతతివంద్యమాన
ధాముండు గమలాక్షు దాక్షిణ్యదృష్టి—
తొలి చదువుల మేనవలచినవాడు
వెలుఁగులగని— ప్రొద్దు వెలచినవాఁడు
గలనిలోఁబొలియు పీనులతొలిచెంకి
తొలికొండచఱియఁ ద్రోచెను సవిత—
పదపడివందనాపరులైనవారు
మధునిషూదన భక్తిమార్గవర్తులు
చలమునదిండున ఛకతాతి పీటు
దళుకొత్తువేషమ్ము వలపలఁబూని
పులుగడిగిన ముత్తెములవోలెవచ్చి
తలుపుల దీవలోపలఁ బ్రవేశించి
పొరఁ గాంచిరచ్చటఁబడియున్నవానిఁ
గడలేనివాని శోకడఁగన్నవాని—
భవబంధములకెడబాసనవానిఁ
బ్రవిమల భక్త్యైక భాగ్యమౌవాని—
ధరణికి ప్రస్తుతావతంసమౌవానిఁ
సురలకునైనఁ బూజ్యుండైనవానిఁ—
బండాలుఁడైనను సనకాదిభక్త
మండలికెల్ల నమ్మాన్యుఁడౌవానిఁ—
బండరినాథుఁడే ప్రాణమౌవానిఁ
పాండురంగని ప్రాణపదమైనవానిఁ—
గని విస్మయాఽఽకృష్టమనములఁ గలఁగి
క్షణములోనన యహంకారము ప్రాంగఁ
కటములుచిట్ల-భ్రూకుటి సంచలింప
నిటలతటంబున నెరయఁ జెమ్మటలు
గన్నులలోఁ బొగల్గప్పుకొనంగ
మిన్నంత కోపంబు మిడిగాళ్ళభిభవ

బెదరించి ధరణిపైఁ బదములఁగొట్టి
రదములు గొఱికి గర్జులువెలఁగించి—
తమలోన నందఱు దండుగాఁగూడి
కమిచిపెంద్రుకలీడ్చి కాళ్ళతోఁదన్ని
రంగని గుడిలోకి దొంగవై వచ్చి
భంగంబునొందిన భ్రష్టుఁడ! లెమ్ము!
కడజాతివానికిఁ గావరమద్దు
పడినదండమ వాని బయటికీడ్చి
దారిఁ బోయెడువారిఁ జీరిరప్పించి
చేరిచి యవ్వారిఁ జెప్పంగఁ దొడఁగి
రవునవు నిపుడు భక్త్యాఽఽవేశమెల్ల
సువిదితంబై వది జూడుండుమీరె—
జగతి కన్నులు మూసి వంతమనంబు
మగులుగా నిల్చిన మాపటివేళ
గుడిలోనికెట్లుఁ దిమ్మఁడుదూకివాఁడొ!
యడుగుండు మీరె నాయంబు చర్చించి—
యనిపల్కు విప్రులయా భాషణములు
విని చొకామేళుండు వినమితుండగుచుఁ
బరమపూరుష దయాపవనముల్వీచి
భరమైనయాఘాత బాధ దొలంగ
నలఁత దీరిన హృదయంబునఁ బల్కు
పలుకునఁ గ్రొత్త కావులు వెలయించి
పలికె నీగతి భక్తిభావబంధురుఁడు—
కలిమాయలకుఁ జిక్కి కానరుగాకె
గలదె! సర్వేశు చేఁతలకుఁబారంబు!
కలహాసములను దిక్కులు వెలిగింప
మెఱపులు దీర్పనేర్పరియైనవాఁడు
చిఱుచీఁకటులను నిర్జింప లేడేమి!

యెవ్వని వెలుఁగూని నవ్వును జంద్రుఁ
డెవ్వని కుడికంట నెసఁగుఁసూర్యుండు.—
యెవ్వని దయ నింగిఁబువ్వులు వెలుఁగు
నెవ్వని తెలివిచే నెనయు లోకమ్ము
లెవ్వని కనుమాయ నింకు సర్వమ్ము
నెవ్వని కరుణచే నింద్రాదిసురలు
నివ్వటిల్లఁ దలంతు రెవ్వఁడనంతు
డవ్వాని తలఁపుల కాటంకమేది?
చీఁకటికావల నేకమై వెలుగు
లోక పాలకున కాలోకంబు గొఱయె!
కాలుష్యమునఁ గన్నుగానరుగాక
కాలమొక్కటి పేఱుగలదె తలంప!
కాలస్వరూపంబు గాదె రంగండు!
పీల నీరద రమణీయ దేహుండు
మాయాసతికిఁ గన్నుమఱఁగించువాఁడు
నాయింటికేవచ్చి, నాపూజమెచ్చి
కోవెలకుమనన్నుఁ గొనివచ్చినాఁడు
గావలివారడ్డఁగలరె దైవమును!
నీరీతివచియింపఁజేరినవారు
దారు రంగని కథల్దలపోసి భక్త
వరుఁడౌట జర్చించి భక్తులక్షణము
లరిది చొకామేళునందుంట గాంచి—
పాఱులకెదురొడ్డి భాషించుధైర్య
పారంబు గొఱవడి సామవయముగ
బలికి రీగతి విప్రవరులార! యేల
గుణహీనుతో వాదములు సేయమీకు
శాంతిభూషణులకు నందదిమేలె!
బంతంబుతో భక్తిబరికింపఁబడునె!

విడచుట లగ్గగు వీనినటన్నఁ
జడిముడి పడుచు-వచ్చినవారిభావ
ముద్రలు గమనించి పొమ్మురా! మూఢ!
భద్రమెప్పటికి రావలదిందుసుమ్ము
పండరి నాథ దైవము నీకులేఁడు
పండరి పురిలోన వాసమ్ము లేదు
పరమ పూతము చంద్రభాగకావైపు
జరియింప వలెనిది సమయంబటన్న
నందఱు వల్లె యంచనిరి విజ్ఞాన
మందులకీ భక్తు కుందేమియెఱుక!
పదపడి యంతిమ స్పర్శదోషమ్ము
వదలించికొనయుక్త వర్తనల్సలుపఁ
జనిరి బ్రాహ్మణు లెల్ల జనములుగూడ
వినమిత శిరుఁడైన విష్ణుభక్తుండు
తలయెత్తి రంగనిఁదలపోసియార్చి—
వలవలఁగన్నుల బాష్పముల్గారియ
సాష్టాంగముగ నమస్కారంబొనర్చి
యిష్టదైవంబ! నీవింతచేసితివి
కానిమ్మటం చానబూనిగోవిందు
దీనప్రశాధారు దివ్యలీలలను
స్మరియించికొను చవశాత్ముడురువోలె
సరగఁ బ్రవేశించెఁ జండాలవాటి—
నల్లంత దూరంబునందె వీక్షించి
యుల్లాస వశమున నుప్పొంగమేను
బిల్లలుదన వీడవెంటనే బఱవ
నిల్లాలు లక్ష్మియైయెదురేగుదెంచి
క్షతజపూరితగాత్రుఁగని యంఘ్రులంటి
వెతగూరిజరిగిన వృత్తాంతమేమి

యని మాటికినిఁ గ్రుచ్చి యడుగవచించెఁ
దనసతికెల్ల గాథయువిస్తృతముగఁ—
దరుణియు నాయుదంతము నాలకించి
సురలకునైన భూసురులకునైన
నియతి దాటంగరానిదని గ్రహించి
భయనివారకుఁడైన పాండురంగండు
గతిగల్గ నాపదల్గలుగవటంచు
మతినమ్మి వారెట్టిమానిసులైన
పాఱులు మాన్యులౌ భావంబుచూది
వారిజాక్షుఁడు భక్తిపరులందెగాక
పెఱచోట వెలయునేవింగడంబుగను
దెరువేదియనియెంచి దేవునిసేఁవ
వణఁగిన ఫలమేమొ! యంచునూహించి
వణఁతిపైవమొవర్ప భర్తకుఁజెప్ప
వనితసమ్మతిగొని దినములోపలనె
బయపద నా చంద్రభాగకావైపు
గుడిపె నేర్పఱచె వక్రూరసన్నిభుఁడు—
కడఁగంటికొలుకులఁ గారుబాష్పములఁ
దననిసుంగులఁబూని తరళాయతాక్షి
వెనువెంట నడువంగ విదితభక్తుండు
చండాల వల్లకి సారెసారించి
పాండురంగనిఁగూర్చి పాడంగఁబోయి
యెలుఁగు వలింపంగ నెదవట్టుకొనఁగ
నిలునెల్ల వణకంగ నిలువంగలేక
పాండురంగాయంచుఁ బడిలేచియూర్చి
పంఢరిఁ పురికోడ వానంబు దీఱ
భాగ్యహీనుఁడనంచు బావురుమనఁగ
యోగ్యవాక్యమ్ముల నూరార్చెఁబత్ని

తరువాత రంగ గోపురమును గాంచి
ధర ఫాలములు సోకదండములెత్తి
ప్రమదామణియుఁదానుఁదన నిసుంగులను
గ్రమముగా నొసట ధరా ధూళిదాల్చి
పలుమఱుఁగన్నులు పులక చూచుచును
దలఁపులు పెనుకకుపరలంగఁ బాద
ములముందు కీడ్చుచుఁబురివై భవంబె
వలనవోయెడునట్లు భక్తరత్నమ్ము
పురిసాధు జనులయార్పులె దోడుగాఁగ
నరిగె సాయుజ్యభాగ్యమ్ము నుబోలె—
జరిగెను గొన్నివాసరములు చింత
మఱచెను భక్తుండు మానసంబందు
వీరజాక్షుండు సన్నిధిపేఁ వాని
కూటట గలిగించియున్న విధంబో!
చెలఁగె భక్తుని గీతములు ముందటివలె
నలినాక్షిరసముగ్ధనాట్యములెల్లఁబె
నొక్కనాఁడాతండు నిక్కంపు భక్తి
నెక్కొనమనమందు నేత్రముల్మోగిచి
తనకుటియెదుట శీతలశాఖిపీఠ
నొవరఁగూర్చుండి లోకోత్తరుగుణిచి
ప్రణుతి గీతములను బాడెడువేళ
వినమితమత్త దేవేంద్రకోటీర
మణికాంతి దంతురమంజులపదుఁడు
దనమోర మూపుచేతనె జగంబులను
కలిగించి నెలయించి పొలియించువాఁడు
తలఁపులుగుపియించి తనపోఁకలెంచి
తనువుపీడించి నెద్దనవివ్యమునుల
వనములఁ దవముఱ ఎట్టిన దొంకి

దొఱకక యనద భక్తులవెంటఁబడుచు
దొఱకెడు వాఁడు చిత్తరువైనవాఁడు—
నారాయణాఖ్యఁ జెన్నారిదేవతల
తీఱని కోరికల్ దీర్చెడువాఁడు—
తొలిమిన్కువీణె తంత్రులనదియించు
మొలకనవ్వుల రాగముల నిగ్గువాఁడు—
గలిమలంబులనెల్లఁ దొలఁగించువాఁడు
జిలుగుమువ్వంక నేర్పులయూటబావి—
కటి తట విన్యస్తకరముతో లలిత
కుటిలంబులగుఁ జూపుకొనలతో ఘల్లు
ఘలుమందుఁ బఱకు గజ్జెలతో-నెసంగి
పెలవులఁ దొడుగు నవ్వులతో నటించు
నెఱిగొన్న ముగుద ముంగురులతో కాంత
కరవేణుదండ సంగంబుతో వడకు
నడుముతో చెన్నారు బెడగుతో నెమ్మి
కొదవుతో మదరేఖకొఱికిపలాడు
నడుగులఁబెన గొన్నతడబాటుతోడఁ
గడుముచ్చటగ నిల్వఁగనుదోయితార
కలువిచ్చికొనఁగఁబుల్కలు గ్రమ్మదేరఁ
దలఁపులగముచు సుడులఁ జిక్కి హృదయ
వనజంబు దిరుగుడువడగ సంతోష
మునఁ దోగితనువు కంపనమొంద బాష్ప
జలపాద్యమునఁజేసి చరణముల్గడిగి
తలవంచి మ్రొక్కి ముగ్ధమనోహరములు
బలుకులుగొంతులోఁ బారాడఁదిగిచి
పలికె నీగతి భక్తిపండినదేహ
'యేమిరా! రంగయ్య! యేమిరా! తండ్రి!
యేమిరా! నాభాగ్యమింత పండినది!

తరుణారుణాబ్జసుందరములు ముక్తి
పరిమళభారబంధురములు భక్తి
స్రోతో వికస్వర శుక్తిపేటికలు
చేతస్సమాధానజీవ నౌషధులు—
పరమ భాగవత జీవంజీవ జీవ
ధరత్రై కపటువులార్ద్రజ్యోత్స్నలు శ్రుతి
లీలావతీ శక్రనీలబోధములు
ఫాలాక్ష చిరతపఃఫలములు భాగ్య
కూలముద్రుమములు ఘోరసంసార
కీలితమాదృశ కృపణ జీవులకు
దొఱకనియవి భవచ్చరణముల్ నేటి
కెఱుకలేనట్టి నాకొఱకయిపూని
యెంతదూరమురాఁగ నిచ్చగించినవి!
సంతతభక్త్యైకసంగ! నారంగ!
యిన్నాళ్ళు ననువీడియెట్టులుండితివి!
కన్నులఁ గపురంపుఁగాల్వలుగాఁ
జేయు నీదర్శనంబాయె నీనాటి
కాయాసమెల్ల మాయంబైనదోయి!
పరమ పవిత్ర! నీచరణరజంబు
శిరముపై ఎరివోసెఁదుఋముకోఁ గలిగి
పురుగైన మదికిఁ దొందరలేదు శాంత
నిరవధికానంద నీరధి! స్వామి!
నీవులేకున్నచో నిఖిలంబులేదు
నీవున్న లేనివి లేవురా! రంగ!
దీపప్రకాశంబు దివిరి వీక్షించి
త్రోవడిశలభంబుమాకి సేరుచు—
కలుషముల్ లౌకికాశలు వానివెంట
నలిగి విజ్ఞానంబుమలచునజీవి—

వాఁడదియెవ్వఁడా నందకందంబు
శ్రీమానినీబాహాచిహ్న చిహ్నితము
పతితైక శరణమ్ము పతితపావనము
నతమౌనిమస్తమందార దామమ్ము
శ్రుతికామినీముగ్ధచుంబ నాశ్రయము
శతధృతి కల్పనాసంధ్యాంబరమ్ము
నీయడుగులదోయి నిలుచునుగాఁత
నీయడుగులయందెమాయను గాఁత
యని పల్కి కనుదోయిఁగొనకొని పాఱు
వినయ బాష్పములర్ఘ్యవిధి దీర్చుచుండ
లలిత దృష్టిక్షేపములు రత్నదీప
ములనిల్ప నగవుల బొండుతోమాల
లలరించి ఫాలంబు నిలవంచిమ్రొక్కి
చెలువెల్లదనయందె నిలిచినవాని
చెలువు కందోయి నానలు దీఱఁగ్రోలి
పులకలుదనువెల్లఁ బొలయుచునుండ
లాలితా కారవిల్లాలినిఁజీరె
కాలుష్యరహితచాకామీతుడప్పుడు___
చూడవె, నవనీత చోరుఁడౌవాఁడు
వీఁడెదర్శన మివ్వవేంచేసెనిప్పు
డనిపల్కి-నమృతార్ద్రమైనట్టిమాటఁ
దనువెల్లశ్రవణముల్ దలకొనవినుచుఁ
దనశరీరంబెల్ల మనములుగాయ
మనముల యందెల్ల మమతగొంగారఁ
దనదేహమెల్లఁబాదంబులై నట్లు
వనజాక్షియవశయై బరుగిడివచ్చి
మొగమెల్లఁగన్నులే మొనసకానంగ
మగవెల్ల భక్తియేనాట్యమాడంగఁ

పులకసస్యంబులు ఫలించియున్న
యిలవోలి యొర్పెరూపెత్తినయట్లు
నిలిచి-రంగనిపాదతలములయందు
తలవంచి మ్రొక్కిన తలనూచి క్రమ
భక్తిజీవనుఁడైన పాండురంగడు
రక్తిదొల్కాడ శారదచంద్రికలను
పురుడించు చూపులు బొంపరివోవఁ
బరమవైష్ణవుల దంపతులను జూచి
తాను భక్త్యేకసందాని తుండగుట
తానువిచిత్ర వర్తనుఁడునగుట
భక్తి పరీక్షణాసక్తుఁడునగుట
భక్తమనోరథ ప్రదుఁడగుటయునుఁ
బ్రకటింపఁ దలఁచియిప్పగిదివచించె
వికసింపవాదర విస్మేరమైన
మొగముపై నొకవింతముగుద తనమ్ము
ముగుద తనమ్ములో మొనయ గ్రొత్తావి
పరమ భాగవతుఁడ! పరతత్త్వవిదుఁడ!
పరమ పాతివ్రత్య భాగ్యైకపేటి!
సంతసించితిని మీసచ్చరిత్రము ది
గంత విశ్రాంతమై కమలినీనాథ
యామినీనాథులున్నంతకు వెలుఁగుఁ
గో! మహాకవి భావపూజావిధాన
ధామమై కృతజగత్క్షేమమై సుజన
కామమై త్రిగుణనిష్కాసకంబగుచు——
సత్కలితత్యాగ లక్ష్మీకమగుచు
లక్షణందగుమీకులాగ్రియ చరిత
నరులెల్ల విని భక్తిసురభితులగుచు
విరసమ్ము సంసారవిధముదలంగి

పరమార్ధ మౌ నిష్ఠ భక్తిసాధించి
పరమపదంబును బడయంగఁగలరు
కనుగవల్ముకుళించి తనువుబుబ్బించి
మనసురసావేశ మాంద్యమ్ముదాల్చి
మహతిపై మీగాథమధురగానముగ
రవానేర్పరించ నారదుఁడు గీర్తించు
చిరకాలముగఁదానుజేసిన తపము
గరకట్టి వచ్చివకై వడి మీరు
బుట్టినదావనీభూమినాకమ్ము
ధట్టించు ధన్యతఁదాల్చెసత్యముగఁ—
బరమ భక్తులు నాకుఁబ్రాణమ్ములోయి!
పరమభక్తులయింటి పరవుడనేను—
నను మణవకమనంబున నెంచువానిఁ
గమలఁజూడక పూటగడువదునాకుఁ
బదునాల్గులోకముల్పాలింతునేను
విదిత భక్తుఁడునన్ను వేడ్కఁగొలించు—
వాని కాపదవచ్చుపట్టుననేను
బూనిరక్షింతును మోనలనిలిచి
పండరిపురిఁబాం వచ్చినయంతఁ
బాండురంగఁడునిన్ను వదలలేదోయి!
నీవేడనుండిన నీవెనువెంట
నేవచ్చి నిల్చెదనిక్కమీవలుకు—
పాండురంగడేడనుండెడునదియె
పండరి యిప్పుడిదే పండరియయ్యెఁ
బాండురంగఁడులేకఁ బండరిలేదు
దండిభక్తుఁడనీవు ధన్యుండవోయి!
పాండురంగనియంత వానిని నిలిచి
యుండఁజేసితివొక్కయుట కంబుపీడ—

నీవు ధన్యాత్మవనిర్భిన్నకాంతి
దేవతవైనిందు దీవెనలొసఁగి
పడయంచినా వాత్మనాథుని మనసు
చెడకుండ మోక్ష లక్ష్మీ భద్రపురికి
నీఁకఁబోవవచ్చునేయింతి! మఱచితి
సకసకలాడుచున్నది యుదరమ్ము
గడువడివడచిన కతననో కలికి!
ఎడికెడన్నము దెచ్చిపెట్టుమా! జాత
మనిపల్క వనజాయతాక్షి శిరమ్ము
వినయావనతముగావించి మొగమ్ము
ముసిముసినగవులమురిపెమ్ముగులుకఁ
బశుపతి వందితపాదపీఠునకుఁ
జలిదియన్నములోనఁ జల్ల నుఁజేర్చి
తలఁపులలోని శైత్యమ్ము బూరించి
తెచ్చి-లజ్జాభరాఽధీన మానసము
పచ్చియాసలెడందవాడు లాడంగ
నిలిచినరంగండు బొలఁతిపీమగఁడు
పలనొవ్వ భుజియింపవలె సుమ్ము ముందు
భుక్తశేషమునేను భుజియింతునన్న
భక్తుని కనులలోఁ బలపలగారె
వారి ధారలు దీనవత్సలుండైన
వారిజాక్షుండొక్క ప్రక్కఁ గూర్చుండె
బలవంతమునఁజేయబడ్డై భక్తుండు
లలనయర్పించెనుఁ దొలుతటిముద్ద
పదపడి సకలజీవవ్రాతములకు
మదిలోని కోర్కెలు విదికెడువాఁడు—
నానాజగన్నేత నారాయణుండు
దానప్పు డరుణహస్తతలమ్ము దాచెఁ

జలదికై భక్తవాత్సల్యమెంతటిదో!
యిల బులకించె వీక్షించి దృశ్యమ్ము
చంద్రభాగాభంగచయ ములు మధుర
మంద్రధ్వనులఁ బాడె మంగళగీతి—
తరుబారుణ కలిప్తములౌచుదవిలి
బూఁవిచ్చినవ జలధరములాఁడినవి—
సకలదిక్కులయందునొక క్రొత్తతెలివి
సకల తీర్థములందునొక క్రొత్తచవులు
సకల పుష్పములందునొక క్రొత్తతావి
సకలజీవులయందునొక క్రొత్తభావ
మావరించినది మాయాబ్రహ్మచారి
భావనాతీతుండు పాండురంగండు
మాలనియుచ్ఛిష్ట మధురాన్నమునకు
మాలెత తల్లిప్రేమకు నిచ్చగించి
చవులెంచి భుజియించు సమయంబునందు
దివినుండి వీక్షించి దేవతలెల్ల
రానంద బాష్ప పుష్పావళులిచ్చి
యానంద నందనునరిగొన్నవానిఁ
బరమ భాగవతశేఖరుఁడైనవానిఁ
గరమర్థితోడఁ జోకామేళుఁబూజ
గావించిరంతట గంజాక్షదర్శ
నావేశమునఁజేయెత్తులుసాఁచి
కనుదోయి చెమరింప గళులనుమింప
మనములుగాయ్యెక్క మాంద్యము విక్క
లలితకషాయకీవలనంక్తిరక్తి
మలుగూడ దీర్ఘపాంద్రమ్ముగాఁ బాడఁ
దొడఁగెను భక్తిసందోహమ్ము స్వామి
మదులు స్పష్టముగ విన్పడుచుండునట్లు

అంతఁజొకామేళుఁ డంతరంగమున
శాంతి దొల్కాడ శీర్షంబెత్తిపలికె
సనకాదిమునిమనస్సంచారియైన
వనజాక్షు దర్శించు పరమభాగ్యంబు
వసిగిగొన్నట్టి మహామహులార!
పుడమిపై నిదికడపుట్టువుగాఁగ
మోక్షంబుగైకొను పుణ్యాత్ములార!
వృక్ష సంస్థితులైన విహగమ్ములార!
పలుకుచున్నాఁడేమొ పరమాత్ముఁడిపుడు
పలుకు పల్కిన సుధాభరమును చేసి
వినవిందు భాషలు వినుఁడు మీరెల్ల
మనములానందైకమగ్నము ల్గాఁగ
నను పల్కితోన విహంగమ్ములెల్ల
ననుమతించినవి భక్తుని దైనయాజ్ఞ
వాసమయంబున నర్భకుండొకఁడు
పాశవమతి చంద్రభాగలోమునిఁగి
మడిదోవతులుగట్టి వడిఁబోవుచుండఁ
బడినవి జెవుల నీ పలుకులు శూల
ములవోలె హుమ్మని మొనయగర్జించి
కలకలనగి కండకావరమెంత
మాలవాని కటంచు మదిలోనఁ గలఁగి
ఫాలంబు ప్రస్వేదభరమునఁదోఁగఁ
దనువుగంపన మొందఁగనుదోయినిండి
ముసకొని విస్ఫులింగములెగయు
మడివీడ భీషణమూర్తియై వేగ
వడుగడుగున భూమి వడకంగఁబాఱి
కలికాలమలబద్ధకంకాళకోడ
నిలిచిమాటాడునే! నీరజాక్షుండు!

చూపింపరా! ముగ్ధచూడా శిఖండుఁ
జూపింపకున్న నిశాశూలమెక్కింతు
నని పల్కియుత్తరంబునకై వ నిలువ
కనయుండు రోషధూమ్రాక్షుండు మీది
కుటుకుచుఁబొరిఁ బొరిఁదఱుటుచు వామ
చరణంబుతోఁడ వక్షస్థలంబునను
నడచిన హరి! హరీ! యనియిలమ్రొగ్గి
పడియెఁ జోకామేళ భక్తవర్యుండు
భాగవతునియెదఁ బడినయాప్రేటు
శ్రీగణనీయంబు చిత్సుఖాకరము
గోపాంగనాకుచకుంభోభితామృ
తాపాన మత్తమధ్య ప్రదేశంబు
సురసుందరీరసోచ్చ్వాన కటాక్ష
వరపుష్పమాలికా వరణాంచితంబు
ముక్తికవాటంబు మునిజననివహ
సక్తంబు దోషవిరక్తంబు పద్మ
వాసినీ లాక్షిక పదముద్రికా వి
శేషక తారకా చిత్రిత నఖము
కలుముల చెలిచన్నుగవ యనుకరులు
సెలవెడికోట, మిన్కులపూవగుప్పె
తలకడగంటి చూపులు విచ్చుకోట
వలపులకెల్లఁ దావలమగుచోట
పరఁ జాతువియురస్థలమునఁ దగిలి
పరమ భక్తునిబాధ ప్రతిఫలించినది.
గమనపడలేదు పాణినికంటికప్పుడు
ప్రణత పాలకుడైన పాండురంగండు
కలిమలదూరుండు గర్వాభిమాన
మలిన మానసులను మన్నించునేమి!

సంచితపాపసంచయరుద్ధులైన
వంచకులకుఁ గావఁబడునా! రంగండు!
ధరణిపైన వశుఁడై మొరఁగినవాఁడు
ధరణీరణోబద్ధతనుఁడైన వాఁడు
గళమున నడఁగు నీరెలుఁగుగలాఁడు
వాలునక్రొవ్వేడిమూలుగువాఁడు
చీలిన యెదనుండి జిమ్మురక్తంపు
జాలుతో వికలలోచనములనిండి
పారు గన్నీటితో భక్త వర్యుండు
నీరసుండయిలేచి నిలిచి హస్తములు
నిటలతటంబుననిలిపిఁ మ్రొక్కినను
గుటిలవర్తనుఁ దర్పకుఁడు పెద్దనవ్వి
మఱలెఁబండరికి ధర్మంబుననిలిపి
విరుదుగట్టిన యట్టి నెఱవాదివోలె
మాలెత శాంతిసమంచితమూర్తి
మాలెత యఘ లేశమంటని పొలఁతి
మాలెత విరిగుత్తి మచ్చయంటనిది
మాలెత మాలనిమనుపు పుణ్యంబు
మాలెత యానంద మహాత సౌధమ్ము
మాలెత, పతి జీవమహాశాఽగ్రగణ్య
మాలెతమాలని మనసులోఁ దలఁపు
మాలెత మాలని మనుగడమెలఁపు
మాలని తలఁపుల మలపెడు తావి
మాలని ప్రాణంబు మాలనిక్రోవి
మాలని మనసు పంటల యాటబావి
మాలని బ్రదుకులో మలయుతొల్దివి
మాలెత, విప్రుదుర్మదముచెయ్దమ్ము
వోలపీక్షించియు మోనపతితిక్ష

బూని పాఱువిఁదిట్టిబోయెద నేన
మానని కోపంబునరిగించికొన్న
దెంత పండినదౌర! యింతి జీవితము!
అంతట భర్తృసేవాయత్తచిత్త
మానినీతిలకంబు మతిఁదూలవగచి
పూనిచేసినది బాధానివారణము
పాఱఁడాపయినిల్లుజేరి ఫాలమున
గిరునామమ్ములఁదీరిచి తెల్ల
మడుగు ధోవతులు సంభ్రమమునఁగట్టి
నడుమునఁబై పంచెకొంగవుగఁజుట్టి
యడుగులఁ బొగరుట్టిపడఁ జిఱునవ్వు
దడఁబడవాతెఱపైని జెక్కులను
మకరకుండల కాంతిమలయఁ, గండోయి
పెకమూపులుమియఁవిచ్చినపూలఁబోలు
తెలిజందెములుబ్రోవు తెగమెఱయంగ
కలిమల ప్రబలాంధకారజుష్టుండు
దేవాలయముచేరి దేవునియెదుటఁ
గావరంబులుగూడుగట్టిన యట్లు
బడిబడిమ్రొక్కి-బావఁడు నిల్చియుండ
నదురాజకోటీరునౌదయఁడౌవాఁడు
తొలిపల్కు-మొదవులవలపించువాఁడు
కలుముల చెలితపః ఫలమైనవాఁడు
ముగురు మూర్తులకును మూలమౌవాఁడు
జగములన్నియును బొజ్జనుగలవాఁడు
బొడగానరానట్టి నడవడివాఁడు
బొడసూపిమాపక యడఁగెడువాఁడు
వలచిన యట్టులై వలపించువాఁడు
తలఁచిన యటులుండి తలఁపనివాఁడు

నియతికి లోఁబడి నెగడెడువాఁడు
నియతిదానయి సృష్టి నియమించువాఁడు
పరదైవతం బైన పాండురంగండు
పరముక్తిదుండైన పండరీశ్వరుఁడు
భవమూర్తియైనట్టి పాండురంగండు
పవిధారికాయుస్సు పండరీశ్వరుఁడు
భాగవతులవేల్పు పండరీశ్వరుఁడు
వాగతీతుండైన పాండురంగండు—
పావతాలువుపంట పండరీశ్వరుఁడు
పాపాటవీవహ్ని పాండురంగండు—
పాఱుని గర్వంబు భంగింపఁదలఁచి
వీరభక్తునికీర్తి వెలయింపనెంచి—
తడయక యొక యద్భుతము సేసెనపుడు—
బడి బడి రంగని వక్షంబునుండి
ధారలుగట్టి రక్తాశోకపుష్ప
ధోరణి రక్తమ్ముబాఱె నేత్రములఁ
గారెఁ బాష్పములు ముక్తాప్రతిమములు
బేరెదయందుఁ బూజారి పాదంబు
తన్ను గుర్తులను నద్దంబునబోలె
గమ్నులఁ బడియె ముష్కరుడైన యర్చ
కుని యంతరక్షియుఁ గొనకొని విరిసె
వనజంబు ప్రాభాతమునయందుఁబోలె
నిందిరాపతియాన కెదురేది జగతి!
తుందిలదర్పుండు—మంద వర్తనుఁడు
దివిరి వీక్షించెనా దృశ్యంబు తోడఁ
గవిసె భయమ్ము దుఃఖమ్మాక్రమించెఁ
గనుల చీకఁటివిచ్చెఁ గావర మణఁగె
మనసులో నుడికె వెచ్చనివంత—తనువు

గంపించెఁ గంఠంబు గద్గదమయ్యె
కంపాలకా సహస్రమ్ములవోలి
నిలిచె కొనంగను దలముగాకుండఁ
దలలోన మెదలెఁ జింతలు దీనుఁడగుచు
బికిరిచూపులు జూచి తెకతెక నుడికి
మొకమునఁగళలేని భూమీసురుండు
చేయంగనేమి యుపాయంబులేక
చేయెత్తి యెల్గెత్తి చీఱెనందరను—
అంతలింతలనున్న యర్చకశ్రేణి
స్వాంతముల్ సంభ్రమావక్తముల్గాఁగఁ
బిఱుగిడివచ్చి చూచిరి శోణరక్త
భరపరిపూరిత వక్షుఁడౌవాని—
రెండు గన్నుల నీరునిండినవానిఁ
బాండురంగని భక్త పారిజాతమ్ము—
పరికించి వదనంబు వఱువట్లువార
తరతర కాయమ్ము తల్లడమంద
కమలు మబ్బులుగ్రమ్మ మనసులభయము
బెనఁగొన వెరవేది పీఁడులగుచు
నిలవ్రాయుచును వ్రేళ్ళఁదలగోకి కొనుచుఁ
బలవలనై యర్చకులు నిల్చియుండఁ
దాను భక్తుని యెదఁదన్నిన దుడుకు
మానసంబుననిల్చి-మదముడిందివది
యతిదురాగ్రహబద్ధుఁడాయర్చకునకు—
నతశీర్షుఁడగుచు రంగని పాదములకు
నిలువెల్ల దుఃఖమై నిలచినవానిఁ
దలరి పశ్చాత్తాప దగ్ధుఁడౌవాని
మొగమెల్ల నశ్రులు మూఁగినవాని
వగపుటూర్పులఁగందు వాతెఱవాని—

గళమెల్లఁజుట్టు గాద్గదికంబుఁబోని
నిలువెల్లఁ జెమ్మట లొలుకనవాని—
దీన దీనమ్ము లౌదృక్కులు వఱల
యానతికైఁ గాచినట్టి పూజారి
గుఱిచి పల్కెనుసుధా గుణబంధురంబు
పరతత్త్వమైనట్టి పండరీశ్వరుఁడు
పలుకు రతిక్రాంత లలనా దృగంత
ములఁబోలి కనులతో నెలయరక్తిమము—
ఓరి గర్వగ్రంధి! యోరివితండ!
కారుణ్య నిస్స్వంద! కర్మచండాల!
పరమ భాగవత శేఖరుడై నవానిఁ
బరమసాత్త్వికుని శాంతిరసాధిరూపుఁ
గడజాతివాఁడని కావరమూని
యడుగునఁదన్నిన యపరాధఫలము
ననుభవించెదవు నీవక్షరక్షరము—
మనుపంగ నేర రమర్త్యులు నిన్ను
నాకపరాధ మొనర్చిన నైన
నోఁకదు హృదయంబు నీఁకమద్భృత్తు
బాధించు నెవ్వండు ఫాలాక్షుఁడైన
వేధింతువానిని భీకరలీల—
పూనిభక్తావనమున కునై దీక్ష
బూనిన నాదైనయొక్క నిట్టూర్పు
ప్రళయ కాలానల జ్వాలలఁబోలి
యిలసర్వమునుఁ గాల్చునిది నిక్కువంబు
వినలేదొ! దుర్వాసముని పరిభవము!
వినలేదొ! కరినిఁగాచిన యట్టిగాథ
పొమ్ము! చొకామేళపుణ్యుని పదర
జమ్మునుదీర్చి ఫాలమ్మున వాని

కుంవాడ్కి గడశేర్చికొమ్ము జన్మమ్ము
మందుఁడై యిచ్చోట మంచెదవేల!
యనిపల్కి ప్రేటుదిన్నటుల బిట్టులికి
మ్రొగ్గకుందమై మసలంగఁ దమవు
మటు చేదుయ గొన్నమాడ్కి దయ్యంబు
శివమునఁ దాండవించెడు పోల్కిఁ గనులఁ
జీకటుల్ గ్రమ్మిన చెలువునఁ బెద్ద
యాకలిగొన్నట్టు లాబ్రాహ్మణుండు
దారి దొంగనిలేక దడయక యుటుక
పారులెల్లరును సంభ్రమున కురులు
పీడి భయమ్ము ద్రోపాడఁగ వాని
తోడఁ బారిరి వాన వీడి వేగమున—

ఆ యచ్చకుండట్టు లతిరయంబునను
బోయి బాధకు డప్పి మూర్ఛమనున్న
వాని-ధరారేణు పరిహారంబు
మేను దాల్చినవాని-దీనంబులైన
కన్నదమ్ములందునఁ గళలేని వానిఁ
దనదైన నతికంక తలమున శీర్ష
ముంచి వండినవాని నూర్చెదు వానిఁ
పంచమజాతి సుదృన మొందనైన
నిత్యముక్తుల తల నిలచిన వానిఁ
నిత్యరూపుని మెదనిండారు వానిఁ
గట మొగ్గలను బోలు కనుచూపు లెసఁగి
మునరంగ రంగ గోపురమునఁ జూచు
వాని రంగని నామ భజనంబు తోడఁ
బ్రాణముల్వట్టిన వాని నద్భక్తి
వీక్షించి సద్గురవే నమో యంచు
నాశణంబునఁ జరణాంతికంబందు

సాఁగి యొఱఁగిన సర్వతులెల్లఁ దోడ
మూగిఁ మ్రొక్కెడులోన ముందుగాలేచి
పరమ భక్తుఁడు దండపడి తలవంచి
హరిహరీ! యెంతట యపచారమయ్యె!
ధరణిఁబుట్టిన త్రయీతనులైనయట్టి
పరతత్త్వ విదులు భూసురులు దండంబు
పెట్టంగఁ జెల్లునే ఱట్టు మానిలకి!
నెట్టన శిరము ఖండింపఁ గారాదొ!
నాపయిఁ బగయొయున్న! మహాదురంత
పాపంబు నాతలపై నెత్తనేల?
నరిగించి కొనఁగందు హాలాహలంబు
నరిగించుకొనలేన యపని దేవులది
యపమానభరము బ్రహ్మాస్త్రమై గాల్చుఁ
బవిఁబోలె వంశగర్వంబులు జెఱచు
నని పలవించెదు నంత్యజుఁజూచి
వినమితముఖులైన విప్రులు పలికి
రవరుద్ధ చాపల్య! యపవర్గకైశ్య
నవమల్లి కాదామ! నాట్యసంరంభ
పరిజాహా భక్తి భావావేశపూర
భరిత జీవిత! పూత భాగవతాగ్ర
పర! రంగనాథ చంచత్పాద పద్మ
పరిమళవాసిత శిర! మాలవాఁడ
వన నపచారంబు సనకాదిమౌని
జనగణనీయుండవనెదము నిన్ను!
నవనీ సురులయేల! యఖిల దేవతలు
తవిలి యర్చింపగఁ దగినవిసుమ్ము
భవదీయపాదముల్ పాండురంగండె
యపశుఁడై నీభక్తి కాకలిగొనియె

నెంతపుణ్యుఁడవోయి! యిందిరాజాని
స్వాంతమ్ములో నిల్చి పండివోయితివి
అఖిల శాస్త్రార్థ సిద్ధాంతముల్దెలిసి
యఖిల వేదమ్ముల నంగడికెక్కి
మతిమందులై తిమి మదముగగ్గప్పి
గతిదప్పి జ్ఞానంబు కడగానలేక
గడుపులోపలజిల్ల గదలకుండగనె
బొడగంటివీవు నాపూర్ణ పురుషుని
నెంత ధన్యుఁడవోయి! యెంత ధన్యుఁడవు!
యెంతకట్టడిరోగ మీ యభిమాన
మనసీ మరులమన్న యాగ్రహమూని
యవమాన మొనరించి యలయించినాము
నిన్నుభక్త్యావేశ నిబిడమానసుని
నిన్ను మానవ వర్ణనీయచారిత్రు
నిన్ను బ్రహ్మేంద్రాది నిఖిలసంసేవ్యు
నిన్నుఁ బండరి పురీనిటల కుంకుమము
నిన్ను సాత్త్వికభావ నిబిడజీవితుని
నిన్ను రంగఁడు ప్రేమ నించినదరణి—
నెంత పాపులమోయి! యెంతపాపులము!
యంతమ్ము లేని మాయఘముదవాంచు
నేమొ జీవితమెల్ల నిందిరారమణు
ప్రేమకుబాహ్యులై నామభాగ్యులము—
క్షమియింప వలెమమ్ము శాస్త్రదుర్గర్వ
తిమిర వష్టులము తుందిల పాపవృత్తు
లము జ్ఞానలవహీనులము జాతిదంభ
ముపలోఁగి యపరాధమునఁ గ్రుంగినాము—
చెప్పనే వలె నీవు శ్రీపతికోడ
నొప్పింపవలె మమ్ము నొకకంటఁజూడ—

నిలుచు చున్నాఁడయ్య విఠలేశ్వరుఁడు
గొలిఎంచి కొనుకోర్కెఁ గూరియున్నాఁడు
నిన్ను దన్నినతన్ను నిఖిలేశ్వరుండు
గొన్నాఁడుఁ నీపైనిఁ గూర్మియెంతటిదొ!
చిమ్మనగ్రోవితోఁ జిమ్మినయట్లు
గ్రమ్ముకొన్నది రుధిరమ్ము వక్షమున
గమలలో జలములుగాలువగట్టె
మనసులో వాడెంత మథనమ్ముపడెనొ!
రావయ్య! తీర్తువు రంగని యలఁత
పావన విఠలేశ్వర పాదభక్తి!
పరమ భాగవత శాశ్వత భాగ్యబంధు
ధరణీ పతిహార తరళంబ! రమ్ము
రమ్మంచుఁ జీరు నర్చకులవాక్యంబు
లిమ్ముగా నాలించి యిద్ధతేజుండు
దనశాఁకుఁగొన్న రంగనికూర్మినెంచి
మనము నిస్సీమ నమ్మదమునఁదోఁగఁ
దనశాఁకుఁ గొన్న రంగని బాధ దలఁచి
మనసులో దుఃఖమ్ము మత్తమైరేఁగఁ
గనులఁగప్పట్టునఖంపచబాష్ప
గణముల సుఖము దుఃఖమ్ముసగలియ
శరముపోలిక వరానరిఁబోవ భక్తు
ఎఱుఁదనఁ బారిరి భీతులర్చకులు
శాంతిదేవత భర్తృచరణరాజీవ
చింతనాఖ్యాన నిర్జిత బాహ్యవృత్తి
యాచొకామేళుని యర్ధాంగ లక్ష్మి
చూచెనాథుని తెన్నుఁజూపులకందు
మేరకు విరిమల్లె బారులుదీర్చి
కోరికలేవట్టి ధీరచిత్తమునఁ

బాండురంగని గుడిఁబనతి వీక్షించి
దండంబు వెట్టివఁ దడయక గురిసెఁ
గోటివేల్పుల శతకోట దీవెనలు——
గాటంపు వేదన గదలింప హృదయ
మూపెయిఁ బాఱిన యార్తభక్తుండు
ప్రేమైకనిధి రంగవిభువిగ్రహెదుట
నిలచినఁ బెదవిపై మొలచెను నవ్వు
ఫలితావ తారుఁడౌ పాండురంగనికి——
మొనసి యాగలువోలె మునరిరి జనము
గనులున్న పున్నెంబు గాంచుట కొఱకు
అంత భాగవతుండు హస్తముల్మోడ్చి
వంతలోఁగూరినఁ బలుకుచలింపఁ
బలికె నీగతి భక్తిభావ బంధురుఁడు
జలనిధికైన నమేరలు గలవోయి!
రంగ! నీదయకు మేరలు లేవుసుమ్ము!
చెంగలించును సర్వజీవులపైన——
నాయూర్పువేడిలో నలిగినదెబ్బ
నీ యెద నాచిగొంటివిగదా! దేవ!
యెంత నిర్హేతుకమెంత చల్లనిది!
యెంత గంభీరమోయీ! భవత్కరుణ!
యేలగల్గినదోయి! యిందిరారమణ!
మాలవానికి నింతమమత! నాపైని
నేల నింపెదవోయి! యింత మిక్కుటము
జాలి లజ్జాభరాచ్ఛాదితమౌచు
భూమిలోనికిఁ గ్రుంగిపోవునాశిరము
స్వామి! భరియింపలే నీ మహానంద
మీయెడ బ్రీలునేమో! యనిపించు
నా యెదలోఁ జ్యోతి! నాయింటివేల్ప!

నాకంటిపాపా! నామనోధనము!
ఒకిలపోనియున్నత భావశిఖరి!
నాకోరికలసీమ! నాపరంధామ!
నాకుఁగాఁ బుట్టిన నారాయణుండ!
నానోటిలోమాట! నాసేయుచేఁత!
నానామధురవృత్తి! నానావతార!
యేలఁ జేసెదవోయి! యింతయాగడము
లేలఁజూపెదవోయి! యిన్ని వింతలను!
గనులలోఁగన్నీరు గార్చుటయేమి!
వననిధివృష్టఫేనవానిబాష్ప
ములనిల్పఁగలుగువారలు గలరోయి!
జలజాసనాదినిర్జరకోటికెవఁడు
గన్నీరుదుడుచు నాపన్న శరణ్యుఁ
డెన్ననాతఁడె గంటఁ గన్నీరుపెట్ట
నెవ్వరు తగువారలింకనోదార్ప!
నెవ్విధమ్మున నిల్చు నీ సృష్టి తండ్రి!
నిలువరా రక్తమ్ము నీరేజనేత్ర!
నిలువరా జగములఁగళలకాకరమ!
పాలింపరా! మమ్ము పండరినాథ
యాలింపరా! పల్కులఖిలలోకేశ!
దీనావనవ్రతాధీన చారిత్ర!
మౌనిమానసగుహాతమహాతహర్యక్ష!
సనకాది భక్త మండన దివ్యనామ!
వినతాతనయ పక్షపీఠీనకామ!
గోపగోపీమనః కుట్మలసురభి!
తాపింఛ మధుర లంఛాఞ్చితకేశ!
యనిపల్కు భక్తుని వినయమాలించి
కమలలో వెన్నెల కాంతులువిచ్చి—

ప్రత్యక్షదైవంబు పాండురంగండు
ప్రీత్యతిశయమ్ము జొప్పిలఁ బల్కెనాఁడు
వినవోయి! కారణజని! చొక్కామేళ!
ఘనమైన నీభక్తికిని లోఁగియిపుడు
పలుకుచున్నాను నాపలుకులావిన్న
తులువలైనను మోక్షఫలమొందు భంగి
నిసుము పరుసవేది నెనఁ సువర్ణ
తనుజెందువట్లు-సజ్జనబాంధవమునఁ
దరియింత్రు ఘోరాఘదళితఖ్యులును—
పరమ భాగవత శేఖరుడైన నిన్ను
గారించుకతన దుష్కరమైన ముక్తి
వీరికిఁగలిగెఁ బూజారులకెల్ల
వమతాపపరిపూతులై పట్టిదాన—
సనకసనందనాద్యనిమిషమౌని
సదృశులఁటౌ వీరు మోక్షము నందియుంటె!
సదమలత్వత్కటాక్షము ప్రసరించి
పావనమైనను భక్తిపంతనుబట్టి
యోపును పంసారమూర్ఛితరింప—
నారీలలామ గంభీరవాగ్వృత్తి—
ధీరతాస్పద మోక్షసారమూర్తి మతి—
కైవల్యమునుగూడఁగంటఁజూడనిది
పావకచరణ విధ్యానార్ద్రి హృదయ
మానవులేమి! యమర్త్యులు దలఁ
బూనింగఁ దగినయద్భుతచిత్త తెలఁగు
నీతవస్సునఁ బంట నీకుఁజెన్రక్ష
నీతాల్మి-నీముక్తి నీవకలమ్ము
భవదర్ద తనువు జీవన్ముక్త నిజము—
భవదీయసుతులు నిష్పాపులు-వారు

దరియింత్రు క్రమముగాఁదవిలిమద్భక్తి—
పరమపూజ్యంబై నభావత్కభక్తి!
ప్రకటమొనర్ప నే, నన్నితీవిధము—
సుతమందు మనివంత చోద్యంబుగాఁగఁ
బేరెదలోనుండి గారెడు రక్త
పూరంబు నిలిచిన, భూసురులెల్లఁ
గలగని నటులొకక్షణమునిల్చిండి
కలకలలాడఁ మోముల వింతకాంతి
జయజయా కారముల్ సలిపిరి భక్త
భయనివారకుఁడైన పాండు రంగనికి—
పురజనమెల్ల పండరమునఁగూడి
పరమ భాగవత శేఖరుఁడై నయట్టి
యాచోకామేళునియంఘ్రుల కెరఁగి
ప్రాచీన సనకాది భక్తసంఘాత
గణనీయుఁడని వాని గుణములుపొగడి
సఁతుల మేల్బంతి పతిజీవయైన
వానియిల్లాలి నభ్యర్చించి ప్రీతి
పూని తోడ్తెచ్చిరి పురమునకపుడు—
పండరి పురిలోన వాసంబుగూరె
పాండురంగనియందె భావమొప్పారె
భక్తిజీవనుఁడైన భక్తవర్యునకు—
రక్తితో భక్తనారాధించుచుండె
నాచోకామేళుని యర్ధాంగలక్ష్మి
యాచరణంబె నెయ్యంపుఁ జెలిగాఁగ—
పాఱులెల్లరును గర్వంబు వోద్రోలి
వారిజాక్షుఁడు భక్తివశుఁడన్న యొఱుక
గమనించి విజ్ఞానకల్పవృక్షంబు
నమల చరిత్రుఁడౌనాచోకామేళు

సేవించి కల్యాణసిద్ధిఁ బొంది
ఏవానికటిఁ గంటెనెఁగుఁడ లోకమ్ము
ఏవానిపాదమ్ము లింద్రాది సురలు
భావింత్రు హృదయదీపమ్మును బోలి
యావిట్ఠలుని కన్నసన్యమౌ దైవ
మీవసుమతిఁ జూడ నెందును లేదు—

పాండురంగా! యంచుఁ బల్కఁగఁ జాలు
ఖండితమజ్ఞానగాఢకాననము—
పాండురంగనినామభజనంబు పాప
షండనిర్మూలనజ్వాలానిభమ్ము—
పాండురంగని నామ భజనంబు ముక్తి
భండార మానందవారిధి వానిఁ
దలఁచెడువాని కోర్కెలు దీఱుచేమి!
గలుగునద్వైతమోక్షానందసిద్ధి—
పరమచొకామేళుచరితంబు నెవ్వ
రరుదారఁ బఠియింతురట్టిపుణ్యులకు
నావిట్ఠలేశ్వరుం డఖిలసంత్రాత
పావననాముండు భవరోగహరుఁడు
పాండురంగండు దివ్యానందవార్ధి
యంతగా నిలిచి నిత్యమ్ము రక్షించు—
శ్రీకరంబఖిలవశీకరం బమృత
శీకరభరితంబు చిత్తజవైరి
భావనాంబరపరిభ్రాజమానేందు
పావన జ్యోత్స్న యాపండరినాథ
నామంబు జగముల నలువుగా మెఱసి
కామితములు చిల్కఁగాఁ త భక్తులకు
వనియాట్లు వైష్ణవజనపదాసక్త
వినయభూషణుచేత, విజ్ఞానిచేత

తరినతపోవాటికా కల్పవృక్ష
శరమరణర్షిశాశ్వతగోత్రుచేత—
పాత్రమాప స్తంబసూత్రునిచేత
మిత్రవాతునిచేత, విపులయత్నమున
లలితశీషపే శలమైనధారఁ
చెలువమరంగ రచింపంగఁబడిన
పరమంబు పండరీ భాగవతమున
గరముచెన్నారు చోకామేళచరిత
భావబంధురమౌచు శ్రీవత్సధారి
సేవాఽనుసక్తుల జీవనంబగుచు—

(చోఖామేళుని కథ సమాప్తము)



# పండరీభాగవతము
## (నామదేవ చరిత్రము)

తనవిూఁద బ్రహ్మాదులును గానరాక
తనయంతవాఁడుఁ దానున్నవాఁడు—
తానందఱికినైనఁ దనకెవ్వరేని
యేవాఁడు నేరీతి లేనట్టివాఁడు—
తన యందు నఖిలంబు దానఖిలమునఁ
బెనగొన్న, నెందున్న విధిలేనివాఁడు—
రూపనామక్రియాదీవితుండైన
రూపనామక్రియారోపబాహ్యుండు—
అట్టిదిట్టి దటంచు నెట్టువచించ
దిట్టలులేనట్టి తిరుగలాఁడు—
భక్తి కవశుఁడౌట భవబంధములను
రక్తిఁజేకొన్న యర్చావతారుండు—
విదితగోపాంగనా ప్రేమవాఙ్మయము
విధుశేఖరధ్యాన విశ్రుతమహము—
పుండరీకుని భాగ్యమండపంబందుఁ
గొండగా నిలిచిన గోపాలమూర్తి—
కలికియశోదకుఁ గతకారిబిడ్డ
తొలిపల్కు తొట్లలో పలి వింతశిశువు—
పాండురంగఁడు లీల పండినరూపు
పండుపై నెలకొన్న పండరి' యందు—
నరపిశోదరదయా శరణచిత్తుండు
పరధర్మపరధర్మ పాతితానేక

చాపల్యాఁ దక్రాంత సాత్త్వికదృష్టి—
కాపట్యరహితుండు కామినీకనక
వంచనాఽతిగమతి వైష్ణవోత్తముఁడు—
చాంచల్యవిముఖుండు - సత్పుణ్యఫలిత
శివకేశవాఽద్వైతశీలకలాపుఁ
డవతరించిన దయనీశుండుదనకు
దయచేసినట్టి శూద్రత్వమేచాలు
భయనివారకుఁడైన పండరీశ్వరుని 15
యడుగులు గొలువంగనని తృప్తపడుచు
పెడబోఁకలుడివిన విషయగంధిలుఁడు—
శాంతంబుదనకుఁ బువ్వనిబందుగగుట
మంతులాడెదు జాతిమాత్రోపజీవు
లైన విప్రులకన్న సత్యోత్తముండు—
తానన్న వాసుదేవాఽమ భావంబు
నెఱపు గుణాబాయి' నిండుటిల్లాలు
తరముగా పసయించు దామాజియనెడు
పరమభక్తుఁడు నిరంతరము గోవింద
పరమనామము దనప్రాణమ్ముగాఁగ— 20
గడచెను కాలమ్ము గలుగలేదొక్క
కొడుకైనవారికిఁ గోర్కెల మొదవు—
దామాజి యెదకిది తగనికొఱంత
యై మానసంబును నలమటపఱప—
పలుమాఱు పసపెనిర్గలుచెంతఁగోర్కె
ఫలియించు కాలంబువచ్చెఁ జెంగటికి—
కలలోనఁ బాండురంగఁడు చిప్పకూళ
టులవాఁడు పెయినామములవాఁడు - పెడఁద
కన్నులవాఁడు చిక్కని నవ్వులాఁడు—
మిన్నంతవాఁడైన మిక్కిలిభక్తిఁ 25

దనుపువారలయెద దర్పణంబందు
నణఁగెడు నిభమట్టులణకమౌవాఁడు——
నిరుకళంబుగ మ్రోయని గమఁనూపురము
లరుదెంచి దామాజి నభివీక్షసేఁ
పలికెనోయీ! నీకుఁ గలిగిన కొఱఁత
ఫలియించుకాలమ్ము వచ్చెనీనాఁడు——
కులదీపకుండైన కొడుకుఁగోరితివి
కులమునకేగాదు కుతలంబుకెల్ల
వెలుఁగునిచ్చెడువాని వేలదేవతలు
గొలిచెడునట్టి వోకలుగలవాని——
నిచ్చితిబో సూనునింతైనవెనుక
వెచ్చపాటిగ తొలువిటిచేరమేమి!
ప్రత్యూషమున చంద్రభాగకుఁ బొమ్ము
మత్స్యవహాతమై నమరులు ఎద్దించు——
కమలంబుపై నూత్నకమలంబనంగ
రమణీయమొకటి యార్ద్రింబైనకుక్తి
దేలియాడుచువచ్చుఁ దీరై నదానఁ
బాలపాపఁడొకండు పవళించియుండు
నిదురకన్నులు యోగనిద్రయేగాని
యది లోకసహజమైనట్టిదిగాదు
వాఁడుద్ధవాంశ సంభవుఁడు లోకంపుఁ
గీడులు యోగుల క్రీగాలినంట
నేర్చునే! కోరికల్ దీర్చునే వారి!
నర్చిస్స్వరూపులకంటునే! కనటు!
నామామృతము వాని ధామంబు దివ్య
సామోదితంబుల సవరబోవాని
పలుకులచే పురాభాగ్యంబు బిలిచ
పలుకులచెలి క్రొత్త భంగిమల్ నేర్చు——

వట్టిన తాళముల్వదలక పలుకఁ
బట్టిన కవితలెప్పాటనిల్పకయ—
మదిఁ జేర్చియున్న నా పదములు - కీన
ప్రదులక భావంబుల దవదగాక
పదబంధములు దామె పడఁబాటియుదుక
మృదులార్థములు గండ్లమెదలుచురాఁగఁ
బలుకఁబోవఁడు రిక్కలఁ బోలుపాట
తెలమించి భక్తులకులము పాలించి
నామదేవుఁడువాఁడు నామనన్నిష్ఠ
శ్రీమహితంబుగాఁ జింతించి పడఁ
నట్టి భాగ్యమ్ము వేయాఱుత్రోవలను
బట్టి చిక్కులఁబడి భంగమ్ము నొందు
సాధకాళికి నామసరణి బోధించి
బాధదొలంచెడు వ్రతమూనుదాన
నామదేవుండు మన్నామంబువాల్చి
యీ మహాజనముల హితమునూహించి
యరయ నిరాకారుఁడైన దైవమ్ము
కరుణసాకారుఁడై తిరిగెడు దాన
నామదేవుండు మన్నామ నిధ్యాన
సీమాతిగంబైన చిత్కళతోడఁ
దనసీడ సోఁకిన తావులనెల్లఁ
బ్రణవంబు పండించి భాసిల్లుదాన
నామదేవుఁడటంచుఁ బ్రేమతోఁ బిలిచి
యాముద్దులాని భాగ్యముగాఁగఁ దలఁచి
పెంచుము పుణ్యముల్నించి కొమ్మోయి!
పండాప్తు గురువొక్క పావనిఁజేఁ
యని పల్కి పోయిన పక్షులువిప్పి
తనువెల్ల గరుపాఱ దామాశి' లేచి

తనబోటి నెచ్చరించి - నితాంతకరుణ
పనుపడ రంగండు పలికినయట్టి
తెఱఁగెల్లఁజెప్ప - చెచ్చెఱరమ్మపోద
మరుదారవీచె గంధాంధ వేదండ
యానసుందరముగా నలసమారుతము
చాన! యనుచుఁబల్కి - సతితోడనడువ
బరమపూతము చంద్రభాగనుచేరి
పెఱవాఱు కన్నుల వీక్షింపుచుండ___
నల్లంత దూరంబు నందుండివచ్చె
నల్ల నల్లనఁ బక్వమై తన పూర్వ
పుణ్యముల్ గరకట్టి పొడకట్టినట్లు
గణ్యమైనట్టి ముక్తాస్ఫోటమొకటి
యాశుక్తి లోపల నఱమూతకనుల
పేశల దృగ్విభావిసరంబుతోడ
పెదపెద నలఁతిగాఁ బొడము చిర్నగవు
తొడవైన తొగరు ముద్దులమోవితోడ
ఫాలస్థలమ్ము పైఁబడివింత యొఱపు
పాలించు భ్రమరక వ్రాతంబుతోడ
బంధుజీవకరాగ బాంధవ్యములను
సంధించి కొనుగండ చకచకద్యుతుల
మహాయంతయును మాటుమణఁగినవేళ
గ్రహతారకలు దేవగణము బ్రహ్మాదు
లడపొడగనరాక యాఱినవేళఁ
గడలిలోఁ దానొక్కకసుగందువోలెఁ
బవళించి యుండెడి పరమాత్మురేక
నవహాతుండై వక్త్రిమందుల్లసిల్లి
బొటబ్రవేలితోఁగూర్కి పొలుపొందుశిశువు
వటుగాంచి యానందమై హృదయమ్ము

కనుదోయముద్వాష్పక మనయమగుచు
తనువెల్లఁ బులకదుర్దినమౌచు జీవ
నంబు కార్తార్థ్య సాన్నాయ్యమై కంటి
నంబు జోదరుదై నయనుకంప బొడవు
నడెవచ్చె నిదెవచ్చె నవ్యయానంద
పదము మానుషమైన భంగిదావనుచు
దామాజి' సంతోష తరళితాపాంగ
దామసుందరుఁడౌచుఁ దత్తరం పడఁగ
వటుతూఁగు చిటుతూఁగు చలలపై వచ్చెఁ
గటకీకృతశ్రుతి కంజాతకరుణ—
దగ్గరించిన భక్తి దామాజి పొలఁతి
దిగ్గునలేచి మాతృప్రేమయునికి
దనుమిట్టలను పాలుజల్లింపఁ, గనులు
దనుపార మెఱపులై ఘనముగాముదము
తరములుదాచి - యాతసుగందునాచి
యురమున హత్తించి యూర్పులునించి
చనుమొనవత్తిమ్ముననుజేర్చ కందు
కనుదోయిదెఱచి చిక్కఁగఁజూచి యంద్ర
నీలముల్ జల్లించి లోలాక్షియొదఁద
పాలు ద్రావఁగఁజొచ్చె భక్తసంతాన
పరిపాలనాచార పండరీనాథ
పరమ కృపాదత్త భక్తిపీయూష
పానంబుచే జీత్తుపాయనియట్లు
దానెంత దొడ్డదో తల్లిప్రేమమ్ము!
ఆకలిదీరిన యట్లైన - చంద్రు
రేకల కనుగలంచా కన్నుగవలు
మూఁపబడుతందు ముప్పేటలగుదు
దూఁపప్రేమతోఁదోయజాక్షి

యాచెంప యీచెంప నంటుచుసారెఁ
జూచుచు చుంబించుచు నెడందహత్తి
కొనుచుఁ బాడుచునున్న కోమలిఁజూచి
తపనోము ధన్యమై దామాశి నామ
దేవా! యటంచును దీయఁగాబిల్చి
భావమ్ము సమ్మోదపరవశంబగుచుఁ
బాండురంగనిగూర్చి భక్తి నందించి
తండిరిసుతు కొక్కతని ముద్దువెట్టె—
వనఘపుణ్యములు చన్నవిఎచేవంగఁ ఆలఘు
జనవునసుతుఁడైనన సాయుజ్యసుఖము
బొసఁగనింటికిఁదెచ్చి పుణ్యులౌఎతరు
లెనకమెక్కఁగనున్న యొడఁగుమారుండు—
తనతండ్రి శ్రీరంగధాముఁడేకాక
తనకు నెక్కడి తండ్రియనుమాడ్కి నవ్వ—
కమలోదరునిమూర్తి కన్నులఁగట్టి
యిమిడినగతి యూరకేవిలోకించు—
శ్రీపత భక్త్యమృతమ్ము చేగ్రుమ్మరించి
పాపడు కరణిహస్తములారగించు—
శ్రీకాంతభజన నిశ్చేష్టతావస్థ
దాకిచేందావ దాపెలుంగందు—
కలగనియజ్ఞాన కలిలంబుద్రోఁప
చెలఁగియాడెడుగఁతి జేతులాడించు—
మాయానుబంధంబు మఱిమఱిదన్ను
దాయఁగా లీలఁగా - చరణంబులార్చు—
వనజనేత్రునిఁబాఎవచ్చిన తనకు
దినమెట్లు గడచునంచను భంగినులుకు
పరమకృపామూర్తి పండరీశ్వరుఁడు
పరువడి భాషించు పగిదినాలించు—

తగని మాయలలోఁగి పొగియులోకమ్ము
మొగిఁజూచి దుఃఖించు పొలుపునవేర్చు—
ఆడియండ ననివంగి హరిపాదములను
బడుగతిధరణిపైఁబడి బోరగిల్లు—
నిలపైని మఱుఁగైన నలినాక్షభక్తి
తలయెత్తువడువునఁ దాఁదలయెత్తు—
సనకాదులకునైన సర్వేశుజాడ
కననిట్టిదని తెల్పుగతిదోఁగియాడు—
హరిభక్తు పద్మాసనాసీనవృత్తి
నెఱినిట్టిదని తెల్పునియతిఁగూర్చుండు
పరమ వైష్ణవతతి ప్రౌఢమార్గమ్ము
గరకట్టినట్లుగాఁ గదఁగి నిల్చుండు.
శరణాగతిని వీడిపెఱ త్రోవలెల్ల
పరయనిట్లని తప్పటడుగులువెట్టు
వాక్కుల కందని వానిపర్ణించు
ఫక్కి యిదని తొక్కుపలుకులు పలుకు
మాయలోఁ గ్రీడించుమా నాధుచెయిది
పాయక సూచించు భంగిఁజెరాడు
వంతవినోదంపు టాటప్రాయమ్ము
వంతరింపఁగ సేవ సమకూడిరాఁగ
తనతోడివారి నందఱఁజేరి కనుల
మొనయంగ బాష్పముల్మద్దుగాఁ బాడి—
తాళముల్దట్టించి తైతయ్యనుచు
లీలతో నర్తించు బాలోద్ధవుండు
ఒకసారి కన్నుల నొనరఁగూర్చున్న
సకలేశ్వరుని రూపుఁజూచునో! యంచు
పడిగ తెప్పలుమూసి బంధముల్ద్రోసి
కడునిష్ఠఁ గూర్చుండి కరఁగులోలోన

నొకసారి దవ్వుగా నున్నట్లు కోరి
చికమకలనుగూరి చేయెత్తిచీఱు
నొకసారి ధవుఁడంట నొయ్యారమొలుకు
చికిలినవ్వులతోడ, ఎగ్గిల్లు రమణి
వడువున, నేవేవొ భావంబులాచి
యెదయెల్లఁ దనలోనె బుడిబుడివలుకు
నొకసారి బుడుతని నోదార్చుతల్లి
ప్రకటించు భావముల్ వదిలంపకంగ
రార! పండరినాథ! రార! నాతండ్రి!
రార! నాయార్పు! యంచారాటమొందు
నామదేవుఁడు నాడు, కామతంబిట్లు
కామధేనువుగాఁగఁగడపద్రొక్కినది
రంగనాథుని దయాభంగిచేనంచుఁ
తెంగలింపఁగభక్తి చేయెత్తి మ్రొక్కి
జనకుండు శ్రీశుయశమ్ము గీర్తింపఁ
గనులూరఁ దానాఁడుఁ గరములుదట్టి
తనతండ్రి చేతులుదట్టి నర్తింపఁ—
దనువు పెన్నెలఁ బోలుతానమ్ములార్చి
పలికెడు నాశుప్రబంధముల్ పలుకు
పలుకెల్ల విరవాది పగిడిగా విరియ
జనకుండు విష్ణుపూజలొనర్చునపుడు
చెవవునఁ గూర్చుండి చెవులు భావించు
విధుశేఖర ధ్యాన నిధియైనయట్టి
మధుసూదనునిముందు మలయుదీపముల
తోడుగా నానందతుందిల దృష్టి
జోడించి యొకవేయి జ్యోతులునిల్పు
జమిలి హస్తమ్ముల శంఖచక్రములు
రమణీయమైవెల్గు రంగధామునకుఁ

పొనఁగఁ దావమ్ములు పొనరించునపుడ
వశమైన హృదయమ్ము పలపలబాఱి
సకలతరంగిణీ జలములుప్పొంగి
యొకటిగాఁ గురిసిన యొరిమదోఁపంచు
తాపింఛగుచ్ఛ సుందరకుంతలునకు
పాపాపనోదన ప్రవణ పాదునకు
పండరీశ్వరునకు భక్తి వత్తొద్ది
తండిరి కుసుమముల్ దలకొల్పునపుడు
తనకరంబుల కాంతిదట్టాటి పూవు
లొనర నబ్జంబుల యోజఁబొల్పార
నందింపఁ బుష్పంబు లానందబాష్ప
సందోహములు తేనెజాలయిపాఱ
నందింపఁ బ్రేమమ్ము నందడింపంగ
నందనందనునకు, నారాయణునకు
నామదేవుఁడు – తండ్రి దామాజి కాంతి
సీమలై తనులు వీక్షించి యుప్పొంగ
నరిగెఁగాలంబిట్టులా కుటుంబమున
కరమరలేవట్టి యానందమునసె
పదియగునేఁడు సంప్రాప్తించె భక్తి
పదిముసు కలుగొట్టు నామదేవునకు
నొక్కనాఁడొక కార్యమొదవి దామాజి
ప్రక్క పల్లియ కేగవలెఁ బచ్చుటయు
నాటి పూజా విధానమ్ములో లోటు
వాటిల్లునో! యేమొ! పండరీశ్వరున
కనితోఁచి నామదేవునిఁ జేరఁబిలిచి
నెనరునముద్దారి వినవోయి కొడుక!
పనిగల్గెపీనాఁడు – పల్లెకుఁబోదు
పనజోదరుని పూజపరున దప్పెదునో!

నాయన్న! నామదేవా! యింటిదైవ
మాయెరా! పండరీరాయండు వాని
పూజదప్పననాఁడు పుణ్యంబువోలయు
నేఁజాడనైన నీవీ ప్రౌఢపూజ
నవరింపవలయు నీనలిపెడుపూజ
భవబంధ హరునకుఁ బాండురంగనికి
మాచేయుమతికన్న మన్ననకెక్కు
నీ చిత్తమందున నిలిచియున్నాఁడు
కడలేని బంగారుగనిగాఁగవాఁడు
కొడుక! మాపితరుల కోటిపుణ్యంబు
లొడఁగూడి యీయింట బుడుతవైనాఁడ
వాడికంబు నీ చేతియొక్క పుష్పమ్ము
తలపైనిఁబడినంత కిలకిల నవ్వి
వెలయఁబారాఁడు విఠలుని విగ్రహము
వోయివచ్చెదనందు ముంగురుల్దవి
యోయన నిల్లాలి కొకమాట చెప్ప
వోయిన నేటికా పురుషోత్తమునకు
నాయిచ్చుపూజలకై యెదనేమి
బ్రమవుట్టెనో! యంచుఁ బట్టంగరాని
ప్రమదంబు నిండార భక్తి భాగ్యమ్ము
నామదేవుండు తానమ్మ వేదీర్చి
తా మాతృదేవికిఁ దమిదీఱ మ్రొక్కి
జనకుపాదములు నిశ్చలఁదొఁచుదలఁచి
యెనలేని సద్భక్తి యేటువై పొఱ
పడతెంచె శ్రీ జగన్నాథునిదరికి
బుడిబుడినడలతోఁ బుడమినంతటను
స్థలపద్మములచాలు జల్లించికొనుచు—
జలజలమనిరాలఁ జఱువులందు

నానందపరతఁ గట్టాణిముత్తెములు—
మానసంబనురాగమత్తమై తూఁగ—
తెరువుఁజూచెడు దేవసురభి చెంగటికిఁ
దటితోడ వత్సంబు బరుగిడునట్లు—
కాచియుండిన ప్రాణకాంతునిదరికి
నేచినతమి - వచ్చునెలనాఁగకరణి—
ఆసక్తిగొని యింద్రియమ్ములు విషయ
వాసనలకులోఁగి పఱచెడునట్లు—
ఉడుగని తెరలెత్తు నుత్సాహశక్తి
బడి - కార్యవిజయంబు వడిఁబోవునట్లు—
తన చెన్నుపైఁగన్ను మనమును నిలిపి
చనుదెంచు నామదేవుని జూచి కోర్కి-
వదె వచ్చె నిదె వచ్చెనని శీర్షమెత్తి
యెదురు బొంగులు వోయెనిందిరాజాని—
నామదేవుఁడు భక్తిపీన సాయుజ్య
సీమంతినీచారు సీమంతభూష
పులకప్రణాళికా పూర్ణతనుండు—
దళితాఘపై కృతు ధ్యానంబొనర్చి
యంతుపట్టఁగరాకయలరుచిన్మూర్తి
వంతలోన ప్రతీకమందావహించి—
సకలంబు దానుగాఁ జరియించునట్టి
యకలంకరూపున కాసనంబొసఁగి
క్షీరవారాశి వీచికయ్యెఁబందు
నారవినేత్రున కర్ఘ్యంబులిచ్చి—
ద్యునదీజనన హేతు ఘనపదాబ్జునకు
ప్రణయశీతలముగాఁ బాద్యంబుజరపి—
మౌనీంద్రచిరతపోమయశిరునకు
మేనవల్పున్నట్లుఁ దానమ్ములార్చి—

కాలాధ్వములకుఁ జిక్కనిదైవమునకుఁ
బాలసూర్యులవంటి చేలముల్ గట్టి!
తనసేవ మనుజమందనమైనహరికిఁ
బనుపడఁదీరు లాభరణముల్ గూర్చి
జలధిజాచరణ లాక్షాబిందుశోభ
దులకించునట్టి కౌస్తుభమున్నవాని
తనురూపధవునిపై నబ్జాక్షికున్న
యనురాగమట్టి చందనములలంది—
కలువల చెలిమాచకములపై వాఁడు
లలితాంఘ్రులకు నక్షతలు సమర్పించి
ఘనపై జయంతికా కలితవక్షునకుఁ—
దనుపారువిరుల పూజనములొనర్చి—
పరమర్షి దివ్యహవ్యద్రవ్యగంధ
భరితదేహునకు ధూపమ్ము లర్పించి—
పరమపూరుషునిఋవలఁకులఁగాంతి
పరిశుద్ధములగు దీపమ్ములు గూర్చి—
నామదేవుఁడు ముందు నైవేద్యముంచి
శ్రీమహాకాకార! బంధుగంభీర!
రావోయి! సనకాదిభావనామూర్తి!
పావనతరకీర్తి! పండరీనాథ!
యెదుటనుంచిన పాలుముదముతోఁ గ్రోలి
యెదపుల్కరింపుల నింపుమాటాడి
నైవేద్యమునఁ జవి నాకు వర్ణించి
తోనచ్చఁగాని సొంపులు జిల్కరించి
యని చీరి పిల్చిన నబ్జనాభుండు
దనకెంత మదిలోనఁ దత్తరంబున్న
వాని సుధాపేశలానూనవాక్కు
లానెడు తమకంబులగ్గలించినను

గదలిరాకున్న నాకలిలేదా! నీకు
మధురంబుగాలేదా! మాయింటిపాలు
మీఁగడల్ జాలవో! మ్రింగుడు పడవా!
త్రాగుటకోలదో! కండచక్కెరలు
దక్కవో! వాసన దక్కవో! నేటి
కక్కట! మాసేవ లదుకఁగాలేదా!
యేల మేలంబు నాపాలి దైవతమ!
జాలమ్ము సేయంగ సమయమా! దివ్య
గోకులవాసినీ గోపీకరాజ్ఞ
కాకలీకలనిన దాకీర్ణ కనక
కంకణ హస్త సంగతిలేక దుగ్ధ
పంకిలపడునా! కృష్ణా! నాదునేత్ర
మింతమన్నింపరా! యింతకే మఱవో!
సంతగించిన గోపకాంతలు వారి
స్వాంతమ్ములిగురింపఁ బలుకాడి నీదు
చెంతఁజేర్చిననాటి చేఁతలు మఱచి
తివా! రూపుమాఱిన తీరుమారెడినా!
యవికృతమైనట్టి యానందభరము
తిరముగా నీతోన దివ్యవైకుంఠ
పరిసరమ్ములనున్న వానినీభువికిఁ
బంపితివొక్క నెవంబుతో స్వామి!
సంపునొదలఁ దాల్చి వచ్చినానిటకు
వచ్చిన నాపైని వర్షించుటుఱవా!
యెచ్చైనదయ కాక యెదబాటుగూర్చి
క్రుంగించుటుఱవా! నీకో! నాకా! నింద
శృంగారజలధి! యోచింపుసుమ్మింత
పాలుద్రావెడులోన వైకుంఠవాన
లాలిత భక్తకులమ్ము నీచింతఁ

దూలెడు నంచురావో! వెన్నయదియు
శ్రీలాలితాకార! చిత్సుఖాధార!
యిటులైన నాకథయేమిరా! యెట్టి
కటికి డెందముతోడఁ గాలమ్మునీడ్తు
నేదియెట్లైన నీవిప్పుడు వచ్చి
యాదరముంచి పదునుప్పుమగ్రోలి
పోవలెనా పూజపుణ్యంబుపండ
రావోయి! పమ్మనో రాజ్యభండార!
యనిమఱిచీరిన నరవింద నేత్రుఁ
డను పమంబను రాగమాగుబ్బుగొనఁగ
హృదయంబులో విస్తరించిన కరుణ
కదలాడఁ దెగమీఱు కన్నులయందుఁ
గమలజాకజ్జలా కల్పమౌపెదవి
రమణీయ మందహాసము ఎసాళింప
నిటలస్థలంబుపై నీలాలకములు
నటియింపఁ గ్రొంగ్రొత్త నాట్యభంగిమలు
ఆఱవంద్రులోని ఒహ్నాఁశమ్మువోలెఁ
గరమొప్పఁ బదనైన కస్తూరిబొట్టు
చఱుకుఁ గెంపులతోడ దొరయు వల్వరున
పరగింపవీరేజ పత్రసంతతులు
బటువుతా బ్రహ్మాండ ఖాండముల్దాల్చి
వుటపుటనై యున్న బొజ్జవౌనంక
పెడఁదపొక్కిలివాఁడు వేకారి, లచ్చి
పడుచు గుబ్బలపైని పవళించువాఁడు
గడుసుపిక్కలవాఁడు కడుమించుపురుల
తొడవుతోఁ జూడమెప్పెడు మోమువాఁడు
కలికి రేకలవాఁడు హాళదిపట్టంబు
గలిగి కన్దనెపెడు కాసుగలాఁడు

నెఱిమించునొక యింద్రనీలమ్మువోలి
పరిణతంబైన శ్రీవత్సంబువాఁడు
యాజానులంబి యాహా! పుట్టఁజేసె
తోఁజగానటియించుతో మాలవాఁడు
కపులకు వ్రేగైన ఘనవక్షమందుఁ
దనుకు కౌస్తుభకాంతి తతిగల్గువాఁడు
నీలమేఘంబొందు నిల్చికొన్నట్లు
లీలగా విష్ణుండు మ్రోలనిల్చుండి
చిక్కనిపాలు గుటుక్కునఁద్రావి
యక్కటికంబునన్ భక్తశిరము
నిమిరిపోయిన సుధానిష్యందియైన
కమలేక్షణునితాకు కలయంతతనువు
పులకలు మొలిచెంఎఁ దెలిగన్నులందు
జలజలరాలంగ సమ్మోదబాష్ప
ములు ప్రయస్పర్శచేఁ బులకించు చెలియ
పొలుపున నామదేవుఁడు గొంతతడవు
లలితలజ్జాభంగములఁ దొప్పదోఁగి
గరుపారుమేనునఁ గరములు మోడ్చి
నరసఖోదరునకు సాష్టాంగ మెఱఁగి
లేవ గుణాబ్ధియై దావచ్చి, చూచి
నైవేద్యమేమయ్యెరా! వత్స! యన్న
త్రావిన వాఁడమ్మ! దామోదరుండు
మోవిపైనదె చూడు మునరుకొన్నట్టి
మనమీగడలజాడ, కనవె యాబొజ్జ
కనువిందులొనరించె గారవంబూని!
యాకలిదీఱినదమ్మ! నాస్వామి!
కేకట నింక వర్తించు, ధైధయ్యా
[illegible]ఖ్య యనుచు సౌందర్యంబులుబుక

వేధాది సురతతుల్ వేకారివినఁగ—
ననిపల్క నా తల్లి యబ్బురంబంది
మనమున నమ్మకయును నమ్మకుండ
లేకయు మరియాడి సాకారభక్తి
యాకుమారుని పూజ యాత్మనాథునకు
వినిపింప, మోదమ్ము వేదురెత్తింప
పనుపడి కోర్కెలు పరవశుఁద్రొక్క,—
నా జియ్య! నా స్వామి! నా వంగడంబు
తేజంబ! నా నోము దీర్చిన తోట!
నిత్య సూరులలోన నిలిచినవాఁడ!
ప్రీత్యతిశయ తృప్త వేధోందతుంద!
నా భావనాచంద్ర! నా భక్తిఫలము!
నా భద్రములపేటి! నా వామదేవ!
ఆ పాండురంగని జూపరా! మాకు
నీ పుట్టువునమాల్చి నిఖిలపాపమ్ము
లటులుండు, నిటులుండు నా వికుంఠుండు
కటకీకృతశ్రుతి, కలితతాపింఛ
గుచ్ఛవిచ్ఛురితాలకుఁడు, రూపుగొన్న
స్వచ్ఛందశృంగార మచ్ఛమాహేంద్ర
చిరతపస్సలిలాంబుధర దివ్యమూర్తి
పరభాగ్యమైనట్టి పండరీనాథుఁ
డని తలపోఁతగా కచ్చంపురూపు
కనుదోయి బండఁగాంచిన యదిలేదు
జనకుమాటకు వీయకొనియె పుత్రుండు
వనజోదరుని దైవవరదర్శనంబు
నిప్పింతువని శ్రీకుఁడెంతగాఁదనకు
గుప్పట నొదిగెనో! తప్పనిభక్తిఁ
బట్టిన భక్తుల పాలిడింగరుఁడు,

కట్టిన పెల్లావు కమలనేత్రుండు
మఱుదినమున యందు మధుసూదనునకు
సరుసంబుబెవఁగొన సర్వ్యమ్ముదీర్చి
సనకాదిదివిజనమస్కారిశిరోభూష
లనుపమాంఘ్రులకు బాద్యంబులందించి
ఆ వైపు నీ వైపు నార్ద్రి మోమునను
భావమ్మునంట దీపములు వెల్గించి
జన్మజన్మమునకు సర్వేశ! నీవె
మన్మనఃపతియని మలరులు వూన్చి
ఇదె నాదుజీవనమిదె తపమ్మంచు
మది చెమ్మగిల్ల తోమాలియసాతి,
సర్వేశ సద్వృత్తచరితములోవలు
సర్వవాసనల ధూపమ్ములర్పించి
నైవేద్యముంచి, యా నామదేవుండు
భావించి చీఱిన పండరీశ్వరుఁడు
నడుమున చేతులు సలువైన మోవిఁ
తొడిఁబడు నవ్వులు విడుదకన్దోయి
బెరసిన సత్కృపా భరమొచునిలచి
వరపుడసైతి నీ భక్తికిఁ, దెమ్ము
నైవేద్యమన్నంత, నామదేవుండు
పేవించికొమ్ము, తండ్రీ! విశ్వవిశ్వ
సమ్మోహనాకారు! సాత్వికాచార
సమ్మితసాత్వత సాన్నిధ్యమూర్తి!
సనిపల్క, దామాజీ యరసి యేపేని
కమపడకుండిన కళవళపడుచు
నే మాయజేసితి విందిరాజాని
నామాంసపుంగండ్ల కీమాడ్కి-ననుచు,
వానఱచిన యట్టులఱచిన, తండ్రి

కీవంత బోకార్చనేవలెనంచు
నామదేవుఁడు హరిమోముపై చూడ్కి
సోమించి నిలువంగ స్రుక్కుచులికె
శ్రుతి పతికమన! విశ్రుతవైరిదమన!
ప్రతిలోక ఖండార! వాక్పరిష్కార!
నా తండ్రి కనుదోయి చేతమ్ముగూడ
శీతలంబొనరింపరా! కావకీన
మగు దరిపెనమిచ్చి - నిగమగంధములు
వగటించు చిన్నారి నగవులు చిలికి
యుని వేడ నభయహస్తాభిరాముండు
కనుగవమెఱుగులు కడలనెత్తఱులు
గామృదుహాస సంకలితమైమోవి
కామనీయమ్ముల కరవోలె వెలుఁగ
వచియించె నీ గతి వాగ్దేవి పుణ్య
నిచయంబు ముక్కారు నింపన యట్లు
నామదేవా! భక్తినందనారామ!
నామదేవా! ముక్తి సీమంతదామ!
యీనాటివా! మన యిద్దరి పొత్తు
లేనాటివో! కలియేచి ధర్మంబు
మునుగుడువడ, నిన్ను పుడమి కంపితిని
ప్రవృమరభావ దూర్వహములైనట్టి
పదకవితలుగట్టి ప్రజల నాకట్టి
యదయ మ్మధర్మమ్ము నడగించుటకు
నో యుద్ధవా! నీకు నొసరినపున్నె
మే యెల్లలకుమ భ్రాంతిందునా! యేమి?
దామాశ కిపుడు మద్దర్శనప్రాప్తి
ప్రాపించ యంతఁదొప్పదునె! యింతెంతో
తడవున్నదోయి! యేకరమునఁ జూడ

నెడసూది కొల్పి సాధించుఁగాకేమి
పండరీశ్వరుని యాభాషణంబులకు
నిండు గన్నులయందు నినిచి కన్నీరు
నామదేవుఁడువల్కె నా స్వామి! కరుణ
యే మేనుదాల్చి యీ భూమికి దిగిన
దని, భక్తవరులెల్ల రగ్గింపఁ, దెలిపి
మనమునవొకసారి మఱచియే కాని
పాండురంగా! యన్న పరమపాపులకు
నండపై నిలిచి తాపాపనోదనము
నొనరించు నీవు, నా జనకుపై నిపుడు
కనికర ముజ్జగించిన విధంబేమొ!
గరుడవాహన! నేడు గఱచితివేమొ!
వరవినాయకునుండి పక్షపాతమ్ము
నా తండ్రి కనుగప్పు నాకు గొల్వీడిన
చేతమ్ము రంజిల్లనా! తాత తాత!
నీమదికెక్కిన నిక్కంపుభక్తి
సామాన్యకంబుగ సాధింతునేని
భాగవత వ్యూహపాదరేణువులు
భాగధేయంబుగా భావింతునేని
పర భక్తపదసక్త పాదజలమ్ము
సురసరిత్తుగ్రగ్రోలి పొక్కెదనేని
భగవంతుకంటెను భాగవతులను
ద్విగుణిత భక్తి సేవింతువయేని
పలుమాటలేటికి పండరీనాథ!
తలచుట్టు పలుకయుద్ధవుఁడనయేని
నీవు నాగురులకు నెమ్మితో కరుణ
గావించిపోవలె కటకటం పదక '
యిక తాళలేదయ్య యిందిరాజాని!

ప్రకటకారుణ్యుండు పండరీశ్వరుఁడు
చాలింపు మద్దవా! పైరణవిరిసె!
బోలనిపంతమ్ము లేల! భక్తులకు
వరవుడమోయును పండరీశ్వరుఁడు
ఎఱికింపనిమ్ము నీ గురువులు నన్ను
నన్నంత, మనసెల్ల నానందమగుచు
కన్నులు బాష్ప ముక్తాతతుల్ గురియ
రావమ్మ నాతల్లి! రమ్ము నాతండ్రి!
దేవాదిదేవుండు భావనామయుఁడు
భవ బంధముల మాల్చు ప్రభుడురంగండు
భవభావనాకాశ దివసకరుండు
నిలిచికొన్నాడు తాఁగొలువిచ్చి తడవు
నిలువంగలేడమ్మ లలితపాదములు
కందును నావాని కందంపుగనులు
గందురుగాత! మీకాంక్షలు దీర!
ననిచీరె నాభక్తుఁ డప్పుడుగనిరి
జననియు జనకుండు సర్వవేదముల
కాధారమగువాని - నమరవై యాత్మ
నాథమ్ములగు చరణమ్ములవాని
కడునలికంబైన నడుమునయందు
నిడికొన్న చేతులయింపులవాని
చేకట్లవాని విచ్చిన తమ్మిదోయి
రాకొట్టు విపుల నేత్రమ్ములవాని
నేత్ర పాత్రములందు నిండిజాల్వారు
ధాత్రాదులను గోరు దయగలవాని
గీఱునామము వాని నీరేడుజగము
లాఁటిది వెలయించు తీరులవాని-
కఱివంక బొమ్మల యొఱపులవాని

పురడైన మొసలి రాపోగులవాని
నెఱులుగల్గుచు నిగనిగలు చిట్లించి
గరువుపైఁబడు నలకలగుంపువాని
నెమలిపించెము వాని, పీటుబోలంటు
కమలారతుద్రవా కల్పంబువాని
కని పులకాంకూర కలితులై యేమి
యనలేక చిత్రమ్ములై నిల్చినంతఁ
దెమ్మోయి! యుద్ధవా! తీయనిపాలు
సమ్మదంపడనీవు చవులెంచి గ్రోలి
పోయెదనని పల్కి పుండరీకాక్షుఁ
డాయత్తపడి వలహస్తమ్ముసాచ
నామదేవుండు దుగ్ధామృతంబొసఁగె
రామావతారమ్ములో మచ్చలేని
సాత్త్వికభక్తితో శబరి వేదాంత
తత్త్వమ్మునకు ఫలతతి నిచ్చినట్లు
చక్షుర్యుగంబు వాత్సల్యంపు భక్తి
పక్షమైన యశోద పాలిచ్చినట్లు
తన నాథుగాఁగోరి తరుణియై దర్పు
తనయ యచ్చంబైన మనసిచ్చినట్లు
కాఁదప్ప లోకమ్ము తలఁపునలేని
రాధ సర్వస్వమర్పణ సేసినట్లు
కాదుగ్ధమున్ గ్రోలి - యాదిదేవుండు
సాధువాదముచేసి చల్లగానవ్వి
యిక పోయివత్తునా? యత్తువా! సెలవు
సకల జీవవ్రాత సంజీవకరణి!
యనిపల్కి మఱుగైన, నపుడు దామాజి
తనయునక్కున జేర్చి తనువునే మఱచి
నీవు చిక్కినదాన నావంశమెల్లఁ

బావనమైనదో భక్తిభండార!
యొక యన్వయంబునం దొక వైష్ణవుండు
సకల పుణ్యమువండి జన్మించినప్పు
డటునేడు తరములు నిటు నేడుతరము
లటమటదొలఁగి మోక్షానందమొంద
తండిరినేగాను తండ్రి నీకెవఁడు
పాండురంగనిదైన ప్రకటరూపమ్ము
వసుమ నగ్గించిన నౌదలవంచి
వినయంబుపేసె నద్వినుతుఁడౌ సుతుఁడు
నామదేవుఁడు భక్తి సీమంతభూష
శ్రీమనోధామునిఁ జింతించిపాడు
పదములు పేలకు, భారతీ మంద
మృదుహాసములవంటి పదములుగూర్చి
అక్రూరు ననురాగమార్గలో మెలఁగి
శక్రవందితు బాడు సఖ్యభావమున
నాభీష్మ భక్తి హృదంతరం బాచి
కోఖిల్లగాఁ దత్వసూక్తులు పలుకు
హరిసూను బాంధవ్య మార్ద్రమైతోచి
పరమేశ్వరునితోడి నావిపర్ణిందు
ఆకృష్ణతానైన యట్లు భావించి
యాకులపడి ఎల్చు నాక్రోశమంది
స్వాత్మజితిప్రేమ చవులెంచి కోవ
పాత్రమ్ము పేయు సౌభాగ్యమ్ములాచి
వల్లవీభావంబు పారాడి విరహ
వల్లకి ప్రోయించు బాష్పరుద్ధమ్ము
పేలలక్షలుగాగ వినిపించె భక్తు
డా లీనమతి సుధాస్యంది గీతమ్ము
లా పాటలకుఁజిక్కి హరి, నామదేవు

నోపందు నిముసమ్ము నుజ్జగించుటకు
వారిసేవ నజ్ఞానమది యత్తమిల్లు
వరుసున, దిన్నఁగా బాల్యమ్ము బాసె
దనుజారి నామామృతమ్ముచే శాంతి
దనికెడువటు కండ్ల తళతళల్దోచె
వైరాగ్యమున ముక్తివాంఛనట్లు
తీరైన నవ్వులఁజేరె క్రొత్తళుకు
హరి రక్షయున్నట్టి నరుమదివోలె
యురము వానాటికి విరివియైతోచె,
శరణాగతుని నిత్యసంతోషమట్లు
గరువులపై క్రొత్తకాంతి భాసించె
పరభక్తు నిత్యసౌభాగ్యమ్ముపోలె
కరమెఱపుల మోవికావిదోతెంచె,
పనిసేయవచ్చిన పడిగాపువోలె
నవవిత్తదంణిక నక్కుచు వచ్చె
నామదేవుని భావనది క్రొత్తహంస
యై, మృదుశృంగార మావిర్భవించె
వరరూపదైవమ్ము నామదేవునకు
నరువమేతెంచెనం చెఱిఁగెను తండ్రి
యనుకూల బాంధవ్యమరఁ దామాజి
తనయు బెండిలిచేసె తని పూవుబోలు
భార్య రాధాబాయి భర్తతోఁ జెందె
నార్య సమ్మతమైన యట్టి సౌఖ్యమ్ము
లానమ్మదములొక్క యర్భకుండఁగుచు
వాసించె భూమిపై, వంశపావనుఁడు
మనుమండు గలుగ దామాజిమిన్నంతె
నవశారుబోలె గుణాబాయి మనసు
అచ్చుకట్టిన యట్లు అలరునే తండ్రి

కష్టంబుగానని, రా జౌతగారు
కాదు రాధాదేవి కన్నులు ముక్కు
నాదర్శమునయట్టులనె గుణావాయి
పౌలంతి భ_ర్తను జూచెఁదెలిగన్నులందు
తలపూవు చిఱునవ్వు తని సొమ్ముగాఁగ
నాదేవదేవునే యడిగి చెప్పెదను
వాదేల యని పల్కె భక్తుండు తండ్రి
పదిదినములు వానిపైని రెన్నాళ్ళు
లదెయిదెయనఁ జెల్లెవఱగదెవాఁడె
కరమువేఁకుకనాఁడు కరణోత్సవమ్ము
జరిగింప దామాజి సంబరపడియె
నిప్పచ్చరపుదేవి నిచ్చలు నిలిచి
ముచ్చటలాడెడి నచ్చోటికెవరు
వత్తురు బందుగుల్? భక్తులన్నంత
తత్తఱపడు మోక్షధాముండుగాక
దామాజి తులఎతా దామశోభాఽఖి
రాముఁడౌ శ్రీ పాండురంగనిఁజేరి
సాష్టాంగపడి దీనజన కృపావార్ధి
కష్టత్రాతాఽఽవన! కలిలాఽతిదూర!
మరుదధీశ్వర! నాదుమనమని నాము
కరణమీనాఁడు సాక్షాత్కారమొసఁగి
నాయింటి నిన్నప్పన్నంబు భుజించి
మాయి సంగునుమదుల్ మలయదీవించి
రావలెననియన్నఁ గ్రాల్గమల్లగవు
క్రొవులుగా నియ్యకొనియె రంగండు
వడిప్రొద్దుదాపైన నామదేవాదు
లడిబత్తి కన్నుల నాత్మల నిలువ
నెదురు సూచుచునుండ నెదుటను నిల్చె

సదమలముని తపస్సామ్రాజ్యమూర్తి
శరణాగతులయింట బరగు బండరువు
తెఱగంట్ల నేమంబుతీరిన కఱవు
గోపీజనమ్ముల కూర్మిగండరువు
కాపథదూర మోక్షదకల్పతరువు
లలిత పీతాంబరోల్లసిత దేహుండు
వలయిత మంజులాప్యాన బాహుండు
ఘుమఘుమాయిత దివ్యకుసుమ సంగ్రథిత
కమనీయమాలికా కలితవక్షుండు
జలధిజానేత్రకజ్జల చారుగండ
తలగళచ్ఛృంగారతరుణ హాసుండు
కరుణాపరిష్కార కల్యాణసార
వరకటాక్షరస భరిత దిక్కుండు
మదకలాప కలాపమండనాత్యంత
మధురాలక కలాప మహనీయమూర్తి
యప్పుడు శ్రీరంగఁడను రాగమొనర
గుప్పున వానవల్ గుప్పఁజిర్నగవు
నామదేవుని జూచి నామనోధనమ!
యేమి? నీ తలఁపు నా కెఱిఁగింపు మన్న
మనసెల్ల వెన్నయై తనువెల్ల భక్తి
మీనరార నామదేవుఁడువల్కె దేవ!
నీవట్టి నర్మిలి నేపేరఁ బిలువఁ
జేపడునో! మేలు చెప్పుమటంచు
నారాయణుండ ' నెనంది వర్ధనపు
బారులుగా నవ్వ పాండురంగండు
నారాయణుండను నామాక్షరములు
చేరలహర్షమ్ము చెవులలోఁబోయ
నామదేవుఁడు గళ సీమరుద్ధమ్ము

గా, మఱిమఱి పల్కెఁ గఱుపాఱుమేను
ప్రాముసల్ సేయు ప్రవర్గ్య హోమమ్ము
లామోదమునజేరి యానెదునట్లు
పాండురంగండు పాపడియె నన్నంబు
వండిన వితములు వర్ణించి కొనుచు
తమ్ములంటొవగెఁ జిత్తమ్మునరాగ
మిమ్మాడిక్కెఁ గ్రమ్మెనా నెలమి భక్తుండు
వోయివత్తునె? యంచుఁ బుండరీకాక్షుఁ
డాయెఁడ చిఱునవ్వ నానవ్వుతోన
కుప్పలువడె చంద్రగోళి గట్టించి
నప్పరుసునవెల్ల నైనవి కొన్ని,
నంజకెంజాయ నిచ్చలమైన యట్లు
రంజించు చీనాంబరంబులు కొన్ని
కనుబాటుఁ బొరయు చిక్కని యవరంజి
పనితనంబున్నట్టి వస్త్రముల్ కొన్ని
పులుగడిగిన ముత్తెముల వంచలములు
తలతలమని మించు జిలుగులుకొన్ని,
మాయూరవంధ నచ్ఛాయముల్గొన్ని,
కాయజశుక తుండకాంతముల్గొన్ని
కోశామ్ర వర్ణముల్గొన్ని వార్వాహ
పేశలరుచితతి పీతముల్గొన్ని,
యీ కరణిని వారి నెలమి మన్నించి
యాకులిత స్వాంతుఁడైనట్టి నామ
దేవుని కయివట్టి దీవించి, దేవ
దేవుండు మఱుగైన, తేజమ్ము దరిగి
గృహమెల్ల దీపమార్పిన యట్టులైన
మహమున కేతెంచి మధుసూదనుండు
తనపాదభక్తి తద్దయుపీక యేల

మనసును మఱగించు మాయదా నొసఁగె
కలుష సంహారు భక్తి గావలెఁగాక
వలువలి పేటికిఁ బదటికే యనుచు
వారి వారినిఁ బిల్చి వసనంబు లొసఁగె
నారాయణ పరుండు నామదేవుండు
కోకలిచ్చెడినట్టి కొడుకునుబట్టి
యాకట్టినది తల్లి యతఁడు దాచినునా?
కోకలుగావమ్మ కూర్మినాతల్లి!
శోకంబులివి, నందసూనుపై తలఁపు
మాలిచి యొఱకలు గూలిచి భక్తిఁ
దూలిచి సంసార మాలిన్యమందు
దేలించు, నిచ్చలు దెప్పయై నిలిచి
పాలితామరమూర్తి - పాండురంగండు
మనపాల నెలకొన, మంఎల్లి యేల
వనటకు మూలమ్ము భాగ్యముల్ గోర
బొదబొదమనిపల్కి సదనంబుఁజేరి
కదలని దయ్యంబు గదలించినట్లు
వలువలు కడజేసి పండరీనాథ!
తలఁపుగన్గొన నొక్క తటవటపేసి
బోయితివో! నీదు మోహమేగంటి
నాయుల్లమున నీదు నలుపైన రూపు
దక్క - నే కోర్కెయు నెక్కొనలేదు
నిక్కంపుఁ బంతంబు నీతోడు ననుచు-
పదములు బెడగార - భావముల్గార
మృదురాగములు దీర మేల్మిగాఁ బాడె,
నారాయణా!' యన నామదేవుండు
చారునేత్రమ్ములు పారించి చూచు,
నారాయణా' యన నామదేవుండు

కేరింతలాడుచు గిలకిల నవ్వ
 నారాయణా యన నామదేవుండు
కోరలెట్టిన పాప, కోరునాలించు
 నారాయణా యన నామదేవుండు
చీరిన యట్టులై చెంతదాఁ జేరు
 నారాయణా యన నామదేవుండు
 నారాయణా యను నవకంపు శిశువు
నారాయణుని దయఁగూర్చిన బిడ్డ
నారాయణుగ నెంచె నామదేవుండు,
నవరసంబులు గుప్ప నామదేవుండు
ప్రవణుండుగా పదబంధంబులల్లి
వింతవింతగ స్వామి బిల్చెడు నపుడు,
కాంతముఖుండైన కందును జాచి
పాఱఁగా వ్రరోడి, భక్తి గమ్మంగ
నారాయణా! యంచుఁ జీరెడునపుడు,
తన సతియైన రాధాబాయి కమలఁ
దనికిన శృంగార తత్పరతలను
జేరి పరీక్షించి - చిద్రూపమెంచి
 నారాయణా యంచు ననిచిన యపుడు,
గృహదైవతమ్మున ెదుటఁ గూర్చుండి
యిహసుఖమ్ములనెల్లఁ దృణముగాఁ జూచి
పూరేకులై పెదపూజలు దీర్చి
 నారాయణా యంచునను పూనినపుడు.
నారదాదులు భక్తిధీరులు మింట
బారులుగానిల్చి ప్రస్తుతింపుదురు
నామదేవుఁడు భక్తివందన వనము
నామదేవుఁడు హరి నమ్మినబంటు
గడచెఁ గాలమ్ము, నిష్కారణమ్ము మదిమి

యెదలాకి దామాజి కెక్కి-వచ్చినది
కహకహమను నవ్వు కన్నులం దొలుక
విహరించినది - యింట వీదలికమ్ము
నామదేవుఁడు దివ్యనామ పారాయ
ణా మిత సక్తుఁడెయ్యది విచారింపఁ
డాకోడ లీయింటి కాయింటికేగి
వాకొనుచున్నది వనట బెన్నైతలు,
పెలిచోటఁ బుట్టక కలవైన వేమొ?
వీరపడి యిచ్చటఁ బుట్టినవాఁడు
వీఁడు వెంగలిబిడ్డ! కూడెందుఁ గలదు!
జాడగా నొకనాఁడు చచ్చుగా కంచు
నపుడు గుణాబాయి, యాత్మజుఁజూచి
యపురూపముగ బుట్టినట్టి యో కొడుక!
కలరు భక్తులు భూమి కంజాక్షుఁ గొలుతు
రలవి యొతింగి నీయట్లు రేవగలు
తాలిగట్టిన భార్య తలఁపులు మాల్చి
బాలచంద్రునిఁ బోలు పట్టి బోవిడిచి
యిటు గురువులచెంత దొలఁగి యున్మాద
పరవశులై వట్టి భక్తులులేరు
ఇటు నిహం బటుపరం బెంచి సాధించు
పటు బుద్ధులగువారు బ్రాతిగారేమి?
పండరీశ్వరునకుఁ బరముద్ధరింప
పండబాతివ చేమ, నిండసంసార
మెవ్వరికించుకో? తప్పవదేమి!!
యివ్వుడమికి నీవు, గొప్ప భక్తుఁడవు
పరధర్మ మొక్కటేఁ బట్టిన యంత
పెఱధర్మములనెల్ల విడువంగ వగునా!
బ్రమదలఁ పుత్రులు, బాంధవుల్ చెలులు

తమతమ కర్మంబు దగిలించి కొన్న
వదలని బంధమ్ము లదవదం వడిన
వీరలదురే రిత్త పలుకులేగాక
ఎచ్చివాడా! జన్మమిచ్చినవాడె
యచ్చంపు కాపురంబిచ్చినవాఁడు
దీని సాధించిన దేవదేవుండు.
యేనాటికోరాక! యేడకుఁబోవు!
నన్నవస్త్రములకు వలజడి వడుచు,
కన్నులఁ దడివెట్టు కాపురం బగుచు
నారాయణా! యేమి గోరాయణుండు
వీఁడి! చాలింపు వెఱ్ఱివేసమ్ము
అని - మందలించిన - యాత్మను గొఱవి
గాని చూడినటులైనఁ గోకొల్ల లగుచు
కనుల నీళులు గార కంపితంబైన
తనువుతో పాండురంగని యాలయంబు
జేరుచు వలగొని చెలువైన పాగ
గిఱునామము కటిజేరిన హస్త
ములు మేల్మిబుగ్గలు వలకల సొగసు
అలవడగట్టిన యట్టి పసిండి
చేలమ్ము నెమలిపించెము వక్షమందు
వ్రేలాడు పూమాల, విరవాది నగపు
చకచకలాడెడి మకరకుండలము,
లోకయందముల దీవి యుర్విపై నిలచి
నటులున్న విభుఁజూచి, యౌదలమోఁప
కటకీ కృతశ్రుతి కాంత పాదముల
దివిజగంగకు క్రచ్చు దీర్చు బాష్పముల
నవఘటింపఁగఁజేసె యభిషేకమార్చి
వలచి కోరినయట్టి వారికి నీక

వలదన్న వానికా! వసుధపై బ్రదుకు!!
కనకమూలములైనా కమ్మల నిన్నుఁ
గనుకంట, ధనమెట్లు గందునో! స్వామి?
ఆపాత మధురమ్ములైన సుఖమ్ము
లా! పుట్టువొందినయట్టి ఫలమ్ము
లా సౌఖ్యముల చవిహాత్మలో మఱిఁగి
నానవిత్రి యజ్ఞ్ర మీసుదొల్కాడ
పనిలేని భౌతిక వాదమ్ముసేయు
జననీ జనకులెవ్వరని నాకు! నిచ్చ
లము నీకు నాకున్న లంకెయేగాక!
ప్రమితి స్వరూప! వైరాగ్య ప్రదీప!
ఒక శౌత్రి నాకిచ్చి యొకపుత్రు నిచ్చి
వికట బంధమ్ముల బిగియించి - నీవు
కనుమఱుఁగైపోవు కైలాటమాడి
నమవేల వేగింప నారాయణుండ!
నాతల్లి పలికిన నీతి కానౌనా?!
భ్రాఁతి యచ్చొనచోఁ బలుకక, యేల
వలవని పాలగింపులు! తేల్చిచెప్పు
మల, యామె వాదమ్ము లలవర్చికొందు
కాదేని సంసార కాలుష్యమార్చి
నీ దాసునిగఁజూచి నిక్కమ్ముఁబ్రోవు
మని నిష్ఠురోక్తులనాడిన - కనులఁ
దనపారు కరుణ చిత్తడిఁబోలఁజూచి
పలికె నీ విధమున పాండురంగండు—
కుందీవ! వసుమతి ఫలితతపంబ!
భక్తి కల్మాషకానవృ! కామాది
సక్తంతరాజాప్రాప్య! నా నామదేవ!
యీ వాక బగుతుండ, నేను నీ స్వామి

నీ వాదములు క్రొత్త లేపట నేర్చితివి
నామదేవునకును నారాయణునకు—
భేద మూరెడు సందులేమి నిక్కమ్ము,
తాను నిర్గుణుఁడైన దామోదరుండు
నామరూపాకృతి నామదేవుండు
తానగుణుండైన శ్రీశుండు నాన
నా బాహ్యతత్త్వంబు నామదేవుండు—
జల్లిమాటల నెవ్వరల్లిరోగాని—
చెల్ల! నీకును నాకుఁజెల్లునే! శౌరపు
నామదేవా! నీవు నన్ను వీడకుర!
యేమైన తానంత యెడబాటు నేను
తాళలేనుర! భక్తతతిలేక - బ్రదుకఁ
బోలదు నాకు గానాలీనమూర్తి!
యని పల్కి రంగని యానవంబందు—
వనువదుదైన్య భావమ్ము వీక్షించి
యనుమడియైనగ,' పెన్ని జన్మమ్ము
లనుభవించిన యెంతవనట బైకొనిన
వరకమ్మునందున్న నణనిమునమ్ము
వరరూప! నిన్ను నేమఱువగలేను
మోక్షసౌఖ్యంబైన మూఁడు కాసులకు
లక్షింప నీ భక్తి లాభంబుమెుందు—
నిది నాకు సత్త్వం బిది నాకు నెలవు
యిది నా ప్రతిజ్ఞ యియ్యదియె నా యుసురు
కౌగిలించెను స్వామి కరికరాకార
భాగంపముల(జేర్చి భక్తకోటీరు
నా రుక్మిణీదేవి, నేరనివాని
నీ రీతి వంచింప నేలంచు నవ్వ—
యట, నామదేవుని యనుగు నాకలికి

కటకటంపడి తల్లి గాఁడియఁ బెట్టఁ
తాలిమినేది రాధాబాయి యత్తఁ
బోల వీక్షించి నీ పుత్రుని గట్టి
కొన్న దానికిఁ జూడు! కూడైన లేక
పన్నలవలె మేము బ్రదుకంగవలసె
పుత్రులఁగననేమి పుణ్యంబు వారిఁ
బాత్రులఁ జేయంగవలెగాక, సుకము
లకు, దేవుఁడంచు బ్రేలాడుచు బ్రదుకు
వెకలికి పుత్రులు పెండ్లాము నేల?
నా గొంతు గోసరి నా తల్లిదండ్రు
లీ గండకత్తెర నిఱికించి మెడకు,
పరమ పాతివ్రత్య పద్ధతులెల్ల
జరగెడువారికి జరగునేకాని—
మావంటివారికే కైవడిఁజెల్లు!!
వావదూకులు తాము పరులకు బోధ
సేతురు ధర్మముల్ నేతులుట్టంగ
నా తెన్నులనుదామ యనుసరించెదరొ!
పాండురంగా! యంచు బనవినఁ గూడు
దండకు వచ్చునా! తనివిదీఱంగ
తాల స్నానము బెట్టఁ దేలంగవచ్చు
వాలాయముగ పీటిపైని విందమ్ము
లీ వల్కు, ల తుల భక్తాపాయనోద
నోపాయ లీలావినోదుఁడై వట్టి
శ్రీ పాండురంగని చెవులలోఁ బడియె—
నాపన్న రక్షకుండల్లన నగియె—
గరుఁడుని దానొక్క తురగమ్ము జేసి
యరిది ప్రాసుతులఁ గళ్ళెములుగాఁ జేసి
బత్తి యొఱకలంక పన్నెలు చేసి

హ_త్తిన వైరాగ్యమది జీనుజేసి
ధీరభాగవత సత్కార పుణ్యంబు
తారవజ్రమ్ముల తలకుచ్చుఁజేసి
పరమసాత్వత హృదాభరణమౌళాంతి
పురత ప్రస్ఫురద్రుచి, మొగముట్టుఁ జేసి
నెమలి కన్నులపాగ నె_త్తిపై వెలుఁగ
కమనీయమైన చిక్కంటి నామమున
మూలగోచి చెఱంగు పుడమిని జాఱ
బోలని పైపంచె నేల జీరాడ
శ్రీకుండు కేశవపెట్టి దానగుచు——
నా సైంధవ పురకున్నలమరంగఁబట్టి
కరపంకజమ్మున కనవద్దవారి
కెఱఁగుచు వినయంబు పొరిబర్వ, నామ
దేవుఁడన్ భక్తుండు దీక్షితుండతిధి
సేవలనని విందు మా విశాలాక్ష
యుని గేహ మెక్కడో! యొకసారి చూపుఁ
డ నిసారె యడుగుచు వల్లల్ల రాఁగ
వారు ఫక్కున నవ్వి నేరఁడో కాక——
కోరిక నరుదెంచె కోమటిపెట్టి
యిది యొక లాభమంచెద నెంచెనేమొ?
యదవదలయ్యెనో యయ్యమనీష
వామదేవుని యింట నా కూడు! వాఁడు
కోమారియై, గుడిఁ జొట్టుచునుండు
చేతిలో చిటికెలు, ప్రాతతంబూర
యే తఱిఁజూచిన నేల పదాలు
భళిరె! చక్కని గేస్తు - బ్రత్తించె నేఁడు
తలమున్క దినములే! ఁదానూరుజాండు,
యీ పెట్టియును నెదురెక్కించినాఁడు

ప్రాసంగు విత్తులవంటి నామాలు—
యిరువురు బగ తులే! యింకేమి కొదువ?
కలవుదీరఁగ నేఁడు కలదు భోజనము
వాడకెల్ల నటంచు పరిహాసమాడి—
కూడిన వంతోడి కోమటిసెట్టి
ఆ కనంబడుచున్నయదె! నామదేవు
శ్రీకరంబగు గృహసీమ! బొమ్మన్న
ఆయతంబగు కన్నుదోయికిఁ దొడవు
నై యుల్లసిలు నవ్వు నంతలో మలఁప
శ్రీకరంబగు గృహసీమ బొమ్మంచు
వాకు దప్పని యట్టివారు పల్కితిరి
మీ మాట వితయౌనె? నామదేవునకు
లేమియన్నది గల్గునే! మధుద్విషుని
యనుగులమనివింటి మాకని కింక
పసుపడకుండెడి భాగ్యమ్ము లేవి?
యని పల్కుచునె యల్ల నా యిల్లు దరిఁ
యనిమిష నాథాదులగు మనస్స్వులకు—
వఱగడె చిక్కని యంఘ్రులు మోఁప—
కరుణాపరిష్కార కాంత గంభీర
ములు చూపులల్లన బొలయించి లోని
కలనటపై కొన్న యతిథులమయ్య!
దూరదేశమునుండి తోతెంచినాము—
మా రాఁక గమనించి పదికించు భంగి
యాదరింతువటన్న యాదతో నిపుడు—
శ్రీధామచరణ పీఠేజ భృంగంబ!
పండరీశ్వర బహుఃప్రాణ! వైరాగ్య
దండితవిషయ! నిశాంత సద్భక్తి
దీపదీప్తమవక్క! పాపాపహార!

కాపథమార! మోక్షరసావతార!
కవికుల కలహంస! గాయకోత్తంస!
నవనీతమానస! నా నామదేవ!
రమ్మంచుఁ జీఱిన ప్రావల్య యింట
గ్రమ్మిన పేదరికమ్ము సూచింప
తన కలికొప్పు రాధాదేవి వచ్చి
మనమనుత్సాహమై మంద్రకంఠమున
మగవారు లేరింట యా యత్తగార
లగవుపై నెచటికో యరిగినారయ్య!
పోయిరందఱ వంతఁ బోవక పెట్టి
యోయమ్మ! నడవలో నొక్కింత ప్రొద్దు
గూరుచుందుము మేము వారింతలోనఁ
దారరుదెంచిన తీఱుమాయాన
లని విశ్రమించిన నా యింటి కోడ
లనుపుదప్పె నటంచునట నిల్వకేగె,
నారద వీణానినాద పీయూష
ధారుధారా పరిష్వక్త పాదుండు—
శివజటామండలీ శేఖరీభూత
పవిత్రలోకత్రయ పాదనదుండు—
ప్రరుచిర క్షేమాబ్ధి రాహళాయమాణ
ఖరనిశాచర వంశ గహనదావాగ్ని
నిరతిశయధ్యాన నిష్ఠిత వేద
పురుష భావగ్రాహ, పురువిలాసుండు
వాగంగనాతపః ఫలసాధుశబ్ది
భాగంభ్రువలయ నిశ్వాణరమ్యుండు
పండరీశ్వరుఁడు రవ్వంత పేపుండి
యొండవారినదమ్మ! యింతి! మా గొంతు
పరవ కృపామూర్తి! ఱలమిన్ని యొసఁగి

యరసి రక్షింపవమ్మా! యంచు నార్చె
నా యార్పులను విని యండజయాన
తోయంబు గొనితెచ్చి తొరగాఁగ నిలువ
జలమందికొనుచు నా సర్వేశ్వరుండు
ఫలితావతారుండు పలికె నీ రీతి—
నామదేవునివంటి నాథుని బడసి
భూమి మూర్తంబైన పున్నెంపుఁబ్రోవ!
నామదేవుఁడనంగ నేమనుకొంటి?
వామనుష్యుండుద్ధ వాంశజుండమ్మ!
కలియుగమ్మున రమాకాంతుని లీల
వెలయింప నేతెంచె నిలువియ్యనేసి
మాకును వారికి మనసులు తనువు
ఏకమై యున్నంత - హితము సవిత్రి!
పేరు కేశవశెట్టి పెద్ద బేహార—
మారసిబోదమీ యనుఁగు వటంచు
పరుగు దెంచితిమి, దెప్పరమైనలేమి—
యతిమెను కాపురంబంచు విన్నార,
మందుకే గొంత ద్రవ్యంబు దెచ్చితిమి,
పందియవడకమ్మ! సదమలాచార!
కైకొనవమ్మ! నీ కాంతునింకైన
వాకొనకమ్మ! దెప్పరములుగాఁగ
పెలపెలి యొదమికి పెల యేమితల్లి!
జలజనాభుని భక్తి సత్యమౌ ధనము
లని పల్కి చేటంతయై వక్త్రసీమ
వనజాక్షి యా సొమ్ము భద్రంబు సేసి
పప్పును బియ్యంబు నిప్పుడఁ దెత్తు
గొప్పవారగుదేర కొఱపేయరాదు,
దయచేసి యొక గడె తాళుంపుండు

అయిపోవు కను గిటినంతలో వంట
యనిపోవఁటోఁ దల్లి! యన్నియు వచ్చె
పనివి నెదమటంచు బలికి కేశవుఁడు
తిరిగిపోయిన భక్త పరివార దుఃఖ
పరిహారకుండైన పండరీశ్వరుఁడె
తావచ్చెనని యెంచి తరుణి యుప్పొంగి
భావించి మ్రొక్కి- విపణికేగి పలయు
నెల్ల సంబారమ్ము లింటిలోఁ జేర్చి—
యుల్లమ్ము హర్ష సంపుల్లమైయుండ—
నచట గుణాబాయి యటనిట దిరిగి—
ప్రచుర నిశ్వాసధూమ్రవ్యన్నమూర్తి,
పరుష వాక్యాదాన విరసంబులైన
యెరవు బియ్యము గొంచు - నింటికేతెంచు
చున్నది, దారిలో శోభితంబైన
పన్నగ తల్పుండు పండరీనాథుఁ
కోవెల దిలకించి - కొడు కిటమందు
దేవదేవుని యిలు దీర్చెడు కొడుకు—
వానిఁ దోకొనిపోవవలెనంచు వచ్చి—
మానిని, యా గరుత్మద్వాహు నెదుట
నిలచి తంబుర మీటు చలఘు గీతముల
నిలుపైని వాగ్దేవి నోయించుచున్న
వాసుదేవుని గాంచి నారాయణుండ
స్వామియన్ చింతతో సకలమ్ము మఱచి
యున్నట్టి వాని, రాగోన్నద్ధమతుల
కెన్నండు దెలియంగ నింద్ర మౌవాని
పెడద కన్నులతోడ విశ్వైక జనకు
నొడలు పానము సేయుచున్నట్టివాని
వాయమృతసార మాకలి దీర్పఁ

గాయంబు కాంతమై కనుపట్టువాని
నలనల్ల నాట్యమ్ము లాడెడువాని
కలుద్రావినట్టులు కాంత భావార్ద్రి
మగు పరిష్వంగంబు లబ్బిన ముగుద
మగువ కోలిక నఱుమఱచిన మనసు
నయి, తనలోఁ దాన, హర్ష హర్షముగ
నెయిది, యేమేమొ భావించెదు వాని
నామదేవుని గాంచి యీ మత్తుజూపం
మా మీఁది మనసును మఱలించినట్టి
మాయలపుట్ట రమానాథుఁడనుచు
నా యింటి రంగని నభివీక్షసేం
దూతెనిట్టులు, కండ్లగారు నీరమ్ము
లారంగ విభుని పాద్యమ్మును దీర్ప
నవనీతచోర! ఆమ్నాయ విదూర!
భవవైరి! యవిదిత భావనా చార!
వంక నిశ్శంకుండ! పారదారికుఁడ!
వంకుమకుఁడ! భిక్షుదావల్య వర్తి!
మా కుమారుని మాకుఁ గాకుండఁజేం
నీకుఁదాసునిఁగాఁగ నిలిం కొన్నావు
పెంచితివో! నీవు పెద్దజేసితివా!
వంచక! యెట్టిలీ పాడువత్తెమ్ము!
నీతియున్నదె నీకు? నీ భక్తులెల్ల
నీతిమంతుఁడవంచు నింగి కెత్తెదరు!!
అంకింతురెప్పు డుదారుఁ డీవనుచు
కొంకంబుగా, అంచ మంకింపకుండ
నెవరికే మిచ్చితి? ఇందిరాజాని!
యువకుఁడై వచ్చిన యాకుచేలునకుఁ
గరుణించి తందురు, కమ్మని యటుకు

అరివెట్ట కుండంగ నాదరించి తివ్వో?
భ్రాతృవంచన జేఁ వచ్చినవాని
దాతవిభీషణు దువ్వి దగ్గరదీసి
వైరివీరులబలా బలములు దెలిసి
యారావణుని హత మార్చి మోసమున
నన్నుఁ జంపించిన యందుకై, యిచ్చె
దన్నట్లు తమ్మున కవని నిచ్చితివి
ధ్రువునిఁ గజేంద్రుని - ద్రోవది గాచి
తివా! వారి నిష్ఠురాధ్యవసాయమహిమ
పరతంత్రునిగఁ జేయ, వంచింపలేక
కరుణ జూపించుటే గాక నిర్హృదయ!
రక్షకుండను కీర్తి రజ్జులేకాని
శిక్షించుటయె కాని రక్షింపలేవు
నినునమ్మి గృహములు నియతులు వదలి
గుణహీన! వచ్చిన గోపకాంతలకు
నిచ్చిన దపయశంబె కాక వారి
ముచ్చట దీర్చితో! ములు చిలమేటి!
పరదార ధనముల భంగించుటలును -
కటకి చూపులతోడఁ గల్లలాడుటలు
వరతులఁ జంపుట - తొడుకు వధించు
టడుగడుగున మాటలటమరించుటలు
నీపుట్టుకతోఁబుట్టి నిలచిన గుణము
లో పండరీశ్వర! యో నిరాధార!
యని యిట్లు దూఱెడు నాతల్లిఁ జూచి
వనజాక్షుఁడనె యేల పరుసంబుగాఁగ
ననుచెట్ట చేసెదు! నామదేవునకు
వనిత! నీపై ప్రేమ బంధమ్ములున్నఁ
దొడుకొని పోవమ్మ! మదువఁ బెక్కేల!

పడఁతి! నిశ్చయముగా భావింతు,వినుము
వాఁడు నా పుత్రుండు, వాఁడు మీ సుతుఁడు
గాఁడు బాల్యంబిట గడచెనే! కాని
మద్భక్తి సుమదామ మహితవహుండు
మద్భక్త పరనామ మనన దక్షుండు
మన్మనోల్లాస భూమస్థేమవృత్తి
చిన్మయ రూపుండు, చిలువాయనంపు
కోరికలకుఁ జిక్కి కొఱఁతల స్రుక్కి
పొరుకాడెడు కాలు బందెలై పోవు
వారికి వాఁడొక్క పీఁటడికాని
ధీరుండువాఁడు - సాకారంబు ముక్తి
సారంబు! విజ్ఞాన సార, మాచార
తీరంబు కంటి కర్పూరంబు నాకు
పరిపక్వమైనట్టి ఫలము వృంతమ్ము
దొఱఁగెడునట్లు చేతో హారియైన
నా భక్తిచే బండివడి వాని హృదయ
మీ భవచింతలనెల్ల మాల్చెనది—
నామదేవునకును నాకున్నయంటు
నేమింప నాటిది నేఁటిది గాదు—
అది నిరుపాధికం బది సనాతనము—
అది వేల తపములన్నైన యంటనిది—
సోపాధికము మీది మా! బాంధవంబు—
యీ పూట వత్తిల్లి రేపు బోవునది,—
యటు లౌట! వానికై యటుమటం పడుట
కటకట! కొఱ గాని కార్యంబుతల్లి!
పలికె గుణాబాయి'' కలబుద్ధి యెల్ల
నొలుక బోఁతివయ్య! యోవిఠలయ్య!
రాజ ధర్మము దప్పి రక్కసుం డగుచు

తేజాన జనములఁ దివిరి వెంటాడి—
వారి సర్వస్వం బవారణ దోచి—
కాటియల్ బెట్టెడి కైవడి మాకు
నేడు గడ్డైనట్టి యసుగు గన్గంట
పాడి దొలఁగుచు బంటుగాఁ దోచి—
తివి, తలి దండ్రుల నవశులఁ జేసి
తివి యింట దారిద్ర్య దేవి నెక్కొల్పి
తివి, చిఱునవ్వుతో జవ జవలాడు
పవిదిఁ దానెక్కి రావలిసిన వాని—
మనుమని బ్రదుకెల్ల మార్చితి వాఁడు
కనులలోఁ బ్రాణంబులను నిల్పికొనియె,
నీతి యేది! నీ కనీతియే గాక,
చాతుర్యములు పల్కి జనము ముంచెదవు
నాననేదిన వాఁడ! దీవరక్షకుఁడ
వైన నిక్కమ్ముగా మానుండి వాని
వేఱు సేసిన దాన, వీధులఁ బడితి—
మేరీతి రక్షించి తివ్వుదు మమ్ము
మేము దీనులు గామొ! మాపేని యుసురు
బ్రామ్ము, నాకటి మంట వద్చెమో! నీకు
నావేశమునఁ జిక్కి యాడెద వమ్మ!
పావని! యని వచ్చె పాండురంగండు
నామదేవుని వంటి నందను బడసి
ఖామిని! నీకిట్లు బలుకఁగ రాదు—
గత జన్మపుణ్య సంచయములు వంటి
యతిలోక నైర్మల్య పతివైన దాన
దామాజివంటి భర్తను జెట్టవట్టి
భూమికిఁ దొడవుగాఁ దొలఁకొందు దాన!
నా మానవపుఁ దావి నా యూర్పుక్రోవి

నామదేవుని వంటి నందను నొసఁగి
యాశీర్వదించినానమ్మ కష్టమ్ము
వీనమ్మ దోచిన వేదురం దెదవు!
గడచుచున్నదియెట్లొ కాపురం, బేమి
తొడబడినది బండి దొరగిల్లి వడె?
సంపదల్ త్రుంబుఁ జంచలలమ్మ
నింపాదిగా నిల్చునే! నిచ్చేలములె?
ఓదమి గల్గుటలెల్ల నువకృతి గాదు—
యొడఁద పటుత్వమ్ము లెనఁగించు గాని—
నేయిద్రావము ద్రావ నాయతంబగుచు
నాయగ్నిమటి నాల్కలార్చెదు భంగి
ననుభవించుకొలం దినం గదలెత్తి
మనసు భోగములకై మల్లడి గొనును—
దేవతాంతరములు త్రైవర్గికములు
నావితమే వేఁటు నవనీత హృదయ!
సతత లక్ష్మీ సమాశ్రితుఁడైన నేను
పతితులై పోదురో! భక్తులటంచు—
ధన ధాన్యముల నివ్వ దాసులకెపుడు
వనిత! కైవల్య సంపదలిత్తు గాని—
ననుశరణంబుగా నమ్మి తక్కుఁగల
మనసున వమ్మని - మద్భక్త వరులు
సుకపు మత్తానోలఁ జాతువ యేని
యిక నాదుయశమేమి హితబుద్ధియేమి!
శాకాయ లవణాయ! సర్వ దేవతలు
నేఁకటఁగైవల్య మివ్వంగ గలరె?
అపునరావృత్తియై నట్టి మోక్షమ్ము
కృపసేయు నన్ను బ్రముక్కడిభోగములకు
'డుకొందురె? ఫలభరిత వృక్షమ్ము

వాడుకొందురె తల్లి! వంట కత్తెలకు!
నైకజన్మముల పుణ్యంబులఁ జేసి
యాకళించిన యట్టి యనితర భక్తి
మప్పు భోగములకై మార్పఁబాలిదియె?
కప్పురమ్మును బెట్టి యుప్పు చేకొనుటె!
అని యాడు నాపల్కులఱమని వినుచు—
వన జాతగేహాని వద్ద కేతెంచి
నీపైన చెప్పవె నిజనాధుతోడఁ
గావించినది పాడి గాదంచుఁ దల్లి!
ముల్లోకములనేలు మొదటి దాంపత్య
మల్లవో? యిటు ధర్మమటమరించుటలె?
అఖిల కల్యాణ గుణాశ్రయుండనుచు
ముఖసుఖమ్ముగఁ బల్కు మునినికాయములు,
మావట్టి హృదయమ్ము మార్చి యీ చేయు
కాపట్య చతురత కల్యాణ గుణమొ?
హరిదంతయౌవతాభరణమైనట్టి
చిరకీర్తి గల్గిన చెలువునిగన్న
గేస్తురాలా! యిట్టి కస్తిగూర్చుట ప్ర
శస్తిగాదని కండ్ల జంకింపఁగదవె!
యని మొఱవెట్టిన నా జగన్మాత
కమదోయి విప్పదు గందరు వనఁగ
మఱల గుణాబాయ మాధవు చెంత
కరుదెంచి కంటినీ రలుఁగులు వాఱ
నిట్టూర్పు పొగవెగల్నింప ధమ్మిల్ల
మట్టట్టులై, శేనె తుట్టె గదల్చి
వట్లుగా వందను హస్తమ్మువట్టి
చేట్లకొఱవి! యేమి చిక్కువటంచు
నీ కొయ్య చెంత వేగింతువు బ్రదుకు,

నీ కిల్లు వాకిలి గాకపోయినదా?
పెంచిన గురువులు పెఱవారలైరా?
కొంచెమయ్యెనా? కట్టి కొన్నట్టి పొలఁతి
కొడుకు గాబట్టఁడో! జడుఁడవా! జోగి
వో! దిగద్రావ నీ పూర్వబంధములు
చాలుచాలిక నింద్ర జాలమ్ములందు
మేలిమివాఁడు సుమ్మీ! విఠ్ఠలుండు—
తెలిగన్నుగవల పైగలతోనె జగము
లలయించి యెలయించి కలిగించువాఁడు
ఆకండ్ల యొఱపుల కగ్గమై గాదె?
యాకలి దప్పుల నణచుట మునులు!
కరుణలేనట్టి యా కనుల బాగునకె
పలువుర మోసరి పాండునందనులు—
ఆ జగన్మోహనమైన యాకార
మా జగా చిఱునవ్వు, లాకటి హస్త
ములసొంపు, వంచన ల్దెలియనివారి
తలఁపులాకట్టి యూర్పుల నేర్పుకొఱకొ!
కమలనాభుండు మర్కటకంబు వాని
మమత లేటికి! బుద్ధిమాలినవాఁడ!
పుండరీకుఁడు తెల్వి పొరివోయి తపము
పండించి వైకుంఠ భవనంబునుండి
తెచ్చి నెక్కొల్పె నీచిప్పు సజ్జనుల
కిచ్చు నిల్కడలువోయెను నాటఁగోలె
పందు నేర్పుచు - భక్తవంచక! కాంతి
కందుక! యొకసారి కనికరంబుంచి
పంపరా! మా వాని - పట్టిని, వడఁతిఁ
బంపివచ్చునుగాని - సాన్నిధ్యమునకు!
పరమబాంధవుఁడైన పండరీశ్వరుఁడు

వరుసంబులైనట్టి భాషణంబులకుఁ
గలఁగి యానామదేవుల తయ్యావట్టి
యొలయవీరము తల్లి కొవ్వునపేం
వొమ్మ నీ సుతునకు బుద్ధులు గఱపి
నెమ్మది జీవింప నిమ్మంచుఁ బలుక
నామె యీడ్చుక వోవ - నరిగె గీమునకు
నామదేవుఁడు రంగనాథైక ధనుఁడు.
యింటికోడలు తాన మెలమినిదీర్చి-
కంటలే నగవు రేకలు గుప్తరించి
కూనిరాగములతో గోవిందుఁబాడు
చానన మెల్ల నానందమై వంట
సేయుచున్నది - వచ్చు జీవితేశ్వరుని
నాయక - దనయత్త నల్లంతఁ గాంచి
యెదురేగి తోడితెచ్చి యెన్నండులేని
మధురోపచార సంభ్రమములు నెఱప
క్రొత్తలు పుట్టెనే! కోడలిదైవ
చిత్తమందని యత్త చిత్తరువంది
ధామంబుఁజొచ్చి పదార్థంబులెల్లఁ
దామతామైపుట్టి తడవాడునట్టు
లేపట్టుఁగాంచిన నెక్కు తొక్కుడుగ
నేపార, రంగనిదిది దయయంచు
ఊరటపడిన హర్షోద్రిక్తకోడ
లారడంబున వంటలన్నియుఁదీర్చి
యత్తమామలఁ బిల్చి యాత్మజుఁబిల్చి
మత్తింపునగవు మోముచుఁ జిందులాడ
నామదేవులఁ బిల్వ, నామనిధ్యాన
సీమాతిగా మోద చిద్రూపుఁ డతఁడు
యెన్నండు లేని యీ యింపు, తన్మూర

సన్నుతికిని గల్గినట్టి కారణము
తలఁపునఁ దట్టక తాను భుజించి
పలుపలు విధముల భావించ, యింట
పరిచారికావృత్తిఁ బరఁగెడునట్టి
పరమపూరుషుఁడైన పండరీశ్వరుని
ప్రియ జనాభాసు నివృచ్ఛింప, నామె
క్రియగాఁగ రంగండు కెళవ పెట్టి
గా వచ్చి జలమాని కనకంబులిచ్చి
ధావంతముడిఁపన కై పడిజెప్ప
నామదేవుఁడు రంగనాధుని దయకుఁ
గై మోడ్చి- నాకేల కనకముల్ స్వామి!
గ్రుడ్డికి దీపమ్ము కొఱయౌనె! చెవిటి
పద్దకు సంగీత భంగులర్థంబె!
నిన్నొకనిని దప్ప నిఖిల విశ్వంబు
మన్నింప పఱకాసు మాత్రమ్ముదేవ!
యంచు రాధా దేవిగాంచి, యో పడఁతి!
వంచితవై తివే! భాగ్యమ్మువలన
యేవి! యా కనకమ్ము లిక్కడఁదెమ్ము!!
త్రోవఁద్రాలివిగాక! త్రోవ బాలివియో?
యని పల్క- నాయక యాత్మనాయకుఁడు
కనక మెల్లను దాన మొనరించునంచు
గుణుతించి కొంతదాపరికమ్ము పేఁ
కణకుఁ జూపులఁ గొంత కనకంబు నివ్వ
వారివీరినిఁ బిల్చి పీరేణవాటుఁ
డీ రూపమున వచ్చె నింకేమియనుచు
హేమమ్ములనుబంచి గామిడియొడమి
యేమాద్కిఁ జూచిన నిద్దియే యనుచు
పాండురంగని రూపు భావంబునందు

నిందించికొని భక్తి నినుపొరఁబాడె
దినములు చనె నామదేవునిపాట
లనుదినంబును వేలకై ప్రచరించె
నంత నొక్కదినాన నవటికేతెంచె
శాంతికూపారంబు జ్ఞానదేవుండు
గుణమణీనిచయ రోహణ ధరాధరము
పణితవ్య చరితుండు ప్రబల మాయాంధ
కారనిర్మూలన క్షమ చరణుండు
సారసోదరునియం శస్వరూపుండు
యెఱుక యాకారమై బరతెంచునట్టి
తెఱఁగైన యాజ్ఞాన దేవులఁజూచి
యెదురేగుదెంచి దుర్విధి దలంగించు
పదసరోరుహములఁ బాద్యంబు లొసఁగి
యా నీరములు గంగ కనుగులంబనుచు
దానాని వారి శిరస్థలమునఁ దాల్చి
పాదయుగంబులఁ బడి లేవకున్న
సాదరమ్ముగనెత్తి జ్ఞానదేవుండు
పరిరంభణముసేసి భక్తకోటీర!
పరమసాత్త్వికమూర్తి! పండరీనాథ
చరణాబ్జనిగడితాశయ! నామదేవ!
పరిమితియేది! నీ భాగ్యంబునకును
పరిచరించెను నీకు భక్తి సుఖమ్ము
నిరవద్య చరితుండ! నీ పితామహులు
నీవు పుట్టిన దాన నిఖిల పాపమ్ము
లావురువది యార్చి యస్తమింప గను
ప్రణుత సాయుజ్య సౌభాగ్యంబులంది
మనుకొని, నినుఁగూర్చి పొగడుచున్నారు.—
ఒక వైష్ణవుఁడు పుట్ట నొక యస్వభాయ

సకలుషమై ముక్తినందుచే భ్రాంతి—
యదియుండదనిమ్ము నేకాంతమ్మునందు
మది మదిగదియించు మాటలు కొన్ని
నాడంగవలెఁ నాయాగమనంబు
కూడునే సమయంబు గూడిమాటాడ
వనఁగ ధన్యోఽస్మి యిమ్మాస దీఱంగ
పెనగొను భక్తి సేవించుటకంటె
మాదృశులకు నింక – మహిమన్య మేమి?
ఖేదమటన్ననా పుణ్యుని కరము—
పట్టి పుల్కలు మేన నెట్టికొనంగ
కొట్టు హర్షంబున దూరమ్మువోయి—
యొక శీతల చ్ఛాయ నొనరఁగూర్చుండి—
వికసిల్ల కనులు – సొంపిల్లు హాసమున
జ్ఞానదేవుఁడు పల్కె, మేను చేకొన్న
శ్రీనాథ భక్తి భావా! నామదేవ!
యెన్నాళ్ళనుండియో యెదఁద నీకోర్కె
యున్న దీనాటికి నొనరె లగ్నమ్ము
నీవు నేమనుగూడి నిఖిల తీర్థములు
సేవించి యటనట చెలువుగాఁ గొలువు
దీరిన యర్చన తారముల్ కనుల
కోరిక దీరంగ కొల్చిరావలయు—
విదియాళమా కోర్కె ప్రదులంగనీక
మదిగూర్పవలెనన్న మనపెల్లఁగ్రుంగి
కటకటం పడి! దేవ! కాదిది నాకు
నెటుఁబాద పండరి యే నాదుపాలి
కఖిల తీర్థమ్ములకాశ్రయ భూమి
ముఖచంద్ర చంద్రికా పూరిత భక్త—
నికరుఁడై దాక్షిణ్య నిలయుఁడై నేత్ర

వికసిత కారుణ్య విభ్రముండగుచు
కటిమండలంబునఁ గరములు చేర్చి—
యిటుకపై నిలచిన యీ పుండరీక
వరదుఁడే యెల్ల దైవతములు నాకు—
సరయుభూవైకుంఠమైన యీ పండ
రీ నివాసము మాని శ్రీరంగనాథ
మానిత పాదపద్మమ్ములు మాని
యొక నిమేషంబైన యుర్విపైబ్రదుక
సకుటిలమూర్తి నాకగ్గలం బయ్యె!
శయపద్మములనున్న జలముఁబోఁద్రోచి
వియతిమేఘమ్ముకై వేకారినటులు
పెరటనుండిన కల్ప వృక్షమ్ముఁ ద్రోచి—
పెఱవృక్షములఁ జూడ మురిసిన యట్లు
తనపారుసుమ వసంతముఁబోవవిడిచి—
తనితావులకు వేఱు దలచినయట్లు
వరశరచ్చంద్రికా స్ఫురితంబు వదలి
తిరిసిన యటు, రిత్త దీవియ కొఱకు—
పండరీశ్వరుఁడు నా పాలిటనుండ
నొండు దేవతలకై యొగ్గుట యెఱపె!
స్వామి! నా సర్వంబు పాండురంగండు
నా మేను, నా యాత్మ నా జీవనమ్ము
లాసర్వ మూర్తికే శేషంబుగాని
పీసంబు నితరుల శేషంబుగాదు—
జ్ఞానదెవా! సర్వ శక్త! యజ్ఞాని
దీను, నన్గరుణించి తికమక లెంచి—
తైలధారయుఁబోలెఁ దఱగక నొకట
పాల బుగ్గలవాని పండరీశ్వరుని
నిరతంబు దరిసించు నిరధికమైన

వరమకైవల్యానుభవము గల్గంగ
దీవింపవలెనంచు దిగ్గనలేచి
భావార్ద్రిముగఁ బాద వనజంబులంట
జ్ఞానదేవుండు విజ్ఞాన కల్పమ్ము
పాణియుగంబుల పండరీనాథు
ననుఁగైన నామదేవునినెత్తి కనులఁ
గనికరమే పారఁగనులలోఁ జూచి—
యో నామదేవ! నిత్యోన్నత భావ!
యో నామదేవ! భక్త్యానంద పావ
నాకార! తెలిసెలే! మాకు నీకొదలు,
శ్రీకాంతుఁడే నిల్చి చెప్పంగనైన
నమ్మతింతువా? మాదు సహవాసమునకు—
రమ్మురమ్మం చుత్తరమునకునైన—
నాగక - యవ్వాని హస్తంబు పట్టి
వేగంబ శ్రీశుకోపెఁజేరి యందు
వలగొని కైమోడ్చి బలిపీఠమునకు
ఫలితావతారంబు పండరీశ్వరుఁడు
కటి తటమ్మున సొంపు గట్టహస్తమ్ము
లిటుకపై నిలచి యక్కటి కంపు కప్పు
రము జార్చుపెదఁద నేత్రమ్ములతోడ
కమనీయతకుఁబరాకాష్ఠగా వెలుఁ
నట్టి సన్నిధిఁజేరి నిట్టు వాయంగ
గట్టిన రూపమ్ముఁ గన్నులఁ ద్రావి
జ్ఞాన దేవుండు విజ్ఞాన దీపమ్ము
జ్ఞాన దేవుండు నిష్కామ్యతాఋద్ధి
జ్ఞాన దేవుండు భాషా పరభోగి
జ్ఞాన దేవుఁడు విష్ణు సాకార మూర్తి
విధివిహితమ్ముగా విభునిఁ బూజించి

ప్రథితవేదములకు వాఎగాఁ బొగడి —
స్వమనోరథమ్ము విజ్ఞాపన సేయ
సవితాదరమ్మున నాలించి సమిత
పరమేశుఁడైన శ్రీవాసుండు పలికె
నరుదయ్యె జ్ఞానదేవా! నీవుగూడ
తీర్థయాత్రలకునై తీవరం పడుట
తీర్థమ్ములెల్ల నిన్ దిరియు గారవము
నీవు వైకుంఠమ్ము - నీవు కైవల్య
మీవు మా రూపంబు నీవు ప్రామునుల
కెల్లను తలకట్టు నెల్ల యోగముల
కెల్ల సాధనలకు - శృంగాటకమ్ము —
విధుఁడు గైవల్యమ్ము వెదకుచుఁబోవు
విధమున సూర్యుండు విపుల తేజమున
కంగవించెడువట్ల ఖంగురజ్ఞాన
మంగళమూర్తి నీ మదికి నీ కోర్కె —
యన జ్ఞానదేవుండు హస్తముల్మోడ్చి —
కనులందు మనమందు వినయంబు దొలక
శ్రీవాస! మీరన్న శ్రీసూక్తి నిజము
గావచ్చు నైన భక్త్యమృత కూపార
మీ నామదేవుండు హృదయంగమంబు
లైన యీతని పాటలనవరతంబు
వినుచు నాయాచోట్లఁ గనుచు మీ మూర్తి
ననుభవించెద భక్తి, నాచవి యొట్టి
దో! యెఱుఁగఁగఁబోలదో!! మాకుఁదీర్ప
డీ! యింత కోర్కెయం చెంతయో వేడ
పండరీనాథుండు బంధు సంతతికి
పండిన పెరటి కల్పకమౌట - మాఱు
పలుకంగ నేరక కలఁకయంతయును—

తేలగంగఁ ద్రోచి - కాదన్న వేఱుగతి
దనియకించను దీనదీనమ్ము
గా నమస్కార మ్ములై నట్టి తనదు —
చరణపంకజములే బరికించువాని—
దరిజేర్చి భక్తి సుందరుని శ్రీనామ
దేవుని ప్రేమ సుధావశతముగఁ
దాపీక్షసేసి నిద్దంబుగాఁగౌగి
లించి లే నగవుల మంచి తోమాల
లంచితమ్ముగ వక్షమందుఁగీలించి—
ఈ జ్ఞానదేవుల నెవరను కొంటి?
పజ్ఞానమున, వత్స! యవనికి దిగిన
యొజ్జ యాతఁడు నీదు పరిచయంబునకు
పరితాపపడుట నీ భాగధేయంబు
బొమ్మ సుమ్మతనితో - బోవుచే గాదు
నెమ్మది కెక్కంగ నియతితోఁ గొలిచి—
యాశీః పరిమళ మౌదలదాల్చి—
మా ఎద్ది సామాన్యమని యెంచరాదు
సర్వదేశమ్ముల సర్వకాలముల
సర్వజ్ఞమమ్ము! మన్మానసాధార!
నిను పీడియుండుట - నిజముగా మాకు
దిన దినంబొక యుగమ్మునకు సమమ్ము
యీ యున్న వైభవంబిట్టి మందిరము
నీ యిలా వైకుంఠ మితవు పండరియు
తక్క భక్తుల బొగడ్తలు భోజనము
చక్కెర పలుకులు - చవిపింపు నీదు
పదకవితలు లేని పగదిర్పలేవు—
మధుర భావావేశ మృదిత నేత్రాబ్జ
నాథాను వంధాన! నా నామదేవ!

నా దైన్యములనెంచి నన్ను మన్నించి
సరగునరమ్మోయి! తిరిగి - నా యూర్పు!
హరి యిట్లు చిరవియోగాఽక్షిప్తుండు
నామదేవునకని జ్ఞానదేవులను
ప్రేమముప్పొంగ నిరీక్షణసేసి
వచియించె నీవు సర్వజ్ఞుఁడవోయి!
ప్రచుర శాంత్యానంద పారదృశ్వుడవు
కలుగుట లేకుంట యలరుట వసట
నలయుట లనెడు భావావేశములకు
నీ హృదయంబున నెలవు శూన్యంబు
నా హృదయగ్రంధి నామదేవుండు
శివ భక్తుఁడు లోకసిద్ధుండుగాఁడు
పసిగాఁడు సర్వభావవివంచి వాఁడు
తల్లి పోలిక నేవిధంబున నోమి
యుల్లంబు నలఁగక యుండ మా దరికిఁ
దెచ్చి చేర్చెదో! నిన్ను నచ్చిపంపెదము
సచ్చరిత్రుఁడ యంచు జలజలరాల
కనునీరు నామదేవుని కయ్యొప్పటి
నెనరున జ్ఞానదేవున కొప్పగించి
చెప్పనమాటయే చెప్పను శౌరి
ముప్పిరి గొను ప్రేమ ముగ్ధుఁడైనట్లు
నామదేవుండంత దామాజీఁజేరి
శ్రీ మహితుని యాజ్ఞచెప్ప సవిత్రి
మూర్చి తన భార్యకూటబ పలికి
మారరూపుండు గుమారుఁ జుంబించి
మతివత్తునని పల్కి మనసున భక్తి
గరమొప్ప, నానాఁడు జ్ఞానదేవులకు
నాతిథ్యముమదీర్చి, హరిగూర్చి పాడి

ప్రాతస్సమయమందు పండరీభూష
చంద్రభాగను జేరి, జ్ఞానదేవుండ
తంద్రచిత్తుఁడు తాను, తానముల్ దీర్చి
యావిర్ఠలేశున కభివందనంబు
గావించి మంత్రసంకల్పమ్ముఁజేసి
వయనమ్మొనర్చిరి, వారు విఠ్ఠలుఁడు
జయమౌను మీకని సాఁగనంపంగ
వారు కన్పడునంత మేరకు స్వామి
దారిపైఁ జూపుల తలద్రిప్పలేదు
నామదేవుఁడు లేని దేఱుగా బట్టి
దాసునస్వకి విఠ్ఠలాధీశ్వరునకు
శ్రీ రుక్మిణీదేవి చెలువొప్పవచ్చి
వారిజాక్షుని చెంతకారాధ్యమూర్తి
వచ్చిన ప్రేయసిఁ బలుకరింపందు
ముచ్చటాడఁడు, నేఁడు మూగయైనాఁడు
కలియుగద్దైవంబు కఱదలనెల్లఁ
వలనొప్పగావించు పండరీశ్వరుఁడు
చిఱునవ్వు ముత్తెముల్ చెంగావిమోవి
కఱపై నిడుద యూర్పు పఱుపులఁగంది
యరయికలేవట్టి యలకలు గాలి
పరిపరివోకలై పరిమళంబుడిగి,
దిగజాఱు చెమ్మట సొగసు యందములు
వెగడులై, కసటొమల్పేరణంబుడిగి,
పలుమాఱు నిలజాఱుజీలుఁగు దుప్పటము,
పొలపంబులుడివోయి భువివల్లటిల్లి,
యఱుగడై కొకవింత యందమ్ము జూపు
వరకిఖండికఖండ మణివిద్రవోయి
నలికంపుపదుముపై వెలయు హస్తములు

నిలచి - నిల్వగలేకవచె బొరియాడి
యందెలైనట్టి భాషాంగనా వీణ
క్రందైవ కుణుకుణు క్వణనముల్ వీగి
కలికి కన్నుల జాలు గట్టిన బాష్ప
ములనున్న విర్గలఁ బోల వీక్షించి
యచ్చెఱువడి, డెందమలమటగుంది
యచ్చపలాక్షి యిట్లనియె దేవేశ!
యోగీశ్వరేశ్వర! యోగవియోగ
భోగవిహీన! సంపూర్ణ సంవిత్స్వ
రూప! నిత్యానంద! చాపల్య రహిత!
కోపులు మాకిలి క్రొత్తలై తోచె
నలమటలనుట బ్రహ్మానందమునకు
తెలియంగ వలనౌనా! దీనికారణము!
కారణ మింకేమి గలదు నీ కెఱుఁగ
నేరని యది యంచు వీరజాక్షుండు
పలికెనిట్టులు నాకు ప్రాణ మిత్రుండు
కలిమియు తలిదండ్రు, లెలనాగ సుతుఁడు
చెలికాండ్రు సర్వంబు వలదని నన్న
తలఁపున నిడికొన్న ధన్యమానసుఁడు
నామదేవుఁడు లేఁడు నాపాలి కఖిల
మా మన్వ్యయె వానిలేమి సర్వంబు
లేనట్టులైనది జ్ఞాన దేవుండు
వానినెట్టులు సూచునో! ననవంటి
యా హృదయము నెట్టులానంద పఱచు
నో! హితములు పల్కునో! సంచులెఱిఁగి,
వాని విశ్లేషంబు భావంబు నాచి
యావఁగరాని యత్తై, వేధ గుడుపు
పరమ భక్తుండైనవాఁడు మున్నెప్పు

డెఱఁగడు నాతోడి విరహంబు చేదు
మ్రింగెడు వటులెట్లు మ్రింగుదునో! దీని
నంగనా! దుర్లంఘ్యమై వచ్చె నెడరు
ఆకాల మీకాల మనిలేని, నిత్య
లోకాళికెల్ల నాలోకింప తల్లి
వేఱునునేన, మద్విమల భక్తా ము
మారుచుదప్ప ప్రేమామృతంబులను
నామదేవుండు నా కామని కంటి
కామెత, వాని భక్త్యార్ద్రింబుహూవ
మన నంబుజాక్షి రుక్మిణి రంగనాథ!
విన కన వింత నీవేడుకల్ మాకు
నఖిల భూతమ్ముల యాత్మల నిలచి
నకల వేళలఁ బ్రచోదన సేయునట్టి
యాత్మ స్వరూపుండవైన నీకెవ్వ
రాత్మభిన్నులు వట్టి యక్కులిగాక!
కలఁడులేఁడని నీదు కడగాన లేక
వెలవెలఁబోవును విపుల శాస్త్రములు
దేవేశ! యా జ్ఞానదేవునియందు
భావింపఁగా నామదేవునియందు
నాయందు దేవసంతానమ్ములందు
నీయునికియె దప్ప నిజమన్యమేది?
యటులుండ యెడబాటులంటిన వోల
కటకటం పడుట, యేకై వడి?" యన్న
ప్రమదను వీక్షించి పండరీనాథు
డమర సంప్రార్థ్య కల్యాణ పాదుండు
వచియించె నిజము! నీ పలుకు వామాక్షి!
యచలితజ్ఞాన లాభంబ్రుని నీవు
నేవరూపుఁడనైన - నిత్యభక్తులకు

మానసోల్లాసంబుమది నిప్పగించి
చెలఁగు నానావిధ క్షేత్రంబులందు
కొలుదువు దీర్తను గుణంబుల బూని - దివ్య
మంగళ గాత్రంబు మన్నించి కనులఁ
దొంగలించెదు దయతో నందమూని
ఆదివ్య తిరుపతులందున్న భక్త
లాదరువులు నాకు నట్లనే వారి
కెడలేక యుందు, నీ హృదయ బంధంబు
కడుకొను పూవుమ గంపునుంబోలె,
అట్టి భక్తులలోన నగ్రగణ్యుండు
నష్టేబు భక్తికి నామదేవుండు —
వాని వియోగమే పగిది సహింతు!!
దీనదీనంబులు దృక్కులు బఱప
నాపైపు వత్సంబు గోవును వదలు
కైవడి కన్నీళులై పఱకాదు
నొదలయి వెనుదిర్గి కడగి చూచుచును —
యెదగ్రుమ్ముకొనుచును నేగిన వాని
కాయంబు నారెండు కన్నులద్రేలు
పాయదు యిక నేమి బట్టు నామదికి!
రెండు కన్నుల పీరు నిండించె భక్త
భండారమైనట్టి పాండురంగుడు
పడతి రుక్మిణి యప్పుడడదడగించె
కడుశీతలములైన మడువులు పలికి
యటజ్ఞాన దేవుతో నరుగుచున్నట్టి
నటదుష్ట బాప్పుండు నామదేవుండు
పలుమాఱు తలమల్పి పండరి వరయు
జలజాక్షుఁదరుదెంచు జాడకై వలచి,
యడియానలైన మగ్గడువు నిట్టూర్చి -

గొడగును దనలోనె కోఎమ్ముబూని —
వచ్చునంచని ఎక్కు వచ్చువాఁడేని
వచ్చియుండడె యంచు వడిబమ్మరించు
నీవె నాతల్లియు నీవె నా తండ్రి
నీవె నా కఖిలమం చావంతయేని
యస్మల నమ్మనియట్టినన్ వదలి
తన్యాయమిదియంచు నా క్రోశవడును
పలుమాఱు భూమిపైఁ బడుచునులేచుఁ
బలవరించును గతంబులు - ప్రేమ తెర్వు
తో యంబుజోదర! యో కృపాజలధి!
యో యవిదిత వృత్తి! యో పాండురంగ
కటితటీ హస్త! భక్తక్రీత! నేటి
కిటులైతివేమని యెంతయే నఱచు
తల్లిని విడిచిన ఎల్లనివోలె
నల్లవో! మది దప్ప నామదేవుండు
జ్ఞానదేవుండు నిష్కళంకవర్తనుఁడు
జ్ఞానదేవుఁడు యోగ గాంభీర్యవార్ధి
జ్ఞానదేవుఁడు శుభం కరభరణుండు
జ్ఞానదేవుఁడు విష్ణు సాకారమూర్తి
నామదేవుని జూచి నాయనా! యేల
నీమార్కి వెతగుంద నీవిశ్వమెల్ల
పాండురంగఁడుగాని వస్తువున్నదియె!!
పండరీపురిలోనె వాసుదేవుండు
వలయుండు ననెడు నీ భ్రాంతి దొలంచి
ప్రకమిత పాపుండు పండరీశ్వరుఁడు
సకలంబునందుండు సాక్షాత్కరించి
యతరువు పద్మంబు నందునఁ దోశె
నను - యనుభవము నీ కబ్బుటకొఱకె

వనిగట్టుకొని వచ్చితిని నామదేవ!
తన్నులుగాక లోఁగన్నులు దెఱచి
యన్న! చూడుము! హృదయంబున - బాండు
రంగఁడున్నాఁడు, చిద్రంగఁడై - లోక
భంగులఁ జిక్కక భద్రం కరుండు
తననాభియందె చిక్కని తావినుంచి
కొని - కంబరము తావికని - పాఱినట్లు
తన మేన యవ్వనంబను దొడ్డ తొడవు
మొనయ క్రాల్గంటి సొమ్ముల కేగినట్లు
పెరటి కల్పనగంబు కరుఎంచి బయటి
పెఱపెఱ యీవుల వేడినయట్లు
మొదలోని రంగని వదలి బాహ్యముల
కదపదపడుట మోహాంధకారంబు
లనిన యౌదలమోడ్చి హస్తయుగమ్ము
మనవి చేసెను భక్త మందారమాల!
తమవంటివారికిఁ దగిన మార్గములు
మముబోంట్ల కెట్లు సంప్రాప్తించు దేవ!
మీరు యోగారూఢు తీరు భావింతు
రారంగనాథుని నీ రూపుగాఁగ
నాతఁడంతర్యామియై యుండు మీకు
నాతఁ డర్చావతారాంగుండు మాకు
నాతండు ద్వంద్వాతి గాఢుండు మీకు
నాతండు ప్రేమానపేతుండు మాకు
నా పాలికా పండరీ పట్టణమున
కోవుల నెలవైన కోవెలయందు
దివ్యమంగళగాత్ర దీధితిదోడ
నవ్యయానందంబు లావటింపుచును
అఖిల కల్యాణ గుణాకరుండగుచు

నిఖిలాశలను దీర్చి నెఱవేదు వారి,
కావంక నీవంక సేవించుచుండ
నావేతులు సనకాదికమునులు,
శ్రీ రుక్మిణీదేవి సీమంతమందు
జేరిచి లాలింపఁ జివురుపాదములు,
నారదమౌని వీణారసికుండు
నారాయణా!' యంచు నలువుగాఁ బాడ,
పుండరీకాది సత్పుణ్యపేటిక  య
ఖండమోక్షవితీర్ణి కారుణికుండు—
భీమరథీతీర పృథుమండపమున
కోమలికములకుఁ గొనదివ్వెయగుచు
కటితటంబున హస్తకమలముల్ జేర్చి—
కుటిలాలకల ముద్దు గురియు వక్త్రమున
కొంగలితొప్పల దొంగ చూపులను
దొంగలింపఁగఁబూని కోడ్త్రోడ సఖిల
చేతనమ్ముల మొదల్ చిరకాలముగను
బ్రాతియౌ వైకుంఠపదమును ఎదలి
కాచికొన్నట్టి తెక్కలి కర్రివాఁడు
వాచవియగునట్టి వలపులవాఁడు
వాఁడెనా పాలిటి వలకారి, నన్ను
నాడించు దైవ మర్చావతారుండు
ఆ వరదైవ దివ్యాంఘ్రి పద్మమ్ము
లే ప్రొద్దుమానక యీ హృదయమున
నిలుచునట్లుగ సేయువలె సమగ్రహము
కలుగదు బ్రదుకట్లు గానట్టివాఁడు
తద్దర్శనమ్మును, తత్కీర్తనమ్ము
తద్దివ్య నిధ్యాన తత్పరతయును
నాకు ధారకమును, నాకు పోషకము

నాకు భోగ్యంబు నే బోకఁ జూచినను
జ్ఞానదేవునకు నీ సహజ ముగ్ధములు
వీనుల కమృతంపు హితమయ్యె నుడులు,
వారు తీర్థములాడి రారూఢమతులు
వారు దర్శించిరి పరదైవతములు
వారు తీర్థములాడ వారి పవిత్ర
మై రిక్తపాపమ్ము లయ్యె నో! నదులు
వారు దర్శించిన పరదైవతము ల
వారి భాగ్యంబంచు బ్రమదమందినవి
శివశాతి భావుండ జిహ్మాగవృత్తి
యవగణితేంద్రియుం డచ్ఛంపుఁ దెలివి
యోగనిష్ఠితుఁడు సద్యోముక్తిదాత!
భాగవతులలోనఁ బ్రథమగణ్యుండు
పండరీశ్వర భాగ్యఫలము ధరిత్రి
బండిన తపము, వాగ్వనితాపవిత్ర
తాపాది, రసభరవ్యాఖ్యాతృమూర్తి
యాపన్న బాంధవుం డాజ్ఞానదేవు
డెడనెడ బోధించె వాతమితంబుగను
తడవు మాటలనె, యధ్యాత్మ తత్త్వంబు,
లొక్కనాఁ డిమ్ముల నెక్కటిగాఁగ
నక్కమలోదరు నత్యంతరక్తి
బాడుచు నెడనెడ నాడుచు, నూర్పు
వీడుచు, బాష్పముల్ గూడ నేత్రముల
నొత్తిలి చీరుచు, నొల్లబోవుచును
మత్తిలియుండిన మాడ్కి, నున్మత్తు
కైవడి, మధురభక్త్యావేశమునకుఁ
దావలమగు నామదేవు వీక్షించి
యల్లన నడతెంచి, యతిగోళముల

మెల్లమై వాత్సల్యముల్లంబు దనియ
గరపద్మమునఁదాకి పరసకుఁ జేర్చి
శిరమునిమిరి తల్లి శిశుభాషణములు
విన వలచిన భంగి విశ్రుత జ్ఞాన
ధన నిధి నామదేవుని జూచి వత్స,
పరమాద్భుతము నీదు భక్తి భావమ్ము
ధారా ప్రపాతమ్ము తన్మయత్వమ్ము,
దక్కనేలితి నీవు దక్కని వాని,
నెక్కటి మునులకుఁ జిక్కని వాని—
నే మంత్రమునఁ, గొల్చితింది రాజాని
నే మార్గమున భక్తి యిట్లు ప్రాప్తించె
నుపవాసములనొ? నిత్యోదక స్నాన
జప నిరతులనొ! పూజా పద్ధతులనొ?
పారాయణములనో! బహుశ్రుతంబులనో?
పరుసంబులైన తపంబులతోనా?
భూరి ప్రదక్షిణంబులతోనా! దీప
వారముంచుటతోనా! పాయసాన్నములు
సావడనిడుటనో! చర్చలతోనా!
చేవడ్డ వితములు చెప్పు మటన్న
కలకల మని నవ్వి కరములు మోడ్చి—
తలవంచి యతని పాదమ్ములచెంత
పెలిపెలి పూజల విష్ణుండు చిక్కు-
నె!! లఘుదైవతముల నేమంబులవ్వి—
యమరాగమమనది యాత్మలో లేక
వనిత పాతివ్రత్య పద్ధతి బయల
నెఱపిన యంతన గరఁగునే ధవుఁడు?
మఱువంగ భరమైన మగని రూపమ్ము
తనుగవ ప్రేలాడ మనమున ప్రేల

తనుదాన మఱచిన తరుణి క్రొత్తడి త
నమ్ము నాశంకించునా! మనోభవుఁడు
నెమ్మి పైపై నమల్ నెఱపకయున్న
నారీతి హృదయమ్ము ననవరతమ్ము
శ్రీరంగనికి నిచ్చి జీవించువాని
కీలయుపాసమ్ము శీల దానములు
కేలెఱుంగని వారి కోలికలౌక!
మనసిచ్చుటననేమి మనసు వీనిదియై
వనజనాభునకు నర్పణము వేయుటకు
మనసు వానిదిగాన జనిగల్గినపుడె
తనవానితోఁ జేరెఁ దానిచ్చుటేమి!
అంబుజోదరుని పాదాబ్జంబులందు
నింబుగా హృదయమర్పించు కొఱకు
జతనంబువలయునో! శ్వాస పీల్చుటకు
తతితోడ నన్నంబు తనియనామటకు
నిదురించుటకు మకమొదవిన వేళ
ముదమందుటకు దుఃఖమునను గుందుటకు
వనియె యత్నమ్ము స్వభావమ్ముగాక!
తన జీవనమునిండ దామోదరుండు
ప్రేమ ఎంపానన స్మితరూపుండు
దీపమ్ముగాఁ గొల్వు దీర్చియుండంగ
పెఱచింతలకు నింక దెఱపియుండెడినా!
పెఱమాటలకు మది స్ఫురణంబుగలదో!!
కలవింక విహగమ్ము గాత్రమ్ము మఱచి
నలుపైన పాటలీనంబైన యట్లు
మనువున తమపును మఱచి భక్తుండు
తన ప్రాణనాథు చేతలఁ జిక్కి పొగయు
కాముకుఁ డెచ్చోటఁ గలయ దిర్గినను

కామినీ రూపచింతామత్తుఁడైన
పొలుపున లోభియే నెలవుననున్న
మొలనున్న ధనమునే దలఁచెడురీతి
చెలువంపు బొలిమేర లలఘువుల్ తీరము
లల శ్రీనివాసు దివ్యాంఘ్రి యుగ్మములు
మఱువంగ నేరఁడు పరమ భక్తుండు,
తతి, జీవనంబిడి కరుణింపనైన
తరిమికొట్టిననైన ధారాధరంబు
గుఱిచి ప్రేగెడు వానకోయిల భంగి
పరుసమాడిననైన వంచింపనైన
కనుమఱుఁగైన నిక్కట్టు లుంచినను
తనుగా దటంచు నూకొనకున్న గదిరి
నను, అట్టుచేసిన, ధనములుగొన్న
తనువడిగిన మానమణచిననైన
పరమాత్ముఁ దొక్కఁడే పరబంధువనుచు
తిరమైన భక్తి సాధించు భక్తుండు.
చదమడిగిన పుష్పసమితి నర్పించు
పదురున, పుష్పసంపదలు గాంక్షింప
ఫలసముదయమిచ్చు పనిది వాఁడడుగు
వలమున కినుమడి పలచి యర్పింప
మఱియేమిసేయు దెప్పరమైన భక్తి
పరపకుండై యింటి వత్సంబుగాక!
పరమాత్మపై భక్తిఁ బట్టంగ నొకరు
పరికించి, బోధించి తెలుఁగివ్వవలెనొ?
నవవసంతము వచ్చినది యంచు, రసము
లివతళింపఁగఁబాడు మీఁకపంచు నెవరు
గానకాని బోధింత్రు, కోకిలాంగనకు
తన మనోవిభుఁడు, కోటము గొట్టమాని

కోటతల్పులఁబోలు కుఱుముదురైక
మీటినంతన యుల్లమూటాడి క్రొత్త
చదురులు నెఱపెడి ముదిత కెవ్వారు
మదిలోనఁ గూర్చుండి మరులు నేర్పెదరు?
అల్లంత దవ్వులనంబ గన్పడిన
త్రుళ్ళింతలిడి ముందు దూటుచు బఱచు
తర్ణకంబెవరిచేతను బోధితమ్ము!
వర్ణింపరావట్టి బంధమ్ముగాక!!
యను, మంటు రాతికి నెగసిన భంగి
వనయంబు హరియందు నావిష్టమైన
మనసు నెవ్వారలు మఱలింపఁ గలరు!!!
వనితలో! సుతులో! శ్రోవగరాని బందు
గులో! నెచ్చెలులో! జనకులో! తల్లులో! స
కల భాగ్యములో! పెంపు గల్గిన యశమొ!
కావడ లేక మార్దంగికు పైని
పానలు వెలయించు భంగి, నెడంద
గట్టలే, కితరుల ఱట్టుచేపెదరు
కట్టిన హృదయంబు కలఁగునే! యెపుడు?
వారేమి సేతురు! వారి ఋణాను
సారంబు వచ్చిరి తీరిన యంత!
చెప్పకయేపోదు, రెప్పుడో కోర
కిప్పుడు ప్రాప్తించిరే! యేటిమాట
భక్తి భావన కొక్క పద్ధతియేమి!
భక్తియే పద్ధతి భక్తియే ఫలము!
ఈతనేర్వఁగబూన నీదుట యొకటె
రీతియైనట్లు, సర్వేశ్వరు భక్తి
ప్రాప్తింపవలెనన్న భక్తిసేయుటయె
యుత్తమౌ మార్గంబు నుల్లంబెగుదువు,

తనకుఁదోచిన యట్లు దానులాలించు
తన హృదయము ప్రుచ్చిలినవాని గాదు
కూడదంచని పల్కు కోమలి విమనో!
దూరఁజూచినయంత ద్రొక్కిళ్ళు లాడి
తనువెల్ల ప్రేమమై తాఁదూట నిచ్చు
తనులు దీనమ్ములై క్రమ్మిన ప్రేమ
మం యొక్క నియమంబు పాటించి కొనునో!
తనరెత్తు సమరతి గలదో! తాక్రిందు
మీదన్న భావమ్ము, మాధవు భక్తి
లేదులేశంబేని మీదు క్రిందవుట!
తలరష్టవిధ నాయికలు వారి భావ
ములు పలు తెలుగులఁ బొగడును జగము
వారి భావములెల్ల భక్తుండు క్షణము
పరమేశ్వరునిఁ గూర్చి పడెదు నవస్థ
వేయింటఁ బోలవు! విదితమ్ములగునె!
యా యవస్థలు చవు, లను భూతిలేక!
తనవాని నమసరించినను తావాని
ననుసరింపఁగఁ జేయను, వభిసారి
కాభిఖ్యయింతికి, నామెయేయగుది
వాఽభిసారిక, దివంబందువర్తింప
బారాదివితముల, ప్రతి నిమేషాఽభి
సారిక భక్తుండు చర్చింపభేద
మొక్కటే, తావానికుచుకునే గాని
యక్కమలాంబకు వశివరింపంగ
జేయందు శ్రుతిసతీ సీమంత భూష
లాయదుగులు నొచ్చుననెదు తావమున,
నిది భక్తివంత దాకిదియ మాత్రమ్ము
కుదిరిన జీవనం బదికినయుసుదు

గంగాది సకల తరంగిణీ చయము
ప్రాంగణమున చంద్రభాగయే నాకు,
సకల పుణ్యక్షేత్ర సంచారతపము
ప్రకటమౌ పండరీ వాసమే నాకు
సకల శాస్త్రపురాణ సంచయాఖ్యాన
మకలుష హరికీర్తనానుసక్తి నాకు
తెరలని యుపవాస దీక్షలు చక్ర
ధరనివేదిత ప్రసాదమ్ములే నాకు
ధ్యానముల్ తపములు మానియౌ జపము
లా సర్వరూపు పాదాంబువే నాకు
సచటి వృక్షమ్ములే యవ్యయానంద
ప్రచుర భాగవతులు, సచటి విహంగ
కలకలములె పుణ్యకథలు నా స్వామి
లలితరూపముజూచి పులకలుబూచి
మనువుమ తనువుమ మఱచుచే ముక్తి
కనుగవ జలమూర - గాద్గద్యమూర
నాకటివేళల వలపైన వేళ
దీకొని పెఱవారు దిట్టినవేళ
కులముచెడినవేళ కొఱమాలువేళ
చేలపాదులకుఁ జిక్కి జంకినవేళ
నాఱడి పడువేళ నంకిలివేళ
ఘోరపాపములకు గురియైనవేళ
సంకెలఁ బడువేళ - చంపుటకొఱకు
వంకకాంద్రొకటియై యడ్డినవేళ
వాని నామామృత మూనుచు మరణ—
మైనను - వరియించుటదియ నా భక్తి
జ్ఞానదేవుఁడు రసాస్వాదపయోధి
ప్రాణ పదంబైన నామదేవుని ని

సర్గసుందరమైన సఖ్యామృత ముని
వర్గకమ్ముగ భుజార్గళములన్ బొదివె
ప్రతిదినం బీరీతి భగవంతుగురించి
ప్రతిలేని వితముల భాషించి కొనుచు
సాధు సమ్మతమైన జ్ఞానవాదముల
మాధురీ సురభిళ మహనీయ భక్తి
వాదమ్ములను వేదప్రమదమ్ము నొందు
బాదరమ్మున నచ్చటచ్చట నున్న
యోగుల భక్త్యైకభోగుల వీత
రాగుల కర్మనిష్ఠాగుణోత్తరుల
త్యాగుల, వేదవిద్యా గరిష్ఠుల, స
దాగతుల, బుధుల, శతమన్యుల పుర
షోత్తములను శాస్త్ర విత్తముల - స
పాత్ర ఎద్దులఁజేరి పల్కాలాఁడుచును
తీర్థమ్ములాడుచు దివ్యరూపముల
నర్థి దర్శించుచు నటునటుఁ దిరిగి
కరినగరంబున కరుదేర జనులు
పరువడై భక్తికి వడగెత్తినట్లు
వామదేవుని దివ్య నాదామృతమ్ము
చే మదివేడుకై - చేరి కొల్చినను
యమునలో వాడి దివ్యావేశముతో
తములైన కమలలో దారలు గురియ
మోద బాష్పమ్ము, లా పురిని కొల్వైన
శ్రీధరుమూర్తిఁ గీర్తించెను వామ
దేవుండు, తోడ్తోడ భావముల్ పొరల
భావాను గుణముగా భాషబొంగార
యతు, అలంకారమ్ము లతిమాత్ర రక్తి
వతుకంగ, దాశ విన్యాసముల్ బొదల

శుద్ధి, ప్రయోగ ప్రసిద్ధి రసాను
విద్ధత నక్షర ప్రకర రమ్యతయు
పొదలంగ విచ్చిన బాగుత్తులట్లు
పొదిగొన్నవిరవాది పొట్లంబు లటుల
కులుకు కస్తురిపిణి గోనసపగిది
తెలికప్పురపు గ్రోవి తెరచిన భంగి
జవ్వాది పక్కణి సడలించినట్లు
మవ్వంపు నవ్వుల ఱువ్వినయట్లు
పులుగడిగిన ముత్తెములవోలె - తాము
గలసి మాటాడిన కరణి సమమ్ము
లైన సమాసమ్ము లంతలంతలను —
దేనె తెట్టెలువోలె దేఁగానదుక
ప్రతి దినమ్మునుగూడ పండరీనాథు —
పతులిత కీర్తనానందంబు చెల్లె—
నా బాలగోపాల మా కీర్తనోత్స
వాబద్ధ హృదయులై యనుసరింపంగ,
నారాజ్యమేలెడు నతఁడు తురుష్కుఁ
డేరూపమునఁ గొల్వ సీకుఁదొక్కండె,
యనెడు సుజ్ఞానంబు నెఱయనివాఁడు —
తనులు గప్పిన యహంకారంబువాఁడు
మాయ బొమ్మలుచేసి మడుగులు గట్టి
తీయతీయని నివేదితములు దించ
దైతక్కలాడుచు కూతలువెట్టు
నేతరిత్రోవలే! యీ భక్తియంచు
పరియాచక మొనర్పు పాటిగలాడు
పురిని కోలాహలంబున విచారించి
యెవ్వరో క్రొత్తగానే తెంచి రిద్వ
రవ్వారి నొక్కని హలహలియందు—

విని, రోషతామ్రాక్ష విస్ఫృతముఖుండు
గనియెద దీనిలోఁగల్ల నిజంబు
అని, నామదేవుఁడార్ద్రాక్షుఁడై కద్ది
వనజాతములతోడ వాసుదేవునకు
కైంకర్య మొనరించు కడకేగుదెంచి —
హుంకరించి జనంబు కింకిరిపాటు
నిలువెల్ల నగుచు ముక్కులు వొంగ నాన
దలఁగి పాటలు పాడి, తైతక్కలాఁడ
చూతురేమం చు చివ్వుఁ జూపుఁ జూచి —
చేతులు జాచి ఎచ్చివి చెయ్యువెల్ల
బాలింపుము ని తక్కళముగాగ భక్తి
దేలెడు నానామదేవు గద్దించి —
వలికెసికై వడి పాదుషా! యోరి!
చిలిపచేతలు పాలు చెవిగోపనట్టి
మేక తెలుంగున మిక్కిలి మిడుక —
నాకలి దప్పులుగాక దైవంబు
వచ్చునా! గిచ్చునా! ప్రజలను మోస
పుచ్చగా, వక్కని బూమె గట్టితివి
కన్నయ్య' - చెన్నయ్య పన్నయ్య'యనుచు
తిన్నని పదములు తీర్చిపాడెదవు
పదముల పొంకమే భగవంతు మనసు
గదలించునేమి! పైగంబరు మాట
యల్లాకు నొకరూప మునిలేదు మాకు
తెల్లంబు, గాకేని ముల్లాల వదుగు
మన్న, పరమకాంతుఁడైన భక్తుండు
కన్నుల మ్రొక్కి శ్రీకాంతు కీర్తనము
సర్వశక్తము ప్రజాభయము నాకట్టి
నిర్వహించుటగాదు నిక్కా నాకలికి

మెదుకులు గడియింప నొదిగించి కొన్న
పదకంబుగాదు! మా పండరీశ్వరుని
పదము పట్టిన నవనిధులు ముంగిటనె
పడలంబుగా నిల్చి పడిగాపు గాచు —
నక్షరాక్షరమున నక్షీణముక్తి
పక్షమ్మొనర్చుచు పని దీర్చుచుండు
నమృతవార్థులు మేన నామేడితములు
తమిదీర వాకలి దప్పులు మాల్చు
పాండు రంగా! యన్నవాని భాగ్యములు
కొండిక ధవదుండు గొల్చునా యేమి?
పండరీశ్వరులెంక భవ్య వైభవము
పండునే! రాజన్య భవనంబులందు—
రారాజులైన తరాజులుగాక
నీరజాక్షు నెదిర్చి నిలువంగ గలరె!
పందెంబు నరుమిదే! పండరీశ్వరుని -
యండెల సాక్షిగా నాస్వామి భజన
దీర్పరానిదియైన దీర్పునటంచు —
నేర్పడనాపేశ మేచి భాషింప
పాదుసా, రోషసంభ్రమితాక్షుఁ డగుచు
వాదిప్పగించి నీ పందె మొప్పితిమి
తీర్పరానిదియైన దీర్పునటంచు
నేర్పడ నీవె భాషించితి గాదె!
ఇదె! తీర్పు మనమంచు నెక్కడే నొక్క
మొదవును దెప్పించి - గదుముచుబట్టి
తలగొట్టి కీర్తనా స్థలమెల్ల నరుణ
వలదూషితముగాగ బ్రత్యక్షమైన
కార్వరుపలెఁ, గళాసము నొలిపించి
యుర్విపై బుఌంచి 'యోరి భక్తుండ!

యీ పశువున బ్రదికించితివేని
నీపాట లాటల నిక్కమున్నట్లు
తప్పున నీ గోవు తలగొట్టినట్లె
తప్పక నినుబట్టి తల గొట్టువాఁడ
నెంతసేపటిలోన నీ కార్య మొవరు
పంతంబు గట్టిన బరిభోగి! చెప్పు —
మనదు గోహత్యకు నాత్మవదంకి
కనుదోయి కన్నీటి కాలువలగుచు
పంతంబు గట్టిన పాదుసా! భక్త
సంతారకుండైన స్వామి శ్రీ పాండు
రంగఁ డీ మొదవున బ్రదికించు నుమ్మ
భంగిగా, నాలుగు పగళులలోన
నిది తప్ప దీవార్ధులింకిన మొదలి
కుధరముల్ క్రుంగిన గోపతి యలకు
రాలిన, దిక్కుంజరములు వ్రాలిన వి
ఫాలాక్షుఁడగుచు నీశ్వరుఁడు సోలినను
నిక్క మీమాట నన్నఁ బెక్కువ నవ్వి
యుక్కు శరీరంబు, లుల్లముల్ శిలలు
నైనట్టి బంటుల నటఁ నాపు పెట్టి
ధూనాధుఁడాగారమునకుఁ బోవుడును
నామదేవుఁడు భక్తిసీమ, వైరాగ్య
ధామ, పండరినాథు పున్నెంపు బ్రోవు—
జ్ఞానదేవుల పాదకంజాతములకు
మానిత శాలినతా నతంబుగను
మ స్తమ్మొనర్చి, విన్యస్త సమస్త
శస్తమంగళమైన శయనశేయము
పై మంచి దీవింప బ్రమదంబు నెంచి-
తవకింక రంగండు దక్కెనటంచు

సన్నంబనక జలంబనక రవంత
కన్నుమూయక ప్రతిక్షణ విజృంభితమ
హాభక్తి భరుఁడౌచు సలకామధేను
పీ భువిపాలు పారించిన యట్లు
కూలంబుదెగి సుధాకూపారమూర్మి
జాలంబుతో ధరాస్థలిదిగ్గినట్లు
నూఱు వసంతము లొక్కసారి
బారుగా ధరణిపైఁ బ్రసరించినట్లు
ఆ మూఁడు మూర్తుల యతి వలనైన
కామతస్ఫురితతనూ గంధముల్ భువికి
దిగజారినట్టులు దీప్త భావములు
నెగడంగ నుడులు వెన్నెలలు కురింప
పండరీశ్వరుపైన పాడఁదొడంగ
నందణవాహనుండా మహాభక్తు
ఎలుపులు చెవులలోఁ జిలుక తేనియలు
నిలువంగనేరక పలుమారు పయన
మై నాల్గుదినముల యవధి పీడింప
మానసంబెట్టులో మఱలించి కొనఁగ,
నిట నామదేవుఁడుత్కటమైన భక్తి
ఘటియింప మృదుల రాగమ్ములతోడ
పదకవితలు జెల్లె ప్రజలు మోదమున
పదమదమై - మదులదికిన బొమ్మ
లటులు - తాము గూడ హస్తముల్గట్టి
కటికరసుందరుఁగంటాటుబాడ
సర్వముండుదయించి యస్తంబువందె
పర్యస్తమయ్యెను వాసరం బొకటి—
పశువు బ్రదుకలేదు - పండరీశ్వరుఁడు
ప్రసన్నమరకరుణతో భావింపలేదు—

నామదేవుఁడు భక్తిధాముండు, కీర్త
నామోదములు పంచె హరిదంగనలకు
జనులెల్ల మదులు నిశ్చలములై పాడి
రనవధికమ్ముగా నా కీర్తనములు
నామదేవుని ఎల్గుతో మాధవునకు
నేమరిల్లగఁగాదు, హృదయంబుపాల
పొంగులై యున్నది పోవుదమన్న
భంగించుచున్న దీప్రతిన, తానొక్క-
కడనిలువఁగలేక కటకటంపడుచు
పెడఁద కన్నుల నీరువెట్టికొన్నాఁడు—
కడచె రెండవదినంబుడువీధి దినక
రుఁడు కెంపులను బోలు రోచులఁజల్లె—
మూఁడవదినమును ముగియంగవచ్చె—
మూడుఁటో నీరేయి ముగిసిన మృత్యు
వని ప్రజలెల్లరు వమకంప మూని
కొనకొని తమలోన గుసగుసల్పోవ—
సారవిచారుండు సాత్వికాకారుఁ
డారూఢ వైష్ణవాభ్యర్హిత తత్త్వుఁ
డతిపేల శాంతిదాంత్యాది సద్గుణని
రతిశయశేశోవిదితమురహస్య
రవశభక్తి సంభ్రముఁడు నేత్రాంత
రవిరళానంద బాష్పాధీనమూర్తి
కమనీయ మగుప్రేమ కరగట్టినట్లు
విమలనిష్ఠకు రూపు సమకూరినట్లు
దృఢనిశ్చయము గండరించినయట్లు
కఠినతపము ముద్ద గట్టికొన్నట్లు
తొడరి గంధపుగాలి వడి వీచినట్లు
దడబడు పదములఁ దతిగొన్నమల్లె

గుత్తులవోలు కొంగ్రొత్త భావమ్ము
లత్తు కొనంగ భాషాంగ నాతవము—
లవఘళించిన యట్టు లాత్మకు గుఱిచి—
యువతికిం పులప్రేమ నెంతేని బిఱువ—
తొలి దిక్కు జవరాలు తలిసుంబు విడిచి—
తలిగించి మునుఁగు దిక్కులు సూచినంత
వలగొన్న కాంతులై వానరాధిపుఁడు
ఝళ ఝళద్ఘంటికా కలితమై సప్త
ఘోట్టాణ హేషావి ఘూర్ణ దాకాంత
హట్టమై వరమణీ ధట్ట రుక్పట్ట
పర్యాప్త గగనమై బరగుళాంగ
పర్యంబునెక్కి దీప్రమ్ము రాజనము
కమదోయి వలరింపఁ గంఠమ్ము జాచి—
వనజ భవాండంబుఁ బాఱపిశించు
వేళకు గళవనమాలికా గంధ
జాలమ్ము దిశల నాసారమై ముంచ
హరిపీల రుచి జాలకాము బద్ధములు
నెఱులుదీరిన కురుల్ పరవళ్ళు లాడ
హరిత శార్వలరుచుల్ హరిదంతరములఁ
బరగించి - శిఖిపింఛ భరము వర్తింప—
మొసలి వాగడలోగు లెసఁగించు రుచుల
పసలనలై బోవ, నక్రమండలము—
పాలుతెంచిన యట్టి పాండురంగండు
దారున బాహాదండమ్ములు పాచి—
యుపగూహన మొనర్చి యో నామదేవ!
యపపాడి గానొక్క యవధి నేర్పఱచి—
నెంతవల్చితివి - నన్నెంత నల్గితివి—
చింతలోనే మేను చిక్కిపోయినది—

ఒక్క జీవమునకు నసురు లిచ్చుటకు
వక్కణముగ నాలు గహములవలెనా!
యొకమాట చాలదో? యుస్సురుమనుచు
తికమక గుడిచితి దినములన్నియును —
అనిజ్ఞాన దేవుల నభివీక్షసేం—
కొనకొని ప్రశ్నించె కుశలమ్ము స్వామి!
ప్రణయాధినేతయౌ పండరీనాథు
ననుపమం, బారూప, మచ్చటనున్న
జనులకుఁ దోపలే దనఘుఁడౌనతనిఁ
గనుగొనుటన్న పైకవుఁ బున్నెమేమి!
అంతటిలో వచ్చెనా తురుష్కుండు—
చెంత మల్లగణంబు చేరిసేవింప
కరమున కరవాఁడి ఖడ్గంబు మెఱయ
వణుకుదుగాక యీనాదు వీమ్రుచ్చు
దొరకెనటంచు, వాతెఱ నుఱ్ఱుగొనఁగ
పరభయంకరమైన విరసహాసంబు,
వాఁడు చూచుచునుండ వసుధపైనున్న
శౌడుకులోఁ బ్రాణముల్ తోడ్తోడగూడ
పలలమ్ము రక్తమ్ము పలుప్రేవుగములు
బలుబొమికెలు - నాంత్రములు సరిగాగ
తొలిమన్న రీతిన నెలకొని యంద
ముల గనులైనట్టి తెలిగండ్ల తోడ
ముచ్చటయైనట్టి మూపుతో, నరిగ
నచ్చుదీర్చిన యట్టు లలుచందురునకు
కలకలలాడు శృంగములతో ముక్తి
వెలువు వేదికబోలు వలికంబుతోడ
చతురుదధులఁబోలు చరణమ్ము లమర
ప్రతిలేని వాల్గ్రప్రా బలుకులఁ బోలు

వలదచన్నులతోడ వలకొప్ప ధరణి
బొలపంబు నెఱపినట్టులు ధేనువగుచు—
ముందట నెలకొన్న మొదవును జూచి
క్రందుగాఁబెరయు నక్కజమున సారె
సారె బరీక్షించి సందియం బెడలి
తీఱిగర్వము డెందమాఱటం బఱప
నికనేమిసేయునో! యీ భక్తుడనేఁడు
వికటంపు వెఱపు నిల్వెల్లను గ్రమ్మ—
నాలుక తడియార నా తప్పుసైచు
డీలల మిమ్ముగారించిన తులువ
నని శాపమివ్వత యమకంపఁజూడుఁ
డనుచు నా యిర్వుర యంఘ్రులఁబొరల
నగి, నామదేవుండు నారాయణుండు
విగత రాగద్వేషుఁ డగణిత శాంతి
పరిధి యీచేసిన పాపంబు దలఁపఁ
డరికట్టి యికనైన నాశాదికమ్ము
లల్లాను భజియింపుమని మందలించి—
చల్లగా మఱియొక్కసారి యక్కునను
జేరిచికొని భక్త, శృంగార ధామ
మారంగపతిఁ సెలవనిచెప్పి పోవ
పరుసమై నిరతంబు ప్రజలు సేవింప
మురహరు బాడుచు మొనయు భక్తులకు—
తెరువులు సూపుచు తీర్థంబులాడు
చరువంబుతోడుత నటఁగొన్ని నాళ్ళు
గడపి యాపైఁ గాశికాపురిఁజేరి
మృడునకు గాదిలి - యుడు రాజనేత్ర
చరణ పంకేరుహ జాతమ్ము మాధ్వి
యరుదారు దివసకరాన్వయనృపుల

యశమైన యట్టి దివ్యా పగనాడి
యసమ బాణుని మదం బణచిన వాని
త్రిపురనారీరతిశ్రీ భంగ తుంగ
కుపిత హుంకార సంక్షుభిత దిక్చక్రు,
దారుకాణారు నీహార శైలేంద్రు
కూరిమియల్లుని గౌరీవరము
లిచ్చకెక్కుడుగాఁగ నిచ్చెడు వాని
నచ్చంపు వైష్ణవు హరి తత్త్వవేత్త
తారక బ్రహ్మ విద్యా రహస్యజ్ఞు
తారకాకమన, సుందర జటాజూటు
కాశికా విశ్వేశుఁగరమర్థి మ్రొక్కి
యానర్వ మంగళ, నా విశాలాక్షి
వినుతించి - యటుడుంఠి విఘ్నేశుఁగొలిచి
వినత దేవవ్రాతు విశ్వవిఖ్యాతు
దరచక్రధరు ధరాధర ఫణాపటల
వరచంద్రకాలికా పర్యంక భోగి
వక్షోమణాక్పల దైవ్యజయంతీవి
లక్షణ సౌందర్య చక్షుః ప్రసన్ను
లక్ష్మీపదాబ్జాతలాక్షరసాంక
పక్ష్మలితద్యుతి ప్రచయాంసపీరు
బిందు మాధవుని సేవించి పీయూష
తుందిల శబ్దముల్ దొర్లఁగాడి
యాతీర్థ మీతీర్థమనుచుఁ గొన్నాళ్ళు
నాతలంబునయందె యధివసించినను
కాశికాపురిలోనఁ గలఁడొక్కరుండు
వాసనా దూరుండు భక్తినిష్ఠుండు
తారక బ్రహ్మ విద్యారతుండు
ధీర రామానంద దేశిక చరణ

ధూళీ పరిష్కృత మౌళి, భాగవత
పాళీపదాయత్త భవ్యజీవనుఁడు
పేరు కబీరు దోహా రసోన్మాది
శ్రీరఘుచంద్ర మాశ్రిత కుటీకలుఁడు
ననువార్త చెవిఁబడ నా మహామహుని
కనిఎంచికొని వాని ఘననిష్ఠఁజూచి —
బోవలెనను బుద్ధి వొడము - యావీధి
నీవీధి గాలించి - యెల్లరనడిగి
కొనపేటలో నొక్కగొందిలో మినుకు
మినుకు మంచును నిల్వమని కితంపడెడు
కొంబదివ్వె వెల్గెడి కుటినొండుఁజూచి—
యరఁ తారకనామ పరిమళ భరిత
మగుటయు, లేమిచే నవళమైనట్టి
దగుటయుఁ దలపోఁ యతని నివాస
మిందెకాఁదగునని యెవ్వరో! యయ్య!
నందిత సుగుణుండు నామావతారుఁ
డాకబీరులఁ జూచి యానంద భరము
నాకంర పరిపూర్తి నందవచ్చితిమి
యతని యిల్లిదియౌనె, యన్నంత - భాగ
వతులెవ్వరోవచ్చి వాకిట నిలిచి —
రని పల్కినది భార్య ధ్యాననిష్ఠుండు
కనుగవ దెఱచి - వేగమ్మున వచ్చి —
వారి పాదములకు వలగొని దార
నీరమ్ములం దివ్యనిష్ఠతోఁ గడిగి
పైనున్న చీరచీవరమునఁ దుడిచి
యానిన భక్తితో నొదలవంచి
దయచేయుఁడని పల్కెఁగా తెర్వనూపి —
కయగతమ్ములు! సిద్ధోక్తులయ్యూవ వ

నాదరించిన యట్టి బోధైక పూర్ణు
డాదాశరథి చిరిత్రాలోచనాని
రంతర దంతురి తాంతరుండగుట
చింతా విరహితుండు జీవులఁ బ్రోవ
నవనికే తెంచిన యాతుకాంశంబు
భవనికారుండొక్క ప్రాఁణాపవఱచి
యఘవంపఁగఁజేసి యంఘ్రులఁబట్టు
చిది భాగ్యసాకల్య మిది నాకు ముక్తి
యిది రామసేవ యియ్యది ధ్యానమనుచు
మదిమది నుప్పొంగి మగువనుఁ జూచి
పరమేశ్వరుఁడు బంపె భాగవతులను
పరమేశ్వరుఁడెవచ్చె భాగవతులుగ
నేమైన నున్నదే యింటిలో" నన్న
నామె, యసుంగులకంబుపు లోనఁగి
పడుకొనఁ బెట్టిన దడలుచున్నారు
బడుతలు కడుపులఁ బొగరాజుచుండ
నేమియుండును వింట! నేమి లేదన్న
దామాత, కనుగవ యార్ద్రింబుగాఁగ
సరిలెమ్ము జిటికెలోఁ దిరిగి వచ్చెదను
కరముపోలిక పాదసంవాహనమ్ము
సలుపు చుండు మటన్న - జాయ యేమంచు
దలఁచెనో! తన భర్త! యలజడిఁ జిక్క
వనిమెంచెనో! నేన యంగడికేగి
కొనితెత్తు ననిపోయె కోమలహృదయ,
యేగినదేగాని యెవ్వరిచ్చెదరు?
త్యాగమ్ముగా పదార్థములు! భాగవత
లైనవారికినేమి? హరిస్థైననేమి!
ప్రాణపదము సువర్ణము భూషణములు,

నదిరేయియవుట జే హారమ్ము నిలిచి
నది యన్నియంగడు లప్పుడే మూఁ
రొక్క కోమటి మాత్ర మున్నరొక్కంబు
లెక్కించుచుండె దా నిక్క సేరుటకు
నతని యంగడిసేరి - యడిగిన దతివ
బ్రతికితి మీనాఁడు భాగ్యవంతుండ!
మూఁడంగడులెల్ల మూయుచుంటివి
మాఁల్గుదప్పించు కోసమైనట్లు
పెట్టి! వేకువతోనఁ జెల్లింతు పైక
మెట్టైన - బియ్యంబువిమ్ము, భాగవతు
లటఁగాచి కొన్నారలా కటమ్రగ్గి
కటకటం బడకు, నీ కాసు పోనివ్వ
నమదును గన్నెత్తి యతివ వీక్షించి
మనసున మదమందు మదులా ద్రేవ
దుర్భర దారిద్ర్య దూషితంబగుచు,
నిర్భర దారిద్ర్య నిగడితనేత్ర
మన్నాతి గాత్రంబు నందును, వంద
మన్నది గనిఎంచి, యా కన్ను గవకు
నావా తెలుకు  నొక్కి, యల్లన నగుచు
భావంబు దెలుపుచు  బలికెనా శ్రేష్ఠి
వేళగావట్టి యీ వేళలో వచ్చి
చాల చాతురితోడ జాలమల్లెదవు
అడుగువారికి నెల్ల నవ్వులనివ్వ
గుడిసెత్తుకొనిపోక, గుదురునా! బేర
మదికానిమాట యేజాక్షి! మాసాయ
మదియొకపైన - నీయది మరియొక్క
పైన నొప్పెడు మాటయవుగాని - నమ్మఁ
బూనఁద్రోయగ, వెఱ్ఱివొఁట్టిలా? మేము

యింతకు - నెవ్వతె వీవు! కాదారి
యంతలింతలఁజేరి యందంబులాడె
దన్న, నీయూరరా మార్పితబుద్ధి
పన్నుతగుణుఁడు శాశ్వతకీర్తి, నిత్య
భాగవతార్చనా పరుఁడు కబీరు
భాగధేయంబు శ్రీ వారణాసికిని-
యెఱుఁగరే మీరలా పరమపవిత్రు
నెఱుఁగకుండిననేమి! యెల్లరునెల్ల
వారిని దెలియంగ వశమౌనా! ధర్మ
దార నేవారికి, తడవు సేయకుఁడు
ప్రాలిందు, పేకువపైకి మొప్పంతు
తాలిఁబడుచునుంద్రు, పర్వేశుభక్తు
లన్నంత, పకపకమనినవ్వి - మేలె!
యన్నుపకౌను దానా! తెలివల్వ
కన్నులదాన! నీకాంతుండు బగుతు
డెన్న భక్తులుగాని దెవ్వరీ ధరణి
బ్రదుకంగ నేరని ప్రతియొక్క-వాడు
కాదదిర్చికొమటకు - గోచినిగట్టి
పంగనామముపెట్టి, చెంగుమంచాడ
పంగులేనట్టి మావంటి వారెల్ల
వీరిని బ్రదికింపఁ గూడుచున్నారొ!
కూరునే! యిట్టి పల్కు-లతోడఁ బనులు
అరమరలేల! నాయాత్మ దెల్పెదను
నెరవేర్తు వందువో! మఱుమాట వలికి,
మఱుమాట లేకున్న విరవాదిపూలు
విరిసిన యటులొకపరి కన్నులార్చి
పమ్మతిఁ దెల్పినఁ జాలు నియ్యంబు
కమ్మని బేడలు - కాయగూరలును -

యొకకేమి! యక్క-ఆయున్న వన్నియును
నికరంబుగా వ్రాలు వీయింట నిపుడు-
కోమటిమది బెవగొన్న దుశ్చింత
యా మానినీమణి కర్థమై-కనులు
చెమ్మలై దిగ్రమింగి యుమ్మలికమ్మ
వమ్మిన దుష్కాంత, వాఁడచెప్పంగ
విందునుగా కని - వందియంబేల
డెందంబు నందున్న తీరెదో పలుకు!
మనినంత! వికవికలై మొగంబెల్ల
మనసులో నున్నట్టి మాట నాలుకకు
దెబ్బంచు వెలివు - గా దేని యోయింతి
యిప్పాటి వెఱఁగరే! యెవరైన బుదమి!
చల్లకువచ్చి దాచఁగనేల ముంత
పల్లవాధరి! విను! భ్రమజెందినాము
నీపైని మా కోర్కె నీవు తీర్చితివి!
యాపైని, రిత్తబియ్యంబేమి! ప్రాణ
ములె నీవి యన్నంత వెలవెలఁబోయి—
తలఁకి, సలందురి తలరి, శ్రీజ్ఞాన
కి నాథ! యిదియేమి కీడు దెచ్చితివి!
మానదునా! లేక - పూనదునా! యి
కెందుకు మమ్ముఁ బరీక్షింతువోయి!
మందెమేలము పేలొ! మా స్వామి! యంచు,
దలపోఁప భాగవతుల యాకలెంచి —
మలమూత్రములకుంత - మయి, దీనిదుష్టుఁ
డాఁపంచె! భాగవతార్పితంబుగను—
వాకిల్లగాకన్న, యూను ఊనించి—
ధవుఁడుగేహానికినిదై నమ్ము - వాని
ప్రవిమలమైనట్టి పంతమ్ము దీర్చు

ఛీ! పతివ్రతలకు హెచ్చైన ధర్మ
మీపట్ల జంకుట లేలంచు, దోచి —
ధర్మస్వరూపుండు ధర్మనిస్త్రుటిత
దుర్మద రాక్షసస్తోమ కంఠుండు
పరసతీ హృదయతాప గ్రంధి శౌర్య
పరితాపారావణ ప్రాణనిహంత
శరణాగతత్రాణ చణుఁడు దుర్గర్వ
భరిత కాకాసుర ప్రాణాపహార
చటులభ్రుకుటి యేకజాయావ్రతుండు
పటుధనుష్కరుఁడయి పగలును రేల
ముంగల వెనుకల మొరవులఁ దనకు!
జెంగట నిలిచి రక్షింప, భ్రుక్కుడులు
దన్నేమి సేయుదురన్న నిశ్చయము
పెన్నిధివోలె హృద్వీధి భాసించి—
'వల్లె 'యన్నది దానవైశ్య శేఖరుని—
యొళ్ళెల్ల పులకల యుద్యానమయ్యె
వంతవాపడఁతి యీనయ్య! పదార్థ
మింతలోఁ జమదెంత వేకటఁదీర్థ
వనుదును బోయినవనితదా మరల
జనదెంచునే? యను సంశయం బొదవి—
వచ్చుట గిచ్చుట వాఁగా దబల!
వచ్చుగిట్టదు మాకు నగదు బేహార!
యిప్పుడే మాయొద దప్పఁబోకార్చి
తెప్పునఁ బొమ్మన్న - దీనదీనముగ
వాని వీక్షించుచు భక్తశేఖరులు
ప్రాణపదమ్ములు భగవంతునకును—
వారట నాకలి పనుటఁ జిక్క
గా రమియించుచో వారిదలంచి—

యెరియాడి నాచిత్త ము త్తలంపడఁగ
దొరకునే! చవులు! తొందరకాదు! మనసు
జతలేని రతము పాషాణ చుంబనము
వ్రతము చెడెనె పొమ్ము! వలదె సుకమ్ము!
తెలికన్ను గవలలోఁ బొలపంబు మెఱయు—
వలఁతి నవ్వులతోడ నల్లన డాసి—
యారజంబులతోడి యఱగంట వలపు
దేరఁగ సరసంపు తీరులఁ బలికి
యెదమేని నెత్తావి సుడియంగఁబైట
నెదవ్రాల్చి యంతలో నెయ్యమపోలి
నెలమిచెల్వముల సొమ్ములుగాఁగ కోర్కె-
తలపోల మెయ్దంగ - దా నమ్మతించి
పళమైన వనితతో రసకేళిగాఁక
పొసఁగునే! పెఱతంబుల మనస్సుఖము
మాట తప్పుననేను మాయింటి దైవ
మోటుపల్కు నయింపఁ దొక తరపైన
నొకమాట యొకపొ త్తి యొకబాణమతని
కకలంకమూ ర్తి ధర్మావతారుండు
మా దాశరథితోడు మరివత్తు లేదు
శేదమ్ము మమ్ము బంపింపుఁ దనంగ—
పెద్ద పెనంగిన విరసంబెగాక
సిద్ధించునే కోర్కె, చెలువుల మనసు
కరగించి కలయుటే కామతత్వంబు
తొరయేటి కనితోచి, తొయ్యలి నేఁడు
దప్పిపోయిన రేపు దప్పిపోయెదునా!!
యెప్పుడో యొకసారి - మీవంతు దీర
కయపోవునా! యన్న గట్టిధైర్యమున
న్మయమానుఁడై పొ త్తి! వరగరా, పొమ్ము"

బెంచుప్రాలోఁసగిన సతిస నేత్రాంత
రంచితబాష్పులై, హరిపదాంభోజ
విన్యస్త చిత్తులై, వేగంబ వచ్చి
ధన్యులమైతిమి తావకార్చనకు
దైవంబుకృపసేసె - తడవయ్యెనేమొ!
సేవకింకిట తడసేయ నటంచు
జలమాడి వంటకంబులు దీర్చ - మేన
నలదుతారకమంత్రమైన కబీరు
గాంభీర్యశరధికి కంది గాంభీర్య
సంభేదనోత్తుంగ శరధికి, భక్త
నిరవధి - కారుణ్య - నిచితాంబకునకు
సురరాజభీతిదాఽసురరాజకంఠ
ఘంటాపథవ్రాత ఘంటాకథమర
కుంఠితఝంకృతి క్షుభితదిక్కునకు
ధర్మైకరతునకు ధర్మరూపునకు—
ధర్మవిద్రోహిసంతానదావాగ్ని
తారామచంద్రున కర్పణసేసి—
పారవశ్యమునొంద భక్తితో మనసు
హరిరూపులై సట్టి యతిథుల కతిస
సరగున సద్దింప సరసఁ గూర్చుండి—
వ్యజనంబు వీచుచు - బ్రహ్మరూపులర
నిజమిది, దాసుని - నిర్వృతికొఱకు
నెంతదూరముఁగ నిచ్చగించితిరో!
సంతోసమేగాని జన్మదరిద్రుఁ
డీదేహ మీకు సంతృప్తిగా సేవ
లాదటఁ జెల్లింప నవకుఁడై వాఁడు
సంధిస వానిలోపల జంకుఁదొలఁచి
దండిగా భుజియించి దయప్రోవవలయు

నని యుపచారంబు లాడుచునుండె
వనిత వర్ధనసేయ వలుమాఱులడిగి—
వారు భుజించిన వడుకలుపఱచి—
వారిపాదము లొత్తు చూరును, వేరు
లడుగ పండరిలోని యా రంగనాథుఁ
డడవడి వర్ణించె నామదేవుండు
అతిథులు నిద్రింప నాకలి వనయు
సుతుల కన్నముపెట్టె, శోభనాచార!
అప్పుడు దెలిఎన దతివ నాధునకు
నప్పాలసుఁడు పైళ్ళఁ డడిగిన విధము
తన ప్రతిజ్ఞయు విని, తడవేలయువిద!
మన గృహంబునకు వచ్చిన భాగవతుల
యాకలి దీర్చిన యనఘుండు వాఁడు
వీకున్న దోసంబు - వీవనేవలయు
మానావమానముల్ మంచిసెబ్బరలు
మానిని! మనుజాల మనములు కల్ప
నలు పేసుకొన్నవి, నరుఁడు శ్రీహరిని
దెలియుట తలచుట - తులలేని ధర్మ
మఖిల ధర్మములకు నా హరిప్రీతి
నికరమౌఫలము! తన్నియతి దప్పినను
సకియ! ధర్మము గణస్నానమ్ము తెల్వి
పికటాటవీ జ్యోత్స్న! విన్కియు రిత్త
జలధి, తరంగిణుల్ గలిఎన నవియు
జలధియైనట్టు లీశ్వరుగూర్చి సలుపు
కర్మంబులందు, సధర్మంబులైన
ధర్మంబులయగు - ఏ తత్త్వంబు కడది
కలికి! ధర్మములుగా గనవడి కొన్ని
యలమున ధర్మమ్ములై తుదిపోయి —

బయలి ధర్మమ్ములై ప్రస్ఫుటాఽధర్మ
మయములౌ గొన్ని సమ్యగ్వివేకచేత —
ఏది ధర్మమో! భువి నేది యధర్మ
మో! తెప్పరము దెల్ప వేదులకైన
కాన శ్రీరాముఁడొక్కండె సత్యమ్ము
వానికి పెఱయెల్ల, పరికింపకల్ల
యితవొమ్ము, వైశ్యుని యిచ్చ బండించి
సుతముగ మఱిరమ్ము శోభనాచార!
యనుచుండ మేఘమ్ములా కాశమందు
పనికి, గర్జాభీల పైయాత్యమమర
పఱుగొని గురియంగ పథములందెల్ల
బురదయై పోయిన పోవంగలేదు
పొలఁతి యొంటిగఁ దాను పోయివనైన
నలమిన జంబాల మంఘ్రులకంటి
తలయెల్లఁ దడిసి, భోక్తకు సుఖభోగ
మలవడునే! యన్నయనుమాన మెసఁగి
తావ భార్యనుగొని తరలంగఁ దలఁచి
మానిని శిరముపై మాపుడు పుట్ట
మొక్కటిగప్ప తా, నుద్వహించుచును—
చిక్కని చీకటి చిటిలినవాడ
లందు సీతాజాని ముందు జనంగ
క్రందుగా రేగిన కమ్ములకావి
తరలెఁగబీరు, సుందరరామచంద్ర
చరణవిష్టర మనస్సాత్వికమూర్తి,
తరలెగబీరు సీతానాథపాద
వరపశనేత్రస్రవద్బాష్పవారి,
తరలెఁగబీర యోధ్యాపతిధ్యాన
భరితరోమాంచ విస్ఫురితదేహుండు,

తరలేఁగటీరు పై ధాత్ర శ్రుత్యంత
పరిమళిత కవిత్వపాటవశాలి,
పయనించి, పయనించి వాడలు గడిచి
రయమున గృహిణి మార్గంబు సూచింప
నాయంగడికివచ్చి, యల్లనమ్రొక్కి-
యోయి! మహాపుణ్య! యొక్కింత తడవు
జరగె మాదోసమ్ము పైపఁగా వలయు,
పరమ భాగవతులు వారు నిద్రించు
వణుకున రావల్ల పడలేదు మాకు!
పరమూర్తి! మాదైన వ్రతము దీర్చితివి
ఇదె నాదుభార్య! నీ యిచ్చ దీరంగ
మదనకేళినిదేలు మదవదం పడకు
తనువులు, ధనములు మనుగడలెల్ల
తనుపారు తృప్తి సౌందర్య ధామునకు
రామచంద్రునకు నర్పణ సేయుకంటె
నే మార్గమునఁ జూడ నేదిపుణ్యంబు!
యేనిందయుండి మీ యిర్వురకేళి
కేనెవ్వ లేకుండ, వీక్షించుచుండు
పరమ భాగవత సేవాపుణ్యమూర్తి
కరుణింపు మనుడుమ - కాపురుషునకుఁ
గన్నులఁ గప్పిన కామంబు విరిసె
సన్నుతమతి యబ్బె, నోచెల్లి! యనఁగ
నే పూర్వజనికృతం బింత యుండినదో!
పాపంబు వెన్వెంట భంగంబునొంది
ప్రబల పశ్చాత్తాప వహ్నిగాల్పంగ
నభయ మీవలె నాకు, నభయం బటంచు
తలమోది కొమరు నాతల్లి పాదముల
కిలజాగి మ్రొక్కి-, కన్నుల గర్వమప్పి

పరమ పాతివ్రత్య పాకసేవధికి
దురిత మెంచితినమ్మ! ధరణీసవిత్రి!
నావంశమెల్లను నరకకూపమునఁ
ద్రోవంగఁబూనితి, ద్రోహామన్నించి
యీ శిరస్థలమున నిడుము నీపాద
మాసాదితంబగు నఖిలమంగళము
నిన్నట్లు బలికిన చెన్నటి నోరు
చెన్నఱి యింతింతఁజీలునో యేమొ!
నిన్నట్లు చూచిన చెన్నటికండ్లు
ప్రన్నఱి గుంతలు వడిపోవునేమొ!
నిన్నట్లు లెంచిన చెన్నటి మనసు
క్రన్నన పెలిబిడిగాఁబోవునేమొ!
నన్ను రక్షింపవే! నా తల్లి! యనుచు
కన్నీటితోనన గడిగి పాదమ్ము
లా కబీరువిపైన యడుగుల కెఱఁగి
మీ కులంబున బంట మీ యింటి లెంగి
మీ పీడ సోకిన బానిసకొడుక
మీనెగుల్నను గాల్చు, మీ కృపాదృష్టి
నా పాపములు గూల్చు, నన్ను రక్షించి—
నా పరుసపుఁబల్కు లోపి మన్నించి
కరకేర్పవలె శిష్యుఁగా జేకొందు
నడపదులెంపక నాయన్నలనుచు
వినయంబుసేసిన విని కబీరుండు
కనుదోయి దొనకంగఁ గారుణ్యదృష్టి
సకలగురుండు దాశరథియేగాఁక
యొకని కొక్కఁడు గురుండుర్వరగలఁడె!
యతఁడు దయాపూర్ణుఁడతని కొక్కనికి
పతితపావనుఁడన్న ప్రథగల్గెనో యి!

వానికంకెను దయావాంతంబైన
దానామదైవతం బానుడియందు
శతకోటియమృతంపు జలధులుగలవు
శతకోటి కైవల్య సౌఖ్యముల్గలవు
ఒక పాపమేమిటి? యుర్వినిగలుగు
సకలపాపంబుల నొకప్రక్కపెట్టి—
మరియొకవైపున మంబును దూచ
భరమౌను నామంపుబలము, శ్రీరామ
శ్రీరామ! యనువాని పేరలెన్నుటకు
నేరండునలువైన నిటలాక్షుడైన
వెఱకు పశ్చాత్తాప మెరగలివోలె
కరుసుపాపమ్మును గాల్చివేసినది
యని వానిలేవనెత్తి నితాంతమైన
యనుకంప దోపంగ, నక్కునఁజేర్చి—
యింక బోయివచ్చెద పేమారకోయి!
యకలంకమైన రామా! యన్న ధనము'
అనిపల్కె, నా పల్కులం దత్తమిల్లె
ఘనయోగి పరులసాధనలోని తెలివి
యా కబీరుని యమృతాలింగనమ్ము
యాకృపానిధి బోధయందలి శీల
యావాటిలోఁ దెగినట్టి ప్రాక్కర్మ
మానసంబును రామమయము గావింప
నంగడివిడిచి, భార్యాదికబంధ
భంగంబుసేసి, తీవ్రంబైన భక్తి
సాధించి యాక్లేశ బాధావిముక్తి
మై ధర్మసమ్మిత మపవర్గమందె,
పరమసాత్త్వతుల దీవనలన్న నిజము
మఱుగైన చిల్లరమాటలా! యేమి?
మఱునాటి పేశువగురుసేవసేయ

నరుదెంచినట్టి యా యంగడిపెట్టి
తనకథ చెప్పిన త్యాగపాథోధి
పెనఁగొన్న యెఱుక, కబీరందు నామ
దేవుండునున్ జ్ఞాన దేవుఁడగ్గించి
భావార్ద్రిముగ బాహుబంధమ్ము జేర్చి
యా పతివ్రత సద్గుణావళినెన్ని
మీపాలి రఘువరుండే ప్రొద్దుగలఁడు
యొకనాటి దేమని యాదివచింప
వికసితముఖుఁడై, కబీరు మస్తమ్ము
వంచి వందించె, సద్భాగవత ప్ర
పంచ పాదార్చనా బలమంచు బలికి,
యాదిన మేకాంతమందు మువ్వురును
శ్రీధవు గూర్చి చర్చించెడు వేళ
వారిరువురి పూర్వభవములు వారు
నారాయణుని దైవ కోరికతోన
పుడమి బుట్టిన విధంబును వారుపైని
నడువంగవలసిన నడువును జ్ఞాన
దేవుండు దలపింప, దిగ్గనలేచి
యావిష్ణు పాదంబులంటి – రిర్వురును,
మఱునాడు కాశికఁ దరలెదమనుచు
నెరవుదోపంగఁ గబీరుతోఁ జెప్ప
యాతని భార్యయు, నవదాతమతికి
నతివేల మగుదయ నాశిస్సు లొసఁగి
జనకు వీరిక – జగంబున కీర్తిగానెదు
తనయు కమాలు ముద్దాడి – దీవించి
పోవుచు జ్ఞానదేవుఁడు – నామదేవు
దైవతంబైన చిద్ఘనమూర్తి 'చంద్ర
భాగామనోహరు పార్థశతాంగ

భాగధేయము భక్తభండారమైన
పండరీనాథుని వర్ణించి చెప్ప
దండిభక్తుఁడ! నీవు తద్దర్శనంబు
నొసరింపరమ్మట నున్నారు, భక్తి
అనుపమవర్తమ' లన్నఁ గబీరు
ధన్యోఽస్మి పూతమంత్రంబట్లు మాకు
మాన్యంబు మీయాన మఱవకేతెంతు
వరఁ యీ కార్తికమందు సుస్థాన
హరివాసరమునకు - హరిగొల్వనమచు
నొడఁబడి దారయు బడిరాగ దవ్వ
నడచి యాయిర్వురి యడుగులకెఱఁగి
సాఁగనంపఁగ బోయి రాగఁజో త్తరుబు
సాగు చూపులతోడ దఱలకందు
మేరకు నవ్వారిదారులే చూచి
కారు కన్నీట కబీరు గిమునకు
దావచ్చె గృహమెల్ల భావుకనామ
దేవసత్ప్రద కవితా వాఃతమ్ము,
జ్ఞానదేవుండును నామదేవుండు
వీనెక్కువట్టి త్రివేణిలో నాడి
ధర్మావతర వికర్తన వంశకీర్తి
శర్మదంబు, నయోధ్య సరయువ్వనాడి,
నిత్యయౌవన కృష్ణ నిభృత విలాస
చైత్యమ్ముయమునలో జలములగ్రుంగి
ద్వారక దరిసించి పదునాఱువేల
వీరజాక్షుల నిత్యజారున కెఱఁగి
తక్కుతీర్థమ్ములఁ దానమ్ములాడి
యక్కడి మూర్తుల నగ్గించి పాడి
పయనించుచుండ మార్వారుదేశమున

భయమొదవించెడు వనములో నొకట
నడచుచునుండిన నామదేవునకు
బెడిదంపు దాహమై, ఎడుచలుగట్టి
నాలుక  తమచూపు నేలలో నెచటఁ
గ్రోలవీరమ్ము చేకూరకయున్న
హరిహరీ! యనుచుఁ దూగాడు పాదముల
నతిముఱి చీకటులైన నేత్రముల
తటమటలైన గాత్రమ్ముతో, నిట్టు
కటకటంపడి యొక్కకడఁ గూరుచుండి
పండరీశ్వర! యిట్టి వనమున కిడ్చి
చండ భాస్కర కరచయమునఁ జూడి
నన్ను జంపింతువో! నాతండ్రి యనుచుఁ
గన్నులవీ రోడఁగలవరించుచును
నల్లంత మేరలో నగములనుండి
పల్లంబులోనికిఁ బడుచును లేచు
చున్నట్టి వక్షులఁ జూచి టిట్టిభము-
లున్నట్టి తలఁపున నాజ్ఞానదేవుఁ
డన్న! దూరమ్మున నదె! సరోవరము
దివ్యంగ రమ్యమన్న  మున్నటలేని,
కాసార  మదియెట్లు గలిగె నటంచు
వాఎయౌ పండరీశ్వరు దయయంచు
నటకేగి చూచిన, నంబుపుల్ వర్వ
కటకంబునందున్నకై వడిఁదోవ
నీరు ద్రావెడు నాన నిలువఁగూల
తోరన నేడ్చుచుఁ బుండరీకాక్ష!
కరుణాదరిద్ర! నిష్కపటులై సర్వ
భరములవీకు వర్పణ చేసి బ్రదుకు
భక్తుల నేడ్పించి, భ్రమవి తిర్గెదవు

ప్రాక్తన కర్మాను భవమన్న ముసుఁగు
దగిలింతు నీచేయు దారుణంబులకు
తగవరి! జీవి స్వతంత్రుండుగాఁడు-
పరతంత్రుఁడగువాని ప్రాక్తన కర్మ
మరయనే విధమున నంటంగవలెఁతి!
సర్వేంద్రియంబుల సాక్షాత్కరించి
సర్వభోగముల రసంబులు గుడుతు
నని నీవె పల్కితి, పట్టిచో జీవి
తన కర్మములకును దానెట్లు బాధ్యుఁ
డని వితర్కించినంబుజోదరున
కనుకంపముమ్మగ్గుపై కోన, కోన
నరఎలో నీరు దెప్పరముగ నునికి
దొరలంగఁజేసెన, పరమ హర్షమున
దోఎటఁద్రావి యేతులఁ బల్కినాను
నాకిశుత్వమ్ములు నారాయణుండ!
తలఁపకుమని చాల తల్లడించినను
కలకలమని నవ్వి జ్ఞానదేవుండు
నామదేవా! నీకు దామోదరుండు
కామితంబులఁ గూర్చు కల్పవృక్షంబు
వరవుడమోసె నీ భక్తికి వాఁడు
తిరముగానని నామదేవు వగ్గించె
నావరం బిప్పటికట్టులే పాఱు
వాఎగా నామదేవయశంబనంగ,
నటమండి కదలి మహాదేవ మస్త
తటవర్త నక్రియా ధన్యకారుణ్య
వతియైన గంగలో మతవత మునిగి
ప్రతిపదమ్మును తపోధరమైన తుహిన
గోత్రంబునకు నేటి కోళ్ళు చెల్లించి-

దాశృతాయత్తు కేదారేశుఁ గొలిచి
నైమిశాదులు సూచి - పదచుచు నాంధ్ర
భూమి బ్రవేశింపఁ బొదిగొనిపిచె,
పావనోదార గోదావరీసలిల
శైవాగ మామోద జటిలవాయువుల
ఆయా స్థలమ్ముల, హరు, మహాజాటుఁ
బాయని భక్తితో బ్రణుతించి నడచి—
మదిరారణోత్తాల మల్లికార్జునుఁడు
మదదిగ్గజవరసీమంతినీహృదయ
పశ్యతోహరుఁడు భావస్నిగ్ధభక్తి
వశ్యుండు, శ్రుతివరామృక్యవర్గనుఁడు
శ్రీశైలవనములఁ జిందుక్రొత్తేనె
నా నదిరగలేదా! యాఘుశంబోలయు
నామదేవుని కవితామాధ్వీగ్రోలె
నేమారుఁబొగడుచు వేవేలరుచులు,
అటనుండిచని గరుడాసనాసీను
కటు దృష్టి, కహాకహాక్కరక్కరాకారు
ప్రబలదైశేయ దుర్దర్పాంధకార
కలశవవ్యగ్రగ శాగ్రశాస్త్రిగ్రహాసు
నరకేసరిమతించి మఱియును గల్గు
పరమస్థలంబుల భక్తినందించి
వేదమ్ములేశులై, దెవదెవల
గాదిలిప్రాముసల్, కాల్వలై నట్టి
శేషాచలమునకు శిరములువంచి,
యానతో వరద హస్తాభిరామునకుఁ
దరమైన పదకవితామాలలేపి
పఱపులై పులకలు కఱుగుచు మ్రొక్కి
యచ్చట భక్తుల కనుగులంబుగను

ముచ్చటలాడి మెప్పులు గొని దివ్య
వై కుంఠమైనఁ దద్వానతమనసు
లేక తానములుగా నిద్ధమౌక్తి
కటనుండి కదలి దివ్యావగ ముక్తి
కటకమైనట్టి యా కావేరిగ్రుంకి
శివరాత్రిదగ్గఱ భవ్యుఁడు వేంచేసి
నవకమొప్పెడు నాగనాథపురంబు
నకు వచ్చి యచ్చట నాగభూషణుని
వికసత్కనీనికా వీక్షణంబులను
బూజించి – కీర్తనమ్ములు చేయుచున్న
నోజగా నీవార్త యూరెల్లఁ బ్రాకి
పదులు వందలుగాఁగఁ బ్రజబుట్టుకొనుచు
పదటునఁ బ్రమదంబు వఱ్ఱుగాఁ ద్రావ
నా యూరి విప్రులకది కన్నులెర్ర
నై, యుడుకుచునుండి, రవసరంబునకు
నానాఁడు శివరాత్రి యాపురియెల్ల
బోనమ్ము ఎక్కినఁ బోయెడునట్లు
తరుణులు ముదుసళ్ళు తరుణులు కూన
లబువుళ్ళవోయిన యంగమ్మువార
లందఱు నామదేవా సీతమగుచు
క్రందైనసుధఁగ్రోలఁ గాఁకొనంగ
ప్రారంభమయ్యె కీర్తన పాండురంగ
దేరాళముగవాడె నెదుటనేనిలచి——
ప్రతిపదంబునయందు బరవళ్ళుద్రొక్క
ప్రతిలేనిభక్తి మువర్వులగ్గింప
తలఁపు తామరనుండి చిలికినతేనె
లలరభావములు దేవాంగనల్గరఁగ
నామదేవునినోట వర్తించెవాణి
పావిత్ర్యనిధికిఁ గైవసమైన యట్లు

ఆ పద కవితలయందముల్సూచి—
యాపసోపములాడి రచ్చరల్ దివిని—
నగువారు తూగువారగునవువారు
నెగిరెడువారు, బిట్టుగ నేడ్చువారు,
కరతాళములు దట్టి కరగెడువారు—
ధరఁబడి పొర్లువారరుసంబుపట్టి
భరమయి కడిదిగా నఱచెడువారు
కరడులై పులకలు కాయంబులందు,
నోరామ! యో కృష్ణ! యో ప్రావృషేణ్య
ధారాధరాకార! మేరుగంభీర!
యని పలవించువారైరి జనమ్ము
వెనుకొని కీర్తనల్ పేదురెత్తింప,
పడమటికొండపై వ్రాలె సూర్యుండు
పుడమిపై నెల్లఁ గెంపులుపాఱఁజల్లి
యప్పు దర్చకులు సంధ్యాకాలపూజ
సప్పుకుసతికిపేయంగ నేతెంచి—
ఆలయంబెల్ల మర్త్యమయంబు కీర్త
నాలాపమయమౌచు నందఱినడుమ
చుక్కలలోన నబ్జునిఁబోలి కాంత
దృక్కుల భువిఁ బవిత్రీకరించుచును—
చేతఁ దండంబుఁబట్టి చిఱుతల మ్రోత
లూతలై పదముల, కొక్కొక్కమాట
యద్దు కట్టిన పరమానందమట్టు
లచ్చంపుసుధవోలె నాత్మలఁ దనుప
నవరసములు జగన్నాథు సంసేవ
జ పరమ్ముగాఁ దీర్చసమయమ్ముగలిగె
నిది తాఱవిడిచిన నెటులంచు, దాను
పదపదంబుగ దూకుచాయగా నడుక

సంకీర్తనముసేయు సాత్త్వికభక్తి
సంకేత, మాత్రికు సర్వస్వమైన
నామదేవుని వెన్క జ్ఞానమార్గమ్ము
భూమికి వచ్చిన పొలుపున నదరు
జ్ఞానదేవుని జూచి కక్కసింపుచును
మానసమీర్ష్యా సమావిష్టమగుచు
కన్నుంగవలు పేడికాయలై పొంగఁ
గ్రన్నన దర్పించి, గద్దించిరిట్లు
చాలులెండోయి! మీ చపటపదాలు
పేలుపుగాణలు విచ్చేసినారు
కౌలిమాలు రాగముల్ కూతలు, వెర్రి
కరము త్రిప్పుడులును, కన్నులార్చుటలు
పొళగింపులు మూతిచాపులు, ఎచ్చి
కాళమ్ము లీప్రణాళతి బేలుపుచ్చు
టలు, రిత్తరిత్త కేకలంతోనె ముక్తి
గలిగెడు నష్టైన క్లైలాసమందు
సూదిమోపెడు నంతచోటైన దొరకు
నా! దినమున ముక్తులా వారికోడ!
నా పండరిని నేర్చినట్టి విద్దెలమఁ
జూపించి యిచ్చుటఁ జొక్కింపుబత్తి
పఱదగట్టినయట్లు బయలుసేసనను
మొలటులై వీరు నమ్మిరయేని! మేము
నెటివచ్చు, మెచ్చంగనేర్తుమే! యిచట
పరికరింపనియట్టివన్నలే! చొప్పు
దప్పిన దేశిఛందమ్ములు కర్వఁ
దొప్పునా! యజ్ఞమయుండు శంకరుఁడు,
మదిగట్టినాము మా మార్గమ్ము విడచి
యెడయుండు, మైలయు మడుగులోపదలి

భజనపేరిటి వెఱ్ఱిపాటల భక్తి
రఁజలకిచ్చోటఁజేరునె గౌరవమ్ము
లనినను పాండురంగాధీనమైన
మనసుతో లోకమ్ము మఱచినయట్టి
నామదేవుండు తన్నామసంకీర్త
నామత్తులైన జనమ్ములుగదల
కుండిన విప్రులు కొఱకొఱలాడి
రందాసుతులు! భక్తి రసికులువోలె
ఎలివిలి నాట్యముల్ సేయుచున్నారు
తలముగా, దిప్పుడుద్ధతి యూరిప్రజలు
వారిపాటలకుబ్బి చేరినారిందు
దారునెదురింప దక్షిణల్ తగ్గు
నని గొణుగుచు, సామమునన – కార్యమ్ము
నసుపడ సాధింపవలెనంచు నెంచి
యో నామదేవుండ! యో జ్ఞానదేవ!
వీమల విందయ్యెలే! నాగనాథు
నకును మీ పాటలు వికసిల్ల వర్తి
మెక తొట్ట నానంద, మిదె భాగ్యమనుచు
వెన్నెల కన్నులు విశ్వేశ్వరుండు
క్రన్నన మీపైపె గాంచుచున్నారు
మీ నాట్యములకును మీ పాటలకును
నానలు తోఁద్రోసి మేనులు మఱచి
మీవెంటఁ బడినట్టి మావారి నవక
శివరమ్ముగ మిమ్ము దిట్టుట మేలా!
కావిందు మీ భాగ్య కాలమ్ము, గాని-
యానిన ప్రేమ సంధ్యాకాలపూజ
సేయించు కోర్కెతోఁ జేరెడు భక్త
శ్రీయుఱు కటమున నిడుముడిఁ బడుదు

లావఱుందికిఁబోయి! యాడుఁడు పాఁడు
డని నాకుఁ బాటలభిమతంబేని
యామొగింబగువంచు నక్కనంపడుచు
నామదేవునకును నడిపఁ జూఁడం,
నటులకాకంచు బ్రాహ్మణులకు మ్రొక్కి
యటనుండి గదలి భక్త్యావేశ యాల
యంపువశ్చాద్భాగ మందునఁజేరి
యింపులేతరువులై యిగిరించినట్లు
శ్రుతితోడఁజేర్చి ప్రస్ఫుటముగా తాళ
గతులు మద్దెలమ్రోత లతులితంబులుగ
నజ్జలు మీరంగ నంఘ్రియుగ్మముల
నజ్జగా గజ్జియల్ హవణిల్లి పలుక
పరిరంభణము సేయువవిధి, శబ్దమ్ము
లఱుదార, మఱిపెత్తి, హరిఁగూర్చి పాడ
నా పాటలకు సొక్కి యమ్మొగంబగుచు
పాపాపనోదుండు, భవుఁడు సంతోష
పులకితుండై పురే! పురె యంచుఁ బొగడి
తలనూఁచఁ దొడఁగిన తారుమ్మలించి
యొప్పరికించిన నప్పాఱులకును
తెప్పున విన్పించె నిప్పల్కులపుడు
కులహీనులార! ఎచ్చిల మదులార!
మలయుక్త మతులార! మత్స్వరూపులకు
నెగ్గొనరించిన నేటికీపూజ!!
ఎగ్గ్లల బాటునఁ జేయుకేగాక
కాలసేతులు గల్గి లేలఁబారాదు
ఫాలాక్షులే హరిభక్తులటంచుఁ
జదివి యొఱుంగరో! సజ్జనులుక
మదిపెట్టరో! కండ్లమాంద్యమ్ము గ్రమ్మె

నో! జాతియన్నది యొదలికిలంకె
యో! జడమతులార! యుల్లంవుగుణమొ!!
జనన మైశ్వర్యంబు, ధనమును, విద్య
యమనవహంకారమునకు సాలములు
హరి యకించిన కృతాదురుఁడు సర్వేశు
దరిపింప నర్హులో! దార, ట్టివారు!
కడిదిమచ్చరులార! కానరో! కాఁక
యొదఁదశుద్ధముగాక, బుడిబుడిపూజ
లొనరింప-తిలమాత్ర మున్నదే గుణము!
కనుఁగవవిప్ప చక్కనఁజూడుఁ దతఁడు
నరమాత్రుఁడేయౌనొ! నామదేవుండు
ధరణికిఁ దిగిన యుద్ధవురూపు వాఁడు,
జ్ఞానదేవుండు నిక్కంబుగా విష్ణు
పీనేల తపమునఁ దాను జన్మించె
వొందు! వ్రల్లదులార! భూసురవ్యాజ
భండులారా! వారి పాదముల్గడిగి
జలమాని – ప్రార్థించి శాంతులఁజేఁ
కొలువుండు మీయఘంబులు వోవకున్న
మిమ్ము మీసుతులను మీ బందుగులను
చిమ్ముటగ్గికి బూది సేయించువనిన
వడవడ వడకుచు తడియారినోట
కడుఁ జీకటులు గ్రమ్మి కన్నులయందుఁ
బదరంగగుండె, లెంపలు వేసికొనుచు
వదఁడు వదండని వఱుఁగులు పెట్టి
యా నామదేవుని యంఘ్రులు దాకి
జ్ఞానదేవుని పాదకమలమ్ములంటి
యో నామదేవ! భక్త్యున్నతభావ!
జ్ఞానదేవా! చిదుదానందరూప!

పశువులమైతిమి భ్రమలు పల్కితిమి
పశుపతి కోపంబు ప్రళయాగ్ని పోల్కి
మమ్ము ముట్టిన, దింక మమ్ముద్ధరించి
నెమ్మిఁ జూడకయున్న నిల్వ లేమన్న
వారికి వందించి పార్వతీ విభు వ
వారిగాఁ బ్రార్థించి బ్రహ్మకులంబు
నిలిపిరి భక్తులు, నింగిపై నుండి
జలజలమని రాలె తెలిపూలవాన,
ఆనాటినుండి భక్తావనపరుఁడు
గాన వినోదుండు కాలకంధరుఁడు
నాగభూషణుఁడైన నాగనాథుండు
తీగె సాఁగఁగ నామదేవుల కీర్తి
యరయఁ బశ్చిమ ముఖుండై నిల్చి భక్త
వరులకంకిలి మాల్చి మెఱయుచున్నాఁడు
మఱికొన్ని దినము లా తరుణేందుధరుని
సరస సంకీర్తనా చారంబు సలిపి
యతుల పశ్చాత్తప్త మతులైన విప్ర
తతులకు జ్ఞాననేత్రమ్ములు దెఱచి
ఆయూరనున్న భక్త్యార్ద్రుల కరలు
బాయంగ సంసార పారమ్ము జేర్చి
మహిత భాగవతధర్మమ్ము బోధించి
యహితసంశయమున హతులైనవారి
నిహతతర్కమ్మున పశులుగాఁజేసి
సుదవ్వునెడ సద్భక్తులు సూప
నాగనాథునిపాద నలినమ్ములంటి
యాగుబ్బుగొనుభక్తి నానతికడప
పండరిపురికినై పయనంబుగట్టఁ
బాండురంగనిఁజూడఁ బదయుదునమచు

నామదేవునిమేను నందనరామ
మామని సొగసు సాంద్రానందవశత
నటు చూచునాస్వామి యిటు పల్కఁదేను
పొటమరింపఁగ వేడ్కఁ బూన్చికౌగిటను
రంగఁడు నేను పత్త్రింబు ద్రిప్పనను
పొంగెనో పొలయల్క వోలఁటంచు
నాకపోలముదాకి నన్నెలయించు
నాకద్దులోకమే వైకుంఠమగును
తరుగనియట్టి చింతాకంతువులను
పరవశమై మేను వరుగిడుచున్న
నామదేవునిఁజూచి జ్ఞానదేవుండు
యేమోయి! పట్టితివింటితెర్వులను
జింకవైతివి మేము జీర్ణవృద్ధులము
సంకటమౌను నీ నరిగాఁగ నడవ
తొందర లేదులే! తోయజనాథుఁ
డుందయుండును నీకునై య్ చ్రుసాచి
మెల్లనఁజనుమని మేలంబులాడు
మల్లెలపూయ కమ్మని మోవిపైని
నామదేవుఁడు పాడు నలినాక్షుగుణిచి
సామోదితములతో సరియైన కవిత
లెండెట్టులుండిన క్రందుగాఁదేనె
జిందుకవిత వాని జీవనంబయ్యె
నా కవితాశాఖికామని ప్రేమ
పాకవరాకాష్ఠ పాండురంగండు,
తెరువులఁ దగిలెడు పురులందు దివ్య
హరినామకీర్తన, లరవిరుల్ చల్లి
యచ్చటచ్చటనున్న యనఘుల - సాత్త్వి
కచ్చపులను భక్తగణములఁ జూచి

నడువంగ నడువంగఁ బొడకట్టెనెదుట
పడికట్టు ముక్తికి పండరీపు ము
పండరీపురములో భావల్లి భక్త
మండలిప్రాణమ్ము మహితగోపురము
పండరీపురమన్న - భక్తులకెల్ల
గండరించిన యట్టి కైవల్యపదము
ఘనులు మహర్షులు కందేర్చికూర్చి
పనివడనిల్పిన భవ్యతపమ్ము—
సనకాదిమునుల వాంఛాభూమి నార
దునిమహాతికి, గొంతుతనివోవుచోటు
సౌళశాయనితులౌ సప్తర్షివరుల
వైఖరీవాఙ్నిర వర్ధితనగము
వాసుదేవుండనువారమ్ము భక్తి
భాసురులకు వెంట బడివచ్చుచోటు
పండరీపురము గన్పడినంత మేన
బొందు మల్లెలుపూచి, పొలపంబుమెఱయు
కనులలో నానంద కమలముల్ విరిం
తన ప్రాణనాథునిదరికి నేకించు
వనిత చిత్తములోని, వగలువకంటె
నినుమడిగానయ్యె నెనునవగలు
నామదేవునకు నెన్నఁగదరమౌనె!
కామవికార సంకలితచిత్తులకు
జీవేశ్వరులకున్న పావనప్రేమ—
లేవితంబులనొప్పు డిగిరించననుచు
కరములు ముకుళించి గండముల్ పూచి—
ధరణిపైఁబడి పరాత్పర! నమోవాక
మని సారెసారె సాష్టాంగమ్ముచేసె—
ననిచినప్రేమల నామదేవుండు

కాన, శ్రీపండరీధాముఁడై నట్టి
జ్ఞానైక వనధికి జ్ఞానదేవునకు
తనకన్న వేఱుగా వనజాక్షుఁదలఁప
బనియేమి! లోకశిక్షణకుఁగా, నేమ
మును, నడపుచుగాక మొనయయాతండు
తనువు భూమినిలోక దండమ్ము వెట్టె—
నిప్పుడు గాదప్పు డిందిరానాథు
తెప్పలుగా హర్షముప్పతిలంగ
దర్శింపవలెనని - కారుణ్యదర్ప
భరితబంభరమల్ల సరసఝంకార
సారంగరాగమై, సారసారావ
పూరితంబై, సారసౌరభసార
సారసవిసర కింజల్క కర్దమిత
వారియౌ వర చంద్రభాగలో నాడి
హరికీర్తనము సేయుచాత్మఁ జొక్కుచును
తొరిగోపురద్వారమునకు వందించి
బలిపీఠమున కర్థిఁ దలవంచి నీల
జలదమ్ము కాలుసేతులు దాల్చినట్లు
కొమరారు ప్రాబల్య కౌసల క్రొత్తావి
గమగమల్ నించు చిక్కని యూర్పులగుచు
అదె వచ్చు నిదెవచ్చు ననుచు తన్గూర్చి
యెదురుతెన్నులు సూచు నిందిరారమణు
గని, మూర్ఛవచ్చిన కరణిపై వ్రాల
కనులలో నీరముల్ గార్చుచుఁ బాఱు
రంగఁడు, కౌగిట వ్రాలిన వాని
ముంగురుల్ నిమిరి, క్రమ్ము కదుష్ణ బాష్ప
ములు మీటి, కండ్లకన్నులఁ జేర్చి చూచి
పలుమారుఁ గౌగిలింతలఁ గరఁగించి

యెన్నండు నను వీడి యెఱుఁగని వాఁడ!
విన్నాళ్ళ లెట్లు వేగించితివోయి!
నీవు లేనిది నాకు నిఁకడలేని
భావమై కన్నులఁ బట్టదు నిదుర
జ్ఞానదేవుల మైత్రి సామాన్యమైన
దా! నీదుభాగ ధేయంబు ఫలంబు!
ననుడును స్వామి! నీ యానతి యంచు
పని వినుకేగాని పవలును రేయి
నీ రూపమే కండ్ల నిలిచిన దోయి!
నీ రూపమయ్యెను నిఖిలంబు జగతి
నీ విరహపుఁ జిచ్చు నిలువున గాల్చ
స్రోవులై వాగులై పొంగి వచ్చినవి
పదకవితలు, భవద్భక్తి సౌరభము
వెదజల్లు మొల్లలు, విశ్వేశ! కాని
యమృతమ్ము గుడిగట్టినట్లున్న - దుఃఖ
శమమైన నీదు సర్వస్వరూపమ్ము
కనుల ముందుటలేక కలఁగుటలేమి
యని యందు! క్షణమొక్క యగ్నికుండమ్ము
బుడతయై నామదేవుఁడు బమ్మరించె
నిడువాలు గన్నుల నీరమ్ము నించి,
నామదేవుని, భక్తి సీమంతినీని
కామకాంతలు కర్వుగట్టిన రూపు
నామదేవుని దివ్యనాదావతారు
నామదేవుని ముక్తి నగరిపీఠించ
మొలక నవ్వు ముత్తెములతోడఁగాని
పలుకెఱు మురిపింపఁ బలికె విష్ణుండు
నామదేవా! గ్రొత్తవా! మనకున్న
ప్రేమబంధమ్ములు విశ్వవిశ్రుతము

పెడఁబాటు లందున్న కడిఁది ప్రేమమ్ము
లోఁదగూడియుండిన నుండవుసుమ్ము
భక్తితాల్మ్యమునాకు బహుళమ్ముగాన
భక్తి విరహభావవర్ధితం బగుట,
భ్రమర గీతమ్ములు, రసపరాయణము
లమృతవేణి కలంచు చున్నవో కావో!
పరమభక్తులకెల్ల భరమౌ మాధవుని
విరహంబు, భక్త విరహంబునట్ల
భగవంతునకు నిమ్నఁబడ్డిన మనసు
మగతఁజిక్కిన నొక్కమాటైన నాడి
యెఱుఁగ రుక్మిణితోడ, వెరవరిపలుకో!
నరసనేయుండె, విచారింపవోయి! —
యనని జ్ఞానదేవుల నభివీక్షసేసి
తనపారనవ్వొ చిద్ఘనుఁడైనమూర్తి
నామదేవుఁడు భక్తితో మౌళివంచె
నా మధుసూదను నర్ధాంగి, రుక్మి
ణీదేవి, కామాత బోధింపదేని
శ్రీవరునకుఁగల్గునే దయాస్ఫూర్తి!
హరివల్కె నామదేవా! బోయారమ్ము!
నరసవతంసమ్ము జ్ఞానదేవులకు
దీర్ఘమాతిథ్యమ్ము తెలుపకు నెగులు
దేర్పుము సుతుని ముద్దిడికొమ్ము, తల్లి
పీపైనె ప్రాణముల్ నిలిపికొన్నదియు
వాపెకునితముగా వాదుమునలుకు,
ధరణి ప్రేమములు, రిత్తకు రిత్తగావు
జరగు బ్రహ్మానంద పబ్రహ్మచారు
లవిలౌల్యములుగాని యంతకు జీవి
తవి మహాసంస్కార మావహించెదును

పోయిరమ్మంచు విప్పగల వక్షమున
తోయజనాభుఁ డొత్తుగ నొత్తికొనుచు
గళసీమనున్నట్టి తులసికాదామ
మలరుచు నవ్వాని గళమున వేయు
శ్రీ రుక్మిణీదేవి, చెలువప్ప లోలయి
వారిజాక్షినిలీలఁ బరికింపుచుండె
వారువోయినతోన వారిజాంబకుఁడు
ధీరమంథరముగాదారతో ననియె
చెలువ! తీర్థమ్ములు సేవించివచ్చె
నలువుగా మనవాఁడు నామదేవుండు
దానికుద్యాపన దీర్పకయున్న
వానియాత్రవతము సత్ఫలవంతమగునె!
వాఁడు నిస్స్వుఁడు, వాఁడు బట్టనదేవుఁ
డాడకాడకుఁగల్గు యాదవాన్వయుఁడు.
మాకింక తెరువేది మనికి తం బలమె,
మాకన్న నద్దిరా! మాయలవాఁడ!
కల్పకల్పమ్ములు కాపురించినను
నల్పెదు మాపైనె జాజఱ లింక
పెఱవారివిడుతువే! విడిముడిలేని
దొరకయివట్టిన తెఱవలొ మాకు
మాత్రమెక్కడ వచ్చు మణులు ధర్మములు
సాత్రాజితులవేడ నమకూరునేమొ
యని కావికన్నుల నలమంగనగవు
వనజనాభుని పదద్వయమంటి స్వామి!
వింతలాడెదవు జీవితములు జ్ఞాన
వంతులనైనను, భ్రమియింపఁజేయు
సురరాజ్యరమ భవచ్చరణంపుధూళి
సురరాజు నీయింటి పరిచారకుండు

గొడుగు పట్టెడువాఁడు గుహ్యకేశ్వరుఁడు
మృడుఁడు నీమొగసాలఁబడినచారణుఁడు
నీవునిన్ను వ్వఁడవౌట నిక్క మేయైన
భావింపనిక భాగ్యవంతులెవ్వారు
మాగుపాలనియోగ మాయావృతుండ
వై గణుతింపంగ నఖిలభూతముల
యంతరాత్మల నిల్చి యఖిలభోగముల
నంతరానుభవంబు సలిపెడుదావ
నీవు నిన్ను వ్వండవు నీవయాధ్యుఁడవు
నీవుగానిదియేమి? నిఖిలక ర్తవు!
కానిమ్ము! నీ కిచ్చగలుగుట యేమి!
పూనిక యది దప్పవోవుట యేమి?
యనుచును కన్నుల నల్లార్చి నగవు
మొనఎనవాలిఱ ము త్తెముల్ పూచి
పండరీశ్వరుఁడనె పడఁతి! యాయుద్ధ
వుండెగా నామదేవుండౌచు వాడమె
వానిమహాత్వంబు వనజాసనాదు
లేనైననెఱుఁగ, నింకేటికివాదు
గగనంబు కడపల గగనమెఱుంగ
దగణితమ్మాత్మ మాయాశ క్తినేన
యెఱుఁగను భ క్తిలో నెంతటిబలమొ
యెఱుఁగఁడు భ క్తుఁడింకొరులెఱుఁగుదురె!
నిరపేక్షుఁడై - నిత్యనిర్మలుండగుచు
పరమశాంతుండు - నిర్వైరుండునగుచు
సమదర్శనుండునై, సతతంబునన్న
తమిమీఱ, నెదలోనఁదాల్చి జీవించు
వానియంఘ్రుల ధూళిఁబడునన్నయాన
వానిసేవలొనర్చి, బ్రదికెడునాన

యనుసరింతుమవాని! నన్పాంబు విడ'
కనుగూర్కు లేక నా మనమున వేఱు
తలఁపులులేక శ్రీ ధామవై కుంఠ
మలవాని కలువుల కల్పంబుసాటి,
పరమభక్తులకన్న పండరీశునకుఁ
బరికింప ప్రియమైన వస్తువులేదు
నామదేవుండింతలో మఱివచ్చె
స్వామి చెంతకు భక్తి భరనిత్యశీలువు
వానివీక్షించి నీవ్రతము ముగించి
పూని యుద్యాపనమ్మునుఁజేయవలదె
ధనములు కొఱయైనఁ దమకున్నకొలఁది
నొనరింపఁదగుఁగాక నొల్లఁటో ధర్మ
మనుటుచితంబె! నీకంత లేవడియె!
కనుకని నీమూపుగాచెదు తల్లి!
తమ్ముబిడారంపు కొమ్మగాదోయి!
రెమ్మ! పండరిలోన శిలార్ధమూర్తి
దిరుగువేదమ్ములు తరుగనినిష్ఠ
వెలుఁగుగావగ్నులు వ్రేల్చెడువారు
నాఱుశాస్త్రమ్ముల నాకళించిన గ
భీరబుద్ధులు సోమపీథులు, వాజ
పేయం బొనర్చిన విశ్రుతశ్లోకు
లాయతి బ్రహ్మల నడకించువారు
పరమకర్మ శతశోభర జీర్ణదేహు
లరుదారు మంత్రమయాత్ములు కడిమి
బహుపురశ్చరణ తత్పరులు, స్వధర్మ
నిహితబుద్ధులు ధరణీసురుల్ గలరు
వారి నాహ్వానించి బహుభోజనముల
భూరిదక్షిణలఁ దృప్తులఁజేసి కాక

వ్రతము సఫలమౌనె! భక్తుండవోయి!
యితరరిగాఁ దక్కనేలినబంటు
పరమభక్తులకును పాండురంగండు
వేఱమాటలేటికి? వేదము నేవత్తు
నీవెంట విప్రుండనై వేదరాసు
లావిప్రవరుల నాహ్వానించుకొంటకు
వని పూని పలికి లీలావతారుండు
క్షణములోఁదానొక్క జగతీసురుండు
గానయి నుదుటిపైఁ గమ్మనితావు
లీనుత్రిపుండ్రముల్ వీనులఁగుండ
లమ్ములు నిడుపుజందెమ్ములు చంద
నమ్ము వక్షమునను సమ్ములయందు,
గళమునఁ దులసి మాలలు వానికోడ
వలముత్తావుల సొగసైన గొజ్జగుల
దామముల్ చకచకద్ధవళ చంద్రికల
చేమించునైదుకచ్చెలకట్టు పసను
యొసపరిజరియిడ్డ యుత్తరీయంపు
వపలు పెన్నెఱిగుంపు నేఁసగెడు కచ్చ—
కరమునఁ బూవుల సురటి యొప్పార
నిరుకళంబుగ నవ్వు - నెఱిముందు నిలిచి
పొందయ్యె పేసమ్ము పోదమేయన్న
కందమ్ములానంద తుందిలమ్ములుగఁ
బొడగని నామదేవుం డాన యన్న
పడఁబారి వచ్చెను భక్తచయమ్ము
భవునంకభవుఁడు నివర్తి దేవుండు
కపులలాటాక్షమ్ము దాచినవాఁడు
పనఖాపమందు సోపాన దేవుండు
తనువునొక్కమొగంబు దాల్చినవాఁడు

యోగ మాయాంశతో సర్వరంజగు
త్యాగైకపద్ధి ముక్తాబాయి చాంగ
దేవుండు యోగనం దీక్ష బుద్ధి
భావకుండా ఏర్ర భాగవతుండు
హరదేశవాద్వైతి నరహరిభక్తుఁ
డరిదిమానిసియైన యాకూర్మదాసు
కుమ్మరి బగుతుండు గోరా మనస్వి
క్రమ్మిన యర్మిలి రాకాభిధుండు
పరమవిశ్వాసమ్ము నరసింహ మేధ
మెఱయు భక్తుఁడు చొక్కామేళ పంచముఁడు
అంబుజోదరుని ప్రేయసి జనాబాయి
నంబి జగన్మిత్రనాగ నాథుండు
లలిత ప్రసూన మాలా సేవతోన
జలజాక్షు నేలిన సావంతమాలి
మఱియుఁ దక్కిన భక్తు లరిది శ్రీధరుఁడు
పరగున విప్ర వేషము గట్టైనసుచుఁ,
జేరిన తనవారిఁ జెంతకుఁ బిలిచి
వారివారికిఁదగు భంగి లాలించి
తాను భూమీసురుండైన కారణము
ప్రాణప్రియులు వారి కాహరి దెల్పె
అపుడు నివృత్తిదేవాదులౌ పెద్ద
లపరాజితుని వెంట నవరంబ పడగ
లను బూనినదువంగ నమఁగలౌ భక్తు
లను పరింపఁగ కీర్తనానందవశులు
నామదేవుఁడునట్ట నడుమ శ్రీధామ
నామామృతము బంచ, వలుగడలందు
పొంగె నాయుత్సవం, బాగళదేవ
తాగణ వ్యాకులి తాండరం బగుచు

పాఱుఁడై వడచెదు పాండురంగండు
వాడక ప్రతి గృహంబుఁజేరఁబోయి
తిలకించి భక్తి సంకలితుఁడై యెల్లి
ఫలితావతారుండు పండరీశ్వరుని
సన్నిధిలో నుండు సంతర్పణమ్ము
మన్నించి మమ్ము - భామా పుత్ర మిత్ర
సహితంబుగావ సన్నిధిసేసి
బహుమతి సేయంగవలె నంచుఁ బలుకు
కారణమే మన్న, గాదిలి తనకు
నారాయణు నిరెంక నామదేవుండు
తీర్థయాత్రలుసేసి తిరిగి వచ్చుటను
సార్థకమ్ముగ వ్రతా చరణముద్యాప
నము సేయనెంచితి మమరులు మీరు
మము గృహార్థులసేసి మమపుడం చనును
ప్రథితాను భావుండు పండరీశ్వరుఁడు
క్రతురూపులగు విప్రగణము వీక్షించి
తనపేరనంతుండు తాను విప్రుండ
ననె, జాతి ధర్మ వేలాఉతీక వృత్తి
యీరీతి విప్రుల నెల్లరఁ బిలిచి
వారిజాక్షుఁడు - భక్తవంశ వర్ధనుఁడు
కోవెలఁజేరి యా కొంటిరి మీర
లావసథములకు నణుగుండటంచు
సెలవిచ్చి, నవ్వుచుఁజెలువకు విప్ర
కులములతోనన్న పలుకులు చెప్పె
నామదేవుని యింట నామసంకీర్త
నామోదములు గుప్పుమనె నాటికేయి
తెలతెలవాఱె దిక్కులఁ దెల్విపేరె
పులుగులు, నుడితేనియల విందు సేసె,

ముత్తెఱంగులఁగూసె మత్తకుక్కుటము
లెత్తిన మెడలతో పీండ్లపై నుండి
మలయ మారుతములు మానినీ గండ
ఫలములు చుంబించె దాక్షిణ్యవృత్తి
తిరుముల నున్న ప్రావిరులఱజ్జగించి
కిరదర్పణములలో కాలివాతెఱల
మొలకచందోయి తెంపులఁ జూచికొనుచు
కుసుమాలువోయరి క్రొత్త కోడండ్రు,
విరిసిన నెత్తమ్మి తెఱవల చుట్టు
తిరిగి యళుల్వింత యొఱపులు చూపె
పరమ రసజ్ఞుఁడైన పండరీశ్వరుఁడు
తెఱుగనితమి భోజతనయ వాకట్టి
కురుకొత్తిగించుచుఁ, గొసరి చుంబించి
విరవాది పూసెజ్జ విడలేక విడిచె,
లోకబాంధవుఁడు త్రిలోకనేత్రంబు
కోకముత్సంధాయి గొజ్జగుల్ జల్లె
గగనమాణిక్యమ్ము నిగమభూరుహము
జగదగదంకార వరణప్రచారి
నామదేవాదులు నారాయణునకుఁ
బ్రేమంపుఁ జొద్దముల్ వీనులవిందు
సేయురాగములతో చెలువుఁదాళముల,
తో, యతులదుక చేతోహరులగుచు
పదకవిత్వమ్ములు పాడుచున్నారు
పదనెక్కు గోపురద్వారమ్మునందు
నింతలో నర్చకు లెలమివేతెంచి
యంతర్ముఖులు భక్తులందఱుకెఱఁగి
తలుపులు దెఱచిన మొలకనవ్వులను
జిలుకుచూపులఁ గటాక్షించె శ్రీధరుఁడు,

తలయంటె నామదేవులకు జవ్వాది
గలిపిన నూనెతోఁగలికి రుక్మిణియు,
సత్యభామాదేవి జలములువోసె
సత్యవ్రతము తపంబగునిదియనుచు
వారతుల్పట్టి రత్నాఢ్యలు దక్కు-
వార, లాపండరీశ్వరుఁగూర్మిసతులు
పురుషోత్తముఁడు స్వయమ్ముగ వస్త్రమాల్య
పరికరములనిచ్చె - భక్తశేఖరున
కీ నామదేవున కెవ్వరీడంచు
మౌనులు, సురలు వేమారుఁ గీర్తింప
పాండురంగని పాదభజనలో భక్త
మండలియుండంగ మధ్యాహ్నమయ్యె!
వచ్చిరివిప్రులు వందలు వేలు
మచ్చిక భుజియింప మాకబ్బు నాల్క-
త్రుప్పుడుల్లెడువంచు దోరశైయాన
విప్పుగిల్గినబొట్టి లప్పళించుచును,
ఆలోన బ్రాహ్మణుండై యున్న చక్రి
పాలమ్ముపంచి తత్పాదముల్పట్టి
జలములఁగడిగి యమ్ములఁ దడియొత్తి
తెలిచి, బంతులుగాఁగఁ దీర్చించి రుక్మి
ణీదేవి వీక్షింప - నిడుదఁగన్నులను
క్రోదిగా నవ్వులు పువుటోడి ముత్తె
ములగ్రుగ్గుదీర్చిన నెలవులయందు
తలిమముల్ మోదాచ్ఛదములు వేయించి
యాఁకరందు వడ్డన కింతులటన్న
వికచాంబురుహనేత్రవీక్షణతోన
నచ్చరలెల్లరు, నాపాల కదలి
వచ్చిన బాంధవ్య బంధంబు గుఱిచి

వోలె నాక్షణమున నాలోక జాల
జాల కమ్ముల విప్రచయము వాలించి
వెలయు మధ్యమలోక లలనల కరణి
చలువ నవ్వులతోడ సాక్షాత్కరించి
జలజవాసిని తలంపులతోన తెట్టు
వలుగాగ బెరిగిన బహుపదార్థములు
వడ్డింపఁదొడఁగిరి వారికోరస్థ
లోర్థిన మృదుగతులొయ్యారములుగ,
పునఁగుఁదావుల యన్నములు నూఱుగాయ,
లనువైన పచ్చళు, లంబళుల్ చారు
పులుసులు గమగమల్ వలచు క్రొన్నేయి
దలఁప వంకలు గట్ట ప్రతివారి ముందు
నరిసెలు గారెలు వవుగులు, లడ్లు
కరిజికాయలు దొడ్డ ఖండమండెగలు
కుడుములు పూర్ణపు కుడుము, అద్దెవలు
మడిగొను నప్పాలు పొడి బెల్లమందు
బొరటిన యవుగులు పరమాన్నములును
పరిపరి విధముల భక్ష్యసంతతులు
నొడికఁపుఁగూరలు, నొఱపు పప్పులును
గడు మధురమ్ము చొక్కమైన పెరుగు
వారి కటాక్షముల్ వారివ యమృత
ధారలు మందాక్ష దంతుర మంద
హాసముల్ వల్గునృత్యత్కుచా భోగ
మాసర దర్పముల్ మాంసల జఘన
మండల జల్పాక మణిమేఖలా ప్ర
చండ విభ్రమములు సాభోగ కటివి
తర్జికల్ గమచు, చి, త్తజ శరాసార
మర్దిత హృదయులై మఱచి నేత్రమ్ము

లాభోవఁ ద్రావుచు-నా కంఠ పూర్తి
సాపడ విప్రులు సారెసారెకును
వనజదళాక్షుండు ప్రతివారిఁజేరి
  మనమున కించిన మధుర భోజ్యములు
వరితృప్తిగాఁదిని, కరుణింప వలయు
శరణంటిమని యుప చారముల్వలుకు
నాపరాత్పరునకు నాజ్ఞానమూర్తి
కపాళులకు నెక్కుడెక్కుడి సాటి!
లోక శిక్షార్థమై యాకమలాక్షుఁ
డీక్షై వధుల నటి యించుచేగాక
భూసురులుత్తరా పోశనం బంది
యాసనంబులువిడ, నంభ్రములు గడిగి
తజ్జలమ్ముల శిరస్థలమువఁజల్లె
పజ్జల నిలుచున్న - భక్తులందఱకు
హరి, పురుషోత్తముండా సలిలములు
శిరమునఁదాల్చె నుద్భరవోవసురలు
చందనమును పూలు సరస తాంబూల
మందర కొసఁగి మంత్రాక్షతలిచ్చి
నామదేవాదులతో ముందు నిలిచి
యామధు సూదనుండౌ దలవంచి
వారు దీవించిన పరమ భాగ్యమ్ము
మీరరుదెంచుట మిక్కిలి వెలిగె
నామదేవుని పుట్టు వమి వదద్వ
యామృతసేవచే నంచు నగ్గించి
భూరి దక్షిణలచేఁ దొందించి తృప్తి
వారట విశ్రమింపఁగ నామదేవ
సోపాన దేవ, పీసోబా నివర్తు
లాపుణ్యులైన గోరాది కుంభారు

లాహాకామీకాదు లంత్యజాల్ భక్తి
వాచవిఁగోలిన వనితలై పట్టి
యూజనాబాయి ముఖ్యగువారు దమకు
సాజమైనట్టుగా వరసిజనేత్రు
కెలనఁ గూర్చుండిన క్రీగంట్ల నగవు
వెలఁది వెన్నెలఁగాయ వేల్పుటచ్చరలు
వడ్డింప పరమూర్తి పండరీనాథుఁ
డడ్డపాకులుగాఁగ నఖిలలోకములు
రమతోడఁ గ్రీడించు రాఎక్యమూర్తి
ప్రమదమువ్వెత్తుగా భక్తులనోట
నిడుఁదన యెంగిలి గుడుచు నుచ్చిష్ట
మొదగూడెనేఁడు మహోత్సవంబనుచు
 నామదేవా! భక్తినందనారామ!
నామదేవా! రచనా సార్వభౌమ!
యేది! నీనోటిలో నిడుకొన్న కబళ
మాదరమార నాకం దివ్వవోయి
జ్ఞానదేవా! నీకు నాకును భేద
మేనాడులేదు యేదీ నీదు కబళ
మారగించెద నధ్వరాగ్నిహుతంబు
పారమితమ్మున పాద్రవ్యమట్టు
లోయి! నివర్తివాధా! యూరకుంచి
వా! యిదె! కొమ్మోయి' యన్నంబు మేల్మి
పలుకాడవేమి కుంభార! గైకొమ్ము
పలుదోయిఁ గ్రుచ్చిన భక్ష్యంబు దీని
నన్న చోకా మేళ! యెన్నకున్నావు?
తిన్నదందిమ్ము సంతృప్తిగాఁ గుడుతు
నోప జనాబాయి! మూపన ముత్య
మైంగ్గుతోడుత నట్టింటివేమె?

కెంపుల పలుగాటు లింపైన ఎదుచ
నంపవే! భుజియింతు నాకలిగొంటి
ననిసారె బలుకుచు నారగించుచును
మునివంటఁ గొటికిన భోజ్యముల్ భక్త
కులముల కిడుచు బెక్కువల నవ్వుచును
జలజాక్షుఁడుండిన చావకూడైన
యావిందుఁజూచి బ్రాహ్మణులు, కట్టెఱ్ఱ
గావించి కన్నులు కటకటం పడుచు
మాదిగ యొకఁడు కుమ్మరియొక్క డొక్క-
డేదికులమొ చెప్పగాదనువాఁడు
పరువెత్తి వచ్చిన పడతి యొకర్తు
పరువు పీడిన, వీరి భక్తులటంచు
వారి యెంగిలిదాము, వారు తనెంగి
లారగించుచుఁ గులాచారముల్ గూలఁ
ద్రోచినా, రేటి విప్రుఁడు వీఁడు, నిగ్గ
దీఁన యట్టి మాదింగుడుగాక
వీని మాటలు నమ్మి వేద గంధిలము
లైన మాకులముల నాలి బుచ్చితిమి
చవియైన తిండి యాశలు చూఁ, కులము
లవియించి, మాకెల్ల లాలంబుపేసె
వీఁడు దుర్మార్గుండు వీని గృహంబు
కూడు, వీఁడిచ్చిన మాడలు కలుష
ములు, పాప దైవంబు నిలిచి మాపాల
నిలువున గూల్చె నన్నిష్ఠ లన్నియును
పేరవంతుండంచుఁ బెద్దగాఁ బనవి
మేరుమానిఁ వోలె మెలమెల్ల డాఁ
మాకొంపలను గూల్చె మాయలపుట్ట
యీ కశ్మలముపోవనేది తెర్వంచు

తిపలోనఁ దాము వితర్కించుచున్న
గములోదరుఁడు వారికై వడి జూచి
తన్మయంబుల నున్న తలఁపులూహించి
చిన్మయుండానంద శిఖర స్థితుండు
విమల భక్తులదైన పెద్దతికమ్ము
తమిదీరఁ జాటంగఁ దామగాఁ బూని
చేసిన తెఱఁగొట చిఱునవ్వు పెదవి
కోపలఁ దొలుక విప్రులఁ జేరిపలికె
దాసుని యెడ నేమి తప్పు దోచినవొ?
భూసుర వరులకు, పుల్ల పద్మముల
వలెఁగలకలలాడు వదన బింబముల
జిలుగు నవ్వులనేది చిన్నవోయినవి!
అనుమానమేల మాయందు! లాతులమె
పనుకంగ! మీలోని వారమే కాక!
మనసులో నున్నది మాటలోఁ జెప్ప
మనపుండ.మమ్ము మీ మన్ననల్ గురిం
యను హరి వాక్యంబు లాలించి యాదు
కొవనేమి యున్నది? కులమున కెల్ల
గద్దలి గొంటివి! కద్దా! విప్రుండు
పద్దుగా శూద్రుల పంక్తి భుజించు
టలు, వారి యెంగిలి కలరుచు గుడుచు
టలు తన యుచ్ఛిష్టములు వారి కొసఁగు
టలు చాపకూడయ్యె తలపంగ వింద,
తెలవారినంత కుండలు గొట్టుకొనుచు
బ్రదుకుపీ కుమ్మరి పరమ భక్తుండె!
పదరినంతనె పెర్రి పాటలు ఎగ్గు
దొఱఁగి, యాడిన యంత, తొట్రిల్లి కన్ను
లఱమూఁ వంతన యయ్యెవా, నామ

దేవుండు శుకునితో దీక్షైన వాడు!
శావరంబున వాఁడు గఱచిన కూటి
వంచివ్వ గుడిచితి వా చొకామీకుఁ
డెందలివాఁడౌగాఁడీ యూరి వాడె!
కడజాతి కౌయ్య వీక్షణమునసైన
వరిగఁ దానము సేయవత్తివాఁడద్ది
రా! వాని యెంగిలి? నీ వాయి డెఱచి
పావన మనిదింటి వీవర్తనములు
పాటులవే? నీవు బ్రాహ్మణుం డనుచు
నేరిమి మాటాడి - నీ యింట మమ్ము
గుడిపించి, మానిష్ఠ గూల్చితి వేల?
యొడిగట్టి తీయఘుంబడుగక సేయ
వీరీతి జూచిన నీకులంబేమొ?
యారని యరగలి యైయున్నదోయి!
పలికెదు శాస్త్రార్థ వాఎతంబుగను
నలిపెదు సేవలా చార పూతముగ
నిన్నియుండియు నీకు నియమంబు లేక
యున్నట్టి దాన వాయున్న వన్నియును
వెలిమిడిలోసేయు వేళ్ళగావయ్యె,
కలిమిగలిగినంతఁగావలమూని
యిచ్చవచ్చినయట్లు వచ్చిగాఁదిరుగ
మెచ్చు వా ధర్మంబు! మీదదైవంబు!
వేదానుసరణంబు విప్రధర్మంబు
కాదందువో! మరి - కల్లలే యౌనొ
ప్రామినుకులు సెప్పు వర్ణధర్మమ్ము
లామేర వడపుట యదిగాదొ తగవు!
అనుడు వప్పరమేశుడంకించి శిరము
కనులార్చి, వాటికిఁగరములు మొగిచి

గాంచె వో విప్రవరులార! ధర్మ
ధురీణులార! మీ బుద్ధుల తప్పు
దలఁతురే! యొక్కొండుతులే వేద
ముల నాకళించిన బ్రహ్మపూరుషుల
కొల్లచెప్పగా వేదవాక్యం ధర్మ
మ్మల్లంతమ్ముగా నొనరించుటందు
బుద్ధులు పెద్దత్రోవఁ బొరలుచేగాక!
ఎద్దంబుగా మీరు చెప్పిన ధర్మ
మఱియు ధర్మంబె కాదన్నచెవ్వారు
మదిగాంచిచూడ సామాన్య విశేష
ధర్మంబులని రెంట తప్పకఁలిగె
మర్మజ్ఞుఁడైన యామ్నాయపూరుషుఁడు
సామాన్యధర్మంబు సామాన్యులందుఁ
దామాన్యమౌను శ్రద్ధాగుంభితమ్ము
మరి విశేషమ్ము ధర్మము విశిష్ట
నరులందుఁజెల్లు నిబ్బరముగాఁజూడ
వెలయు సంస్కారమ్ము భేదకధర్మ
మెలమి వీఁడు విశిష్టుఁడితఁడు సామాన్యుఁ
డని నిర్ణయించుట కా నిర్ణయమ్ము
వినికియు జదువును, వృద్ధోపసేవ
నమ్ము, తపోబుద్ధి నెమ్మది శుద్ధి
నెమ్మి సాత్త్వికవర్తనమ్మునఁగలుగు
పలఁతు లొనర్తురు పలవనిభంగి
పలుకుదు రొరులహంభావదూషితులు—
నామదేవుఁడు భక్తిపేమ సామాన్య
గామతినెంచుట కడిదిపాపంబు
కులము దేహమునకుఁ గులహీనుఁడైన
జలజాక్ష భక్తుండు, కులమునమేటి

యహరహమాత్మనిధ్యాన ప్రీత్యంత
నిహితచిత్తుఁడు శాంతవీరధి నామ
దేవుఁడే హీనుండుగావుటమేని
యీ వసుమతి పూజ్యులింక నెవ్వరు?
వైష్ణవాగ్రణి, భక్తివాల్లభ్యనుతుఁడు
ముష్టద్విషయ శిరోమోటనవృత్తి
సహపంక్తికినివాఁడు సరిపోవదేని
యిహమున సరిపోవుటింక నెవ్వాడు?
వనజాక్షి భక్తులవాం మీ కెఱుఁగ
నమవౌనె? దెలిపెద నాలకింపుండు
అధమతుర్కర పలలాశియౌగాక
మధువైరి భక్తుండు మతి భక్తిలేని
విప్రునికన్నను వేయిరెట్లధికుఁ
డప్రియంబైన నియ్యది మౌనిమతము,
పరమభక్తులయందు వాత్సల్యభరము
పురుషోత్తముని పూజఁబూర్ణమౌరతియు
నొరులొనర్చెడు పూజ నొనరుముచ్చటయు
దరధరుకొఱకునై దంభ, రాహిత్య
మా హరికథలయం దత్యంతరక్తి
శ్రీహరిపేరితో చెలరేగి మేన
మొలకలై నిలిచిన పులకచయంబు,
శలువుగానిచ్చెడు నామజపంబు
కామసంకలితమ్ముగాని సద్భక్తి
యీమాడ్కి నెనిమిది హితపద్ధతులను
నెగడెడుమ్లేచ్ఛుఁడే యగుగాక! వాఁడు
జగతీసురునికంటె సర్వశాఘనుఁడు,
వాఁడు మౌనీంద్రుండు, వాఁడు పండితుఁడు
వాఁడు శ్రీమంతుండు వాఁడు సన్యాం

ఉచ్ఛిష్టమును బంట గొప్పయేతించి
మచ్చనీచములు దామున్నవేయాత్మ!
కళిలంబునందున నాళ్యుఁడై నిలిచి
సుఖదుఃఖములకెందు సాగియకయున్న
వాఁడొక్కఁడేగాక - వందఱు గలరొ?
వాఁడు బాధ్యుఁడు ద్వంద్వభావసంపత్తి
ఆత్మ యుచ్ఛిష్టంబు నాత్మయేడున్న
దాత్మ విదులు మీరలాశంకమేల
భిన్న భిన్న శరీర వేషమ్ముతోడ
భిన్నమౌనేయాత్మ! వెడకొయ్యలార!
సరసులు నదులును జలధుల భిన్న
పరణినుండిన దాన జలము భిన్నంబె!
ఊరూర నొక సూర్యుఁడుద్భవించినను
సూరులు పలుపురే! సూరులు మీకుఁ
దెలియనదేగద! తెలియని భంగి
కులగర్వమునఁజిక్కి కొల్లలాడెదరు
వినయవిద్యాశీల విత్తముండైన
ఘనవిప్రునందున కరియందు గోవు
నందు - కుక్కురమందు నధమచండాలు
నందు భేదంబెంచ నట్టిడుల్ పండి
తులు, మీ రలా పండితులరొ? వైతండి
కులొ! నేనవాత్రుపవ్వ వలయునే చెపుడు!
నేదాన భేదమ్ము లెంచక సర్వ
సాధువులై యున్న సమదృష్టిపరులు
సమదర్శనముగానఁ జర్చింపనాత్మ
సమరనిచ్చలు వార, లాత్మ సంస్థితులు
ఈ పుట్టువున యంద, సదృశుల్ నాక
భూపట్టభద్రులు బొమ్మంచత్రుకులు

వఁకుట తెలియదో! కులహీనుఁడంచు
పులుమేల నామదేవుని పల్కినట్టి
యవడులు మీరలయ్యాత్మ సంస్థితులో?
యవగుణుల్ మీరలనాత్మ దూషితులో!
అనిపల్క హరిజూచి యాలంబుపేప
వినుఁడంచు చదువులు వేలఁ బెట్టెదవు
మేముగూడను గొన్ని మేర ధర్మములు
నీమాడ్కి నాచరింప నేర్తుమువెమ్మ
శాస్త్ర మన్నదిలోకచక్షువు శీర్ణ
పత్రమ్ముపలెదాని వదలంగ దగునె!
విధి నిషేధంబులు వింగడించినది
సదమల శాస్త్రమా చక్కటిఁబోని
కామకారునకు సుఖంబె శౌర్యంబు,
ప్రాముష లందిన పరగతిమేడ!
కావున శాస్త్రంబు గఱచి - తద్భావ
భావుకుండయి వృద్ధపథసమ్మతముగ
నడువంగవలెగాక తొడిబడి నేను
నుడివినదే మేల్మి నడయను వాని
ననుసరించుచొ లోకమంధమైనట్లు
మణిఁబెంకు లొచ్చెయున్మాడ్కి ధర్మంబు
దూషించి ఎలికితి, వాసుదేవుండె
వేషకుండోయి! తత్పూతధర్మమున
కదికానిదంచన నా హరిగూడ
మడిదప్పెనని యన్నమాడ్కి యోగాదొ!
తర్కింపనదిగాదొ! దైవమాషణము!
శర్కరిలమ్ము వాచాప్రౌఢియేల,
హీనకులుండైన యీ నామదేవుఁ
డూనిన సద్భక్తి నొక్క విశిష్టుఁ

ద దుప్పు, మూకెట్టు లుప్ర మాణమ్ము
నందుగొండుల వెంట పండరీనాఁగ
ఎదిలేటు వాఁడెల్ల భక్తుఁడే యగుచు
మదిసంబుఁ జుట్ట నామాన్య ష ణ్మమ్ము
నింక శాస్త్రమ్మేల! యెవఁడాచరింత్రు
జంత కొక్కొక్కఁడే, సనకుంద ననఁడొ!
కర్మ మనుబంధ వంశలితుండుగాని
శర్మవయుఁడు ఫణిశాయి యేసుమ్ము
కాప్రథమాచార్యుఁడీ ప్రశస్తమ్ము
దీప్రధర్మమువ కీ తీరుగాఁజూడ 95
నాతనికిని ధర్మ మర్థి మన్నించు
పేఁత కర్తము లోక శిక్షణార్థంబు
గావున యుచ్ఛిష్ట కలమమ్మువోవ
నావిష్కృతమ్ముగాన, నను ధర్మమ్ము
పంచగవ్యము నీవు పత్తెదు వణకు
త్రుంచంగనేరమీ తొదయంచుఁ బలుక
కడగండ్ల జిఱుపవ్వు తొడవుగా మదివె
మదువులఁ దలఁపుల కడమైన వెలుఁగు
తానిండు, మీకోర్కె గాదనఁగలనె!
ప్రాణసములు నాకు భవ్య భూసురుల 1800
యెల్లిగ్రహింతు మీ యుల్లంబు లలరి
ఎల్లవితములుగాఁ బంచగవ్యంబు
తమరెల్ల నేటివితముగానె రేపు
మముఁగృపఁ జూచి సున్మందిరంబుననె
యాతిధ్యమహము సేయఁగవలె నంచు
నా తలంపున మెచ్చి యట్లకా కంచు
దీవెనలిచ్చి భూ దేవులు వోవ—
పావనరూపుండు పండరీనాథు

దాదరంబున భక్తులందఱఁ జూచి
వేదముల్ చదివియు వేదార్థ మనన
పేయక, కులకృత ఒక్కణి గర్వ
మే యెడబాయక యెవ్వరికైన
దూలనాఁడుచు బుద్ధి దూలి యాకాలు
పాలగొట్టెలుగాఁగ బదలి చిక్కెదరు
పరిమళ ద్రవ్యముల్ భరియించు పశువు
పరిమళం బెఱుఁగునే? - పాఱుఁడై పుట్టి
మంత్రముల్ మోచిన మాత్ర నీజన్మ
తంత్రమ్ము దప్పెడు దారిగప్పుడునె!
వెలివెలి చదువుల వేదపూరుషుఁడు—
తెలుపునేమర్మంబు దేవపుంగవుఁడు!
భాగవతోచ్ఛిష్ట పరమోత్సవమ్ము
యాగయోగవ్రతా ద్యఖిలసత్పుణ్య
ఫలము తత్ఫలముల బలిమిచేగాదె
బలకొని, యిటు పెల్గు పండరీశ్వరుఁడు!—
పానలేటికి! తేపు పాఱుల కెల్ల
జ్ఞాననేత్రం బిచ్చి పాఱి తక్కరించి
భక్తుల మహామహుఁ బడగెత్తఁబోదు
నత్యంత మాశ్చర్య మందంగ సురలు
పొందు రంగండన్న పారాదుదైవ
మొందేల! మాట లీయుర్వరయందు
పొందన్నలార! యెప్పుడు వీడవోలె
మందుడు మీవెంట నొప్పరికింప
కని పల్క, భక్తి పీరాగ్రణుల్ వాని
యనుమతి గొని కాళ్ళ కౌదలల్వించి
పేదు రమ్మున నెద జేరిచి, గంధ
సార శీతల పరిష్వంగంబు నంది

యురికి పట్టుల ాగి, యుల్లంఘలంఘు
వనజాతనేత్రుని భావించి కొనుచు
నాలుఁగ్లిం ౨ నా హరిలీల లెన్ని
యాలోల ఒతులకు, వర్ధితోఁ బలుకు
చంతంత బాడుచు వరిలోక పర్తి
నాంతర్మ్ఖుయి మోదమందుచునుండ,
నామదేవుని యింట నాట్యమ్ములాడె
పామ్రభుత్యుక్తి భాషాదేవి ప్రాకృ
తావతారం బూని యదుగద్గువందు,
శ్రీవాసు నెమ్మేను చెమరించుచుండ,
వద కవితారవ ప్లావితుల్ మౌను
లది తపం బనిచేరి యంకించుచుండ
మురలైరి మేని కస్తురివోని తమము
హరిదంతరంబుల నల నల్లవిరిసె
కదలి కన్నియ వాలుగంఢ్ల చిర్నగవు
తొడకెనోయన, దెల్పు దోచె నల్గదల
శ్రీరంగపతి తులసీ మాల్యగంధ
పూరమ్మువలె, వాయువులఁదోచెఁదాని
పూకక్రతాయాక వోలరాగమ్ము
భాతి తూర్పున నేచెఁబాటల కాంతి
హరి దర్శనంబున వలరెడు భక్త
వరులమోములు వోలె వనజముల్ విరిసె
గడువేడ్కఁగెందమ్మిఁ దొరకి చుంబించి
సడియుదు నెలుగించె బొక్కి తుమ్మెదలు
దివసవారణ రాజదేహ మాత్రమ
పవిత్రభా వద్మకోశైప మ్నాప్త్రిఁదోచె,
పాండురంగ ద్వారభరిత నద్భక్త
మండలి కీర్తనా మధురిమల్ చెలఁగె

ద్వారముల్ దెఱచిన పండరీశ్వరుఁడు
ధీరవార్షుక మేఘ దీప్తతనుండు
లలితేంద్ర చాపరీలాహారి పింఛ
వలయి నర్తన కేకీ భ్రమితలో కుండు
కామాక్షివర్షి, గుంజామాలికాఽభి
రామ చూడాపాశ రాఎక్యమూర్తి
కమలాలయా నేత్ర కజ్జలా కల్ప
రమణీయ బింబాధర స్ఫురద్భ్రూవ
మకర కుండల విభానికర చంద్రశీత
విశదగండస్థలీ విస్మేరవర్షి
త్రిశిఖీ కిటీరరా రాజత్కరద్వ
యశివార్థ చంద్ర విశ్వావ సుందరుఁడు,
కమలాసనాది పీఠా పుష్పపుంజ
'మసీయ శ్రుతి శిగం కరపాద తలుఁడు
కొలువివ్వ నానాఁడ తొలినాడువోలె
తలమొలఁ జూడక దండడిఁబాటి
పరమ భక్తులు నేత్ర పాత్రముల్ నింద
పరమేశ్వరుని రూపు పానంబుసేయ
  రావోయి! నావదేవా! వెలుఁగులకు
తావలంబగు నేటి భావాఽభిరామ
నాటకంబున కీవె నాయకాగ్రణివి
చాటున నున్నావె? సావంత మాలి!
కనుఎంపరా కండ్ల కఱవులు దీఱ
వనధి గంభీర! నివర్తి నాధుండ!
యొకరేయి గడచె నిన్నొరుల భావించి
మొకమైనఁ జూపంపవకట! యిదేమి?
ఓయి! బోపాన దేవా యత్యమృతము
గా, యశస్వి! నిగ్గుగాఁ బల్కరాదొ!

జ్ఞానదీపా! వేద వర్చ్యను చర్చి
కానిధి! నాపైని కనుము గొన్నావా!
నరహరి! రేయి యెవ్వరిఁ గొల్చితోయి!
గిరిశునో! నన్నా! క్రిక్కిరిసిన భక్తి
కడజాతివాడ! చౌకామేళ! పాఱు
లడిగిన నేజాతి యందువా! యేమొ!
యేకుండ మంచిదో! యేది దూష్యంబో!!
నీకుఁ దెల్లంబోయి! నిజము కుంభార!
అడుగులో నడుగుగా నడచెదవేమొ!
యడిఎగ్గుదాన! జనా! క్రొత్తవలపో!
ఏమమ్మ! సక్కుబాయీ! రేయి యెల్ల
మామిది మనమంత మఱలింప వైతి
వనియట్లు భక్తుల కాదర శీత
లనిభృత దృష్టనుల్లాసంబు గూర్చి
మెచ్చటించుచు నుండ, మొగసాలయందు,
కెచ్చెర విప్రులు జేరినిల్చినను
కనుగిటినంతలోనన విప్రవేష
మొనరంగ నబ్బిన వనజోదరుండు
వారిడాయఁగ వచ్చి పరునకు వచ్చు
తీరున, కౌతుకా ధీన మానసులు
చేరిన నడువు వీక్షించి, చిన్నగవు
పారాడఁ బెదవిపై, ఫాలమ్మునందు
గిరపుటమ్ముడిగించి కడువడి మ్రొక్కె
హరి సర్వధర్మ రాహస్య రక్షాఽబ్ధి
పాఱులతోఁ జంద్ర భాగకు నేగి
సారస కింజల్క సమ్మర్దితమ్ము
వారి మునింగి, సర్వాఘనిబర్హ
ణారభటీ గుంభితాఽభి ధానుండు

తనచేసిన యఘమ్ము దలఁగించు కొఱకు
రణదఘ నిచయ భారవరాస్తమతులు,
కర్మబంధితులు దుర్గర్వితుల్ జన్మ
మర్మాఽవిదులు, కామ మాంసలితాశ
యులు, ముధావేదార్థ కథన వ్యగ్రు
లలరి భూసురులు పెల్లఱచి సంకల్ప
మును జెప్ప తలవంచి ముగ్ధుండువోలె
వనజోదరుఁడు గొనె పంచ గవ్యంబు
నిఖిలాఽత్మ యాజికి, నిఖిల ప్రమాణ
శిఖరాఽవిదితగుణ శీలికి, మాన
మేది! యవజ్ఞతానేది! యభీష్ట
మేది! దూష్యంచేది, ధృతగర్వు, లవని
సురులు తమకు దృష్టిగోచరయుట కొఱకు
భారపడిరే కాని - పుణ్య దూషితులు
హరి పురుషోత్తముండంతట, నవని
సురులతో గూడ భాసుర నవార్థముగ
భాషించు చెడనెడ నీషద్వికాస
భూషిత వక్త్రాంతముగ నవ్వులాడు
చలరి, భక్తులు ముందు నమృత సంపేక
ములుపేయ, తంబూర లెలుగెత్తి పాడ
ప్రతి పదమ్మున యందు ప్రత్యగ్రపులక
తతిఁదాల్చి, వసుమతి తత్తఱంపడఁగ
నవిదిత రూపులై యశ్రంబు వందు
తివగట్టుకొని నిల్వ - దేవతల్ మునులు
పసిడి గోపురముల పనలు, మిన్నులమి
యనలు గొన్నట్టి దేవాఽవసథమ్ము
జేరి, కూర్చున్నంతలో, రత్నమాలి
కేరపూవులఁ బొత్తుగూరు మయూఖ

మాలికల్ బరఁప దిఙ్మండలం బందు
దా లీల గగన మధ్యంబున నిలుప,
బంతులు దీర్చి రంభా గండపాళి
వంతుకువచ్చు రంభా పత్రములను
శాల్యన్నములువెట్ట సద్యోఘృతంపు
కుల్యలతోఁబాటు కుచలిక చముల
దుంకిళ్ళతోడ జేతో జాత దిండి
మనతీర్థ్య కంకణ మధుర నాదముల
పలుకు, పొగడపు టంగ్రముల జతుర్ద్రవము
మలవుల, మెట్టదామరల స్పృష్టంప,
తడి నవ్వులను పేల్చు తరుణులు తేనె
మడువుల వడ్డింప పుడమి జేజేలు
గళదష్ఫుముగఁదిని కరములు గడుగ
జలజోదరుఁడు, దక్షిణలఁ దృప్తపఱచి
మఱల నెప్పటి యట్ల పరమ భాగవతు
లిబువంక గూర్చుండ - నిచ్చతోఁ గరగి
వారియుచ్ఛిష్టంబు లారగించుచును
వాఁకిఁ దనచేత వక్త్రదష్టంబు
గుడుపుచు, టక్కరి కొనరు చూపులను
నడదివియలు వోలె నలుగడల్ బఱప
తిలకింప, విప్రులు కలుషింప వదన
ములు, గుసగుసవోయి పొగులుచు కడకు
తెగియాంచి యేమోయి! దిమ్మరి! నీకు
నగవు పాలయ్యె నామ్నాయ ధర్మంబు
పంచగవ్య మ్రుగ్రోలి, వంచించి మమ్ము
ముంచి, యదే పని మొదలు పెట్టితివి'
యనుడును, కిలకిల యై మొగంబెల్ల
ప్రణుత త్రయీ మూర్తి పలికె శ్రీధాముఁ

దున్మాదులార! మీకున్న దేగాని
చిన్మయమూర్తికిఁ జేరునే కపటు!
ధరణి గోరూపంబు ధరియించి యెవని
చరణపీఠేణు సంస్పర్శంబు కొఱకు
చిదిమండి పడునొ! యాకడలేని వెలుఁగు!
కడు కొని నిలిచె చక్కఁగఁజూడుఁ దనిన
నావాక్య బలమేమొ! యందఱి మదుల
నావటిల్లగ భక్తి యావైష్ణుఁ జూడ
దరిపెనం బిచ్చె, వేదాంత వేద్యుండు
బరమసూరులు గొల్చు పండరీశ్వరుఁడు
క్రిందైన యట్టి వైరాగ్య సుఖమ్మొ!
ముందట నిలిచిన ముఖ్యానవద్య
యపురాణ సారమొ! యని బిష మౌని
విపుల గీతానంద వినుత సౌభాగ్య
మొ! వ త్తకోటి మహోన్నత మంత్ర
వాఒ తానుష్ఠాన వాల్లభ్యభరమొ!
మేనంది నిలుచుని ధ్యాన రసమ్మొ!
ఆనిగమముల పుణ్యము మూర్తమైన
బిాలుబిా! యానామదేవుని ప్రేమభక్తి
కలవడ వంగముల్ మొలిచిన వితమొ!
యన, ముందు నిలిచిన యాపరమాత్మ
గనుగొననేరక కకుభంబులెల్ల
నొక్కచే వెలుగుఁగాఁ బిక్కటిల్లినను
చిక్కుదోపక భయా ధీన మానసులు
వదువడ వడకుచుఁ దడఁబడ నుడులు
పుడమి వేల్పులు కండ్లఁ దొడిబడు బాష్ప
ములను సబ్రహ్మణ్యము వఠించి - వేద
వలఁ గ్రుంగి, ముందట, నారాయణంబు

నా ఋణంబు వంచి యటుపై నృసింహ
దారకమ్ము నృసింహా తాపనీయమ్ము
రామతాపని, షడక్షరము మహో
పాయము వారి, కలిసంతారణమ్ము
మొదలు గాగల మంత్రముల నెవ్వరించి
పదములఁబడిన వారెన్న శరణ్యుఁ
డా రూపమును విడి యంతలో విప్రుఁ
డై రదోచ్చన హోమఖాంతుఁడు
తోచిన, వేదవిద్యాసంచిత గర్వ
శోచనీయులు మహా శుష్క నిష్ఠావి
దూషిత హృదయులు తాపంబు నొంది
మా పాపములు వోవు మార్గ మింకేమి!
ఆత్మస్వరూపుని నఖిలదర్శిని చి
దాత్ముని సామాన్యుఁడంచు భావించి,
కొరవడి వెర్రిగా దూషించి పొగరు
బోరఁ ప్రాయశ్చిత్తమునకు దార్చితిమి
యనుచుఁ బశ్చాత్తాపమున గ్రుంగు పాఱు
లను గూర్చి కేశవుండను కంటిఁబలికె
నో విప్రవరులార! యోసదాచార
భావితులార! మీ పాపంబు దొలఁగె
మనసు పశ్చాత్తాపమును బొందు కతన
ఘన పాపములనైన కసటులనైనఁ
దొలఁగింపఁ జాలిన తోరంపు మందు
నొలయు పశ్చాత్తాప మొక్కటే గాదె!
యని యాడి నామదేవుని జేరి ప్రేమ
దనుపార వీక్షించి తలఁబుడుకుచును
ఓయి నాప్రాణంబ యోయి నిర్వాణ
దాయి దయావేశ! యోయి భక్తార్ద్రి

హృదయ! యనారత హృత్పుర సంస్థ
తదర రథాంగ ముద్రా భద్రమూర్తి!
కవితా వసంత! కైతవజిహ్మ! జగతి
నివతళింపఁగ భక్త హృదయ సౌరభము
వినయసుందరుఁడవై, విప్రులపాద
వనజంబులకు మ్రొక్కుమని యానవెట్టి
యామాటతో నతండవని సాష్టాంగ
మై మోకరిలిన, యాదివిభుఁడు
ధరణీ సురులఁబల్కె దయబెట్టవలయు
తిరముగానీ నామదేవునిపైని
వీఁడు నా సేవధి వీఁడునా యుసురు,
వీఁడు సద్భక్తికి వీఁ డుద్ధవుండు
వరముండు భక్తి కింకరుఁ డన్నమాట
యెఱుఁగరో! కాక, మీ రెల్ల వేదముల
తొలియాకు గాదొ! యావలకు, వేదముల
మలచిన సారంబు మనసులఁ బట్టి
యలవోక లోకంబు నందుఁ జరించు
కులపావనులు భక్తి కలితులులేక
పరమేశ్వరుఁడె లేఁడు బ్రాహ్మణులార!
ధరణి యీ భక్తుల చరణ ముద్రికలు
తనువందు సోకిన తాపులనెల్ల
కనులార్చి, పులకలఁగ రఁగుచునుండు
భక్తుఁడే జాతిలోఁ బ్రభవింపనేమి
వ్యక్తంబుగా వాడు వాసుదేవుండు
పంకమ్ములోనన పద్మమ్ము పుట్టు
కౌంక ఘఁబట్టు దా పురుగులఁ బుట్టు
గులకరాలను రత్నములు ప్రభవించు
చిలిప యీగలను దీపులదేనె దేఱు

గుల్లలో జన్మించు గొప్ప ముత్తెమ్ము
ఎల్లిపై జన్మించు పేర్మి జవ్వాది
కులగర్వ మునఁ బ్రుంగి వెలివెలి నిష్ఠ
నలిఁగిన యది గజ స్నానంబుగాక
యెఱుకకు మార్గంబె యెఱుకలేఁగాక
పెఱ్ఱితోవలను జన్మ మరణముల్ దెగునె!
అటు సూడు డెఱుకయే యాకారమైన
పటు బుద్ధియతఁడు సోపాన దేవుండు
వానిప్రక్కనమున్న వాఁడు నివృత్తి
జ్ఞాన మార్గము వాని కాలిపెండెరము,
జ్ఞానదేవుఁడు వీఁడు శర్వాది ఘనులు
గావని యెఱుకకు ఖనియైనవాఁడు
ఈ జగన్మిత్రుండు పూజనీయుండు
రాజయోగాంబుధి రసతుందిలుండు
సావంతుఁ డువ్వాఁడు, సావంతుఁ డనఁగ
నావై జయంతమ్ము భావహాంతుఁడు,
కులము మాదిగగాని గుణములజూడ
కలిపావనుండు చొకా మేళుఁడతఁడు
వీఁడు గోరా భక్త విమల సత్కీర్తి
యాడుడు వీనింట నహరహంబేను
పరమ భక్తులు వీరు పండరీశ్వరుఁడు
వరవుఁడు వీరికి వలచున వీరి
చరణరేణువులకై శిరమున బూన్ప
యరయంగ నుచ్చిష్ట మనుట యేపాటి
బగుతులదొనఁగెన్న పాపంబునకును
మిగిలిన పాపంబు మేదిని లేదు
వారువేనోట శత్పరిథ వంబన్న
వారి జాతిని నన్నుఁబరిభవించుటయె

యను హరి వచనముల్ విని విప్రవరులు
కనులలో బాష్పముల్ గాఱ మోదొనఁగు
మన్నింపవయ్య! రమానాథ! వేద
వన్నముల్ మోఁతి మెన్నగార్ధభము
పరగ మోయనయట్లు, జల్పజీవులము
పురుషోత్తమా! వేద పురుషుండుగూడ
పరిభూతుఁడయ్యెమావదనముల్ వెంది
పరమాణు వాదిగా బ్రహ్మ పర్యంత
మరయ సర్వమ్ము మాయామయం బనుచు
పరమాత్ముఁడొకఁడు దప్పక నిత్యుఁడంచు
కలిగిన యీ సృష్టి కనుగల్గి చూడ
పలురూపములనున్న బ్రహ్మంబటంచు
నెన్నిచెప్పును వేదమన్ని బోవిడిచి
యున్నత కులగర్వ మొకటఁ బట్టితిమి,
స్వామి! నిర్హేతుక జాయమానంబు
మామైల దొలఁచె - నీ మహాకాఱను కంప
జ్ఞానదీపం బిచ్చినావు భాగవత
మానవములు దూల మా చేసినట్టి
యవినయములు ముక్తికయ్యె మార్గమ్ము
లవునవు! దము రాచనట్టి వారలకె
కావుల నొసఁగుఁ జందనపుఁ గాష్ఠమ్ము
లీ విషలాత్ముల కీర్ష్యలు లేవు,
తాపముల్లేవు చిదానందు నిన్ను
మాపాల గలిగెడు మాడ్కి గావించి
రీభక్త సంతతికెన్నఁడే గాని
క్షోభంబు గలిగించు కొఱయఁటట్లు
నీ నామ నిష్ఠలో నిలువెల్లఁ గరగి
మానసమ్ములు, తక్క, మఱచెడునట్లు

స్వీకరింపుము సర్వ భావముల
ఎవ్వరి! పీఁపై, ఐవకట్టి నట్లు
కులగర్వమున బుద్ధిఁ బొలయఁ మా యొక్క
మఱఁచు మాయల తెర్చి వ పని యట్లు
శరణాగతియె మాకు ఎంధన్న మగుచు
మొఱకు ధర్మపు తర్కములఁ లోగనట్లు
భక్తి లన్నంతనే - వారి పాదముల
శ్ర క్తితో సేవింప వసుకట్టునట్లు
మము గటాక్షింపుము - మన్నించి -యందు
దమతలల్లంచిన ధరణి దేవులకు
దామోదరుండనె ధన్యులై తిరి మ
దాటిక తమము నేఁదత్త మిల్లిక
జ్ఞానదేవునిఁజేరి - వంతత సేవ
బూని - యా మహాసీయు పూర్ణకటాక్ష
మునకుఁ బాత్రులరైన మొనసిన మాయ
తనుదాన విరిసి - చిత్తముల నారూపు
హత్తి సారూప్యంబు నందంగవచ్చు
యుత్తెరవునఁ దక్క నిఁక లే దటంచు
జ్ఞానదేవుఁడు కరాబ్జమ్ములుమోడ్చి
తాను వందించె - వేదాంత వేద్యునకు
కడగంటి చూపులు కడల రత్నంపు
నడదీపములుగాఁగ నారాయణుండు
మఱియొకసారి యా ధరణీ సురులను
బరికించి ఒఱునవ్వు పెఱలను దేల్చి
కనుమఱుఁగైన - చొక్కంబైన భక్తి
తనువుల మనములఁ దట్టాడు చుండ
జ్ఞానదేవుని పాదకమల రజంబు
బూని శిరమ్ములఁ బొరలాడువార

లా మహనీయుని యంఘ్రులు, బాష్ప
దామంబులను జేసి తడిపెడువారు
లామూర్తి కన్నుల నద్దె నెక్కొల్పి
తామేది యెఱుఁగక తనిసెడువారు
నై విప్రులెల్లరు నతనితోఁ బాటు
నావసథములకు నరిగిరి భక్తు
లాపాండురంగని యడుగుల కెఱఁగి
తీపైన తత్కీర్తిఁ దివిరి పాడుచును
గృహములఁ జేరిన నిందిరా జాని
మహార్ఘతములైన మొలకనవ్వులను
నామదేవునిఁ జేరి, ప్రేమ సౌరభవి
ధామృదులముగాఁ దనిముద్దువెట్టి
యాఁకఁబోయి రమ్మని యిం[illegible],
వికచ తామరసాక్షి విశ్వైకమాత।
మెచ్చి యాలింప రుక్మిణి, నామదేవు
నచ్చంపు కీర్తిగా నంకింపుచుండె
కడచె దినమ్ములు, కమ్మకస్తూరి
పడువున గుమ్మగాఁ గడలకుఁ బ్రాకె
నామదేవుని కీర్తి నానాట వాని
ప్రామినికులు వోని - పదకవితాప్ర
వాహమ్ము లింటింట వఱ్ఱుగాఁ బాతె
శ్రీహరి ధ్యాన సుశ్రీకు, లాత్మమ
సంధానమతు, లజస్రము రాఁదొడగిరి,
బంధముల్ దొలఁచిన బాంధవుల్ పాండు
రంగ సంకీర్తన శ్రవణ తత్పరత
తొంగలించంగ భక్తులు వానిదరికి,
నేమియున్నది వాని! కామధుమధను
నామమొక్కటిదప్ప నామదేవునకు!

నాయె సర్వము దీర్చు నవనిధుల
ముదలఁగై కొనఁ జేయు మొదలిదైవంబు
ప్రతివాసరంబొక్క పండుగయయ్యె
ప్రతిలిప్త రచనాధునా గంగయయ్యె
నిటలాంత సుందర కటలాంతరవని
కటహస్త సర్వలోకైక ప్రశస్తు
పాండురంగని భావభక్తిచె గెలిచి
యందనిల్వఁగఁ జేసినట్టి కుంభారుఁ
డొకనాఁడు భక్తులకు ల్లంబు దనియ
వికసింప పున్నెంబు విందుసేయంగఁ
దలఁచి వినయంబు దలకొనఁ బిలువ
నేఁటినా సజ్జను లియ్యకొనంగ
నామదేవుండు ఎదరినిభావాఁడు
రామమైనట్టి యర్చావతారంబె
పాండురంగండన్న భావంబువూని
యందవదలిరాని యట్టివాఁ డగుట
గోరా యచటికేగి కూర్మిగోఁ బిలువఁ
బోరామి భావించి, యూరకా వరుని
యెడబాటునకు నుల్కి యెట్టును బలుక
నొడబడకుండిన నుడివె రంగండు
నామదేవా! భక్తిసీమ! కుంభారుఁ
బ్రేమంబుఁ జెల్లింపఁ బ్రియము మా మదికిఁ
బొమ్ము! రావచ్చును లెమ్ము! శీఘ్రముగ
కమ్మని పీదేవ కవితా ప్రసంగ
ములఁ గళఁ గూర్చుము, మొనసి భక్తులకు
నెలవోలు నీవులేనిది - భక్త బృంద
మదియేమి సొబగు! నాయన! హారవల్లి
మదికింపనే! మధ్యమణిలేని దేసి?

లెమ్మన్న కనుల నీరమ్మునై యెడఁద
నుమ్మలి కిమ్ములై యున్న సద్భక్తిఁ
గౌగిటఁ దనిపి చొక్కుపునవ్వు నవ్వి
నాఁగనంపినఁ బోయె కాంతిఁ దొలంగి,
పరమపూరుషుఁడున్న పండరీపురికి
తరడోకి యనుపల్లె కుఱఁగటనుండు
నచ్చోట కుంభారు నావాస మగుట
నచ్చలంబునఁజేరి రక్షిత భక్తులను
హరిహరాద్వయ వాది నరహరి భక్త
దరిది తెల్పికి నెల్లయైన వీసోం
వేల్పుల వాగరు నివృత్తి నాథుండు
జల్పచపేటంబు జ్ఞాన వాధుండు
పరమశాంతుండు సోపానదేవుండు
నరరూపమా తెల్వి నాగనాథుండు
అతివయౌ యోగమాయాంశంబు యోగి
తతి తలపూవు, ముక్తాబాయి, మాలి
కాసేవతో లోకకాంతు మెప్పించి
భావంబునేలిన సావంతమాలి
క్రొత్తడితనపు నఖ్యాబాయి వలపు
దత్తయౌ చిత్తమ్ము తోయజాక్షునకు
పావడమిచ్చి తన్నాహం బంధనపు
తావుల నిలువెల్ల తనిపినయట్టి
నానము త్తెంబు జనాబాయి, భక్తి
పేనైన యాచోకామేళుండు తెల్వి
కదలియైనట్టి రాకా సజ్జనుండు
పుడమి జన్మముగొన్న పుణ్యుఁడుద్ధవుఁడు
పండరీనాథ పద్మపద సర్వస్వ
దండబాయని భక్తుఁ డఖిలేశ్వరునకు

నామదేవుఁడు, రమానాథ నామోచ్చలి
రామనంతతవృత్తి నామదేవుండు
మఱియుఁ దక్కిన భక్త వరులెల్లఁ గూడి
సరస జ్ఞోదరఁ గూర్చి చర్చింప్పుచును
తమ తమ యనుభవ తతిఁ జెప్పుచును, ని
గమనము, నామదేవమధుర కవిత
లను జొక్కి, భావ్యమాలా రమణీయ
తనువులతోడ నంతంతఁ బొర్లుచును,
ఒక్కరి చేతుల నొక్కరుఁ బూని
చిక్కని గతుల రాసంబులాడుచును
పరమేశ్వరునిఁ గూర్చి పాడుచు నవ్వు
చరయుచు లేదని యలతలంబడుచు
నోరంతప్రౌఢ్ద భక్త్యున్మాదమందఁ
దారుచు జన్మసార్థకముగాఁ గడప
యాపైని భజియించి యలవోక, కాను
శ్రీ పునీలీలఁ జర్చించుచున్నంత
జ్ఞానదేవుఁడు రమానాథుని పాటి,
యానపంబున నాయనఁ దిరోసంబు
ప్రక్కనమున్న కుంభారు వీక్షించి,
యిక్కరణి వచించె, నెలమి గుల్కంగ
వోయి! కుంభార! నీ వుద్దించువాఁడ
వాయజ్ఞభవునకు వతఁడు ఘటమ్ము
లమరించుఁ బంచభూతముల సాయమున
వమరింతువీవునేకైక మృత్సాహ్య
మున, నసువులులేని బొచ్చుంబె కాక
పనజాసనునకు నీకును భేదమేమి
వరుసగాఁ గూర్చుండి రరుదైన భక్తు
లరసి యాఘటములయందు నవక్వ

ఘటమేదా! చెప్పుము, కచ్చితంబుగను
కటకటంపడకు, నిక్కంబున కెవరి
భయమేమి యనుడు కుంభారుండు నుదుట
కయిగవపేర్చి నిక్కంబు పల్కుటకు
వెఱవ జెందుటగాదు ధరణి సంసార
సరణికి సరిపోవు సామాన్యఘటము
తారతమ్యము చెప్ప నేరదుగాని
నేరదునే? భక్త నికరంబు వాం
నిదమిత్థమనితెల్ప, నీలెంకయైన
సదమల జ్ఞాన విశ్రాణన కల్ప
కము జ్ఞానదేవులు మము గోరిరద్దె
క్రమమౌనె! ముందువెక్కలుసూడఁ, బాండు
రంగని యానకు ప్రతిగల్గనైన
సంగవింపఁగఁ జెల్లునా! మీదుమొదల
ననుచు కుంభారుండు నా భక్తగణము
పనుపడఁదనతట్టు పలకచేఁగొట్టు
చునుఁ బోయిపోయి నెక్కొనిన పుల్కలను
తనువును మఱచి శ్రీధామ నామాను
సంధానమునమున్న సాత్త్వికు జన్మ
బంధాతిగుని, తట్టు పలకచేఁ గొట్టి
నామదేవుని నిది నాకుఁ జూడంగ
స్వామి! యిన్నిటిలో, నపక్వఘటంబు
గాఁదోచెనని తెల్పి కడగి చెప్పనను
బోధస్వరూపుండు, ముక్తి శృంగాట
కము, జ్ఞానదేవుండు కలకల నవ్వి
ప్రమదంబుగలిగె కుంభార! నిక్కంబు
పలికితి, నీ యున్నవానిలో నిదియె
పలువాదులేల! యపక్వమౌ ఘటము

టంచు నెందియున్నప్పు, నాయున్న భక్త
నంచయమతనిని పై పై యటంచు
కరముఁదద్దై వెక్కసముగా నవ్వి
ఆఱకంటఁ జూచుచు నా నామదేవు
నంతముక్తాబాయి యవిరళయోగ
తంతన్మయానురక్తి కమనీయ
చణః పరిష్కార సరగునలేచి
పక్షంబుసేఁ కుంభారుని, మేలు!
మేలు! నిక్కంబుగాఁ దేలిచితోయి!
నీలాగు చెప్పంగ నెవ్వారునేర
రీనామ దేవుండు, మహాత్మ జనత
మానిత రాహాస్య మధువెల్లఁ దాన
గ్రోలిన యటులెంతో! నీలిగి నడుమ
నాలింపఁగా నింద రతని నిజమ్ము
నేటికి బయలయ్యె నీరజేక్షణుఁడు
నీటు పాటలతోన - నియమింపఁబడునో!
యనుచుఁ జెలఁగి నవ్వ నక్కాడి భక్తు
లనయంబునగిరి - శయంబులు దట్టి
ధరణి సర్వంబు నీశ్వర విభూతిగను
దరిసించి, ప్రాణి మాత్రమునకు దొసఁగు
నాచరింపని యట్టి యనఘుల కరుణ
కాచార్యు లౌభక్తు లావైష్ణవోత్త
ముడు, నామదేవుని యెడఁదకు నెగులు
బొదమింపఁ జేతురే! పూర్ణాను కంప
వాని వాతమ్మును భావించి, లేని
దైవ నేరము, బూని యనుటయేగాక,
యీ పరిహాసకం బెదగ్రుమ్ము వాడి
తూపుగా, నిట్టూర్పు దొంతరల్ మలయ

కమల పీఠము గ్రమ్మ గంపింపఁ దనువు
మనసెల్ల వడియలై మానాథు దరికి
పఱఁచాతి నామదేవుఁడు పెకలొలుకు
నిడుదలౌ నూర్పులై నిటలంబునందు 60
గ్రమ్మిన చెమటలై కాయమందెల్లఁ
బిమ్మి నవణకులై పండరినాథు
పాదద్వయంబులంబడి లేవకున్న
నాదావతారుండు నారాయణుండు
పరమర్షి యజ్ఞవ పాగంధిలమ్ము
పరశివానందైకాంతిక భావ మహమ్ము
ఘోషనారీ నేత్రకోణ భాషావి
శేష తాత్పర్యమ్ము శ్రీరమ్యమైన
పెదవిపైఁ జిఱునవ్వు ప్రదులంగ, ముక్తి
మదవతీ మేఖలా మాణిక్య కాంతి 65
నాయనా! నామదేవా! యేల యిట్లు
పాయఁబాఱఁగ నోర్పువనటఁ జిక్కెదవు!
నావంటి దైవంబు నీ వెన్నుగావ
సేవగ నీకింత యిడుగడ గూర్చె!
చెప్పరా! నా తండ్రి! దెప్పరమైన
నొప్పరి కింవక నూడ్తు నీవగవు!
వనుదుము, పరులైన నలమటం బేల!
దినదివంబును బదు తీరులే గాదె!
లౌకిక మాయా ప్రలాపముల్ మదికిఁ
దాకునె! నీపాద తాత్పర్యమతికి! 70
షీవంక వారుగా నెగడుచు నెఱుక
శ్రోవలు దఱచిన దొడ్డవారలుగ
యశము చేకొన్న భక్తాగ్రణుల్ మనసు
కవగాటు వఱచినఁ గలఁగుట గాఁక

యనుచు గుంభారు గృహం బందుభక్త
గణము పరీక్షింపఁగా జ్ఞానదేవు
డడిగినవిధము నయ్యాజ్ఞ పాలింప
నొడిగట్టి కుమ్మరి యొక్కొక్కరుని, ప
రీక్షించి గుణముల నెన్ని చెప్పుచు, వ
రక్షితుండగు దన్పరీక్షించి యిదియ
యన్ని ఘటంబుల పవరి పక్వంబు
నన్నట్టి జాడయు, నాపైని జ్ఞాన
దేవుండు నవ్విన రీతియు భక్త
లావరుసన చేతులల్లార్చి గేలి
కొట్టినవడు, వాడ కూతురు, నాన
తట్టు పడంగ ముక్తాబాయిలేచి
పలికిన దురుసులు భక్త బృందమ్ము
తలలార్చి, యంకించి, పలిపిన గేలి
పూనగ్రుచ్చిన రీతి, బొవఁగంగ దెల్పి
మావరంబుగ నేర్వ మదు మదహంత
యతనిలేవఁగనెత్తి యౌదలఁబుడికి
చతుర భాషలను హాసంబు పుట్టించి
మించు నర్మిలిఁ గౌగిలించి క్రాగ్గమల
యంచులతోఁ గటాక్షించి యిట్లనియె,
యున్నట్టి సత్యంబు నొప్పుగాఁ బలికె
పన్నకంబేమి! కుంభార భక్తుండు
జ్ఞానదేవుఁడు దయాకంరి! నేరంబు
లావంగ నతఁడేమియలఁతులవాఁడె!
కైవల్యవల్లి ముక్తాబాయి కంటు
లావెలంది వఎంచు తావుల మన్నె!
తక్కు భాగవతులు, తారు పూతాత్మ
లెక్కటి భక్తి నాకెక్కినవారు

జగమఖిలమ్ము నీశ్వర విభూతిగను
దగఁజూచి మానమ్ము దెగఁజూచి, యెల్లి
ప్రాణుల సుఖమునే వాంఛించువారు!
దీనదయాపరుల్ దేవ సన్నిభులు,
వారి బుద్ధులయందుఁ బంక లేశమ్ము
దూఱునే! సూర్యుని ద్రోవఁదప్పెనను
వారు నిన్నవమాన పఱతురే! వాతము
గోరిపేఎన యట్టి కుఱపేఁతగాని
నామదేవా! భక్తిలో మేటివైతి
వామాటకేమి! సదాచార్యసేవ
లేనిది గలుగదు, దానెంతవడిన
జ్ఞానమ్ము, దాని పౌష్కల్యమ్ము లేక
ధారా ప్రపాత సంస్కార కల్పితము
తీఱదు సుమ్ము! సంసారంపుఁ దగులు
మొదలును తుదలేని - పుట్టువుల్ చావు
లదయంబులివి సుడు, లందు దప్పించు,
మరకాఁడు గురువను నెఱకాఁ డొకండె
యరఎ సదాచార్య నా రహస్యంబు
దెలియంగ వల నీవు వెలితి లేకుండ
తలకొని నిత్య సేవలగురుఁ దన్ని
యీ కొఱ దీర్చుట కీ భక్తగణము
నీకుఁ గల్పించె నీ నెగుల ని యన్న
నామదేవుఁడు పల్కె నా స్వామి! పరుల
చే, మక్కి హృదయమ్ము చేరంగ చెంత
పీవును వారికే వెరవుగా నాద
నావిధి కేమని - దేవురించెదను!
కావి ద్రవ్వఁగఁ బోవఁబడి పట్టులయ్యొ
వావిరి బూతముల్ పండరీనాథ!

జ్ఞానదేవాదులకైన వేరైతి
మానాథ! నీకునుఁ గానట్టి వాఁడ
నైతినో! యింక నా కార్య లెవ్వారు
చేతమ్ము వడదేర్చ శీతల ఫణితి!
నని విలపించిన, నా నామదేవు
కనుగవ దుడిచి శ్రీకాంతుండు పలికె
నాలింపవోయి! సన్నపగల కాంతి
బాలికుండవు పోలె భాషింపఁ దగదు,
పూవునకును, దాని తావికి భేద
మేవిధి లేనట్టులించుక లేదు-
మనలోన నెడము, మున్నాటికి నిజము
మనసరి! నీవేల మల్లడి గొనెదు!
కాని, సదాచార్య కరుణచేఁ గలుగు
జ్ఞానమ్ము నేనివ్వజాలను సుమ్ము,
పాండురంగఁడు నాకు స్వాధీన మింక
నొండుగురుండేటి కొవ్వదటంచు
నలఁతిగాఁ జూడకు, మాచార్య సేవ
ఫలియించుమే లనుభవమాత్ర వేద్య
మదియెల్ల మొఱకల కవ్వలిగట్టు,
పదనైన బంగారు పన్నాలో తత్త
మయ్యును, వెలిగార మంటించకున్న
నెమ్మ్యాజిఁ గడగని, యాడుగా నీవు
నాకెంత బాతుఁడవై నడచుచున్న
చేకూర దాత్మకు జ్ఞీవన, మతుల
గురుసేవ లేక - సద్గురుఁడు బ్రహ్మంబు
గురుఁడు త్రిమూర్తులకును కొలి వేల్పు
దైవంబు గోపింప, దయగల్గు గురుఁడు
దైవకోపంబును దప్పింపఁ జాలు,

గురుఁడు కోపించిన హరి హరాదులును
గురుదేవుఁ గాదని కొనియాడ లేరు
గురుసేవయే భువి నరిది తపంబు
గురుసేవ ముక్తికి గురుతైన దారి
రవివంశ మందు శ్రీరాముఁడ నగుచు
నవతరించిన యప్పు, డవ్వశిష్ఠులకు,
యదువంశమందుఁ గృష్ణావతారమున
సదమల గుణులైన సాందీపనులకు,
నేసేవ సేయుట యెఱుఁగవే! దాన
నే సముపాస్యత లెసఁగెను నాకు
సంసార బంధ సంసక్తియుఁ గర్మ
సంసరణం బనీశ్వరునకు లేవు—
గాన సద్గురు సేవ - జ్ఞాన స్వరూప
మైనట్టి నాకు ననావశ్యకంబు
ధరణిఁబెద్దలు వోవు తెరువులఁ దక్క-
నరులు వర్తింతు, రీన్యాయంబుఁ దలఁచి
సలిపితి లోక శిక్షార్థమై, సద్గు
రుల సేవ, మాయను దొలఁచునంజనము
జ్ఞాన దేవాదులఖండమౌ జ్ఞాన
మూనుట, గురుసేవ నొనరించు కతన-
నదిలేని నాఁడు మోక్షార్థుండ నగుట
బధిరుండు వినుట - సద్భక్తి కాసార!
యీ పాట లీ యాట లెన్నియుండినను
వోవవు నిర్వాణ మురవుగ నివ్వ
వాలింపు పలుకు, సదాచార్యుఁ జేరి
పాలింపు కైవల్య భవ్యసుఖంబు
నన, నామదేవుఁ డట్లనియె గోవింద!
శమధన వైభవ దర్పాంధులైన

పురుషులుగాక యీ పుడమిపై జ్ఞాన
ధరితులు సద్గురు వరులు పుట్టుదురె!
పొనఁగఁగుంపటియందు బూదిదగాక
య సదృశంబై నట్టి యగ్నంబు గలుగు
నే! యట్టి సద్గురు లెవ్వరో! వారి
నేయుపాయంబున నే జేరవలెనా!
కృపని చ్ఛగించి యీవే యానతిమ్ము
కపటంబు లేక, నిక్కము సెప్పు హితుఁడ
వీవె కాకెవ్వార లింక నాకన్న
నావన జోదరుండనియె భక్తునకు
వినవోయి! 'విసోబ' యను నొక్కపురుషు
డనుపమ జ్ఞాన దుగ్ధాబ్ధి! యీ యూర
నాగనాథస్వామి, నా జను శివుని
యాగార మందుండు నది యూరిబయల
ఘనుఁడు! రహస్య వర్తనుఁ డాత, ఁడేల
మమలకుఁగీర్తి భూజనములకుఁ గాక!
కైవల్య పతని చెంగట దాఁ వాని
సేవించి పొందు మాశిస్సిద్ధి యనిన
నామదేవుఁడు రమానాథుని చరణ
సీమ, నాదల వంచి చిత్తమ్ము గ్రుమ్మ
నెరవాటు నెగులు, దానింటికి వచ్చి
బిరుతని లాలించి పొలఁతి భూషించి –
తల్లినిఁదేర్చి శ్రీధాముని యాన
వల్లనఁ దెలిఁ తానామె నొప్పించి
మఱునాఁడు శ్రీరంగఁ డెఱిఁగించినట్టి
తెఱువున బట్టి తత్పురి దాటి నడచి
యొరంత వోయిన, నొక జీర్ణమైన
గారికు కోవెల గనుఁగొంప నందుఁ

కోటఁబారి చూడఁ గ్రిక్కిరిసిన తమము
నెఱసిన యొక మూల నిదురించుచుండె
శతవృద్ధుఁ డొక్కండు జడలైన కురులు
పతిత ధూళీ ధురాపవాహములు గాగ
నెమ్ము లేర్పడిన ~ యమ్ముతో, వెలుఁగుఁ
జిమ్మెడు పెదఁద ఫాలమ్ముతో మేన
నిలువని యట్టి ప్రావఋవతో భంగ
ములుచేని పంద్రమ్ము పరశోత్తయుండు
ఆజీర్ణ దశమి నిజాంఘ్రులు చెంతఁ
డేజరిల్లెడు చంద్ర దీప్త కిరీటు
కడుపూతమైన లింగమ్ముపై దాచి
యొడలెఱుంగని నిద్రనున్న వీక్షించి
నామదేవుఁడు నాగనాథునిపైన
పీ మంపు నేఁతలి దెక్కడి పీతి!
యాజడ ప్రాయుండు _ వాత గురుండంచు
నీడగఁ బంపెఁ దానెన్ని 'శవుఁడు
కానిమ్ము! చూచెదఁగా కంచు నోర్మి
బూని యోయయ్య యో పుణ్యాత్మకుండ!
యిదియేమి నిద్దుర! యీశ్వరుపైనె
పదములు చాచి, భూ భాగమ్ము లేదె!
కనుదెర్వుమంచు, బిగ్గరగాఁగ _ కర్ణ
మున నోరు పెట్టియార్చినఁ గొంతపడికి
వతఁడు గన్గవవిప్ప యల్లనవవ్వి
ప్రతిలేని భక్తుండ! బాగాయెనోయి!
యూరెల్లవదలి యొవ్వారు మాదరికి
రారంచు నీ పాడు ప్రవారిలోఁ గుసుక
నిచ్చటికిని వచ్చి రచ్చ చేసెదవు
కచ్చగట్టినయట్లుఁ గావంగ నీతి

మేలువాడా! వయసు దూలి బలమ్ము
మాలి కాటికిబోవ వేళయైనట్టి
మాతోడిదేవయ్య! మాత్సరంభరము!
చేతమ్ము నొప్పింతు వేతులఁబోయి—
పదములు లింగమ్ముపైఁ బెట్టి నతని
కెదుగనికిక్క ఏ కేల? చూడంగ
భరమయ్యెనేని, మా పదములందీఁ
పెరచోటఁబెట్టుము! కరుణతో నన్న
నామదేవుఁడు కృపాన్నతచిత్తుండు
ప్రేమమ్ముతోఁదీఁ పెఱచోటఁబెట్టె
నడుగులు, తోడన - బొడమెనందొక్క
యుడు రాజధరమూర్తి యొండుచోనుంప
మఱియొక్క లింగమ్ము, వెఱఁగుబూన్పుడును
పెఱచోటనుంచిన, వేఱొక్కలింగ
మ్మై, యెచ్చటెచ్చట నంఘ్రులుపెట్ట
పాయకలింగోద్భవం బచ్చటగుచు,
శిలలెల్లలింగమ్ము, లలరువాకిటల్
చెలువైనలింగముల్ లలిమొల్చినట్టి
గడ్డిపోచలును లింగమ్ములు - బయల
నొడ్డిన పుట్టలు నుర్వీజములును—
లింగముల్ తనవైన యంగమ్ములెల్ల
నంగజహరురూపు లింగమ్ములగుచు
విశ్వరూపము సూవ వెఱగంద మఱి య
నశ్వర చైతన్య నావృద్ధిఁ జూడ
నతఁడు లింగాకారమైయున్న దుఃఖ
మతివేలమై కంఠకానినిగండ
పదము తొలంగి, తత్పదముల నంటి
దుడుకుతన మొనర్చి, ద్రోహియైనాను

నా తప్పు సైపుము, నాగనాథా! కృ
పాతరంగిత భావ! పార్వతీరమణ
యనిబిట్టు వాపోవ, నావృద్ధు నవ్వి
కనుగల్గిచూచిన గలవిశ్వమందు
దైవంబు గానిది, తడవినలేదు
భావంబు నన్గాక, ద్వంద్వపరాప్త
మై మతి, భేద మిథ్యా కల్పనమ్ము
తో మనుగడనెల్లఁ దూలఁ బుచ్చెడును
పండరీశ్వరుఁడు నీ భావంపుఁ జెడుగు
ఖండింపఁ దలఁచి యిక్కడికంపె నిన్ను
నీరేజనేత్రుని నియమంబు పూని
చారు భక్తి స్ఫీతు, జ్ఞానిఁగాఁ జేతు
నామదేవా! యన్న నామదేవునకు
దామమ్ములయ్యె ముద్బాష్పసంతతులు
ఆ దినంబున నుండి యతినిష్ఠతోడ
సాధింపఁ జొచ్చె నిచ్చలు గురుసేవ
యనెడు తపస్సు హృదబ్జ సద్భక్తి
తన తోడునీడగా, దళితాఘుఁడైన
నామదేవుఁడు, నాగనాథుని రూపు
కామిత కల్పవృక్షంబు నీ బోధ,
పలుకుల చేతల భావసంవాద
ముల వనుకణమును బోధింప నెఱుక
కలుగు నీ జగమెల్ల కంధిగంభీరుఁ
డల పాండురంగని యంశమేగాని-
యన్యంబులేదని - యా సద్గురుండు
మాన్యోత్తముఁడు పెక్కుమాఱులు జెప్పు
చెప్పిన యర్థమ్ము చేతలఁజూపు
విప్పుమోహ గ్రంధి వివశ శిష్యునకు,

నామదేవుఁడుపాడు నారాయణునకుఁ
గా మృదుకవితలు, కనులవీకోడి
తలనార్చి గురుఁడు తత్కవితలు దిద్దు
నెలకొల్పి, జ్ఞానవాదల సత్సుగంధ
ములు పాండురంగండు తలమొల నెఱుఁగ
తలవారిముందు నాట్యమ్ములు సేయు,
ప్రతిపదార్థమ్మును పండరీశ్వరుని
యతులిత రూపమై యానందభరము
కంఠదఘ్నమ్ముగా కళలొత్తగిల్ల
కుంఠీభవన్మాయు గోవిందుగుఱించి
సనుపఁబూవులు వాఁడు నామదేవుండు
ప్రణుతభక్తుఁడు, రంగపతి వానివెంట
వెంటనె దిరిగిన వీక్షింపఁదతఁడు
కంటి వీకలు, నిక్కము బొమ్మటంచు
కరములు దట్టి సద్గురుఁడు, ధన్యుంత
వరమతి మఱువంచు నగ్గించి పలుకు
నప్పుడప్పుడు మాయ గప్పిన తెరవు
దప్పనీయక చూచెఁదామ సద్గురుఁడు
వీరితి దిష్టంబు చేరువగాఁగ
నీరజానన ముఖ నిఖిల సుపర్వ
అఱుసాచి పేశారునట్టి జ్ఞానమ్ము
గురుదేవు కరుణచే కరబదరంబు
గానైన వీనోడి కైవల్య వార్ధి
మానిత శిష్యుని మౌళిపై హస్త
ముంచి ప్రేమమున దీవించి, సత్పుణ్య
సంచయంబులు పండి సాధించి కొంటి
వెఱుక కృతార్థుండ వింత - కైవల్య
మఱచేతిలోనిది, యాజ్ఞాన దేవు

కరుణ వాకొనఁగ నఖండ సుజ్ఞాన
మరయ ధరణినున్న వారిమాపుఁ డతఁడు
పరమగురుఁడు నీకు భక్తితో వారి
చరణముల్ సేవించి తరియింపు మింకఁ
బొమ్మంచుఁ బలికిన నెమ్మతో నడుగుఁ
దమ్ముల కెఱఁగి గృహమ్మును జేరె
నానాఁట నుండియుఁ నఖిల విశ్వమ్ము
ప్రాణ ధనంబైన పండరీశ్వరుని
యాకారముగఁ దోప నఖిల చేతనము
లాకృపామూర్తి దివ్యాంశముల్ గాగ
బొలఁతి శ్రీధాముండుఁ, బుడుతండు రంగఁ
డదలతల్లి మా, నాథుఁ డక్కచక్కముల
వారెల్ల పండరీశ్వరులు, జంతువులు
నీరజోదర రూపు పాఱు పక్షులును
విచ్చెడు పూవులు వీచెడు గాలి
యెచ్చోటనేది వీక్షించినొ పాండు
రంగమయంబైన ప్రతి వేళ ముందు
చెంగలింపఁగ రమార్చిత పాదతలుఁడు
అర్చావతారంబునందె వేంచేయు
నర్చిస్స్వరూపుండు హరియన్న మాట
దొలఁగి తద్విరహంబు దలఁగి, యానంద
పులకితమై మేను, పూర్వంబు నట్లు
కోపెలకేగక యేవేళ భక్త
పావన గోష్ఠుల భ్రమఁ బాడుచును
ప్రతిభక్త ముఖమందు పండరీశ్వరుని
ప్రతి లేని రూపు దర్శన మొనర్చుచును
యీ యొఱుకకు నెల్ల నిదియె కాకంచు
పాయక జ్ఞానదేవ పదంబు దాకు

చను దన్నుమాలిన యనువున నున్న
వనుదెంచి యొకట నర్చావ తారుండు
నామదేవా! గురునాథుల కరుణ
నీమఁ జిల్కరించిన దాఁ యెఱుక
రాపై తివేల దర్శనమునకైన
మరి విభవమ్ముల మఱచితి వేమి?
యని ఒఱవవ్విన యంఘ్రుల నంటి
వనిచిన యెదఁ బల్కె నామదేవుండు
విశ్వస్వరూప! యనశ్వర సంవి
దద్వర మాత్ర వేద్య విలాస! కొల్లి
వరయుదు నిన్ను భీమరథీ తటస్థ
వరగోపురస్పృత ధర్మదేవాల
యాంత స్థితునిగాఁగ సర్వావతార
కాంత స్వరూపుగా, కమలాఽధినాథ!
కటకటమ్మున యందుఁ గరముల బూన్చి
యిటుకపై నిల్చిన యీవె సర్వస్వ
మనుతలం పుండుట నచ్చోటు వదలి
క్షణమైనఁ గదలిరా జాలక యుంటి
నీవనుపునఁజేసె నెనపెను సద్గు
రూపదిష్టంబైన యుత్తమ జ్ఞాన
దీపంబు దలఁగె వేధించు నజ్ఞాన
పాపంబనెడు నొక్క బహుళ తమమ్ము
జీవేశ! చేతనాచేతనంబులను
నీవ గన్పడె బహ్మ, నిభృతమ్ముగాఁగ
నెన్న నేనెచ్చోట నున్నను నీదు
సన్నిధినే యున్న చందమై తోచె
నేమి వచించిన హృద్య మౌనీదు
నామమే వచియించినట్లు భావించె

నేఁడి భావించిన నీ యెదయందు
నాదట నీ తలం పైనట్టు లయ్యె
వరయ నీసోఁకా న దంఘ్రి పద్మములు
దరి జూపె నాకింకఁ గొఱలేదు స్వామి!
తావక విరహంబు దావానలమ్ము
గా వేధపెట్టుట కడచెనో ఱేఁడ!
గాని యికొక్కటి గలదు నాకోర్కె
దానిఁ గృపావృత్తి దయసేయవయ్య! 30
ఆత్మవంతుల లోన నభ్యర్చితుఁడు వృ
ధాత్మజుం డన్నట్టు లతి చపఁలంబు
హృదయంబు డీనిని గుదియింపఁ గడిది
పెదలు గాలిని గట్టు మెయివడి నింద్రి
యములకు దాసుండనయినట్టి నాకు
క్రమమున నిలుచునే! కపటంపు బుద్ధి
యది నిల్వకున్నచో నమరునే యెఱుక?
పదివేల తెరువులఁ బారాడ నైన
స్వామి! సద్గురు కృపాసంపాదితమ్ము
కామ రోధకమైన జ్ఞాన దీపంబు 35
నమర భావత్కా మౌ నమకంపచేత
నమల కాంతుల వెల్గ నట్లుదీపించి
ననుగృతార్థుని జేయు మని తలవంప
వనజనాభుఁడు నవ్వి, నాతెఱగుని యు
నా నామదేవుని హస్తమ్ము వట్టి
తానిట్లనియె భక్త తతితోడ, నల్కా
డీ నామదేవుని నింక నవత్వ
మైన ఘటంబంచు ననువార లుందు
రా, యంచు సద్భక్తు లాహ్లాదతుంది
లాయత చక్షుష్కలంకించు చుండ 40

నామదేవుఁడు భక్తి జ్ఞాన దేవులకుఁ
దా మౌళివంచె బోద్ధగురూత్తమునకు,
కడచెది నమ్ములు గమలాధి నాథు
పదుగు దమ్ములపైన యందముద్దొలకు
పదరచనలతోడ, భావాభిరామ
నదివోలునెడఁదతో, నామదేవునకు
ఒకనాడు సద్వృత్తి నొంటిగఁ బిలిచి
వికసిల్ల నెమ్మోము విశ్వరూపుండు
ఆచార్యకృపఁ బ్రాప్తమైన జ్ఞానమ్ము
లేచాయనున్నవం చిచ్చక మాఠ
తలవంచి, యోదేవ! తలఁగక యున్న
దలసదాచార్యుని యనుకంప నన్న
మిన్నకుండెను స్వామి, మీదొక్క నాఁడు
పన్నుగాఁదానొక్క భషకమై, వాల
మల్లార్చుచును వీథులందుఁ బట్టుచును
నల్లన భక్తులమనుకొన్న వారి
యిండుల దూరుచు నేదేవీఁదాక
దండంబు గొనివారు - తఱిమి వచ్చుడును
బాఱుచు నటనటఁ దాఁచుచు, చొంగ
గారు నాలుక తోడ గవణోప కొనుచు
వంతంత మొఱుగుచు వలికిడి యైన
గంతులిడుచు క్రొత్త గాన్పించుఁ దన్ను
వాడకుక్కలు వెంటఁబడి కర్వరాఁగ
మాడని బాఱుచు, నాగి వచ్చి వచ్చి
యా నామదేవు గృహమ్మున దూరి
జ్ఞానైక నిధియైన నామదేవుండు
రొట్టెఁదినుచునున్న - నెట్టన నెగిరి
తట్టన, వద్దాని దాఁదట్టు కొనుచుఁ

బాలిన గురుకృపా పరిణమగు సు
దారమౌ నెఱకచేఁ దచ్ఛనకంబు
పండరీశ్వరుని రూపంబుగాఁ దోప
నిండు భక్తుఁడు లేచి నెయిలేని రొట్టె
నేరీతిఁదిందువో? యందిరా జాని!
పాఱకు మయ్య! నాపై నెనరుంచి
యిదె! ఘృతం బంచును ఘృత పాత్రబూని
ప్రదిలిన కురులతో వెన్వఁ బాఱుదును
నగుచును జనులెల్ల - నామదేవునకు
వెగటుగా నిడుబత్తి పెట్టికెత్తనది
పరికింపరందఱుఁ, బదఁబారి రాఁగ
బరువడి శునకంబు బడిపాఱుతెంచి
నామదేవుఁడు, పురీ సీమనుదాట
నా మనుజాలు నంతకంత విచ్చినను
ఆలసిన యదివోలె నాకుర్కురమ్ము
నిలిచిన నద్దాని నెవరువఁదాకి
బుజ్జగించుచు ఘృతమ్మున ముంచిరొట్టె
నజ్జాగిలము నోటి కందించు చిట్టు
లోరంత ప్రొద్దున్న, మవ్వట్టులుండి
సారమేయంబింద్ర జాలమ్ము వోలె
మాయమై యెదుట నున్మాదమ్ము వెంచు
నాయతమ్మగు కన్నుదోయి గలాడు
నలికమౌ నడుమున నిలిపిన యట్టి
చెలువమౌ కరములచే కట్లవాఁడు
అలకల సందుల యందుండి గ్రమ్ము
నొలపుల తెక్కుల చూపుల వాఁడు
పాండు రంగఁడు విల్చి, భక్తకోటీర!
బండి కాజ్ఞాన దుర్గమునన! యెట్టు

యుంటివో జూడంగ నుల్లంబు పుట్టి
వెంటన నీకొక్క వింత సూపితిని
గురుకరుణా పరిస్ఫురితమౌ తెలివి
తిరమయ్యె నీయందు, ఁడీతనానెగులు
పోయి వచ్చెదనన్న బురుషోత్తమునకు
నాయెడ వందించె ననఘ భక్తుండు
తడచెను కాలమ్ము గాత్రికి కమ్ము
కొడకెంచె వికచాబ్జ పుంజ పింజరిత
జలము, సత్తచ్ఛద లలిత పరాగ
విలులితమారుతమ్ముల తోడ, జలధ
రాంగనా మణిత విభ్రమముల తోడ
తుంగేషు వనపాలి కాంగ విన్యాస
వాసిత కలకంఠ భూషిత గాన
మానసమదనమై - మధురంపు వేళ
చేరి కుద్దైకాదశిని వామదేవుఁ
డారవి నేత్రుని యందు, కీర్తనము
సేయుచు నుండిన, యోయి! యీవాఁడు
మాయింట భుజియింపుఁమని శ్రీకుఁడనిన
హరి వాసరము నేఁడు దురితంబుగాదె!
యరయక భుజియింప - నశ్వత్థమెట్టు
లగముల పత్రంబు లందు శ్రీతులసి
వగయెట్లు, సర్వదేవతల నీవెట్టు
లటుల వ్రతములందు హరి వాసరమ్ము
కటకీ కృతక్రతు! కడిదియౌ తపము
ఈవాఁడు భుజియింపనిఁక నెన్ని జన్మ
లైనను నిమఁజేరు నాపలు గలవె!
క్షమియింపుమన్న శ్రీకాంతుండు పెదవి
గమిచిన నవ్వులై, గారవించినను

మఱికొన్ని నాళ్ళుగ, మధుసూదనుండు
సరస భక్తునియెడ శాస్త్ర గౌరవము
లేపాటివో! జూడనెంచి, తానొక్క-
పాపఁడై జీర్ణ చీవరములు గట్టి
తలవణఁకఁగ పాదములు తొట్రిలంగ
నిలువెల్ల చర్మమ్ము వఱినట్లు దూల
పలు తెఱగులులేని వదనమ్ము, మిత్తి
యలఁతి నవ్వులు నవ్వినట్లు భాసింప
వట్టిపోయిన బావులట్టి నేత్రముల
నట్టిటు పారాడ నలఁతి జీవమ్ము
నామదేవుని యింటి నడవలో నిలిచి -
యో మహామతి! సమాశ్యోత్రరా! దీనుఁ
డను, బ్రాహ్మణుండను కనికరంబుంచి,
నమగాచికొనవె యన్నము పెట్టి? యనుచు
నుడిచిన, వెసవచ్చి యా విప్రుచరణ
సరసిజములు శీత జలములఁ గడిగి
పేంచేపు పేయించి, వీవన వీచి
మంచి మాటలవాడి - మజ్జిగ నొసఁగి
కరములు మొగిచి, యేకాదశి నేఁడు
నరకాలవాల పన్నంబును దినుట
జరయుట కాకకాలరయేని పండ్ల
నరకట్టు దాకలి యన్న - ముక్కోప
కాడౌట, విప్రుండు కటకటం బడుచుఁ
బాడైన ధర్మముల్ బచరించి, యన్న
మింత పెట్టఁగలేక యొగుర గొడ్డైదవు
బంతులు దీర్చి - వేదాంతముల్వలికి,
బ్రదికినగాదె! ధర్మములు, ప్రాణంబు
కదలించు ధర్మంబు, పదటికి గాదె!

అన్నంబు పెట్టక యాగడించినను
కన్నులు మూతు మీ కడపలో వీకఁ
దన్నుదు బ్రహ్మ హత్యా దోషమనుచు
నప్పాటుఁదగ్గి నిర్దైన్య శపించినను
రంగండు దలఁచిన భంగిగా నిమ్మ
భంగంబు నొందింప పరధర్మ మనుచు
నామదేవుండనె నా మహీసురుఁడు
పామమ్మువీడి క్రచ్చర శపించుచును
పై నన్నతునకు నొప్పంచమున్నట్లు
దాపీడె నసువులు ధరణిపై దొఱఁగి
యవకాశమునకునై యాకలి గొన్న
భవిజనుల్ వీఁడట! పుణ్యుండు పాఱఁ
జూడఁజూడఁగఁ జంపె నోడక, వీని
పాడుట లాడుటల్ పగటికే యంచు
క్రంతల నిలిచి, వ్యాఖ్యానముల్ పలుక
దొంతరలుగఁ గండ్లఁ దొలక బాష్పములు
నాపాలు నెత్తి కొంచభిల భాగవతు
లాపాటఁ దనవెంట నంటుచు రాఁగ
మనసమ్ము పేరి రమాకాని కేవి
మనటు గల్పించితి మనుగడ కింక
నీవిభ్రుతోడన నింకును గాక
జీవమ్ము లనుచును, (జిచ్చు రగిల్చి
తానను మంటలోఁ దడయక పడిన
మానిని మణి భర్త్ర మరణ ప్రయత్న
మును జూచి, నామదేవుని ధర్మపత్ని
గొనకొని, తానును గూడఁ జిచ్చులుక
యపుడు హాహాకార మంబరంబంటె
కృపఁ జూడవేమి లక్ష్మీనాథ! యంచు

భక్తలార్చిన చలజ్జ్వాలా జటాల
మక్తమౌవహ్ని తానపుడ చల్లారి
లలిత పీతాంబర కలిత కటీర
తలవినివాత కరద్వయ విరాజితుఁడు
సురమౌళి మందార సుందరోదార
తరసుగంధ నిబంధ చరణపద్ముండు
ప్రతి ముహుర్విస్రంస భద్రోత్తరీయ
ప్రతి కర్మసాధన వ్యగ్రమానసుఁడు—
కస్తూరికాపంక కర్దమిత ప్ర
శస్త వక్షోరత్న శబలితమూర్తి
శతశస్సహస్రశస్స్యందిరుగుచ్ఛ
యుతమణి కుండలాన్వితశ్రుతిద్వయుఁడు
లలితకపోలభారశిఖాచలన్మృ
దులహాస చంద్రికాకులిత దిక్కుండు,
సారంగనాభికా సమ్మర్దమృదిత
చారుకుంతల భృంగ సంగతాలకుఁడు
చకచక త్పింఛగుచ్ఛ విరాజికేశ
నికరోద్గ్రథితమౌక్తిక కలాపమూర్తి
పాండురంగఁడు దోచి, భక్తుని లలిత
గండముల్ చుంబించి కౌగిటఁ బొదిలి
బాపురే! వైరాగ్య భావనాసార!
బాపురే! ధర్మనిర్వహణైక ధీర!
భళిభళి! సద్భక్తి భర్మభండార!
కలిమలభార సంక్షాళనాధార!
అశాంత యౌవతహారనక్ర్తి!
పేశలగుణ వాసనానుపమమూర్తి!
నా యుద్ధవా! యుద్ధవా! యెంతవాఁడ
వోయి! సద్భక్తుల కుత్తంసముగను

చరితంబొనర్చితి, చలియింపకుండ
దిరమౌనుగాత! సద్గురు కృపాదత్త
మైన యఖండ బ్రహ్మాకార సంవి
దానందమని మౌళినాశీస్సునింపె
భాగవతవ్రాత బహుజయకార
మా గుబ్బగొనె గగనాంతరంబందు
నామదేవుఁడు కన్నుదామరల్నిలిపె
నా మురళీధరు నడుగులయందు
జ్ఞానదేవుఁడుమోవిఁగనుపించునగవు
లైనగధరుఁజూచె, నానంద జలధి
నామదేవుఁడు సుధానదులు పాఱించె
భూమి సత్కలితల బొడలైన భక్తి
వారియానచే వచ్చినట్టి యుద్ధవుఁడు
హరియానచే నందెనానందపదవి
నని యిట్లు విష్ణుభక్తాధీనపాద
వనజపరాగ సంవాసితమౌళి
తలిచేత, రసనముజ్జ్వల కావ్యసృజన
ఫలితప్రభవుచేత బహువాఙ్మయప్ర
సిద్ధ మహాకవి శుద్ధసద్గ్రంథ
శుద్ధాంత సంచరద్బుద్ధిచే రసన
శంసదహృదయుచే శశ్వదాభాస
సంవిత్స్వరూప కృష్ణముఖారవింద
విగళిత వేద్యాంతరగతిచే భక్తి
నిగడితమతిచేత నిరతసంసక్త
పావనాష్టాక్షరీ వరమంత్రదత్త
భావనానంద నిష్ప్రత్యూహఫలిత
గురుకృపారసుచేత విరచింపఁబడిన
పరమంబు పండరీభాగవతమున

నిదినామదేవుని సదమలచరిత
మిది భక్తికాసార మిది పాండురంగ
విమలయశోజ్యోతి విస్తరించిన వ
భము భవబంధ సంక్రాంత ముముక్షు 40
జన శాంతిదము, ముక్తినపాయమైన
మననంబు, పాండురంగని శరీరమ్ము
ఉక్తుల విష్ణుపాదోద్భవ రిక్త
రిక్తులాడు త్రివేణి, కృతమహాపాప
ములనెల్ల బోకార్చు వెలలేనిమందు
వెలయును సూర్యచంద్రులతోడిదగుదు 43

---

# పండరీభాగవతము
## (గోరాకుంబారు కథ)

శ్రీకామినీ కుచార్చిత పాదకమలుఁ
డాకృతిగొన్న బ్రహ్మానంద భరము—
సనకాది హృదయ కాంక్షానదీజలధి
ప్రణతామరీనేత్ర పంకజమహము—
కలిమలజ్వలదేకగతిపయోధరము
లలితవంశీరాగలాస్య పీయూష
సరసు—విఠ్ఠలమూర్తి సాక్షాత్కరించి
భరియించు చుండెడి పండరిపురికిఁ
జరుగు దూరమునందుఁ బల్లియ యొకటి
తరడోకి యను పేరఁ దనరుచునుండు
నలరు "గోరా" యను నభిధాన మొనరఁ
గులజాత వృత్తియౌ కుమ్మరియొక్కఁ
డందున పూర్వభాగ్యములు ఫలించి
క్రందుకొన్నది చిత్తకంజంబు వాని
కావిఠ్ఠలేశుని యడుగులయందు—
భావింపఁడు పురాణ భావార్థములను
దఱచి చూడండు ప్రస్థాన త్రయమ్ము
పరికింపఁడు ప్రమాణ వాక్యమ్ములెల్ల
శోధించి విప్పండు శుద్ధమ్ముగాఁగ
వాదాంత తర్క తీవ్రగ్రంథులెల్ల
వదియేమి చిత్రమో! యప్రయత్నముగఁ
జదువుల మర్మంబు చదివినాఁడతఁడు
చదువేల! యాజన్మ సంస్కార భరము
పొదలు కారణజని పుణ్యమూర్తులకు!

వారిమాటలయందె వర్తిల్లు శ్రుతులు
వారి పల్కులఁబొంగి పారుసత్యమ్ము—
వారిచేష్టితములు వరపురాణములు
వారి చూపులు లోక భద్రరూపములు
వారిపుట్టువులు దుర్వారసంసార
సీరసమాన వోన్నేయ పరములు—
వారి దివ్యకథాసు వాచనంబులను
శౌరియే యొద మెచ్చి స్వయముగాఁ జేయ
నట! యీఁకఁ గొదువేమి యట్టిపుణ్యులకు
కుటిల శాస్త్రార్థముల్ కొల్లలునేర్చి
పనిలేని కుత్సిత వాదముల్ ద్రవ్వి—
మనము శ్మశాన ధూమమ్మునబోలఁ
గనులలో గర్వంబు కరుడు గట్టంగ
తనపుట్టుకయె వసుధకు మండనంబు
గానెంచి, దైవంబుగాఁ దన్నుఁ దలఁచి—
కానవచ్చినవారి గద్దించి చూచి—
పరనిందయే యొక వ్రతముగాఁబూని—
యుఱకాసు బోలని యట్టి మెప్పులకు
మురిసి మానవుల సంభాషించి - వారి
కరుణచేఁగొన్న సౌఖ్యంబులుగుడిచి—
యేగాలికా చాప నెత్తుచుఁదిరిగి
భోగంబురోగమై పురులు దూలగను
బరదూరులై పోవు పండితమ్మన్య
లరయుదు రెట్లు బ్రహ్మానందపదవి!
అతఁడు గుణాతీతుఁడతఁ డప్రమేయుఁ
డతఁడనఘ తపఃప్రాప్తంబుసిద్ధి
యతఁడు పురాణ వాక్యార్థైక లక్ష్య
మతఁడు నైగమ వీధి శామల జ్యోతి

అతఁడు నిష్ఠాతత్త్వ మతఁడు పావిత్ర్య
మతఁడు పండరినాథు నంశావ తారుఁ
డపగతక్రోధుఁ డహంకారశూన్యుఁ
డవికారి భాగవతాచార శీలి—
జ్ఞానాగ్నికుండవషట్కృత భౌతి
కానేకచాపల్యుఁ డభినందనీయ
పండరినాథ దివ్యపదాబ్జభక్తి
మండితుఁడఖిల సమ్మాన్యవర్తనుఁడు—
దళితాఘుఁ, డుపకార తత్పరబుద్ధి
కలివియుక్తుఁడు కుంభకారవృత్తుండు
జ్ఞానస్వరూపుఁడై సంసారమందుఁ
దాను వర్తించు కతన, బంధచయము
లంటలేదతనికి పద్మపత్రంబు
నంటునే సలిలంబు లబ్జాక్షభక్తి
పూతులింద్రియములఁ బ్రుంగి చిక్కుదురె!
అతని యిల్లాలును పతియన్న శివుని
ప్రతిగాగ నర్చించు భావంబుగలది—
సతతోపవాసకృశాంగి - స్వభర్త
చరణధూళ్యంకిత చార్చిక్య నిటాల - ప్రేమ
పరిణతమూర్తి, బంధురనీల వక్ర
చూర్ణకుంతలశోభి మందరవర్తి
కర్ణమూలాయాత కమనీయనేత్ర—
సంచిత దివ్యవిజ్ఞానాత్మ విషయ
కుంచితాపాంగ, యాకుంభకారునకుఁ
గాఁగ ధరాస్థలి కవతరి చినది
భాగ్యలక్ష్మి యనంగఁ దద్దయుఁ బ్రీతిఁ
బతిసేవసేయుటే వ్రతముగా నడపుఁ
బతికమ్మలనె దన భావమర్పించుఁ—

బతికొఱకె దాను బ్రతుకు  రంగనికిఁ
బతికిని భేదమావనితకు లేదు—
కలదువారలకు సౌఖ్యగ్రంధి  యొక్క
కలకల నవ్వులు మొలచెదుకుపు—
వాని కన్నులయందే భావించుకొందు
రానలినాక్షు దివ్యస్వరూపమ్ము—
వానిచేతలఁజూచి వర్ణించికొందు
రానిగమాత్ము బాల్యచరిత్రములను—
వాఁడన్న వారికిఁ బట్టియేగాదు
వాఁడు పండరిలోని పాండురంగండె—
నాఁడు కారా జాతనగ్నకృష్ణుండు
నేఁడొక్క గుడిసెలో నెలకొన్నవాఁడు
ఈరీతి వాత్సల్య పూరితమతులు
దారచరిత్రులు దారు జంపతులు
చరియించు చున్నారు శాశ్వతానంద
పరిపూర్తికొక్క దివ్యము పావనమ్ము—
చిఱువెన్నెలల చల్వచిందినయట్లు
విరులపై నెలగాలి పఱచినయట్లు
తేనెలు సోనలై దిగజారినట్టు
లావందమే రూపమై నిల్చినట్టు
లందమే పొందుగా నమరినయట్టి
చందమై - పావని పరప ముఖాబ్జ
మందు నవ్వులు నాట్య మాడినయపుడు
గందురు ఎతరులు గన్నులవిచ్చి
తమలోనఁ దాముగాఁ, దల్లి మనమ్ము
భ్రమియించు వాత్సల్య రసపరిప్లుతము
జనకుని మానసాంచలములదాకి
చనునొక్కసారి యీ షట్ప్రియకైత్య—

పతఁడు భావించిన నాత్మ భావింపఁ
దతఁడు సూచిన హృదయంబుతోఁ జూడ
దనుభవించిన నైన నాత్మలగింపఁ
డు  నియతేంద్రియుఁడుపడునె బంధనములఁ
మానినిహృదయమమ్లానసుమమ్ము
వానిచేతోవృత్తి వజ్రకర్కశము
మగువ చిత్తమ్ముప్రేమమునఁ గోమలము
మగని చేతము తర్కమలినంబుగాదు
జగమెల్లఁబ్రేమింప సాధ్వి చింతించు
మగఁడుదాసీనుఁడై మలయుచుమందు
సంసార చక్రంబు సత్యంబు సతికి
సంసారభరము తుచ్ఛము మిథ్య పతికి
జగదేక రూపుగా సాధ్వి భావించు
నగధారి నిర్గుణుఁడంచుభావించు
ధవుఁడు  విభిన్న భర్తమలిరువురును—
గవగూడికొని రొక్క కాపురంబందు
నామెనే ప్రాణేశుఁడనుసరించెడునొ?
కామినీమతియె యాకర్షించుకొనునొ?
వారిరువురి భావ బంధమ్ములదుకు
మారరూపుండు గుమారుఁడొక్కరుఁడు—
తరళనేత్రముల మందానిలమట్లు
బరుగిడముగ్ధభావమ్ములు తూవ
తనపైపు జూచిన దంద్రిచిత్తమునఁ
గమ్మంచు నగుబామై కంజాక్షిమూర్తి—
యలకవచ్చినవేళ నతులుమెఁగిచి
చిలిపి నవ్వులులేక - చేతులుగట్టి
నలుకకతూర్చున్న బాలుని జూచి
శాంతి భావంబులో నలనిర్గుణుఁడుగ

భాసించఁబరుఁడైన పండరినాథుఁ
డానవమయములందు నతఁడు క్షోభించు
నప్పుడు జనని యత్యాశ్చర్యమొందు—
నప్పగిదిని బాలునందగా నిలిచి
యాడించుచున్న వాఁడఖిలైక వృత్తి
కూడికూడని యొక క్రొత్త నాటకము!—
అలకలనొత్తి కుంతలములు దువ్వి
చెలువంబుగాఁగొండె ఎగవేసి విళ్ళ
ముడిచి, గోర్వెచ్చని ముద్దులువెట్టి
జడదీర్చి పచ్చవినంపెగల్దాలిమి
కందమ్ములందునఁ గాటుకదిద్ది
యందముల్దెలుగెడు నలిక పట్టంబు
నందు చిత్రకమిడి యమరాగ మొనర
నందిక జేర్చుక్కఁబొందుగాఁ దీర్చి—
కలగంధ దర్పణంబులనోష్ఠచిబుక
తలములఁజిట్టి చుక్కలాగదియించి—
నందిట కాయతుల్ పవరించితూర్చి
కందమ్ము యడుగుల గజ్జెలుగట్టి
యూచెంప నాచెంప నెత్తిముద్దాడి
యాచపలాక్షి కుచాగ్రంబులవికి
గోరువెచ్చని పాలు గురియుచునుండ
రార! నాకృష్ణమ్మ! రమ్మంచునెందు
గరములు దాచి ముక్కుఅగదలాడ
కరమార్చి చీరి కొంగరమట్లు ద్రిప్పి
గిలిగింత పెట్టి నవ్వులను దెప్పించి
కలకల నవ్వులోఁ గర్పూరమట్లు
గరగెడునప్పుడు కామిని పైపు
పరవ కటాక్షవీక్షణములఁబాదు

పతి ఎగ్గుకోవింత పరుగులువోయి
సతి దివలోననే శాంతించికొనుమ—
కురులు జిక్కువడంగఁ గూకటుల్ చెదర
నరవిరి గన్నులయందుఁ గజ్జలము
మాలి మోమునగాంతిదూలి ఘన్నదిని
ధూళీ పరిప్లుత ధూసరాంగముల
బూడిద బుస్సన్న వోలికఁబిల్ల
వాఁడు బాజారులోఁ బరుగిడునప్డు
కన్నతల్లి మనమ్మకంది వెంటఁబడి
యన్న! రమ్మంచు నాహ్వానించు వేళ
జనకుండు మధురహాస్యస్ఫురితంబు
కనుచూపు జల్లిన కామిని యెదను
హత్తించుకొను హృదయాంతర జ్యోతి
ద త్తరపాటు మ త్తలపాటు గదుర—
నన్న! యక్క! యటంచునందఱజేసి
యన్నువ బ్రేమమాటాడించుచుండు—
బిలచినఁ బలుకందు - పలికెనయేని
యలనల్ల నాతఁడు నలువల్కు పలుకు—
వతఁడు కూటస్థునకాత్మలో వెదకు
పతిపనగుణరూప కాత్మలోగరఁగు—
చిరిగిన వస్త్రంబు నణకొనుతిండి
యణకొను నిద్రయు నై పనేమాయె
వారు తృష్ణాసంగ వర్జితులగుట
వారు మహారాజ్యపట్టవైభవులు—
కుమ్మరి కులవృ త్తిఁగుండలు జేసి
యమ్ముగావె త్తి పైకె త్తికొన్నంత
ముదిత కుమారు పీవునఁగట్టికొనుచు
పదముల పావిత్ర్యనందవాలె

వడుగులో నడుగులనిడుచు పెద్దవులు
యడజడిలేని తుష్టాంతరంగమున
పతి పాండురంగని భవ్యగీతముల
నుతియింప నతిసముత్కంఠ మదినెనసి
పరఁతిసూడిగములు స్వనియింపతుఱుము
వడకంగ సాత్త్విక భావముల్గ్రిమ్మఁ
దనువుకంపన మొంద తలపులు బూయు
వెనువెంట బాడును విన్నవారెల్ల
నిదువెంద్రు తలపెట్టఁలిచెదరింక
నడుగఁగనేమున్న దాయదృష్టంబు!
పండరి పురిఁజేరి వాడల బెట్టి
గుండలన్నియు నమ్మి కొన్నంతఁ గాని
పూవుచెత్తులుగొని వోదురురంగ
దేవాలయమునకు దేవియుఁదాను
సమచరణమ్ముల సౌందర్యముబక
రమణీయ హస్తతలములు గటీర
మున వికసింపంగ ముగ్ధవిపీల
తనువు లావణ్య పీమనను వదింపఁ
గలికి గన్నులయందుఁ గరుణదొలంకఁ
గళలెల్లదామగా నిలచినవాని
లావణ్యలక్ష్మి విలాసమౌవాని
భావజకోటిరూపముగలవాని
సనకాది ముని మనోధనము విర్థలుని
గనులలో గొగిలించిన యంతలోనె
మఱతురు లజ్జ, నే మఱతురుమేను
మఱతురు లోకమ్ము మఱతురుమదుల
కొనితెచ్చినట్టియా కుసుమమాలికలు
వనజనాభుని పాదపద్మంబులందు

వైచి కొంగ్రొత్తవైభవమావహించి
వాచంయమానీక భావసౌగంధ్య
భరితరూపుండైన పాండురంగనికి
కరయుగంబులు మోడ్చి కనుగవమోడ్చి
తారుదండమువెట్టఁ దరుణి గుమారు
చేరంగ మూర్తికిఁజేయి మోడ్పించు
పదపడి నామదేవాదికభక్త
పదవనిర్గ తసుధా మధురగీతములు
దలపోసి తలపోసి తదవశుఁడాడి
యిలుపేరికొంద్రు రేయికిగుటుంబమ్ము
పండరినాధ దివ్యచరణాం బుజము
లంద వారికి నెల్లయవసరంబులను-
కలలలో పాండురంగని వైభవమ్మె
దలఁతురు మేల్కొన్న తరుణంబులందు
గొలుతురు వాని సలలితరూపమ్ము
బలుకుదురతని దివ్యమ్మునామమ్ము
కలకంఠ సతివోలెగామినివాడ
జలధరమును వోలె శబ్దించు వకఁడు
నా పలుకులఁగ్రోలి యతివ విల్వెల్ల
నీ పవృక్షమువోలె విమదును బులక
లమ్మది తనుగాంచి యార్ద్రాక్షిఁదగుచు
నెమ్మికై వడివాఁడు నృత్యమ్ముసేయు
దనపితరుల గనుంగొని బాలకునకుఁ
గనుల విరమ్మదకాంతులు దూయు
తరదోకిలోని యందఱియిండ్లు హర్ష
పరవశములు దమనసులను మణచు
నొకనాఁడు ప్రత్యూష వికచనీరేజ
నికర ధూళిపాళి నీరంధ్రితాంగుఁ

దలన సమీరకుఁ దవనీమృదూరు
తలమునకెగ బ్రాకు తరుణంబునందు
హరినామ చింతనాతురుఁడై నవాఁడు
పరమభక్తులకొజ్జబంతి యౌవాఁడు
భవబంధనము లెద బాసినవాఁడు
కవచితశాంతి నిష్కలుష మానసుఁడు
స్థండిలశాయి మితాహారభోక్త
పాండురంగ వియోగబాధా౽సహిష్ణు
డాకుంభకారకుఁ డక్షులు విప్ప
శ్రీకాంతు రూపంబు చిత్తంబునందు
నిలుపుచుఁ దనయెద నలినమృణాల
వలయంబువలెనున్న వనిత హస్తంబు
దెమలించునంతలోఁ దెలివి నొందినది
కమలదళాక్షి చిక్కనిక నుల్విప్ప
పరమమునీంద్ర శాపవశంబుచేత
ధరణికి డిగిన యచ్చరలేమవోలె
నిలువెల్ల నందమే నెలవుకొనంగఁ
దెలినవ్వుల ధరళుక్తిక నల్లలాడఁ
గుడిచంటిలోఁబాలు గుడిచెడునట్లి
పడుకొన్నబాలుని వదనంబునందె
యున్నకుచంబు ప్రేమోద్భూనమగుచు
వెన్నెలపాలు స్రవించుచునుండ
వచ్చిపంపెగల సొబంగుల బిడికి
పుచ్చికొన్నట్టి చూపుల వాధుజూచి
ఘుక్కుర గదలాడ ముగుదరసార్ద్రి
వాక్కులతోవాడెఁబరియాచ కమ్మ
తావట! యొకఁడు భక్తాగ్రేసరుండు
మానినీ హృదయసమ్మర్దదూరగుఁడు

యిల్లాలి కనుగప్పియేగెడువంట
గొల్లగొబ్బెడు నాన గోవిందభక్తి
దాఁజేయు భక్తి సర్వమ్ము భాగమ్ము
గాఁజేయుసతియని, కానఁడోగాక!
కానట! యొకనాఁడు కరుణి కటాక్ష
దీనుఁడై గోర్కెను దీర్చినాఁడంట
యానంద గర్వుడై యతివగన్నదట
మానాత్మ నిభుఁడైన మామ నొక్కనిధి
యున్నియుండినను యోగీశ్వరుఁడంట
గన్నులుగప్పి తెక్కలి మొనగాఁడు
తనక్రోవ తనదట! తరుణినికొడుకు
గనఁడట! వారేమిగావలె సుమ్ము!
పరమాత్ముఁడిట్టి నిష్ఠురభక్తిమెచ్చి
కరుణించునేమి! నిక్కముచెప్పు" డన్న
దాని గ్రహించి మందముగాగనవ్వి
కానవే ప్రత్యూషకాలమ్ము పరమ
పూతమ్ము రంగని పూజనమ్మునకు
నాతి! లెమ్మన్న మందానమ్ముగను
ఎల్లనినోట దీపించుకుచమ్ము
నల్లనదెమలించి - యలకలనొత్తి
కోక్కొట్టి - యడిపిగ్గు చూపులకొవల
నాకట్టఁజూడని యట్లుగానాధు
బరికించి యావక పాటలాధరము
నరవిరి తెలినవ్వులా గుబ్బగొనఁగఁ
గుదియించికొను పూన్కి పదపదమైన
మదినొక చాయగా పదువులోనుంచి
మీనకే తనక్రమ మూణిరమట్టి
మేనలి యారియాడగా నలిచేశ

శిరము వంచుచు నమస్కృతి సేసె   పుణ్య
పరిణతమూర్తికి ప్రాణనాథునకు,
ఫాలంబునందు విస్ఫుర మోక్షసౌఖ్య
మూలమ్ముధరియించెఁ బూతరజమ్ము
పలికెడు కోయిల పాటలోఁ గలిసి
పలుకఁదొడఁగిరి దంపతు లిరువురును 55
కమనీయ తమము శ్రీకాంతునామమ్ము
చెమరింపఁ దొడఁగెను చిఱుగాలివొరలు
చెమరించి రిర్వురు శ్రీనికేతనుని
రమణీయభజన సాంద్రా నందవశత,
తలలవ ల్లార్చె దీపెలు మెలమెల్ల
దలలవల్లార్చి రీ ధ్యానతత్పరులు
కుముదముల్ ముకుళింపఁగోరిననేత్ర
కుముదముల్ మొగిచిరి   విమలదంపతులు.
తెలివిపేరినది దిక్కులయందు తూర్పు
మలయేన్గువకుముఖ మండనంబట్లు 60
సరభ సాయాత వానర రమాచరణ
పరిగళి తమ్ము ప్రభాంబువాతాంత
రావకాళము పద్మరాగనూపురము
నావెల్గెఁగమలినీ నాథ బింబమ్ము
పంకజ కేసర ప్రతిమముల్ సాంద్ర
కుంకుమోపమములు   కుంతనితంబి
నీ కటాక్షాంకూర నికరములు చక్ర
వాకరాగోద్రేక వర్ధిష్ణువులు - వ
యోజనీ వరన ముఖోల్లాసముల్   ద్వి
జాతిర దత్త వంద్యార్ఘ్యమాహాత్మ్య 65
పరిణద్ధకాంతులు   బ్రహ్మభూయములు
ధరణి జీవముల చైతన్యరూపములు

ప్రసరించినవి బాలభానుకరమ్ము,
లెనలారు వేడుక నిందీవరాక్షి
దినపతి యానతి గొని యంటియందు
బనులుదీర్పఁగ బూని చనినదిగాని
మనమున రంగని మధురనామంబు
కనులలో భక్తిరేఖయు మాయలేదు
విగళితేంద్రియ వృత్తి విమల సంస్కారుఁ
డగణిత జ్ఞానతమోర్కుండు   పాండు
రంగవిఘ్నాఖుండు - సంగవిదూరుఁ
డంగీకృత తితిక్షుఁ డత్యంతశాంతి
పరిణాహ పరివేషభాసురమూర్తి
కరమరుదగు కుంభకారభక్తుండు
వరమూత వడివట్టి యశ్రులతోడ
బరుగులువెట్టు బాష్పమ్ములతోడఁ
జలియించుచున్న హస్తమ్ములతోడ
మొలకలై నిలిచిన పులకలతోడ
వలసాలసంబుగా సంగంబులూగ
నల్లనల్లలేచి కార్యమ్ములుదీర్చి
యతసీసదృశదేహ ప్రభాంకూరు
నతమౌని మానసానందప్రసారు
బహుపురాణనికాయ భావైకసారు
మహిత శ్రుత్యంగనామణి పరిష్కారు
యాదవీమధురత్రపా దిగ్గగండ
కేదారపులక లక్ష్మీజలధరము
నామదేవాది మహామహచిత్త
తామరసాకర తరుణ బంభరము
జ్ఞానేశ్వర్శ్రీగంధ సరసకల్హార
మాన వరాగమ్ము, శుద్ధసత్వమ్ము

కలియుగ మాలిన్య కతకఫలమ్ము
కళగల్గు పాండురంగని రూపుమదిని
కొలువుదీర్పఁగ, ఖండములుసేయు బొంకె
పులకాంకురిత తీర్థభూతదేహుండు
మన్ను ద్రొక్కుచునుండె, మహనీయమూర్తి
మన్నుద్రొక్కుట గూడ వన్నెదెచ్చినది
వానికి మరి యాత్మవంతులకే వి
ధానమ్ము! గౌరవాధానమ్ముగాదు!
సమదృష్టితోడఁ గాంచన లోష్ఠములను
గమనించు బుధుఁడు సుఖమ్ముదుఃఖమ్ము
వేఱువేఱుగను భావించునా! యేమి?
కొరినిధ్యాన విష్ణాతుండు - గరళ
సదృశంబులైన కుక్కుముల సౌఖ్యముల
మదిగోరునే! విఘ్నమధురగుణాను
వాదనానందలవంబుతో సరియె
సౌదామినీలతా చపలపై భవము!
వారుగోరిన విభవములకుఁగొఱయె
వారికుటీరంబు ద్వారంబులందె
యష్టసిద్ధులు నిల్చి హస్తముల్మొగిచి
సాష్టాంగపడును వాఙ్మాత్రప్రతీక్షముల
వారుకోరరు, వారు గోరినయేని
కోరుదు రాకొరిగుణ కీర్తనమ్ము
కుమ్మరియెదలోన గోటిధేనువుల
చిమ్మునవానంద క్షీరదుగ్ధముల
అనుకరించినది సంధ్యాంతరిక్షము
వనురాగరుందిలవొ వానిమనసు
తారకారత్న సంతానంబునాను
దారభానమ్ముల తరళించినవియు

ప్రతియయ్యెనందనారామమ్ము తోడ
తతపులకా పూరితమువానిమేను
రంగ! రంగా! యన్న ప్రత్యక్షరమున
జెంగలించినది విచ్చిన యెలనవ్వు
గళమెల్ల గద్గదాకలితమై - వెడలు
పలుకెల్ల నద్భుతావార్ధ్రిమై వెడఁద
కనులెల్ల జీవనకలితముల్గాగ
దనువెల్ల పులుపుమ మనమెల్ల జడత
గనికొనంగ హృత్కంజంబులోన
దివిరి ప్రకాశించు దీపంబుగనుచు
వనజాసనాది దివ్యాళికాంక్షితము
ననుపమంబైన బ్రహ్మానందసుఖము
ననుభవించుచునుండె నాకులాలుండు
ప్రణతయౌవత శిఖాలంకారమైన
ధరణికిదిగిన నిర్జరపుణ్యమైన
పరమపావిత్ర్య రూపంబైన, వాని
పడతికినింటిలోఁ బనిదీరలేదు
పడుకొన్నబుడుతండు ప్రాభాతమధుర
శతపత్రములబోలు చణులువిప్పి
వితతఫాలస్థలీ విభ్రాజమాన
చూర్ణకుంతల శోభ చోగలై మౌగ్ధ్య
పూర్ణంబులైన చూపులకాంతి యింటి
కొకవింత వెలుఁగివ్వ నోష్ఠవిపంచి
జికిలినవ్వులపాట చిందులాడంగ
దనకట్టెపుటనున్న దండ్రినిజూచి
దనకరంబులజాచి దరియంగవేగె,
నమృతమే రూపెత్తినటులున్నబాలు
కమనీయరూపంబు గనలేదుతండ్రి

కనులుమీలితములుగావించి చిత్త
వనజంబు విఠ్ఠల పాదార్పణంబు
గావించి సర్వలోకంబును మఱచి
భావాతిగమ్ము సవస్థనుబూని
దను దానెఱూచు చాత్మారాముఁడగుచు
ననుభవించుచునుండె నమరదుష్ప్రాప్య
మతిదుర్లభంబు బ్రహ్మానందసుఖము,
బ్రతిదినాఖ్యాన కారణమున బాద
యుగము మన్రొక్కుచు నున్నదేగాని
యగుపడదాతని యత్నమావంత,
బాలుండు దరిసమ్మృణాలహస్తములు
లీలదాచుచు గౌగిలించె మారువులు
నమృతశీతలమైన యాస్పర్శగూడ
గమనింపఁ డాతండ్రి గన్నులువిప్పఁ
డాతని సర్వేంద్రియమ్ములు రంగ
పూత నిధ్యాన సంపూర్ణమత్తములు,
గళమెండినది బఁకందుకు ఎలిచి
ఎలిచి తల్లికిఁగూడ వినబడలేదు
తరుణి చిత్తమ్ము మాధవకీర్తిగాన
పరవశమై దన్నుమఱచినయదియు
పఁకందునకు చేతిపట్టుజారినది
వనమఱిమంటిలోఁ బడినాఁడు తండ్రి
ద్రొక్కుచున్నాఁడు నిస్తులభక్తిపరిధి,
యక్కజపడినారల ఖిలదేవతలు
యెన్నఁడుగంటిమే యీ భక్తిభరము
గన్నారనని దమకరములెత్తి
జయజయాకారముల్ సలుపుచున్నారు
జయజయాకార సంసక్తగర్వమ్ము

అమల దిశాంగన లతికుతుకమున
క్రమముగానిచ్చె గ్రహములు నేత్రములు
జలదాంగనలు నూత్నసౌందర్యరేఖ
లాలికించినవి మింటియోరలయందు—
కల్పవృక్షము శిరఃకంపంబొనర్చి
కల్పించినది సుమకాయమానములు—
సురవీథులన్నియు బురదయైపోవ
సురసైచికియు బయోభరముచేసినది
సురగంగ కంకణ స్ఫురితముల్ రేగ
కరమర్థి తారంగ కరములనెత్తి
యానందనాట్యమ్ము లాచరించినది
ఈనాకమునకన్న నిలయెంత బుణ్య
వతియని దేవతావనిత లభీప్స
మతినిండ మత్సరమంది వీక్షించి
రగణిత పుణ్యభాగ్యమ్ముదృశ్యమ్ము
నిగమవానంత వనీకోకిలమ్ము
పండరినాథుడే బ్రమసి యానంద
తాండవమాడె నాతరుణంబునందు
బురుతని యవయవంబులమంది దొరఁగి
గడుకొని బాదురక్తమ్ముతో నెనయు
దాన, మృత్తిక హరిద్రాగౌరమయ్యె
వాని పాదమ్ములు బాలావి యాంత్ర
ములజుట్టుకొన లతాప్లుతమైన తరుల
వలెనున్నయవి ఎల్లవాని మేధస్సు—
కరము లంఘ్రులును వక్షమ్ముదరమ్ము
శిరసులు కోమల కుంతలంబులును
కన్నులు జెక్కిళ్లు కమనీయ తనువు
మన్నులోఁబడి రూపెమాసిపోయినవి,

పండరి నాథుని పరమభక్తుండు
పండరినాథు రూపాంతరమైన
కుమ్మరి, మీలితాక్షుఁడు పుల్కలెగయ
నెమ్మనమానంద నిభృతమై దూగ
పలుకుచు నున్నాఁడు పండరీశ్వరుని
కలిమలహరము నిష్కలుషనామమ్ము
నాడుచున్నాఁడు భావావేశమెనఁ
యాడునాట్యమ్మున కలఁతయేలేదు
పలుకు నామము పలుఁబరితప్పలేదు
కలమోదమున కానకట్టయేలేదు
అవంత లేదు బాహ్యజ్ఞానభరము
భావాతిగస్థితి పరిమగుఁ దతఁడు
వానియిల్లాలింటిపనులను దీర్చి
సూనుండు లేచెనో చూతముగాక
యనివచ్చినది శయ్యయందునలేఁడు
తనతపస్సిద్ధియో తనపృథుకంబు,
తల్లిమనంబులోఁదత్తరపాటు
మొల్లమైనది యెందు బోయెనో కాక
నాతండ్రి! నాకందు! నామనోధనము!
నాతనూజాతుండు! నాహృదయాళి!
అరనిమునము గృహమందాడు కొనఁడు
పరువెత్తుగన్నులు భ్రమియింపఁజేసె
కాళ్లువచ్చిన పెద్ద కష్టంబునమ్ము
యిల్లిల్లు దిరుగాడ నిప్పుడే నేర్చె
దయసేయరా! యెందుదాగితో కాక
కయిసేయ రార! నాకన్నులు బండఁ
పప్పుబెల్లమ్ము సాపడుదువుగాని
చెప్పరా! యెచ్చోటఁజేరితో స్వామి!

రార నాకోరిక! రార నాతండ్రి!
రార నాజీవన రమణీయ దీప!
రార! నామోదసర్వంకష జలధి!
రార! నామానస రత్నభండార!
యని పనవుచు వీధులన్నియు వెదకి
గనుపడ్డ యమ్మలక్కల విచారించ
నందుగొందులుజూచి జతగాండ్రనడిగి
యెందుగానక శోకమేరూపుగొన్న
దై పడి దనువెల్లఁగంపంబుపుట్ట
భావమ్ముసుడియంగ బదములు జెదరఁ
గన్నులగన్నీరు గాలువగట్ట
నున్నమితాస్యయై యెక్కుచేకీతి
నోయంచు నార్చుచు నురముదాచించు
చాయత ధూళికా వ్యాకీర్ణఫాల
తలమును స్వేదపంకిలములంగములు
కలిత గద్గదరుద్ధ కంఠరవమ్ము
వదలుచీరయు, వడంకెడు కౌనుగలిగి
పడుచును లేచుచు బావురుమనుచు
దిరిగివచ్చెడుదాని, దీనవిక్లబను
బరికించి పల్లెలో పలిజనులెల్ల
దలరెడునట్టిడెందములతో గార్య
ములనేది బొమ్మలు మూగలు వోలె
వెనువెంటనడచిరి వెలఁదిమానందు
జనివహేతువున నిశ్శబ్దమై వన్నె
దరిగిన గృహమును దరిసి ప్రాణేశు
బరికించెలౌకిక భావవిదూరు
సారవిచారు నిస్సంశయాచారు
దూరవికారు - నిర్ధూతాంధకారు

బరికించి - వదనంబు వఱునట్లువారఁ
దరళాక్షి యీగతిఁ దలరుచుఁబలికె

పలుకవో! నాతోడ ప్రాణేశ నీవు
చిలుకవో నాయెదఁ జిక్కినమధువు
బండరినాథుఁడే బగదాయ యగుచు
నిండారు కనుగందు నీడ్చికొన్నాఁడు
మనగూటిలో పిట్టమాయమైపోయె
మనయింటి దీపంబు మలఁగిపోయినది
మన తపో భాగ్యంబుమాసి పోయినది
మనప్రాణ సర్వస్వ మంతరించినది
మనహృదయగ్రంథ మనభక్తిఫలము
మనపాండురంగఁడే మనకింకలేఁడు
యేపొదలో దూరి యెటనున్నవాఁడో
యేపాముపంటికాపెనఁగిన యదియొ
యేబావి పొట్టలో నిడుకొన్నయదియొ
నాబాలనెవ్వారు నాకునిచ్చెదరు?
ఆకలికై యెంత యలవరించెడినో
నా కంఠదెంతగాన వసిపోయెడినో
యాకన్నులనుకాంతులంతమౌ నేమొ?
యాకంఠమున దీప యమరదోయేమొ
బ్రదుకునా నాతండ్రి బంగారుకొండ
పదముల కిణకిణక్వణనమ్ముల్మీర
వచ్చునా? - మరల నా బాహుబంధమున
కచ్చింప పున్నెంబులమరిన యట్లు
చిక్కునా శ్రుతులకు చిక్కనివాని
నిక్కంపు వరము నాపీడ నాబిడ్డ'
నిలుచున్న జనములు నీరు గాగరగి
వలవించి రెల్లరు బాపురుమనుచు

వదయునివోలిక వచ్చలవిప్ప
సుదతి నూరార్పంతు జూడఁడుగూడ
గోరా , హృదయమెల్ల గుమిలిపోయినది
నీరజాక్షికి విభునీదేజ నద్భుత
పదములు గట్టిగాఁబట్టి బంధించి
కదలించినది - యామె గరములకంటి
కొన్నవి బ్రేవులు గొమరునిశిరము
చెన్నేది మంటిలోఁ జిక్కినదమవు——
కరములా కాంతకు గట్టివారినవి
యురమెల్ల గుతకుత యుడికిపోయినది
సోగకన్నుల పెట్టిచూపు నిల్చినది
మూగగొంతుక బాష్పములు గలఁచినవి
తలఁగోటి వజ్రాయుధమ్ములు పగిలి
దలఁపులఁ గోటిపిడుగులు చెక్కువఱచి
చెవులలోఁ గోటిగర్జితములురేగి
యవయవమ్ముల గోటియహితతుల్వేఁటికి
యంతర్హృదినిగోటి యగ్నిశైలములు
దంతురితాశముల్ ధగ్గనిచిటిలి
హా యని లలితాంగి యాకాశమెల్ల
హో ' యని బదులివ్వ యొకసారియఱచి
పడినది ఋషుల శాపమ్ముచేఁబడమి
బడినట్టి యప్సరః ప్రమదయుంబోలె
నక్కడ నిలిచిన యవ్వలుగొంద
రక్కటికంబున నాచపలాక్షి
కుపచారములు సల్పి - రువిదయుదేరె,
నవగత కల్మషుఁడరవిందనాథ
చరణ సంస్మరణైక చందరీకమ్ము
వరమవైష్ణవ శిరో భవ్యరత్నమ్ము

నాకుంభ కారకుఁడఖిలబువిప్పె
నాకలకంఠి హాహాకారములకు
బరికించె భక్తుండు బరమ శోకంబు
బరిగొన వెరపేది పలవించునట్టి
దరళాక్షి దుఃఖ సంతప్తయౌదాని
బరిచుట్టినిలిచిన పల్లి జనంబు
చూచినవెంటనే సుదతి యెదంద
నాచిన వేదన యతిశయింపంగ
కరయుగమ్ములదాచి గన్నులయందు
బరవళ్ళుద్రొక్కు బాష్పములతోనిలిచి
దనయేక పుత్రసంతాన దుఃఖమున
దనవివేకము మాయ ధైర్యమ్ము దలఁగి
బలికె నీభక్తికై బాలునిగూడ
బలిగొంటి వింక నా ప్రాణంబుగూడ
గొందువా! కానవోయి క్రూరకర్ముండ
కందును మంటిలోఁ గలిపి త్రొక్కితివి
విన్నేమియనగందు నీవెతలెల్ల
మన్నించు గట్టిడి మధుసూదనుండు
వాఁడునిందార్హుండు వాఁడునిర్దయుఁడు
వాఁడెనాబాలుని బలిగోరినాఁడు
కరుణాకరుండంచు గల్లరిబిరుదు
మెరపఁ దాల్చినయంతమేలేమిగలదు?
కరుణాకరుండు నిక్కంబగునేని
తిరిగొనువేనాదు పుత్రుని, భృంగి
వనితరేపులమాపు ననవరతంబు
దననామ భజనంబు దగిలిచేయుటకు
ఫలమిచ్చెనీనాఁడు పాండురంగండు
గులవర్ధనుండగు గొడుకును ద్రుంచి"

యను దారుణం బైనయతివాక్యములు
వినికుంభకారుండు బెదవులు వణఁకఁ
గనులలోఁగరుణ తొఁగాడఁగాఁ బలికె
వనజాక్షి! మాయా వివశమానసమున
వెలుఁగ నేరదునమ్ము విజ్ఞానకళిక
కలదు లేదను వృథాకల్పనంబులకు
మఱఁగి జన్మంబని మరణంబటంచు
నరులు గల్పించుకొన్నదిగాక - యాత్మ
బుట్టునే! చచ్చునే! పూబోడియేల
పట్టికై యీరీతి భ్రాంతి బొందెదవు
ఆత్మవాదుల మతంబనుసరింపక య
నాత్మవాదులపోల్కి నాతి యెందులకు
భావించె దా వట్టి ప్రభవింపలేదు
చావనులేదు నిస్సంశయంబిద్ది
మెలఁత! యాత్మయె నిత్యమేయనుకొమ్ము
నిలుపుదువే నీవు నియతికిఁలోగి
జచ్చుచు పుట్టుచుఁ జక్రంబు రీతి
గ్రచ్చరితిరుగు నీ కష్టజీవులను
తన తన కర్మాను గుణముగా జీవి
జనియించు వర్తిల్లు - సమయమనుమ్ము
లేదు సంబంధంబు లేశమాత్రమ్ము
వేదవాదులు బల్కువిధమిదియింతి?
యిచ్చిన రంగఁడే బుచ్చుకొన్నాఁడు
త్వచ్చిత్తమునకు సంతాపమింకేల?
పుట్టంగవచ్చును భువి కోటిసార్లు
పుట్టునే విభుపదాంబుజముల భక్తి
మనకర్మవండి సంప్రాప్తించినట్టి
వనజాక్షిభక్తిని వనిత యెందులకు

వలఁతిగోర్కెల జిక్కి యడ్డగించెదవు
తలఁగకఁజేసెదు దైవదూషణము,
పూని యనే శాబ్దములు జేసినట్టి
మానిత తపమొక్కమారు మాధవుని
నిందింప దగ్ధమై నిలువదు సుమ్ము
తొందరపడి యేలతొయ్యలి! ఘోర
నరకదుఃఖముల కాకరమవయ్యెదవు?
బరిపరి విధముల భ్రమఁయాడెదవు
యెవ్వని మహిమ గీర్తింపను బూని
క్రొవ్వేటి శ్రుతులు వాక్రువ్వగానుడిగె
నేవానిరూపు బ్రహ్మాదులెల్ల
భావించి భావించి బరితుష్టినొంద
రేవాని చరణంబులిందిరాకాంత
పావన స్తనముల భరియించిపొంగు
నేవాఁడు మత్స్యాద్యనేకావతార
భావియై జగములఁ బరిరక్షసేయు
వాని, యౌవన మత్తవల్లవీ హృదయ
మానవీ రాజిత మహితవిలాసు
వాని కాంచన సవర్ణశరీరు
వానియోగీశ్వరేశ్వరుని రంగనిని
మానిని! నామనో మంటపంబందు
బూని చొక్కెడునట్టి పుణ్యకాలమున
మామని చావొక్క సుద్దిగాఁబవవి
ధ్యానంబు దెలిపితిఁ, దనయుఁడు గలుగ
వచ్చుమగానంత భాగ్యమేయున్న
వచ్చునే మరల గోవర్ధనధారి
చరణనీ రేజ సంస్మరణైక సిధు
వరవశచిత్తమా భవ్యయోగమ్ము."

సమపతిదైవ వాక్యము లాలోంచి
వనితగన్నులనీరు వరద బారినది
కొందరు దమలోన గొందల వడిరి
మందుండనుచు గొంతమంది వాపోంచి
రన్యాయమని కొందరాక్రోశించిరి
శూన్యదృక్కులతోడఁ జూచిరి కొంద
రిట్టి చేతలు భూమినెందును గలవె
పుట్టక పుట్టక పుట్టెనే భక్తి
వీనిపుత్త్రునె పట్టి వెంగలిగాక
నూనని జంపు తుష్టులకేవి భక్తి
యని కొంద రంకించి రాక్షేపణములు
వినలేదా! రంగని శ్రీతికై యొసఁద
గరములఁ జీల్చి దాఁగంగఁ జొచ్చు
పరమ భాగవత సావంతుని భక్తి
త్యాగంబుచే నమృతత్త్వంబు నొందఁ
గాగోరు భక్తుల కధలెల్ల నిట్టి
వేగాక మరివేరు విధములుగలవె!
భోగరూషితులైన పురుషులకివ్వి
మతికంటునేయని మఱికొందరనిరి
మతికెక్కనని కొంతమంది గర్జించి
రీరీతి యటమన్న వారెల్లవారు
వారివారికి దోచు భంగులననిరి
దలకొక్క పుర్రెయుఁ దలకొక్క మాట
తలమె యీ వింత వాదమ్ములు దీర్ప!
సుదతి యొడందను శూలమ్మువోలె
గదలించె భర్తృ విజ్ఞానబోధనము
పతిజీవయైన యావదతి పవిత్ర
మతి నేక పుత్ర దుర్మరణశోకమ్ము

గ్రుయించినది గనుల్గ బ్బెల్లివాఱ
ప్రసభ గద్గద భరాక్రాంత మౌనెలుఁగు
చలియింప మృదుపలాశమ్మునుబోలె
కళవళపడి, మోవి కంపనమొంద
పలికె నాకోర్కెల బంగారుమేడ
లలిత మద్భాగ్య కుల్యాదివ్యసరసి
మజ్జీవన నిశాంత మాణిక్యదీప
మజ్జిగా నెలకొన్నయట్టి నాశక్తి
నాపరమానంద నందనవనము
నాపుణ్యసంచయ నలినగంధమ్ము
నాదువెన్నెల విత్తు నాప్రేమలతిక
నాదుప్రాణంబైన నారంగమూర్తి
నా పసిపాపని నాచికొన్నావు
నా పుణ్యదీపంబు నార్పివేసితివి
యమృతతుందిలమైన యట్టి నాజీవి
తమున శోకాగ్నిని దలిగొల్పినావు
సరళ కోమల మదాశాపాత్రయందు
గరళ బిందువులను గలిపివేసితివి
యెటుబుట్టి పోయెనో! యెలదీగయెడఁద
బొటమరించిన యట్టిపూవందెగాని
కళలేని తీగెయే కడకు నిల్చినది
మలయవాయువు మాయమైనదేగాని
తదుపలాలన సౌఖ్యతరళచిత్తము
మృదుకంటకపలాశ వృతదేహయష్టి
పరమదుఃఖిత చూతవని మిగిలినది
పరమప్రియంబైన పారావతంబు
భ్రమపడి దానెటు బ్రాలెనోగాని
యమిత దీనముగులాయమె మిగిలినది

కమనీయ తరములు గాంతులుగలిగి
క్రమవర్ధితమ్ము చిక్కఁ్ణము నాభక్తి
నెనయు దీపము గొండనెక్కెనేగాని
గుణహీన మీజీర్ణకుటియె దక్కెనది
పాండురంగనిపేర భగవంతుపేర
దండించి నూమని బంచుకొన్నావు
కన్నతల్లి యెడందఁగనలు ప్రేమంపు
దెన్నులు వీకెట్లు దెలియునో స్వామి!
యిచ్చినరంగఁడే యేలెవటంచు
బద్ధునీతులు సులభముగ బల్కెదవు?
పుత్రుండు బచ్చెన బొమ్మయో! వాని
గాత్రంబునందున గలుగదో యుసురు
పంకందు బోకార్చి భజనలోఁమునిఁగి
యిసుమంతయును మదినెరియకున్నావు
నీయెదరాచట్టో! నిష్ఠుర వజ్ర
మో! యిదె భక్తికి పూర్ణఫలంబో
పాండురంగఁడె యింతపని చేసినాఁడు
ఖండించినాఁడు నాకల్పవృక్షమ్ము
తనపైని నా భక్తి దక్కువైనదియొ
బనిబూని నాపాపఁ బలిగొన్నవాఁడు
కరుణాకరుండట! కల్లరిమాట!
కరుణావిదూరుండు గమలావిహారి
జవరాలి దైవదూషణముతో మనసు
వివశమై ప్రేమమ్ము వెనమూరిబోవ
కుంభకారుఁడు గన్నుగోవలయందు
జృంభింపఁగా గోపరేఖ—శరీర
మాపాదమూలంబు నాకంపమొంది
పాపీ! నావాని బంధరివాథు

గలుషించి నిందింపఁగడఁగితివేమొ?
దలఁగు మిచ్చటనుండి దౌర్భాగ్యురాల!
హరిదూషణము సేయుపట్టి మొగమ్ము
బరికింప గతికి నోర్వఁగఁజాలనంచు
తనచేతిలోఁ జక్రదండమ్ముతోడ
వనితను మర్దింప వచ్చినయంత
నలినాక్షి తనభర్త నడవడిఁజూచి
వెలవెలనయి వేరు వెరవులేకున్న
 నన్ను ముట్టినను నా నలినాక్షునాన
యన్న దా మాటతో నాతఁడు రుద్ధుఁ
డై —మంత్రనష్ట వీర్యంబైన యట్టి
భీమసర్పము పోల్కి నిట్టుగ రోషి
దండమావలవైచి తరుణార్కనేత్రు
ఖండిత భక్త వికారవిస్తారు
నారదముఖపూత నాదావతారు
ఘోర సంసారసంకుల నిజదాస
బంధవిమోచన ప్రవణవిలాసు
నంధకాంతక భావనాంబర తరణి
శ్రుతి మహాచిత్త భుక్తిమౌక్తికము
నతమౌని మానసానంద స్వరూపు
నైక సిద్ధాంత లక్ష్యైకమూలమ్ము
శ్రీకామినీ కుచపీఠవినోద
తాండవ నృత్తరాద్ధాంతైకరణకు
యోగీశ్వరేశ్వరు నుపనిషద్వ్యాప
తాగృహ్యమాణుఁడౌ దక్షిణనేత
పాండురంగనిమూర్తి భావించికొనుచు
నందెకమ్మలుమూసి యొకమూలయందు
చేరిన జనులెల్ల—చెప్పనులేరు

వారివారికిదోచు భంగిని బలికి
కొన్నారు—వారెల్ల గుంభనిర్మాత
యన్నవ దుఃఖమ్ము నతనికాగుండె
జేసిన నడత, విచిత్రమిందేమి
యీసంసృతినెబడి యిది పరమార్థ
మనుకొని—పిరిగెదు మలిన జీవులకుఁ
గననౌనె—యున్మత్త కరణి—బాలకుని
భంగి—పిశాచమ్ము భాతి వర్తించు
జంగమదైవమ్ము జ్ఞానివర్తనము,
నతివ కడుపుకోత యారనేలేదు
నతని సమాధికి యింతమేలేదు
ప్రతికృతివిధమున బాషాణమట్లు
మతియెల్ల రంగసంస్మరణైకమగ్న
మైమఱచుండంగ, మానిని విగళి
తామర్షయైషణి తాపేశమునను
పతిదైవమును దిట్టుపఱచిన యఘము
పతికై కళరణంబుఁ బండరినాథు
వితగదూరిన యట్టివిధము చింతించి
మతిననుతాపంబుమల్లడిగొనఁగ
సకలపాపంబుల శాంతింపఁజేయ
నొక హరిస్మరణమే యోపునటంచు
బతియించుచున్నది బరమర్షిహృదయ
మరవిరాజిత రుచి మహాత దీపమ్ము
రంగని నామ మంత్రమ్ము సంసార
భంగుర సౌఖ్యచాపల్య రోధకము
మగనికి దింధిపై మమతయేలేదు
మగువకు భజియింప మడిబుట్టలేదు
అమ్మ! నా కాశలే యన్నంబువెట్టి

రమ్మని ఎల్బునర్భకుఁడింకలేఁడు
చిటుకననగానొక్క చీమయులేదు
గుటియంతయును గయికొన్నదిశాంతి
యరుదెంచె సంధ్య కోశాంబర ముఖర
పరవిహంగమరత్నవలయమంజీర
తరడోకి భక్తిముష్కరమైననిష్ఠ
జెరుపంగవచ్చు నచ్చరకన్నెభోశె
నతఁడు జలింపలేదా కుంభకారు
సతిగూడ తనదు నిష్ఠనుమానలేదు
కిరణకేసర ఘటాస్ఫురితమంజీర
బరతెంచెఁ పూర్వాద్రి భాగమ్మునుండి
హరి దనరాకచేవల్లలనాఁడి
బరువెత్తఁదొడఁగెఁ దిమిరగజఘటలు
నడునెత్తిపై నిల్చి నలిపిప్రియుఁడు
గడిబిమ్మై జగములఁగాల్చుచున్నాఁడు
నాకుంభ కారుహృదంత రమందు
శ్రీకరనిజదయా శీకరంబులను
జిలికి, భావాతీత చిద్విలాసముల
వలయక రంగఁడే యాడుచున్నాఁడు
పరమపాతివ్రత్య భరిత కుమ్మరిత
దిరదైవతధ్యాన పరవలోఁమునిఁగి
తనువావదెలియదు దరిసెనురేయి
తనువెలిగించు జాక్కలచీరఁగట్టి
తనులువిప్పఁడు కుంభకారుండు వనిత
గనుదోయి శోకపుష్కర నిరుద్ధమ్ము
మటిదెల్లవారెను - మధ్యాహ్నమయ్యె
బరతెంచినది రాత్రి ప్రత్యూషమయ్యె
మగఁడవలసమాధి మానవేలేదు
మగువకు శాంతికామడ దూరమయ్యె

సూరియవ్వలువచ్చి యువిదను టీకి
యూరార్పఁదొడఁకొని యున్నది కాల
మెందుల కీరీతి యాఘఁగుమగుచిచి
గొందలపడెదవే! కోమలి! యేడ్వ
జచ్చిన కొమరుండు వచ్చునామేమి?
జచ్చినవారితోఁ జావఁగానౌనె?
యనుచు వాపోయిన యక్కుకుపోదె
వనితకు నేఁడుగాఁదట్టినదేమి?
యున్నమగఁడుగూడ నొక్కఁడేపోరి
దన్నుగాదని మూగతనముగై కొనఁగ
నావేధవారికి నర్థమేగాదు
నావెలఁదులు నూత నాశ్చర్యవిహాత
హృదయలై పోదురు గృహముల గుఱిచి
సుదతి ప్రాణేశ్వరుజాచను చూపు
కానలలో నొక పేయిగోర్కెలుదూగ
మనసులో ప్రేమమున్మత్తమైరేగ
బలవంతముగ నైన బలికింపఁదలఁచు
బలికింపఁదలఁచెడు భావమ్ముతోనె
నిలువెల్ల బులకించు నీవవృక్షమ్ము
గళమందె కన్నీరు గద్దలుఁట్టి
వతనిపాదమ్ములవంటఁగానెంచు
వతివపెట్టిన యొట్టు నాత్మలో నిలుచు
ధవుని గర్కృశత్తిదవయొద ప్రేలి
చివికినమోవిపైఁ జిట్లునిట్టూర్పు
మగఁడు మాటాడఁడు మగువమాటాడ
దగునెట్లుగాపుర, మంత బూబోడి
దనకు దానయి సమాధానంబుదెచ్చి
కొనిమాట లాడింపఁగోరెనుత ర్త

నదిరాత్రి వెన్నెలయావరించినది
వదలెల్ల చిఱుగాలి చలువలదాకి
గదలాడినది కోర్కె కాంతయెదంద
వదనంబుపై లేని ముదమునుదాల్చి
గనుదోయి నొక నోయగమువాల్చి దనదు
దనువెల్లవింతసౌందర్యమ్ములలుక
చిత్తరింపఁగ ఎగ్గు దత్తఱంపడుచు
వత్తలోదరి ఎదు నందకవచ్చి
నిలచి నిల్వఁగలేక బుజ్జఁగబూని
పలుకఁగలేక విభ్రమ వలితంబు
పలుకు గొంతుకలోనె దారాడుచుండ
గలపీణెవాడిన కరణి నాప్రాణ
ధనమ! గన్నులువిచ్చి దమకంబుగురియ
గనుగొనుటకునోమగాలేదొ! నేను
మూఁడునాళ్ళాయె నీమూఁననకనులు
గూడవిప్పవు! బల్కవేఁడఁబోదునర!
కలికి కోయిలగుంపు కంఠమ్ములెత్తి
బలుకుచున్నదిగాని ప్రాంతవృక్షముల
నీమాటలోఁడీఁ నేరదోస్వామి!
నామీదకోపమా! నామనస్తృప్తి!
దండింపరానన్ను దప్పుదోచినను,
ఖండ ఖండములు నాకాయంబొనర్చి
నను పైతుగాని ప్రాణములతోనిలిపి
జనవీ యకున్ననే సైపలేనోయి!
మూఁడురాత్రులుగూడ మూఁడుకల్పమ్ము
లై దప్పనామురా! యభయమొసంగి
బలికెదవో! లేదొ! బలుకకయున్న
వలపులజిలుక! నీపాదాంతికమున

వదలెదనోయి! జీవములు స్వతర్త్రు
వదసన్నిధినిమేను వర్జించుశుభము
గలుగునో! సకలకాంతల కందుఁబట్టు
దలఁచూని యెదురుగా నిలిచినదాని
పరమ పాతివ్రత్య భరము రూపొంది
ధరణికి దిగ్గిపట్లరుదారు దాని
గనుల నిండుగ నిండుకొనిన తరావఁ
దన పాదములు దోయిగమదున్నవాని
నక్షత్రప్రేషుదివ్యావతారంబు
వీక్షించెనాతండు జఱివులెత్తి
ప్రావృడంభోదంబు భంగి విపీల
మై వగలుదిగించు నాతనిచూపు
బొలుచ వంతటిలోనె బొలఁతిమేనెల్ల
బులకలే పులకలై పొంగిపోయినది
కుమ్మరి యంతటఁగూర్మి దుల్కాడ
నమ్మెలంతనుగాంచి యలివేణి! నాకు
నీపైనిఁగోపమా! నిబిడానురాగ
రూపిణి! యేల నిరూపింపునిపుడు
మనయింటఁ దిరుగుచు మాయమైచన్న
తనయుని కొఱకేడ్చు తల్లియెడంద
తలఁచికోపింతునో! ధ్వని! నేనొక్క
శిలగాను హృదయంబుగల మనుష్యుఁడను
యిచ్చినక్లే యిచ్చియిప్పుడు మరలఁ
బుచ్చికొన్నాఁడు నా పుత్రునటంచుఁ
గమలోదరునిపైనఁ గాకసేయుదునా?
ప్రమదా! దగ్గొలిచెదు భక్తులనెపుడు
మాయావిదూరులఁజేయనేజూచు
వాయరు క్రమఁడు భాగ్యమ్ములు, బుత్రు

లను బంధములదగుల్కొననీడు వాని
బనివడి మెల్లగా వదలించునిజము
కమలాక్షి! యదియనుగ్రహమని గాక
భ్రమపడి కీడుగాఁబరికింపదగునె!
మరణించినట్టి కొమరుపైన మఱవా!
యఱ మఱినలుగంగ నరులు గాలంబు
ననుసరింతురు దప్పదవశులై, మృత్యు
వనునది తెప్పవచ్చునె? యేరికైన!
కావ నేనెవ్వరిపైన కోపంబు
బూనుదునే! యింక బూర్ణేందువదన!
అతివరో గడుపు చిచ్చుగలింపనీవు
బతితపావనుఁడైన బండరినాథు
వీత గదూరినగొంత వెతగల్గె నిజము
మతికి నదెప్పుడో మఱచితిసుమ్మ!
వగగుంద కింక నెప్పటి భంగికాంత
ముగనిల్లు దీర్చుకొమ్మ పవిత్రహృదయ!
యని పల్కఁగువలయ దళాక్షి గన్గొనలఁ
బెనగొనఁ గోర్కెలు విభుని పదంబు
లంటఁటోయిన వెన్క కల్లంతయొదిగి
దంటవుగదవె! విత్తరి! పాండురంగ
నికి ద్రోహమా! చాలు నీతోడి పొత్తు
సకియరో! నీవు నా సర్వేశుపేర
నొట్టుపెట్టితివివ్వ, దుల్లంఘనంబు
నెట్టులొనర్తువే! యింక నీ జన్మ
మందునన్దాక బేరాసలు మాను—
మిందీవరాక్షిని తెందమ్మువందు—
నరిగఁ బ్రతిష్ఠించి నలువుమీవ్రతము
పరమేశ్వరునిదయా భరమెంతబండి
నదొ? మన కామంబు నాశం బొనర్చె

నిదియొకసాకుగా మదిరాక్షి! యనుచు
జిఱునవ్వునవ్విన సత్నిపున్నిద్రుఁ
బరమకాంతుని జూ డింతికి నంత
ధారలై యులికి నిద్దపుఁగన్నులందు
భూరిబాష్పమ్ములు బొరిబొరి కుంచము
లను బుటమెగసె, ప్రమ్లానమైనట్టి
వనిత మొగంబును వాడప్పుచూచి
యతిదురంతములగు నాగమాగమ్య
వితత మాయలకు నివ్వెఱవడి పలికె
కలికి! తుచ్ఛంబైన కామంబుపైని
నిలిపితి మనము వెన్నెలలకుఁ గఱఁగి—
గరమర్థిఁ బుడమెల్లఁ గౌఁగిలించిన
దరిసి వెన్నెల పరాత్పరుని విభూతి
వెలఁదివెన్నెల వలె నిలగల సర్వ
ములను ప్రేమించు మా పూర్ణపూరుషుని
తనువులంచును సుంత దారతమ్యంబు
గమనింపఁ జేయక కల్యాణి! యపుడు
దలకొనులాభ మద్దాని బోవిడిచి
నలుపుదురే తుచ్ఛ సంతానకాంక్ష'
నన్నంత మొగమెల్లఁ జిన్నవోయినది
యన్నుల మిన్నకు, నధరంబుగంద
నిట్టూరుపుల నింక నిలచినలాభ
మెట్టులు లేదని యింతి పెన్దిరిగె
గనులు మోడ్చెను భర్తగంజాక్షి ఘనన,
వనిత దృక్కులు మూతబడలేదు ముందు
నిలిచికొన్నాఁడు చవివయట్టి శిశువు
దలఁపుల మెదలెను దల్లికివాఁడు
చిలికిన నవ్వులు, పలికిన పలుకు

తెలయించినట్టి చేతలు, పట్టువడక
జారిన పరుగులు - బాహుపుత్రైనది
జేరినబాగులు చిత్రంబునందు
వలెఁ గొడుకా! యని బాడియావట్లు
పిలుపించినది కాని, వినలేదు భర్త
వెడలిన పంతట విమలాక్షి నోట
మడువులు మిడుగుబు వెడఁదలోఁబెటిలి
యోరి కృష్ణయ్య! వేకారి పేకారి
మారువిటోలు కుమారునొక్కరుని
గన్నామురా! నాదు గన్నులగప్పు
చిన్నయ్య గొన్నావు శ్రీ పాదములకు
వలినాక్షు! పాపని ననునెడఁబాప
వలదురా! ననుగూడఁ బైనం బొనర్పు
మవటి కే వాఁడు మాయంబైనయంత
వవల సర్వంబు శూన్యంబైనదోయి!
యెంతవెన్నెలగాయనేమి! మా పాప
సుంత నవ్వివ దాసిశోభ గల్గెడునె?
నా పాప బ్రతికి చిన్నఁగ నవ్వియున్న
పీపాడు జగమెల్ల నింతదురంత
ముగఁజీకటుల గుంపుమూఁ యుండెడునొ?
గగనంబుపై సుధాకరుఁడున్నవాఁడు
గోటి చంద్రుల వెల్గు గూడిన గాని
సాటివచ్చునె పాప చలువ వెన్నెలకు
చందురుఁడా నీకు జతగాఁడు గాడొ?
కందు - వాఁడెట్టి లోకమ్ములయందు
దిరుగాడు చున్నాడొ? తెలుపరాసుంత
పరుగెత్తి పరుగెత్తి భారమైన యలఁత
మెయివాల్చెనో? కాకమేలుకొన్నాఁడొ?

యయిన పోయనవారి నడిగి చూడుమురా!
అదియేమి! చంద్రమ్మ! యగపడుచున్న
దవికందుగాదు యయ్యాలగట్టితివో?
మాచిట్టి పాపకు మామవునీవె
యూచరా! యల్లని నోదార్చి తండ్రి!
దెలిసెనే నీ గుట్టు చలువలమామ!
యలపాప నీ యింటి యందుననేఁడు,
నీకు మా వానికి నెక్కడికోడు
లాకల్కి నగవు నీ యందు జొప్పడునె!
ఆకురాలనిచోట వలయల వాఁడు
శోకవిచోట – విశుద్ధ వాసనలు
దరుగనిచోట యే తరుణమందైన
పరభృతంబులపల్కు పారాడుచోట
ప్రతిరేణువున పాటపాడెడుచోట
ప్రతిలత లాస్యముల్ప్రకటించుచోట
సకలసౌందర్యంబు సంఘీభవించి
సకలకాలంబుల సాక్షాత్కరించి
సకలదేశముల యాశల రూపుగట్టి
ప్రకటమైనిలిచిన భవ్యలోకముల
గరుడవచ్చలుదాఁ గట్టినయట్టి
సురుచిరంబైన సుందరహర్మ్యమందు
వెండిముత్తియముల ప్రేలాడఁగట్టి
యలరులకెందూళియనువుగాఁజిలికి
కడుమనోహరముల కలలెల్ల నేయ
దుడుకుపాపని తలగడగానమర్చి
తెలిగంటిబానల దెలినగవులనె
గరమర్థితోఁ బొత్తికలుగాఁగఁబఱచి
యూర్వశిదీర్చిన యుయ్యాలయందు

సర్వలోకేశ్వరి శాంకరీదేవి
బడుకొనబెట్టి యప్పుడపుడుమరులు
గడుకొన జెక్కిలి గమ్మగాగీచి
దనగొంతులోని సౌందర్యమునెల్ల
నొనగూర్చికొని పాడియూపుచునుండ
నిదురబోవుచుమండు నిపుడు నాపాప
నిదురబోవుచునుండు నెనరు దొల్దివి
నిదురలో నాచింత హృదయమ్ముసోకి
కదలియేడ్చునొ? యేమొ కందుగన్విప్పు
చూచికోవమ్మ పీసూనునిగాగ
నాచిట్టి, శాంభవీ! నామనోజ్యోతి
బనవుచుమన్నదింకను గాంత యపుడె
వనజబంధుఁడు గొండపై నెక్కినాఁడు
వనుపడదోచిన మిహమానికంబు
కనుగాని తెల్లవాఱినదంచు దెలిపె
కువలయదళనేత్రి, కుంభకారుండు
చవిగల్గు పండరీశ్వరపదధ్యాన
మధురబలితమూర్తి మ్రాగన్నుపెట్టి
కదలనేలేదు కాంక్షవివర్జితుడు
పదతియెట్టులోయింటి పనిదీర్చె నామె
కదుగదుగున బిడ్డడాడినయల్లె
గనిఎంచు విభ్రాంతికలిత చిత్తమున
వనితచేతులుదాచు, వానికౌగిలికి
అన్నమువండనే యబగుబలయ్యో
యన్నులమిన్న, ఛాయామూర్తివోలె
నరతెంచి పతిదేవునడుగులచెంత
నిరుడ యూర్పులతోడ నిలచి, వచించె
తమ్మిరేకులువిచ్చి తడవాయె - కన్ను

దమ్ములనేమి కతమ్మున దెలుప
వుర! స్వామి పాపంబువోయిన మానె
కలపైనదేమి నీకనుమాపుగాడ
పాపఁడులేక దీనుండవైనట్టి
యీపాడుగుడిసెలో నెట్టులోఁబడగు
చున్నాను - ప్రాణముల్గమ్మఁబట్టి
నన్ను బరీక్షింప న్యాయమౌనేర!
నాలుగుదివములన్నంబులేకిట్లు
మూలగూర్చుండుటే పూన్కియో స్వామి!
నా నల్లపూసలైనను బాచి యింక
మానిరావోయి! సమాధి చాలఁడ!
నా యొరుపెల్లి కన్నయ్యతోడుతనె
మాయమైనది యింక మనలేనునేను
కనుదోయి విచ్చివేగమ్ముగాధవుడు
మనసుగరంచి యీమాటతోనప్పుడు
భావించెనంతట భక్తవర్యుండు
యోషవీక్షించి యయ్యో! నీరజాక్షి
గడచిపోయిన యట్టి గాధలాద్రవ్వి
యేఁడదమ్మలఁబట్ట నెందులకిట్లు
పరితాపపడెదవే, పరమేశుఁడొకఁడె
యరయ సత్యంబు దదన్యంబుమిథ్య
కలలోనఁ గలిగిన కందుగతించె
గలయంచె యెందుకే యలపరించెదవు!
పోయిన పాపండు పుట్టోణి! వచ్చు
నే! యెంత బలిసిన నీ యాత్మకాంతి
కెదురుటయేగాక శ్రీ కాంతభజన
మధురరసంబున మరువవే తనువు
వడె సత్యమైనట్టి యమలభవమందుఁ

గదలింప నీపాదు కష్టముల్మనసు
నన్నంబు దినకేమి హరమె నాకటల!
యన్న గదరు చింతనామృతపాన
తుందిలోదరఁడౌచుఁ దోచకన్యంబు
మందుడఁబోలె నీమాడ్కి మందితిని
వదపొడ! మేటికి భ్రమ యంచు నుడువ
మదిరాక్షి తనువు సమ్మద దంతురితము
వయ్యె ధవుండు నీరాడుట కొఱకు
నయ్యువిదయె జల మంది యిచ్చినది
జలమంది కొనియెడి సమయంబునందు
జలజాక్షి దాకండు, కరుఁడు మగండు
కడుపునిండుగ భర్త గుడిచినయంతఁ
జరతుల మిన్నకుఁడుపు నిండినది
తాను భుజించి నట్లే నెనరెంతొ
వానిపై, చేతిపైఁ బడినదో! నీదు
మరల సమాధి నిర్మగ్నుఁడై నాఁడు
కరమరుదగు కుంభకారభక్తుండు
ఓరగంటను జూచె మవిద సంసార
భారమేమియును గాఁబట్టని వాని
దనవెత్తు నింత జూడనివాని భార్య
యనుమాటయే మఱచిన వాని దనకు
నైన వారెవరు లేరనువల్లె రంగఁ
డేనిఖిలంబని యెంచినవాని
దనముగఁ దేగాదో! తలఁపు మారినదా!
వనితకు నీ క్రొత్త వర్తనమేమి
దెలియనేలేదు, వంచులనావరించి
తళతళ మెఱసె నేత్రములఁ గన్నీరు
బలచిరింతటిలోన వెఱఁగత్తి యెవరో

యలివేణి  చనులఁ జక్కిలిగింతవారమి
బరువెత్తి బయటికిఁ బావందుగాదు
పరభృతమ్మది తీపిపాటబాడినది
ఆ పాట యెదగ్రుమ్మినటులైన - బహుళ
తాపంబుతోడ వాత్యాకంపితంబు
లతికయువోలె వల్లాడగాఁ దనువు
సతినేలపైఁబడెఁ జాపకట్టుగను.
గమనింపనేలేదు గాంతుండు దీని
గమలాక్షి యంతలోఁ గన్నులు దెఱచి—
తనపాటు నొరులు జూచిన భర్తృదైవ
మనునింద పెఁపెద రనుభయంబునను
నరగునలేచి సుందరిలోని కరిగె
పరమపాతివ్రత్య ఖ్యాపైకజీవ!
కోనంబు జక్కుల కోనమై దీన
దీనయై విలపించె తెలివ యీ రీతి
మఱచి పోయిన యాస తెఱలించిచూపి
పరభృతమా! యెంతపని చేసినావె
కూయకే కోయిలా! కూయకోకమ్మ
తీయతేనియ బరువు మోయలేదమ్మ
హృదయమ్ము నీ పుణ్యమే! కలవోలె
బ్రతుకులో విన్నట్టి పావని గొంతు
తలఁపులు కెదికింపవలదె! నీ యాన
సలిపి కొందును నమస్కారమ్ము నీకు
పాడవె యొక క్రొత్తపాట యీ దుఃఖ
పీడిత హృదినెల్ల వెన్నెలతెక్క-
లను విప్పుకొని యుప్పుకొన నవస్మృతులు
వనవిభూషణమా! నా తనయుఁడు లేఁడు
యెవ్వరిఁజూచి నీ వింటపై నిలిచి

మవ్వంపుఁ బాటఁ బ్రేమమున బాడెదవు
కసుగందులేఁడు నిక్కంబుగా వాఁడు
వసియించు నందన వనములో నేఁడు
తావి పూవుల వెల్లఁ దరలిపోయినవి
యా వెన్నెలల గుంపులన్ని చేరినవి
వెల కన్నెలందరు చేఁకొన్నారు
మలయసమీరంబు నిలువ కేగినది
తలిరుటాకులును సంతన కష్టైనెపుడొ
జిలుగు సంజలకాంతి యలవీడియేగె
జలదేవతలు వెంటఁ జామరల్వీవ
వలసపోయిరిలేరు వనదేవతలును
గందు వీక్షించు భాగ్యము నోచికొన్న
నందనా రామమ్మునకు ధరాదేవి
కేమి దక్కినదింక యెల్లచెల్వంబు
నామ మాత్రంబు నాచికొన్నాఁడు
మీ కులపెద్దలు మేదినిఁగలుగు
గోకిల లెల్లరుఁ గూడికొన్నారు
తెలియలేదో నీకుఁ దెలివి మాసెనదా!
యిలనెందు కున్నావె! యింకను పికమ!
బదుకఁడు లేఁడు పో! పో! వానిగోలు
వడి నిరంతర దుఃఖభారంబునకును
దక్కనిల్చినయట్టి తల్లికనమ్మ
దక్క, స్మశాన మాధారుణి యందుఁ
బడమటి సంద్రాన బడియె సూర్యుండు
బడతి దుఃఖముమీద భరమైనపోలె!
జూచె, దృష్టుల విప్పి శూన్యదృక్కులను
వాచవలాక్షి గాఢాంధకారంబు
గవిసికొన్నది యెల్ల కదలనాత్మియ

మవు దుఃఖమే భువి వలముకొన్నట్లు
కుటిలోన చిమ్మచీకటి యంతలేచి
కువిలకుంతల యొకగ్రుడ్డి దీపమ్ము
వెలిగించె మెఱపె చఖలలోన నీరు
చిలిఎపావని మోము తలఁపునఁదోచి
తలమల్చి వీక్షించె ధవుపైపు మగువ
మలఁచి నిల్పిన యట్టి ప్రామిబొమ్మతఁడు
నా పాపఁ డింటిలోనడయాడుచున్న
యీ పగిదిని భర్త నేకాంతమందు
గనుగవమూఁ కూర్చొవనిచ్చునేమి
దనయుండులేని కతమ్మున నిల్లె
పాడువడ్డదటంచుఁ బడతి నిట్టూర్చె
వేడిగా వగతోడ పేమఱు గొనుచు
నావతి దైవంబ! పావదవత్తు
వా! పాండురంగని వంపరా! యింక
మన పాండురంగండు మఱగెను వాడె
యనినది యర్థోక్తి వట్లె మ్రింగినది
కనులు విప్పె ధవుండు గామిని యన్న
మున బెట్ట నఱతిండిదిని మూపె దృష్టి
తలె దొల్చె తరుణి హృదయములోఁదోచె
దలెదొల్చు నవ్వుడు - దన కొంగు వట్టి
బుడి బుడి యేడ్పులు ముద్దుల గురియ
వరుగుల ద్రొక్కుచో నందెలు బలుక
నత్తనయుఁడు వెంటవంటిహాతాన
నెత్తుకొమ్మని చేతు లెత్తువాలకము,
కలికింకేమి యాకలి దోచలేదు
మలపి వేసెను దీవకలిక నిల్వెల్లఁ
జలియించుచుండ వెన్నెలం బైటఁ జేరె

పలుకరించిరి చుట్టుప్రక్కలవార
లేమాటకును బదులివ్వదుగాంత
జాముప్రొద్దెక్కఁగా సంతైన నిద్రఁ
బోవ, దేమోయెంచి మూల్గుచునుండె
నావలనొక్కజా మయ్యె దాలోనె
గ్రుళ్ళుకొనుచునుండెఁ జెల్లుచునుండె
నల్లన మూఁడవ యామంబు వెక్కి
వెక్కి యేడ్చుచునుండె వెన్నెలమాగె
దిక్కుల భరమయ్యె దీర్ఘ రోదనము
అవినిశ్శబ్దరాత్ర్యంగనగూడ
నీవెలంది యెడంద నెగయించునేడ్పు
వినితుషారచ్ఛలంబున నీరుపెట్టి
కవలేకవలె మొఱంగినది ప్రాభాత
మయ్యె నీరజసమూహమ్ములువిచ్చెఁ
గుయ్యాదెమింటఁబక్షులు దానఁదెలిసి
వాని గాంచిన యంత వనిత వక్త్రమున
వాన కాళులుగట్టె బాష్పజలంబు
మొదలంటనఱకిన ముగ్ధవృక్షమ్ము
ముదిత గుభాలున మూర్ఛ వోయినది
తటుకున లేచెనా తఁడు పతిస్పర్శ
ఘటియించునో యనుకాతరత్వమున
సంబరమెల్ల నాహాకారమిచ్చెఁ
సంబినయవ్వాని భక్తినీరతకు
దేవతలెల్ల లజ్జావితుంచితులు
భావతంత్రులుమీటి పాడుకొన్నారు,
పండరినాథుడే బాష్పమ్ములలమ
గుండెలు చెదరి దిగ్గున వ్రగ్గినాడు
శాపాహతిని ధరాస్థలిఁ బడినట్టి

పావరాకన్నియ పడగెత్తినట్లు
డెవవ మూర్ఛనుదేలి – యుఱమేసురెత్తి
గరములపైనాని కరుణంబుగాఁగఁ
దిలకించె ధవుని నిశ్చలముగా ఁగలు
బలికించె నామె చూపులగమిఁజూచి
దడియొందినట్టి పెదవులతో నదుటఁ
బడిన ముంగురులతోఁ బాలినచెక్కి
ళులతోడ బాష్పకల్లోలమాలాభి
కలితంబులైన కన్నులఁదేలిచూడ
నలవిగానట్టి యాయమ మొగమందు
విలిపె నిచ్ఛలపుఁజూపులు ధవుఁడంతఁ
బ్రేమమేకోశమ్ము పెకలించవడియె
యా మహసీయుని యక్షియుగంబు
దడియయ్యె గొంతుక గడగడ వడక
నడిచెనాతడు బొత్తినావర వీక్షించి
కరుణామయూ! మనోహరి! యిది యేమి
కొఱమాలు దుఃఖమ్ము కొడుకు లేడింక
రాడువెన్కకుఁ బాండురంగని బాహు
సీడ మందునఁజేరి నిద్రఁగొన్నాఁడు
క్రొత్తదుఃఖము నీకు గ్రొత్తది! మదికి
హత్తదు – నేఁజెప్పునట్టి సత్యమ్ము
గదు బెలుసుగమందుగాని చావునకు
నెడలేదఁదలిలేదు – వెంతగుందినను
మరలిరారెవ్వరు మరణ గహ్వరము
దరిఁబనవారలు – ధవళాయతాక్షి!
నీకున్న దుఃఖమ్మునాకు లేకుండునే
నేకందు గుఱిచి – కానీ మనయత్న
మేమి చెల్లని దానికేడ్పుటగూడ

కోమలి! వితగాకఁ గూడునే ఫలము
ఇన్నాళ్ళు విలపించితేమి సాధించు
కొన్నావు! మఱిఁ దెచ్చికొన్నావొ గొడుకు?
ప్రకృతి నటింపఁ జక్రమ్మునఁ బోలి
సకలాధినేత యాచ్ఛపుఁ దలఁబూని
గనుక ప్రాప్తించు సుఖమ్ము దుఃఖమ్ము
మనమున కంటించుకొనక విజ్ఞాన
లనవరతమ్ము మాయాతీతుఁడైన
వనజాక్షు నిర్మల పాదపద్మములు
దలఁచుచు భవబంధములఁదాటి ముక్తిఁ
గలిఁకొందురు భౌతికాశాసహస్ర
శకలిత చిత్తులై - జన్మచక్రమ్ము
వికలులై దాటంగ వెరవేది చుట్టు
చుందురు - రాశులనెల్ల భ్రమించి, నంద
నందనుపై నిల్పు డెందమ్ము నీవు
పొలఁతి! లౌకిక జనంబులకు నాచిత్త
మల శిలా కర్కశంబయితోచు నీవు
నావిధంబునదల్ప ననవేమి గలదు!
పాపపక్షాములు భవరోగములకు
భేషజమిదియెచెప్పరి - తత్త్వమెంచి,
యీషత్తు గోర్కెలకెలమిలొంగినను
మనము పాశంబు దప్పును - వాఁడుచెడును
గనుగొనలేదు నిక్కంబైనరూపు
తరుణిరో! మనపాపఁ దలపోఁకొనకు
మఱచి పొమ్మికథ జరుగనియట్లె
మనపాపఁడూడిన మంచిదే యయ్యో
మనకింక సంసారమమతయే దప్పె
నీనాటికిని గింజలింటిలో లేవు

నానాథుడేమౌనా! నాగతియేమొ
యను తుచ్ఛచింతల నఖిలకాలంబు
మునిఁగిదలంపవు పూర్ణపూరుషుని
రమణి! నీ సర్వభారంబులేవాఁడు
కమలేశ్వరున కర్పణముసేయఁ గలవా
యానాఁట, కే దుఃఖమంటదు నిన్ను
గాని నేన 'ను నహంకార మున్నంత
వఱకు – దుఃఖములు దప్పవు కనుద్దెఱచి
పరిపూర్ణ హృదయంబు – పండరినాథు
నరుగులఁ బెట్టవే! యగచాటులేల?
పుడమిఁజూడు మనెన్నిపుట్టియున్నవియొ
ప్రాణులు వానికెల్లనుఁ జూచునాఁడు
వానియాహారంబు పాండురంగండు
పుట్టించినట్టిదేవుఁడు బూరిమేసఁ
గట్టడియే! యింతకడి తిక్కఁబోదొ
నగదక్కు నేడునవాన ప్రతంబు
నోగిఁజేయ విధియించెనో! ఎవి మేఁకుఁ
దవి, యంత ధవుఁడు మాటాడెను నేఁడు
మనసు విచ్చియటంచు – మానిని దుఃఖ
మంతయు మఱచె నాయమ యమరాగ
మెంతటిదో! రమాధీశ్వరుకెఱుక——
పలికెఁ బతివ్రత భర్తనుఁ బల్కు
పులకనఁ గమఁగొని పున్నెంపుబోగి!
తిగఁగోఁ కొన్నావు తెంపుతో నీవు
నగను రెచ్చించు చాపల్యంబులెల్ల
నాకింక గోర్కెలు నశియింపలేదు
నాకందుపై యాశ నశిగిపోలేదు
గలుగు లోకంబెల్లఁ గలవెఁ గాంచఁ

గలవు నీవేమియు కష్టంబులేక
నాకింక నట్టి జ్ఞానమ్ము రాలేదు
లోకంబు సత్యంబు నాకింక తోఁచ!
పుణ్యపాప రూపులోఁ బండరీశ్వరుని
యసదృశమౌమూర్తి నభివీక్షఁజేసి
కొలుచుచే నావంత కొడుకట్లుబోవ
నలరంగడే పోయినట్లయ్యె నాకుఁ
బుత్రకుండు వెన్కకు వచ్చునందాఁక
వసమగు గాదోయి! భావము భక్తియందుఁ
బ్రీతియాగ్నిఁబోలు తపంబైనఁ జేసి
కులదీపమైనట్టి కొడుకునఁ దేక
పోదువా! చూడుము - మురళీధరుండు
నాదురవస్థఁ గ్రన్నన మాన్చితీరు
వనయామె మాటల వినలేదు ధవుఁడు
కనుఁగవ మూసి చిక్కఁగఁ జొక్కినాఁడు
మొదలఁ దోచెను వెలుంగదుకులు గాఁగ
నదె యభివృద్ధమైనది రాఁగ రాఁగఁ
గడకు దిక్కులనెల్లఁ గలయఁ బ్రాకినది
కడు పెక్కసంబయి కనుగొనరాక
నావెల్గు నడుమన నణువు
భావింపనడియొ దీపకళగా మారె
నాదీపమే యయ్యె నంతటిలోనె
వేద పూరుషుడైన విఠలుండుగమ
కలకల నవ్వులు కంచుగంటలయి
పలుకంగ మొలనూలు జిలిబిలియాడ
నిలిచిన రంగఁడు నిఖిలగీర్వాణ
కులపారిజాతంబు - కులుకుఁ జూపులను
జల్లించి యమృతంపు వెల్లువనించి

యల్లన నీకీతవనెఁ గులాలవకు
పరిపూర్ణ విజ్ఞాన! నరరూపమెత్తి
వరియించు నాదు వంశావతారంబ!
యఱమఱలేదు నీదైవతవంబు
పరిపూర్ణమైనది భవబంధములను
గెలిచితి వింక నీపాలఁతి బావలఘుఁ
కొలికిఁ దప్పింపుము - కొడుకుపైఁజింత
దలకొని మమ్ములఁదడవంగ మఱచె
వలవల్ల బోధింపు మామెతు నెఱక—
నాయము గూడ నవ్యయమోక్ష పదము
కాయంబు గానందుఁ గాని యొకింత
కాలంబు తడ కొంతకత పెల్లవలయు
నాలీల లవియెల్ల నాగూర్చునాఁడ!
నీయొట్టు విడువకు విర్ణిద్రకీర్తి!
తోయజ నేత్రి సంతుష్టుని గుఱిచి
రేవటిమండి నిర్లిప్తతాభూతి
మూఁ ముందటివలె మన్నుఁ ద్రొక్కుచుమఁ
గాపురంబునఁజేయి గల్గించుకొమ్ము
నావయి నీక్షేమ మరఁ రక్షింతు
నీమాటలెల్లను నెపుడుఁ జెప్పకుము
కోమలితో నని కృష్ణుండు మాయ
మయ్యె గోరా' యు మహాశ్చర్యమొంది
చయ్యనఁ గనువిచ్చి సకియనీక్షించి
చిఱునవ్వు నవ్వీన జిఱునవ్వులోన
కఱగిపోయెను - బావగాత్రంబులెల్లఁ
దనకు దుఃఖమ్ము ప్రాప్తముగానియట్లు
వనజాక్షి యొక వింత వాలకంబమర
మొగము వడ్డము ద్రిప్పి - మగనితోఁబలికె

నగినావు రా నేడు నాకల్వఱేఁడ!
మఱియొకసారి నవ్వర! నీదునవ్వు
సెరలలో నావగ గరగిపోవంగ
నావేలుపుల పంట నవ్వినాడిపుడు
జీవితాశయెదావిఁ జిలికినదిపుడు
చూడరండో వనసుందరులార!
నేడు నాయింట వెన్నెలచిందులాడె
మగువ కానందమున్మాదమై పోయె
నగవులే నగవులై మగఁడు దూగాడె,
పడమర యనుకోటి ఫాలభాగమున
కడునొప్పె భానుండు కాంత చిత్రకము
తళుకుల పరసీమ వలరాజుమామ
కలకలనవ్వె - చల్వల చందమామ
పాలవెన్నెలలంచు భర్తృముఖమ్ము
కోలవీక్షించెఁబూఁబోఁడి వీక్షించె
నావీక్షణమునకు వలపకేలేదు
నావెలందికి ప్రేమ కంతమేలేదు
ఎంత సౌందర్యమో! యీనాడు విభుని
సంతోష పులకిత సరస వక్త్రమున
చలువ వెన్నెల మన్న సౌందర్యమెల్ల
నలువొప్పఁ గయిసేసె నావాని మొగమో'
యను భావములతోడ సతిసయొదందఁ
బెనఁగొనెముదము దీపెలు సాఁగిసాఁగి
నడురేయి యరుదెంచె నలినాక్షికనులఁ
బొడమిన నిదురమబ్బులు తెక్కలార్చె
రమణినిఁ జూచి విరక్తుండు చాల చాల
శ్రమపడినావు కాసంతవిశ్రాంతి
నందు గన్నుల నిద్దురానెదివాడు

సుందరి! యన వింతసోయగమూని
పొలతి చూపులు నెమ్మిపురులమఁబోలి
కలయఁజూచెను కాంతు క్రమ ముఖమ్ము
పలుకఁబోయెను బాల తల్త్రిప్పెదవుడు.
చిలుకల కొలికి గన్నుల నిద్రఁదలఁచి
యీ వెన్నెలలవాక వలిప బరుండె
నా వాలకముగాంచ హర్షించె ధవుఁడు
మెలికెలు దిరిగిన పెలయేరువోలెఁ
తెలిగె యొయ్యారి వంపుల తోడి మేను——
యున్నమితములైన యువిదకన్బొమల
చెన్ను నవ్వివ యట్లుఁ జిత్రమైదోచె
కలలలోన బుసాప గనుపించెనేమొ
చెలువ వాతెఱపైనిఁ జిత్తిడి దోఁకె
నెల బాలుఁడమృతంబు నిండించెనేమొ
తలయెత్తి నిక్కెఁ జన్నులదోయి పతిక
నాకాంతఁ జూచి కామావేశమింత
పోకదు పతి కెంత శుద్ధమ్ము మనసు!
వండువెన్నెలలోనఁ బలుకంగఁ దొడఁగె
పాండురంగని సుధాభరితనామంబు
నాకులాలుడు క్రోధిమ్రాకులలోని
యాకులు వెమవెంట నలరిపాడినవి
తెలతెలనైన వెన్నెల లందె యొప్డొ
దెలతెలవయ్యె దిక్కులగుంపు జిలుగు
మొలగంట లులియంగ మొగముఁ జూపనది
తొలికొంగ చఱుల ప్రత్యూష పురంధ్రి,
చలిగాలివీచెఁ బూవుల చెక్కులంటి
యలరె ముత్తియములు దలిరులపైని
వంతఁగులాలు దత్యను రాగమురఁ

చెంతఁబందిర కాంతఁజేతుఁ దట్టి
పిలచిన పిలుపు చక్కిలిగింతలోనె
జలజాక్షి కనువిచ్చి చకితయై లేచె
కాల్యముల్‌దీర్చి నిక్కంపు భక్తుండ
తుల్యమ్ము సంసారతోయధినౌక
కమలాక్షు భజన శ్రీకారముఁజుట్టెఁ
గ్రహముగా మన్నుఁద్రొక్కుచుఁ గులాలుండు,
పడతి బండరినాథు మదినెంచు కొనుచు
వడి వడిగా నింటి పనులనుఁదీర్చె
మహితమైనట్టి గోమయ వాసనల
గృహలక్ష్మి నవ్వెఁ దీర్చిన మ్రుగ్గుతోఁ
జెదరి పోవని మ్రుగ్గుఁజెల్వ చూచినది
మదిలోనఁ బాపండు తలపెనో! యేమొ
కనులయంచులనీరు కదలి యాడినది
తనపాపడున్నఁ బెట్టిన మ్రుగ్గుకెదికి
కనులపండువుఁ జేయుగదయన్నచింత
వనిత మొగమ్ము నిశ్వాసధూమ్రమ్ము,
పమ్మిన కన్నీరుఁ జిమ్మివేసినది
యమ్ముగ్ధ, తన మగండరయునో యనుచు
బలవంతముగఁ బెనవుల నవ్వుదేర్చి
తెలి కన్నుగవలఁ జూపుల బాగుగూర్చి
కలి బొమ్మలందు వంకలు దీర్చి నుదుటఁ
బరమ పాతివ్రత్య భద్రచిహ్నంబు
కమనీయమైన కుంకుమరేఖఁదనర
రమణి నిల్చినది - కులాలునియెదుట
నతఁడెచ్చరించె మందాలస దృష్టి
నతి - నెచ్చరింపులోఁ జాయగాఁదోచె
కసుగందుచూపు దక్కని వాలకమ్ము

కనుఁగంటె నామె ముఖమ్ముపై నప్పు
దళికిన నగవు మెత్తగఁ బెదవులోనఁ
బరికించు వేరైన భావరేఖ
ఘన విషాదావాయాద్భినవానందంబొ
యనఁగ నిట్టూర్పు వీడెను. కుమారుండు
తలవంచి యాయన ధరణి వీక్షించెఁ
దలనెత్తివాడు మిన్నులవంకఁజూచెఁ
బలికె నంతట తన ప్రాణేశుతోడ
నలినాక్షినాడు గింజలులేవ టంచు
వాఁడూరిలోఁబోయి వారిని వీరి
వేడి కుండలనమ్మి వేదీర్తుననుచు
మూఁడు నాళ్ళకు సరిపోవు బత్తెంబు
చేడియ చేతికిచ్చెను దెచ్చి - దాన
మొగమెల్ల విరిసెను ముగుదకు లచ్చి
వగలునఁ దనయింటి పద్దకే వచ్చి
కొలువు దీర్చినటు - బేదలయానలెంత
లలితమ్ములెంత కోమలమైన కాంతి!
క్రమముగానాగెఁ గులాలుని వృత్తి
ప్రమదయునింటఁ బారాడఁగాఁదొరఁగె
వాని పుణ్యములు రూపమ్మెత్తినట్లు,
కూన యొక్కటిలేని కొదువయేదక్కఁ
దరళాక్షికితరంబంతయులేదు దానిఁ
బరమాత్ముఁడొకఁడె దీర్పఁగఁగలవాఁడు
తలపోయ యత్నించఁ గలికి శ్రీకాంతు
మలహరమైనట్టి మంత్రంబుగాని
పలికించునేదియో ప్రబలమౌకాంక్ష
కలదైన యా పసికందునామమ్ము
భావింప నేర్చునభాము యానంద

సేవధి రంగని శ్రీకరమూర్తి
నంతిటిలోనిల్చి నఖిల యెదుఁ
గాంతరూపమ్మయి కందునెమ్మోము
మఱువంగనెంచను మానిని కొడుకు
మఱచుమ రంగని నరవింద నేత్ర
యొంతఁ బ్రయత్నింపనంత గాఢముగ
వంతఁగూర్చుచుఁ బిల్లవాఁడెహృద్వీథి
నాక్రమించెను దేవునడుగులయందు
నేక్రమంబున నిల్వనీక చిత్తమ్ము
నొకనాటి మధ్యాహ్నమువిదయ వాఁడు
వికలితముఖులయి పేదుకఁ బ్రొద్దు
గడుపుచున్నారప్డుఁ గాంత, యెదంద
మడివడ్డకోర్కెతో ముట్టికొందుమర
నాయొట్టునాసామి నాకు వెన్కకును
నీయరా! నేనోర్వనోయి! నీవదుకు
నాయొట్టుగైకొని నాకీయకుండ
మాయలమారివై మఱగుచున్నావు
లేదు నాయొట్టుగాలినిఁ జేరిపోయె
పాదముల్ ముట్టుదు భ్రమచంపకోయి!
యనినంతఁ జుఱచినట్లయ్యె భక్తునికి
వినవెయో తన్వంగి! వినుఁడు రంగండు
విన్నఁగూడనుఁ గలఁ జెన్నుగానిలిచి
వన్నెచ్చరించి యీ నా పట్టు విడకఁ
బాలించువట్టుఁ బ్రీవమ్ముగాఁ జెప్పె
బాల! యొందులకుఁ జావల్యంబునీకు
వలచుము వండరీశ్వరుని యొండేమి
ఫలము 'గోరక మోక్షపదవి సిద్ధించు
వనులోన వండుకొన్నది సుధామూర్తి

కనపడె విన్నవాకలం కృష్ణమూర్తి
ఊకొద్దిధవుఁ డేమి యుచ్చరించెడునొ
యాకల్కియనెడు పేరాన గూడంగఁ
బలికెను గాంత పైపై నేమియందొ
వలపుల చిలుక! చెక్కులవన్నె వండఁ
గులుకచు దోగాడు కొనమ నాయంక
తలమునకేవచ్చెఁ దెలిపెనా! వచ్చి
కలకలనవ్వె నవ్వుల మనవాని
వెలుఁగు వెన్నెలవన్నె వింతలేతోచె
వీడెవ్వఁడమ్మ! యీ విధముగావచ్చెఁ
జూడగా నాపావ సొబఁగు లేవనుచుఁ
దిలకించితిని గళల్వలచినమోము
తలపైని నెమలి కన్నుల గుత్తిలేదు
మనవాని బుగ్గలే మనవాని కనులె
మనవాఁడె దారంగఁదనివచ్చినాఁడు
తరుణికిఁబై మాట దొరలనేలేదు
కరమూరు చున్నది కన్నీటియూట
వరికించెఁ గుమ్మరివాఁడు వామాక్షి
వరునగా వెడలె నిశ్వాస ధూమములు
మనసులో నెన్నియోచనలు రేగినవొ!
వనితఁజూడఁగ శివాలున లేచిపోయె
అప్పటినుండియు వాతని యెడఁద
నుప్పతిల్లెను చింత యువిదకుశాంతి
గలిఁగెడు వట్టి మార్గంబేమి? యామె
దలవదు రంగని దలవనివ్వఁడును
థరమైన కొడుకుమంవరమేమిజేయ
వెఱవేదిలోలోన నెఱియుచుమండె
వరుదెంచెరాత్రి పీహారకరుండు

కురుల మల్లెలబంతి కరణిఁజూపట్టఁ
గూరుచున్నారప్డు కుంభకారుఁడును
వారిజాక్షియు నింటబైట వెన్నెలలు
పాలొల్కఁ బోసిన వసుమతియందు
గాలిపాడుచునుండెఁ బాలపాటలను
తన భావలోకమే తనదిగానుండె
వనిత మౌనమ్మున - వాఁడంత దఱిసి
పలుకవా! నాతోడఁ బడఁతుల మిన్న!
వలపునఁ జిల్క తెక్కలు విచ్చినట్టు
లని యెచ్చరించిన వబ్జాయతాక్షి
కనులెత్తిచూచెఁగ్రక్కున - నామెకండ్ల
మినుకులఁగాంతులే మెదలి యాఁడినవి
వినువీథిలోనఁ దెల్లని మబ్బులట్లు,
మఱలనని మగండు మహనీయమూర్తి!
తరళ దృష్టులనె యుత్తర మిత్తువేమొ
కలికి చూపులెగాదు కలకంఠమట్లుఁ
బలుకంగవలె మది వసటలు దొలఁగ'
వనివంతలోనె వనాంతరంబందుఁ
బనవి పల్కినదొక్క పరిగళంబెత్తి
విరవాణి ఎకియుఁ దచ్ఛ్వరముతోఁగూర్చి
యరవింద నయన త్రియప్పుడూకొట్టె
భాషించెధవుఁడు శబలిత చిత్తుండు
యోషల్లలామ! నీకుండిన యలఁత
మఱువనేలేదు సుందరపాండురంగ
చరణపంకజ సమాశ్రయమునుఁగూడఁ
జేయనేలేదు వచ్చినసుతునెందొ
రోయుచున్నావు తిరుగ వచ్చువనుచు
వాఁడింకరాఁడు నీ వదనంబువందుఁ

గూడదు ప్రమదంబు క్రుళ్ళుచునిల్లె
గతియింతుపీవు - శ్రీకాంతు నామమ్ము
మతిఁజేర్పకాకందు మమతలోఁజిక్కి
యేకాంతవాసంబు నిచ్చించుచుందు
వో కరుణామయీ! యోగులు మనసు
దశేంద్ర పీలపాదమ్ములయందుఁ
జలియింపకుండ నిమ్మళం నిల్పికొనుకు——
నీకునేకాంతమే నిష్ఠురమైన
శోక మూలంబుగాఁజొచ్చె, ననేక
జననసంచిత పుణ్యచయములు పండి
కొనిన నీజన్మంబు కూనకైఁగుంది
రంగని వదలి వ్యర్థము చేసికొనుట
యంగనా! చూడశక్యముగాదు నాకుఁ
బద పుట్టినింటికిఁ బదుగురిలోన
మదిమన్న చింతమున్మురముగాఁదోవ
దటఁగొన్నినాళ్ళుండి యంతటవత్త
మింటకు - నన్నలయాంపకే! చూచి చూచి
యనలేక ననలేక ననుచున్నవాఁడ
వినుము నావల్కన్న విభునిముఖమ్ము
దిలకించెఁ బొమలెత్తిబొలఁతి యాయతకుఁ
దళతళమెఱయు వెన్నెలయందు స్పష్ట
ముగఁదోచెఁగాంతుని ముఖమండలమున
నెగచు కప్పనవంత మొగిళుల గుంపు
మఱుమాట పల్కడెప్పరమయ్యెనతికి
సరి యని యూకొట్టెఁబరమ పతివ్ర
తలకు - నాథునికన్నదైవమెందెద్ది
తలనున్న బరువుక్రిందఁ బడినట్లయ్యె
'గోరాకుఁ' దృష్టుడై కుమకంగఁదొడఁగె

నీరజాక్షియుఁగూడ నిదుర గూరినది
తొలికోడికూసె దిక్కుల నల్పుమాసెఁ
దులసీసుగంధ బంధురములు చలువ
గాలులువీచె మేల్కాంచెఁగుమ్మరిత
యాలోనఁ గుంభారుఁడఱలవిప్పె
మన్నుఁద్రొక్కుటతోడ మధురమైసాగె
నన్నలినాక్షునామామృతస్మరణ
పడమటి దెసమొగ్గె భానుండు - నెండ
పడతగ్గె నప్పుడు భాండనిర్మాత
యాడె భార్యనుఁజూచి యతివలమిన్న!
నేఁడె ప్రయాణంబు నీపుట్టినింట
కలచంద్రుఁడంబర స్థలికెక్కునంత
వలుపుదమప్పుడే సాగుఁబై పమ్ము
వడివడినింటిలో వలయు నేర్పాటు
నడుపవే' యంచును నలినాక్షి వల్లె
యన్నదాయింటనే మున్నదివాచ
మన్నదంతయు భక్తియొక్కటేదక్క!
యున్నకుండలనెల్లనొక్కచోఁజేర్చి
పన్నమూకుడులవి నరిగాగఁదీర్చి
కోమలి యింటిలో గుడ్డయు గుడుసు
నేమూల కామూలకే మూల్గకుండ
పేరిచి తనతల్లిగారు తనింటి
పేరనిచ్చిన చెక్కపెట్టెలో దాఁచె
నిరుఁగు పొరుఁగు వారికెల్ల నుఁజెప్పె
వరశీల - తనయింటిపై బోకసారి
చూచుచుండుఁడటంచుఁజూతు మన్నారొ!
యాచేడియలు కన్నులద్దంబు ద్రిప్పు,
రేమొ! వారికినెల్ల నీపెపై ద్వేష

మామురహరుని మాయాలిఖితంబు
లిట్టి దట్టిదటంచు నెవ్వరుచెప్ప
దిట్టలు! రంగఁడే తెలియంగవలయు!
వరుణాంశుఁడంతట న స్తమైపోయె
మిఱిమిఱి చీకటుల్ మెఱసెది క్తటుల
నెలబాలుఁడల్లన నింగిపైఁబ్రాకెఁ
జలువ వెన్నెల దిశాంచలములఁదాకె
నప్పుడు కుంభారుఁడన్నంబు దిన్న
నప్పడంతియు శిష్టహవ్యంబు గుడిచె
పదపడి యింటిలోఁ బనులనుఁ దీర్చి
పడిరాశి - గుడ్డలు పట్టవంబుగనుఁ
బిఱు మూటగట్టి చెచ్చెరవచ్చి ధవున
కరుల దుల్కాడఁ బ్రయాణంబునెచ్చ
రించిన - పతిఁడు సరే' యని సమ్మ
తించి - దుప్పటమునఁదీరుగాఁగప్పు
కొని కఱ్ఱనొకటి చేఁతమఁబూనె దారిఁ
జనువప్పు దోఁశుపడుమ నమునాన,
తరుణియు నింటికిఁదాళమ్ము వేసె
పెరపుతోఁ బిఱుమూట వీపున గట్టు
కొన్న దామూట చూడ్కుల పండుగమ్యోఁ
జిన్నట్టి - తన్నయ్య తయనించువట్లు,
నడచెను మధుర శ్రీనాథనామమ్ము
నుడువుచు ముందునాథుఁడు వానివెంట
సమగమించెను చాన - యాథగీరథుని
అనుసరించెడు సమరావగవోలె
పతిఁడు భాపించె వేదార్థమ్ము బోల్కి
సతిప వెలింగె న్మృత్యర్థమ్ము రీతి—
ఖాంతవినిర్మాత వలుకు నామమ్మె

యండజయాన తీయంబుగాఁబాఁడు
నతని కంఠమునందు నభ్రముల్మొఱయు
పతిగళమున పికచయముల పలుకు
పదముల లయదట్టి భాండనిర్మాత,
సుదతి చేతులఁదట్టి చూపుఁతాళమ్ము
వెన్నెల విరిసినవేళ లోకంబు
కన్నులు మొగిచిన కాలంబునందుఁ
బలుకుచున్నది గాలి తలలెత్తియాఁడి
కలిమల హరణమ్ము కమలాక్షుపేరు
నెక్కడనేర్చెనో! యెపుడు నేర్చినదో!
యక్కలాలాని చెంత నపుడె నేర్చినది
యా కుమ్మరికి దృష్టులట మూత పడియె
నా కల్కికందమ్ము లార్ద్రమ్ములయ్యె
పద పదమ్మునఁ గొంతు వడఁకె నాతనికిఁ
బదపదమ్మునఁ ప్రేమ పండెనా కాంత
కతని పాలిటి రంగఁ డగుణుఁ డనాది
యతివ పాలిటి రంగఁడయ్యె బాలుండు
వడఁచు చుండిరి వారు గడచినదారి
మెరమల్పి చూడకఁ మిక్కిలి భక్తి
మాగు బారెను చంద్రమండలం బంత
లోగతితయఁ గులాలుడుచేరినారు
తమయూరి పొలిమేర తమయూరుఁజూచి
ప్రమదంబు తోడ నాప్రమదకుఁ గనుల
తెలతెలవాఱ తమ్ముల వొల్కివిచ్చె
గిలకొట్టె మనసులోపల బాల్యఖేల—
లప్పుడు దానొక యచ్చెరకన్నె
గువ్వలు దివ్వలో కోర్కులు మదిని,
దెలివచ్చు విడని వాతెలు - పెనుదుఃఖ

ములఁ గుంది కందని ముగ్ధజీవితము
నెలనవ్వులందు వెన్నెల తువ్వలాట
లలితలు నొసలిపై నదియొక్కకాల
మిపుడు దా, దారిద్ర్యమే గొన్నరూప
మపగత కాంతి వ్యథాక్రాంత చిత్త
మూర్పుల జల్లెడ యోష్ఠంబు శోక
తూర్పాసమై కళ గుందిన బ్రదుకు
చనిపోయినట్టి పుత్రునిఁగూర్చి యేడ్చు
జనని ఎల్చుట చెవుల్వినఁబడనట్టి
మధుసూదనుని గూర్చి యిది యొకకాల
మదవద యయ్యెను హృదయంబు సతికి
నింతలోఁ దమయింటి చెంతకే వచ్చి
రింతియు మగఁడును - నెదుట వీక్షించె
నీరజ దళనేత్రి నిర్విచారముగ
నారు వెన్నెల బైట నతి సుఖనిద్ర
మునిగిన తన తల్లి తనసుతుంబులనె
గనుచున్న దానినిఁ గలలందుఁగూడ
నరులు దొలంక నమ్మా యంచునామె
పరువిడె మాతృదేవత సమీపమున
కామె దిగ్గనిలేచి యభివీక్షచేఁ
ప్రేమమ్మ మీఱ రావే యంచుఁబొదివెఁ
గవుగిటఁ దనకూతుఁ, గళ్యాణియంత
నవలోకన మొనర్చి యల్లుని వేగఁ
దన పెనిమిటి లేపెఁ దడయక యపుడు
కనుఁగవ నమ్మదా క్రాంతమ్ముగాఁగ
మామ యల్లునిఁజూచి మంచమ్ముమీదఁ
బ్రేమతో నుపవిష్టునిఁజేసి
పలుకఁ బోయెడులోనఁ బరిణయయోగ్య

జలజలోచన చారు చక్రవాకముల
దులకింప పూవ చన్నులు గదలాఁడ
నలనల్ల నటువచ్చె నా కుంభకారు
రెండవ కూతురు శీలామృతంబు
మెండుకొనంగను మృదులోష్ఠమందుఁ
దన యక్క ప్రక్కకుఁ జనుదెంచి చేతు
లమఁజాచి యేడెల్లఁడు చూత మనియె,
నా మాటతో గుండె నడచినట్లైనఁ
గోమలి తలవంచి గోలుమటంచు
నేడువ దొడఁగె నా యేడుపె చెప్పె
వాఁడెన్నఁడో - విష్ణుపదమందె ననుచు—
తెల్లెలి హృదయంబు శీర్ణమైపోయెఁ
దల్లి మనస్సులోఁ ద్రాచులు మలపె
నందఱు నేడ్వ హాహాకార మెనఁగ
క్రందు కొన్నది ధరాకాశంబులందు
విన్నాఁడు మామ యీ వేదనాగాథ
కన్నుల బాష్ప ముల్గరడులుగట్ట
విలపింపఁ దొడఁగె, వీరలమధ్య నొకఁడె
చలియింప నట్టి సుజ్ఞాని యల్లుండు
చుట్టుప్రక్కలవారు చూచి రీగొడవఁ
జుట్టుముట్టిరి యెంతఁ జూచిననొకటె
మరణంబునకు దయాభర మింతలేదు
వరమేళు నిచ్చ మార్పను వీలుగాదు—
తల్లిపల్కినొ దెంత దంటవే! నీవు
ఎల్లవానికి నింత పెద్దరోగమ్ము
వచ్చినచో నొక్క వార్తయుఁజెప్ప
వచ్చలేవో! చెప్పి వచ్చియే యున్న
తెక్కలుగల్గి వ్రాలెదు వారు లేరా!

యక్కటా! ఎల్లని హతమార్చినట్టి
కౌగిలితోపచ్చి కాయగోల్పడ్డ
తీగ పోలిక నిల్చితే బిడ్డ! యెటులఁ
గనుఁగొందునే నిన్న టనుచు కూకురునఁ
దవతల్లి యొడిలోనఁ దలఁజేర్చి యేడ్చు
చున్న దేమంచు నిచ్చును మ త్తరము!
న న్నలినాక్షితో నవ్వుడు పవచెఁ
జెలియ లో యక్క! యా చిన్నిపాపండు
నిలపై నిఁ బ్రదుకు వాఁడే గాఁడుతల్లి!
యా నవ్వుపోరలేమి! యామాటలేమి!
యానిగారపు చూపులందమేమమ్మ!
మనుజ మాత్రుఁడె వాఁడమర్త్యుఁడే నిజము
మనకు దక్కునె వాఁడు మందభాగ్యులకు
బూచివచ్చె నటన్న బుడిబుడి బరచు
నా చెల్వమే పాపలందున్న దింక—
వాఁడరా చిన్నయ్య! యాఁడరాకృష్ణ
యాఁడరా నావాఁడ! యన్నప్డు ఘల్లు
ఘలుమంచు మొలనూలు పలుక పెన్నెరులు
వలికంబుపై నాట్యమాడుచు నుండ
వనమయూరము పోలె వాఁడాఁడు నపుడు
కన్నులున్న వారెల్లఁ గరగిపోవుదురు
వాఁడు మాయంబయ్యె నేడింక నెవ్వ
రాఁడెద రోర్వగా నతిభరమయ్యెఁ
బాపని తల్లికిఁ బలికె నో చెల్లె!
నా పుణ్యఫలము చిన్నయ్య చేతలనుఁ
గలచి కన్నులయందు నిలుపకే నీవు
తలముక్కలయ్యెను - కాకలేవమ్మ!
పోయిన గాథలు పోనిమ్మ మరల

యూర్పుమంటల యనుభవంబులకుఁ
గెదుకకే! తాపంబు గదురు నాగుండె
చెదరు వసంబేది జీవ పంచకము
బ్రిదులు మఱువనిమ్ము ఎల్లని పోదె
బ్రదుక నిమ్మిక నన్ను బట్టనుఁ గట్టి'
యని యింతలో దిక్కులనుఁ దెల్పుగూరె
దినమణి పొడసూపు దిశజొత్తు మీరె
నాదినమంతయు నంగలార్చుటయె
లేదింటిలో కాంతి - లేశమ్ముగూడ
మఱుదినమయ్యె నావరకు నొకింత
పరితాప భరము ముప్పురకునుఁ దగ్గె
మఱిరెండు దినముల మఱచిరి చింత
తరళాక్షి చెల్లెలు తల్లియుఁగూడఁ
గన్నతల్లి మొగానఁ గళ గూడలేదు
చిన్న పాపని చింత యున్నట్టి మగఁడు
తనుదాకఁ డనెదు చింత కరుణలేకఁ
దనయునిఁ ద్రొక్కనేయను చింత తనకు
సంతాన మింతనేదాయ యన్జింత
సంతతి లేనట్టి జన్మంబు వ్యర్థ
మనుచింత పోయినఁ దన సంతందుఁ
గనుఁగొను మార్గమే మనుచింత యన్ని
చింతలే, యెవరితోఁ జెప్పనులేదు
వంత బ్రింగనులేదు భామిని యింత
మంచంబుఁబట్టు మన్మాదమే కొదువ,
చంచలాక్షి మనస్సు చచ్చినపావ
పనటయొక్కటె బాధపఱచెడు వంచ
జననియు సోదరి యనుకొన్నవారు
కాని, వారికి - లోని కత యేమి యెఱుక!

దీన దివములైన దృక్కులతోడ
శోకమే యింటఁ గూర్చున్నటులున్న
యాకూఁతు వీక్షించి యమ్మ వచించు
నెన్నాళ్ళు చింతింప నేమిలాభమ్ము
ఎన్నపాపం డింక వెనుకకు రాఁదు
రాతల్లి! ప్రబల కర్మము దాట నెవరు
నేతు రన్నంబును నీరును విడిచి
పెద్దప్రాణము నిట్లు పెతఁబెట్టఁ దగునె
వద్దంచు బిడ్డలేవదు – బంగవడును
తళ్ళు దగ్గుత్తికఁ దల్లినిఁ జూచి
క్రుళ్ళియేడ్చును బిడ్డ కూఁతుమఁ గనుచు
బావురుమని మాతృదేవి శోకించు
నేవారు పరిఁచేతు రీ హృదయములు
దళె ముందుఁగూర్చొను లలన – కన్నీరు
పలవలగారు చెక్కులవంటి యన్న
బిందదు తిన్నట్టులేమొ నటించు
సుందరి యంతలేదును చేయికడిగి
మణిల నేకాంతమే మణపురావట్టి
మురుచిరాకారుని మానుని గుఱిచి
తలపోఁతయే బొమ్మవలెఁ, బెమమూగ
వలెనుండుటయె మార్పు నలానంతలేదు
మగఁడందమా! జ్ఞానమదిరా ప్రమత్తుఁ
డగ పడందెన్నఁడు వగపున నాతఁ
డలిసీలవేణి యూహలగూడు నుంత
వల వంతకుమఁ దీరుబడి చిక్కఁబోదు
రమణికి, నింక పైరణ దక్కువయ్యెఁ
గమలాక్షి విధ్యాన కల్లోలములను
మునిఁగి యాలోకమే యనుకొనవట్టి

తన ధవునిఁగనంగ మనసయ్యె నెవ్వ
రంతలింతల లేని యట్టి యేకాంత
మింతి చేరెను భర్తనెలమి దొలఁకఁ-
బలుకఁడువాఁడు నిప్పులఁ బోర్లినట్టు
లలివేణి మనసు బాధాక్రాంతమయ్యెఁ
బలవింపఁ దొడఁగెఁ, గన్నులనుండి పాఱు
జలములు పతిపాద జలజము ల్గడుఁగ
నోటి మాటకుఁగూడ నోచుకోలేదా!
మాటాడ వేమిరా! మన్మథాకార!
కొడుకునుఁ బోఁగొట్టుకొని నరకానఁ
బడిన నాపై నేమి పంతమ్ము నీకుఁ
బాపఁడు లేక నేఁ బ్రదుక లేనోయి
యీపాడు దేహంబు నిపుడెఁ ద్యజింతు
నాకుఁ గైవల్యమీనాఁడు కాఁబట్టు
దాతూవయేస్వామి! యమృతత్వసిద్ధి
మఱల నాకసుగందు చిఱు నవ్వుతోడఁ
బరుగిడనేవలె బంగారుకొండ
మనయింటిలో, నేమి మాటాడవేల!
తనయు నొసంగరా దండి భక్తుండ!
పలుకు పంతకు వరవడెదవీ నాడు
పలుకనేవలెనంచు - బహువిధంబులను
విలపింప వినుచుఁ జనుల విచ్చేవాఁడు
చలనంబులేని పాషాణరూపుండు
పలికెమగోల! నీవ ర్తవంబునకుఁ
దెలుపవే యేడ్తునో! చెలగి నవ్వెదనో!
కొమ్మ! నీవాకతి బోఁగొట్టు కొన్నావె
యమ్మవాఁ బసిపాప - నెందఱులేరొ
యడిగిచూఁడవె - యెవరైన నీయట్లుఁ

గొడుకునకైఁ ద్రవ్వుకొని యేడ్చినారొ
ఎచ్చిఎల్లా! చచ్చి వెన్కకుఁ దిరిగి
వచ్చినవారలెవ్వరు గాఁనిఁగలరొ!
యొక కథఁజెప్పెద నోర్పుతో వినుము
సకల క్షితిని ధర్మసంరక్ష సేయఁ
బరమేశ్వరుఁడు బుద్ధభగవానుఁడగుచు
నరుదారఁ దిరిగెడు నట్టి రోజులవి
యొక్కనాడు సమాధిమంది యాతండు
గ్రక్కునఁ దెఱచెను కందోయి నెదుట
నిలచిన దొక్కతె పీవంటి యబల!
జలవరి పూరిత విలులితగాత్రి
కరయుగమ్మును మోడ్చి కనకాంగి చెంత
మరణించినట్టి కుమారుని శవము
పడియుండె ధరణిపై - వాఁడును నీదుఁ
గొడుకంతవాఁడె నీ కూర్మివంటిదియె
యాతల్లి యమరాగ మవనతమస్త!
చేతస్సరోజంబు చిందింపఁ గరుణ
పలికె బుద్ధుడు మాత! వచ్చినయట్టి
గెలసమేమి యటంచు, నిలజాగి మ్రొక్కి
యాతల్కి దీన దీనాస్యంబుతోడఁ
నీకరణిని వచియించె నో ప్రభువ!
తొలిచూలి నాకిది వలపులపంట
బలియయ్యెనేఁడు చేర్పడి మృత్యువునకు
నా పసపాప వెన్కకు నిమ్ము తండ్రి!
నీపేరుతోఁబిల్తు నింకనావాని
పరమ తపస్వు లివ్వగలేనియట్టి
వరములు గలవె! నాపాప నిమ్మంచు
కాళ్ళద్రేళ్ళముఁబడి కడువిలపించఁ

దల్లిని వీక్షించు ధాన్య బుద్ధునకుఁ
గనుఁదమ్ములను గిరికొనెను జలమ్ము
వనిత! సాత్త్వికులకు మనసులులేవె!
బదులిచ్చె బుద్ధుండు వలదు సంశయము
బ్రదుకింతు నిప్పుడే - పావని తల్లి!
కాని యొక్కటె క్రియ గలదు దానికిని
వీని నిక్కడె యుంచి చాన! నీవేగి
యేయింట నేనాఁడు నెవ్వరుఁ జావ
రాయింటఁ బిడికెడు నావాలుదెమ్ము
మఱియేమి వలదు కుమారుండు బ్రదుకుఁ
ద్వరపడు మన్నంతఁ బరుగిడె నాపె
వెలది! నీవలెనామె వెఱ్ఱిబాగులది,
కలదె! చావన్నదె కలుగని యిల్లు?
కట్టిన కడపెల్ల జుట్టినదామె
చుట్టి చుట్టి వడంతి సొమ్మవోయినది
గాని యావాలు చిక్కనెలేదు నెచటఁ
దావడిగిన నవ్వె తనకు నుత్తరము
మఱలి వచ్చెను వ్యథాభరిత యామాత
చిఱునవ్వు పెదవులఁ జెంగలింపంగఁ
గడువడి నుడివె బుద్ధుడు చెయిఁజాచి
వడఁతి! తెచ్చితివె యావాలంచు నామె
శిరమెత్తనేలేదు ఎగ్గువ వలిగి
యరయుచున్నది భూమి నవరాధినివలె
నప్పుడు భగవానుఁడనె ‘తల్లి! చావుఁ
దప్పించ కావనేరి తరముగాదమ్మ
జననంబె యున్నచోఁ జావును గలదు
మనమున నెందుకీ మాడ్కిఁ గుందెదవు
వందఱుఁ జచ్చెదరమ్మ! యేనాఁడొ

యుండె - యూగెడు వారలెవ్వరులేరు
మరణంబునకు లేదు కరుణయొకల్లి
పరికింపదితఁడు పాపఁడు వృద్ధటంచు
జననంబు మరణంబుఁగాన! తప్పించు
కొనగ సత్యంబుగాఁ గోరెదవేని
తెగువ వాసనలెల్లఁ దెగఁగోసికొమ్ము
తగులవు జన్మబంధముల నటంచు—
నామె హృదయకోశమల్ల విచ్చినది
ప్రేమస్వరూపుడౌ విభునిఁ గట్టెదుట
దగ్ధంబొనర్చె నంతన వాసనలను
ముగ్ధ - నాటనుఁగోలె బుద్ధచైత్యమున
భిక్షుకీ వ్రతమును స్వీకరించినది
యక్షయ నిర్వాణ మందినదామె
యరఁతివో! దీని యర్థమన్నంతఁ
ధరణి మూర్తాకృతిఁ దరలిపోయినది
మరునటి దినమందు దరఁనదామె
మరల జీవితనాథు మరియదే గాదన
వినుగెత్తినది ప్రాణవిభున కన్నాదు
వనముగాఁ గంత నావలన నీయింట
నుండు మందువా! లేదా! యొక్కటిఁజెప్పు
మండలయాన యటంచు నావాక్య
మునకామె యెదఁద గ్రుమ్మిన యటులయ్యె
వినయంబుతో శిరంబున వంచి నుడివె
జీవేశ! నన్నేమి చేయుమన్నావు
భావమే నిలువదు పరమేశుపైన
నన్నుఁదాకవునీవు నాయొట్టుచట్టు
కొన్నది యురిగాగ గొంతుకు, నిన్ను
భంగింప నాకేమి ప్రతినయా! చూఁడు

పొంగి వచ్చెడు నాదు పూవవయస్సు
విరికన్నె యేటికిఁ బరువంబుఁజిమ్ము
నరుదెంచి చుంబించునని మధువ్రతము—
వనలక్ష్మి యుత్సాహమునవేల కులుకు
దనునప్పుకొనునని తరుణ మాధవుఁడు—
నేల ధుపీసతి యెగురు ద్రుళ్ళింత
జాలి గొన్నాఁడని సాగరస్వామి
గగనేందిరకు వింత సొగసేల తుంగ
నగశిఖరంబు నెమ్మిగ ముద్దుగొనుట
కతివయేమని కోరు యౌవనంబుననుఁ
బతిదైవ మనుభవింపగ నిమ్మటంచు
అటులుండ నాస్వామి! యాశలన్నియునుఁ
దటుకున నెటుఁద్రుంతుఁ గలికతనాన!
మాట సామెత కన్నమాటనుఁబట్టి
యాటలాడింప న్యాయంబేమొ నీకు
వందుఁగొన్నాఁడు వాఁడంత లోపలనె
సుందరి! యెంతటి సోదెఁజెప్పితివె!
వన్నాతోఁ జెఱలాట భగవంతు గూర్చి
నిహ్నవించుట మాట నిలుకడ పేక్క-
కై వనెవ్వఁడు పరమాత్మ నిందించు
ధానితోఁ దీరును వాని తపస్సు
సర్వేశునకు నపచారం బొనర్ప
షోర్వ, నేమైన, నమ్మారకనేల
దీనవై కెదుక నాలోనేనులేను
వానియిచ్ఛయె - యింతవరకుఁ దెచ్చినది
యెంతకష్టమెకాని యేమైనఁగాని
వంతంబు వదలను భామ! నిన్నాక
వన్నాఁడు వేదురు గొన్నదికాంత

మిన్నవియుచుఁ దలమీఁదఁ బడ్డట్లు
నడలుచుఁ బరువెత్తి - యటనుండి వచ్చి
పడినది తనతల్లి బాహుబంధమునఁ
బిలచినఁ బలుకదు నిలుపదు నేడ్పుఁ
జిలుకల కొలికి కన్నులు వాచిపోయె
మఱుదినంబందుండి మంచముపట్టెఁ
దరుణి తీవ్రంబైన జ్వరముగాచినది
తనువు నానాటికిఁ దఱుగంగఁజొచ్చెఁ
దినఁగ నన్నమువోదు దీర్ఘదాహంబు
కనుల యందునె జీవకళనిలచినది
వనితకు లేదింక బ్రతుకుపై నాస
గోరాకు నిది ప్రాణ గొడ్డమై పోయె
నేరీతి దోప దింకేమైనఁగాని
రంగఁడే గతియంచు రమణి మంచంబు
చెంగటఁ దామగాచికొనియె యుండె
నయ్యది నడురేయి—యప్పుడు చెల్లెలికిఁ
దొయ్యలి తల్లికిఁ దూగుపట్టినది
కనుఱెప్పలెత్తి చూచెను ధవువైపు
వనజాక్షి యేదియో పలుక నున్నట్లు
అతఁడు ముందుకు వంగె వలివేణి పలికెఁ
బతిదేవ ! వేఱొక్క పరిణయమైనఁ
జేకోరా ! నాదుఁ జిన్నికుమారుఁ
డాసతి కడుపునందైన జనించి
మన యిల్లు పరమపావన మొనరించు
ననుచుఁ దోడనె కన్నులను నీరునిండె
వనితకేడ్చెదు నంత బలమైన లేదు
మనమేమొ బిట్టుగాలినది - తాపమున
నేమంచు నుత్తరమివ్వగా వలెనొ

యామగనికిఁ దోచ కటునిటుకునికె
వంతలో హృదయంబు వందుండి యెవరో
కాంత! కానిమ్మని కదువదిఁబలికి
రతఁడు దిగ్భ్రమఁ జెందె నన్నవారెవరో!
పతిత పావనుఁడైన పాండురంగండె!
మగనికి నిదియెల్ల మాయసై దోచె
వగవా! యాశ్చర్యమో! మొగమునవ్రేలె—
వరధనుర్జ్యానాద పరిభీతయైన
హరిణి విధంబునఁ బరువెత్తినాఁడు—
నెల్ల చింతలు బాసి నేకాంతమునకు—
నల్లనఁ గనుమూసె నపుడు పురంధ్రి
తెలవారెనింటఁ బనులు పొగుచుండెఁ
జెలియలి కన్నన్న జీతె నబ్బోలఁతి—
ఎలచివదే చెలియలికిఁ గొండంత
ఫలము తొందరగాఁగ వచ్చినదామె—
చెయిఁజాచె నక్క - విచ్చిన చూపుతోడఁ
గయికయిఁజేర్చి ప్రక్కనఁ గూరుచుండె
జ్వరమెంతఁ జేసెనే పాడుదటంచు
వరవాయి గొనుచు సోదరి యామెమాట
విని యల్ల నవ్వెను వనిత - యద్దానఁ
గనపడె నూరు భావములు గుత్తులుగ—
నామాట యీమాటయైన దర్వాత
సీమంతిసీమణిఁ జెల్లిలిఁజూచి
పలికె నేవన్నటో మెలఁత నీకెంతఁ
గలదొ ప్రేమము నేఁడు గనిపెట్టవలయు
నాదొక కోర్కెయున్నది దానిదీర్తొ!
లేదొ! తెల్పవె!యంచు, పేమ, యందికొని
నాకు నీకును భేదమే కొల్దిలేదు

నీకోర్కె దీర్చుచు నాకోర్కెయక్క!
చెప్పవ నీకేమి సిగిలేదేనిఁ
జెప్పుమ దేదియో చెలువారవిందు
వన్నిది, వెంటనే యక్కమొగంబు
గొన్నది ముదముచేఁ గ్రొంగ్రొత్తకాంతి
చెవిలోన నాకోర్కెఁ జెప్పెదినంచు
ధవళాక్షి తనదు సోదరి మస్తకంబుఁ
గరమొద్ది యల్లదగ్గఱఁ దీసికొనుచుఁ
తెరచేతఁ జెవిపైనిఁ దెరచిన కురులు
వెనుకకు ద్రోసి చెప్పినది యామాట
తననవ్వు పెల్లనే దఱిగిపోయినది—
వినఁబడ లేదక్క! వినిపింపు మఱల
ననెచెల్లె! తిరుగఁజెప్పనుఁ బూనెనక్క
చెలియ! బావనుఁ బెండ్లిసేయ కోవమ్మ!
కలకలనవ్వ గజ్జెలమ్రోసె పతికి—
ప్రక్కలుబ్బ కొనంగఁ బడివడి నవ్వ
నక్కకుఁ జెల్లెలి కొక్కచే నవ్వ
నవ్వులుగాదె యన్నది యక్క పాప
నివ్వగవలెనీవు నిజముగా నవుచుఁ
జిఱునవ్వుచునె చేతఁజెయివేసి—భగిని
పరువెత్తినది ఎగ్గు తలముకొనంగ
కాంతకు ముదము వెగ్గలమయిపోయె
గంతులు వేత మన్నంత యుత్సాహ
మలము కొన్నది దేహమాద్యంతమపుడు
పులకరంబులఁగొనె గులకరంబులను—
కనులు మూయగలేదు కనలేదు నిదుర
పెనఁగొన్న పెదుటనే ప్రేమంపుఁగలలు—
పరి క్రొత్త పెండ్లాము పరియాచకంబు

చిఱునవ్వుతో విని చిత్తంబు కరగి
కౌగిలించెను తనకాంతుఁడు చెల్లె
కౌగిలిలోననే కరగిపోయినది—
ముద్దులు వెఱవెఱ్ఱి సద్దులు ప్రేమ
ఒద్దిన బాసలు దీదిరించుటలు
వదెవచ్చె - దిగివచ్చెనంతలో నొకఁడు
త్రిదివమందుండి ధాత్రికిఁ—శ్రమమూర్తి
యెవ్వరయ్యావిఱయ్య! యేయూరుమీది
యవ్వనాతముమాది - యమరుండనేను
యెఱుగవే యింతలో మఱపుతాకినదా!
తరుణి! నీ చిన్నారి తనయుండనేను
మఱలివచ్చితినమ్మ! మమతతోనిటకె
యరుదార నీస్వనకై నాను కొడుకు
నమ్మవు నాఁడు పెద్దమ్మవునేఁడు
నమ్మవా! నమ్మ నన్నాఁడు సూనుండు
రార! నా కన్నయ్య! రతనాల బరణి!
రార! నా ప్రాణమా! రస సాగరంబ!
నాఁడు పోయిన వాఁడు నేఁడు వచ్చిడివి
కూడిందలేదురా కొడుక! నిప్పిడి
పాడుఁబొతెను వాడచూడరా! కౌగల
తేఁడు పూయని యట్టితేయ విధాన—
నీవు లేనట్టి దానికి, నింకనూరఁ
గావలఎనయంతఁ గళగల్లు లెమ్మ—
ఓఎకంబుల గుంప! ఓయళిబాల!
పాపఁడు వెనుకకు వచ్చినాఁడమ్మ!
రండు రండిక సుధారాగముల్పాడి
పొందు - జీవితముఁబున్నెముల్మొలవ
పకపకమని నవ్వెభామ మొగమ్ము

వికసింప - నానవ్వు విన్నది తల్లి
యెన్నాళ్ల కెన్నాళ్ల కింతనవ్వినది
పున్నెంబు లెల్లనుఁ బొంగినయట్టు
లని యద్భుతానంద జనితవేగమున
జనని - వేగమ్ముగా సాగి వచ్చినది
యెందుకే నవ్వెద వేమియానంద
మందితి వీవాఁడటంచుఁ బ్రశ్నించె
నేమి లేదన్నదా యెలనాగ కాని
యేమి లేకేమి యా కోమలి హృదయ
నందన వనిలోని మందార విటప
సందోహములను వాసనలు విచ్చినవి——
మఱిరెండు మూఁడు నాళ్ళరిగిన యంత
దరుణి, యొక్కదినానఁ, దల్లి సమీప
మునమండఁ గ్రాలుచూపులనెత్తియామెఁ
గనినదా దృష్టులఁ గనవచ్చెనెమొ
మాటలాడెదుఁ గోర్కె మాతృదేవియునుఁ
బోటి నెమ్మది తలంపున గ్రహియించి
జరుగుచుఁగొంత దగ్గఱియెఁ - బ్రేమమున
గరములఁ దనతల్లి కంఠమ్ముఁ బెనచి
దడిచూపుఁ గలుప ముత్తమ్ముల నామె
యెడఁద భూషించుచు నెలనాఁగ పలికె
వినవమ్మ! నా దగు విన్నపం బొకటి
మనవిఁ జేతును నీకు - మదిదాచలేను
నేమందువో! తీర్చవేమొ! నా హృదయ
కామితమను కంకఁ గలగుండుపడుచు
నాలోనె తలపోసి వగయుచున్నాను
తాళఁజాలనె! వంతఁదల్లి! నేనింక
నెట్టులుగాని నీవిదేర్పవలయుఁ

బిట్టికోరిక - నాదు జీవముల్నిలువ
దలపుఁగల్గినయేనిఁ దప్పదునీకు—
నిలుపుమీ! నాచన్న నిందుకాపురము
నిలిపి కొమ్మలపైని నీకన్నకూఁతుఁ
జెలియలు సమ్మతించినది నాభర్త
యనుమతిఁగొన్నాను నమరెనన్నియును
వనజాక్షి ఊఁ యనవలయు నీ వాకతె—
దాచనేటికి నింక దయతోడనీవు
నా చెలియలినిచ్చి నలువొప్పుచుండఁ—
బరిణయంబొనరింపవలె - నాఁడుధవున
కణమరఁజేసిన యటులైన ధరణి
నిలువ నమ్మాయందు నిబిడ బాష్పంబు
కలిత నేత్రాబ్జయై కడుదైన్యమొంది
విలపించుఁ దనకూఁతు వీక్షించి మదిని
దలముగాకుండఁ జింతలు వేలుపెనఁగ
నేమాటఁ జెప్పకే యా మాతృమూర్తి
ప్రేమార్ద్ర బాష్పముల్ బిరిగొన్నఁ గనులఁ
గనుఁగొనుదును లేచి కడువడిఁ జనియె
మనమున జికటారి మలపినట్లయ్యెఁ
గలికికా శోకతోఁ గందుమొగమ్ము
దిలకింతు ననునాప మలికితమయ్యెఁ
గడచెనా దినమెల్ల గనకాంగి యొక్క-
కడియైన నన్నంబు గుడువనేలేదు
తననాథుఁడొకసారి దరిపెనమివ్వఁ
దనయంబు నేకాంతమందు - రమించఁ
దనతల్లి యేమను కొనినదో గాని
తన మాటకేమి యుత్తరము రాలేదు
తల్లి సమ్మతిలేకఁ దండ్రినివడుఁగఁ

చెల్లదు తనకోర్కె సిద్ధింపఁబోదు—
చెలియలే మనసు పెద్దల చాటుపిల్ల!
వెలిబుచ్చినది తన వలపు తీరేమొ
వడఁతి కెట్లును సేయఁ బాలుపోలేదు
యెడఁద యేయాశల కెడమీయలేదు
తన తల్లి గనిపట్టు తరళ నేత్రముల
నినుచు నీరంబులు నిర్భరప్రేమ
వివశయౌ మాతృదేవియు బిడ్డ కలఁత
నవలోకనమొనర్చి యలమటఁగుందుఁ
గాని చెప్పదు తనకడచూలిఁ గుఱిచి
యేనిత్తు నివ్వ నంచే మాటగాని—
మఱుదినమంతట దరిసె నన్నంబు
నరివడదయ్యెఁ గూఁతురికి నీగతికిఁ
దాళ లేదింక నా తల్లి మనంబు
గోల! యేటికె యిట్లు గ్రుక్కెదవూర
తలపెద వలయింతువమ్మ! యందఱను—
ఫలియింపఁజేతు నీ తలఁపింకలెమ్మ—
పచ్చపచ్చగనీవు - ముచ్చటగులుక
వచ్చింపు లక్ష్మివై యలనల్లనింటఁ
బారాడ నేర్చినఁ బదివేలు తల్లి!
తీరెనే యనుకొమ్మ తెలుప నీకోర్కె
యికలెమ్మ మాయమ్మ! యిందిన యంత
యొకకడిదినమంచు నుద్విగ్న హృదయ
దఱిఁజేరవచ్చె చందనశీతలమ్ము
కరమెత్తి ప్రేమ సుందరముగా జనని
దాకిన యంతట నా బిడ్డకమృత
శీకరములు మదిఁజిందె నట్లయ్యె—
నలఁత సర్వము మాయమైనది - కనుల

నిలిచె సజీవుఁడై పిల్లినకందు —
గృహపతిఁ బ్రార్థించెఁ గేలొగ్గి నెలఁత
దువాత కోరికఁదెల్పి తోడనె యతఁడు
సమ్మతించెను నెట్లు సమ్మతింపఁడు
సమ్మాధవుఁడు సర్వమాడించుచుండ!
జరిగె నేర్పాటులు పరిణయంబునకుఁ
దరుణి జ్వరమ్మునఁ దానయితగ్గ
శీతల వైరాగ్యాసక్తభావుండు
చేతస్సమాధాన సిద్ధిదక్షుండు
జ్ఞానైకఖని, కుంభకార భక్తుండు
తానేమో, తపమేమొంగా, నుండెఁగాని
పట్టించికొనఁడు వల్పంబును మదికి
నిట్టలంబుగరేఁగు నింటి సంబరము
పరిణయంబొనరింప వలయు దినమ్ము
వరుదెంచెఁజిరునవ్వులై కుంభకారు
తొలిభార్య వేడుకఁ దొంగలించినది
కొలపంబు వెలయు గన్నులతోడిపొలఁతి
వడుగడుగుననామె కళలయందుఁ
బొడసూపెరాఁబోవు పుణ్యదినంబు
లిఁకఁగొంతసేపులోఁ బీడేరుఁబెండ్లి
వికసింపఁ జిరునవ్వు వెన్నెల చలువ
లడిఁగ్గు బోదరి - యరుణహస్తములు
తడఁబడ - భర్తకుఁదలఁబ్రాలుపోయు
దలఁబ్రాలు కోసంతవ నఁగుఁ బెండ్లి
దలముగాదెవరికిఁ దప్పింపసైని
విదప సూమడు గల్గఁజిన్న చెల్లెలికి
నెదనున్న కోర్కెలే యొత్తినమూర్తి
తులగ పిల్లఁడువాఁడు, నిలువఁడెచ్చోటఁ

గలయఁగ్రుమ్మరు నెల్లెడలఁ జిక్కకుండ
వడసాలలో వాఁడె బయటమవాఁడె
నడువీథివాఁడె, యంగడియింటవాఁడె
యనుకొన్నదీగతి, నంతలోవలనె
కనులముందటనిల్చెఁగందు సమ్మోద
పరవశమైనది పగటివేళలనె
కరముపెనంగొనఁగలలకు మదఁతి
కనులయంచుల నీలికాటుక దిద్ది
ఘననీలవేణిఁ జక్కగ నావటించి
జడవేసి బొక్కెమ్మునిడి తావిపూలు
ముడిచి గావిరిబొట్టుముద్దుగాఁదీర్చి
తళుకు నెన్నుదుట బిత్తళిబొట్టువెట్టి
చెలియలిఁగ్గై పేసెఁ జెలువప్రేమమున
నీలిచుక్కల చీర నీటుతో కర్ణ
మూలముల్దాకుచూపులకోడఁ దీగె
వలెనటునిటుఁదూగు బడుగుమధ్యమునఁ
వెలది వెన్నెలడుల్పు వెలఁదినవ్వులను
జెలఁజిక్కరాలేని తెలుగున అవికె
దెలఁజిక్కి నక్కని త్తరవుఁజన్నులను
గిలుకు గిలుక్కంచు నలుపుగాఁబలుకు
పలుకున వలపుఁబ్రాబలుకులఁజిమ్ము
జలపట్టి యెదఁబట్టి చక్కిమెట్టియలఁ
బలుమరునెలగించు బాజుబందులను
నిలువెల్లఁదొడకెడు నెలసగ్గుతోడఁ
గలకలలాడు ముక్కరతోడ సొగసు
లమరినదానిని నతివలమిన్న
భ్రమర మానని నవప్రసవంబు చేతి
తాకు సోకని యటితలిరు సంపేధ

శోక మెఱుంగని శుద్ధరత్నమ్ము
రుచిచూడఁబడనివారుణీ భర్తృపుణ్య
నిచయముల్మగుడగా నిలచినరూపు
పరిక్రాంత పెండ్లికూఁతురిని జెల్లెలిని
పరిపరివీక్షించుభామ - యేమంతఁ
బరువమ్ము జిమ్ముసోదరివాలకమ్ము
తరుణి యెరుంగదు తనమదిలోని
యారని యాశలే యరిది కాంతులమఁ
గూరిమి చెల్లికిఁ గూడుచునంచు,
దరిసెను లగ్నమంతట - దేవగణము
పలికించె దివినుండి భక్తుని పెండ్లి
యున్ననల్వురు పెద్దలొక్కచోఁజేరి
పన్నుగాఁదీర్చిరి పరిణయ మహము
మరునాఁడు నింటనందఱుఁజేరి వేడ్క
సరసంబులాడెడి సమయంబునందు -
నొకయవిదితమైన యుద్విగ్నరేఖ
మొగమునఁ గనుపింపఁ బున్నెంపుఁబ్రోవు
నల్లుని వీక్షించి యన్నాఁడు మామ
చెల్లెను పెండిలి చెలియలినక్క
నొకచెట్టునకె కట్టియుంచితినోయి!
యొకతీరుగా నరయుము భేదభావ
మందక నిరువురి యందున నీవు
ముందున, కింకనేమున్నదిమాకు
నాన, మీకాపురమన్నివిధాల
వాసికెక్కినవదే పదివేలటంచు
నాపల్కులకుఁ దథాస్తనెనల్లుఁడెవరో
పాపము! తను పట్టి పలికించినట్లు
మామమోదించె సమ్మతికిఁ గొండంత

యామనుష్యునకైన యర్థమే వేఱు
నల్లుఁకైనట్టి యర్థమే వేఱు
నెల్లపన్నాగంబులిందిరేశునివి,
అమృతంబుచేనిండి నట్టి కుంభంబు
ప్రమదాకృతినిఁదాల్చి పారాడునట్లు
క్రొత్తజవ్వనమూను కొన్నట్టిభార్య
యుత్తమశీల! తన్నుద్వీక్షఁజేసి
ధవుఁడనునాసఁ జేతఁనల్లఁదిరుగ
నవజిత కాముడై నట్టియాతండు
పరికింపఁడేమియు శిరమెత్తి యామె
పురపురఁబొక్కి సంబరమెల్లవిడచుఁ
జెలియలి యెడఁదలోఁజిందించెధవుఁడు
వలపుఁగ్రొత్తేనెలు వాఁగానవ్వఁ
దొలిభార్య పుత్రుండు దొలిచూలుగలుగు
నిలునింపుఁగ్రొంజాపు కళికలనంచు'
నవ్వినతనయక్క నాతి వీక్షించి
త్రవ్వినఎగ్గులై, తధ్యమ్మువలుకఁ
దడమాడి, చివ్వునఁదాటుఁదా వెంటఁ
బడునక్క, సమ్మోదభావాభిరామ
చెప్పవే! సత్యమ్ము ఎగ్గుల గిలక!
కుప్పవోయవె! మదిఁగోటిరత్నాలు
ధవుఁడుదాకెనొ! ప్రేమదట్టాడుకొనెనొ
జీవరసై యుండెనో సంబరములు! మ
దీయ భాగ్యమ్ముదోకించెడు నట్టు
లీయింటఁబుపాపయెల నవ్వుగలదొ!
వలుకదే మాట చెల్లెలు, మూఁగవోలి
తలవంచి, బొటవ్రేలిధరణిపై వ్రాయు,
లజ్జాభరమ్మునలలితాంగి, వలుక

మజ్జగించిన దన్నయుల్లమై యక్క
పలుమారువింత నెపమ్ముల నడుగు
తెలిగండ్ల చూపులే పెఱవయు త్తరము
జరిగె నీరీతి వాసరములుగొన్ని
మఱువడ్డ మాటల మనసులతోనె
యిరువుర కొక్కనాఁడే కాంతమందుఁ
దరుణంబు సాధించి, తల్లివీక్షించి
కూరిమితోఁ బెద్దకూతురుపలికె
దీతనే కద పెండ్లి తీరెనుకోర్కె
చెల్లనేరని ముద్దుఁజెల్లించి నాదు
మల్లము నమ్మోద పుల్లంబొనర్చి
నావమ్మ! నీ ఋణం బావంతయైనఁ
ద్రోవనేరను తల్లి! పావిత్ర్యవల్లి!
యిన్ని దినంబులు నిచ్చట నెలమి
మన్నార మింక మాయూరు చేరంగ
ననుమతి యియ్యవే యమృతమయాత్మ!
పనిపాటు లేక మీ పైఁబడనెన్ని
దినములు తోషంత్రు! తినుచుఁగూర్చొన్న
జనయాత్రి! కొండలైనను నిల్వఁగలవె!
కలిగినవారమో! కై యాడ నోటఁ
గలదు భోజన మింతఁ దెలియనో నేను
తిగెకుఁ గాఁశే వ్రేగొను యందా!
ఆగతి యిపుడేమి యంటివదమ్మ!
కాలుసేతులు మాకు గట్టిగా నున్న
నేలిలనైన జీవించెద మెచట
నుండిన నీకన్నయువిదలె గదవె
యొండాడకుము వంపుముమ్మలికమ్ము
దక్కి యాయూరేమి దగ్గఱ కాదా

ప్రక్కనున్న దెగడ   రాకపోకలకుఁ
గలదొ కష్టము! చూడఁదలఁచిననెంత
వలయు యత్నమ్ము రావచ్చునులెమ్ము
మము పొగనంపుము మన్నించి  యన్నఁ
గమలసమ్మితవక్త్రి - కరుణార్ద్రహృదయ
జనయిత్రి దుఃఖాత్మ భాషణములు  తనదు
మనమునఁ దలపోసి  మఱిమఱి మెచ్చి
తన భర్తకునఁజెప్ప  యనుమతిఁదీసి
కొని యంత నిశ్చయించెను ప్రయాణమ్ము—
ఒక పుణ్యదినమందువికచనీరేజ
నికర సమ్మర్ద గంధిలశరీరుండు
మలయసమీరుండు, మదమంథరమున
మలసెడువేళ  కుమ్మరి బయల్దేరె
దనయూరి గుఱిచి  యాతనివెన్కనిజ్యా
రనుగమించిరి పత్నులలపక్రమముగ—
నొడిబాలు దాల్చిన యొరపుతో  ముగుద
వడలతో మదులఁబ్రేముడి తొలుకాడ
వనుసరించెడు కూఁతులను వీక్షసేసి
జననియు, జనకుండు, చలువయై యెదలు
తడికండ్ల  వీఁక విల్చెదము తల్లులార!
వడి వడిఁబొండింకఁ దడవగు  ననిరి
నంతఁ బితరులకు  నవమాన వినయ
దంతురితములు  చిత్తమ్ములతోడ
నిరువురు కూఁతులు శిరములువంచి
యరుదార గావించి రభివందనమ్ము
లిఱువురి శిరముల నెలమి దీవెనల
విరులమ్మఁ బితరులు కురియించి రప్పు
డప్రతిమాన దివ్యజ్ఞాన కాంతి

దీప్రుండు గతఖేదదృష్టి నిధ్యాన
మధుమత్తుఁడితర దుర్మానవవాక్య
బధిరుఁడల్లుఁడు భక్తిభరితుఁడై వెట్టె
దండంబు – మామకత్తకు వారి మదినిఁ
బండరినాథు రూపములుగాఁదలఁచి
అల్లు – విజ్ఞాన సంపుల్లపీక్షించి
యల్లనల్లనఁ బల్కెనప్పుడు మామ—
సెలవు మాకిక – సాగవలయునుద్రోవ
నిలావదీరదు పొందు నిరతంబు మీసు
ఖమ్ములే కాంక్షించి తలగుండువడెదు
మమ్ము మర్వకుమయ్య నెమ్మనంబందు—
నప్పుడప్పుడు సేమముమరంగ మాకుఁ
తెల్పుచునుండుడు – చెవులపండువుగ
వినఁగందు – మిపుడు మా ప్రేవులుదీఁ
పెనవైచితిమి గళంబునవీకు నేమి
చేసననైన నీ చిత్తం బటంచు
భాసురమూర్తి కుంభారుండు శాంతి
దలుకొత్తు చూపులఁ దవరవీక్షించి
వలికె నిర్వరియందుఁ బాటింతునమత
వలరింతు నిజము దివ్యానంద మొసఁగి
దలరకుఁడని యంతఁదారు పంతృప్త
గని దువాతలతోఁడ గడసారిగాఁగ
వెనుకకు మఱలెదమని చెప్పి సారె
దలమల్పి చూచుచు దైన్యంబు గొన్న
దలిపుల మగిడిరి తల్లియుఁదండ్రి —
నడువఁ దొఁడఁగెనంత నలినాక్షవదని
గడిత చిత్తుఁడు కుంభకారభక్తుండు
వానివెన్కనుఁ బెద్దభార్య పవిత్ర

మానవ యటువెన్క మదనసామ్రాజ్య
వరకేతనంబునుఁ బరుడించు వెలఁది
నరసత్రపా విభూషణ చిన్నభార్య
యడుగడుగునయందు నతఁడుచ్చరించుఁ
దశయుత నిందిరాధవునినామమ్ము
నామధుదిగ్ధమైనట్టి నామమ్ము
కోమలు లిరువురు కూర్మితోఁ బాడు
దురు వారి పాటకుఁ దరువులనున్న
వరపుష్పములు త్రపా భరితంబులగును—
సిరీతి మధుమస్మరారాధనైక
ధీరచిత్తులు వానిదివ్యస్వరూప
మెదలలోఁ బొదలనమ్మదముఁ బొందుచునుఁ
గడిపిరి – తమ యూరుగలి విరవాతులు
వారిఁజూచిన యంత నూరిలోనున్న
వారిజాక్షులు గుంపుఁ జేరినా రచట—
కనుగిచె నొకతె ప్రక్కనమన్న యట్టి
వనితనుఁగని, యామె కమల నవ్వినది
నవ్వుగాదది త్రాచు నంజు మున్పెలఁతి
నవ్వులలో ఏవనాళి చిట్లినది
పరమేశ్వరుఁడు దయాభరితుఁడై సృష్టి
కరుదార నొసఁగిన వరము, హాసంబు
దానిలో రేఖగాఁ దనరుచునుండు
వాని తేజం,బెవ్వఁడేని నిష్కలంక
భావంబుతోనవ్వ – వాఁడెయానగవు
లోవెలపెడుఁ – బరరూపు నర్చించి
నట్టివాఁడటుసేయ నట్టిదులెల్లఁ
గట్టదులై చెడఁగందురు నిజము
పాడులోకంబు తత్త్వంబు మాహాంప

దాడెదు - నున్మత్తమైన తాండవము
కామధేనువుపాలు కలువలతేని
యామని వెన్నెల యమృతంపుసోన
నందనారామ మందార వాసనలు
చిందంగ, కెలఁకులశీతలకాంతి
మలయింపఁదగినట్టి మధురహాసములఁ
జిలికించి కోడెనాగుల దొడ్డవిసము
నవ్వెదరేమి యానందమో జనుల
కవ్విధిఁజెలరేగి నవ్వుటలందు—
నొకతె గిరెను మరియొక్కతె చేయి
నొకదాని మూతి ముందుకువచ్చె నొకతె
గికురించె నొక్కతె మొకము చిట్లించె
వికట దృష్టులతోడ నొకతె వీక్షించె—
నెందులకో వీరికింత విడ్డూర
మిందరకేమి గావించిరివారు
కొఱగాని దేమి యక్కఱలేదు భక్త
వరులకూరక వచ్చి పడును వైరంబు
వదియెల్లవాని మాయావిలాసంబు
వదిలించఁ గదకు వీశ్వరుదెయాముదుల
దిన్నగా నిలుపేరి కొన్నారువారు
కన్నులఁ దడిగ్రమ్మె కందులేనట్టి
యిలుఁజూచి పెద్దదానిల్లాలి కతఁడు
చలి యింపలేదు వీసంబై నగాని
తొలుకటి వలెనెమరల మన్నుద్రొక్కు
కెలసంబుసాగె లక్ష్మలబాతియింటఁ
దిరుగాడఁ జొచ్చిరి కెఱవలిద్వరును
జరిగెఁ గొన్నాళ్లు దెప్పరమయ్యెఁ జిన్న
భార్యకు మదనతాపమ్ము విజ్ఞాన

ధర్యుందు పతియొక్కతూరి గన్నెత్తి
కనినదిలేదు పల్కినది లే, దరుల
పెనఁగొనఁ గోపించినదిలే దేమి
కర్మమో యనుబాధ కందిపోయినది
నర్మగర్భము గాఁగ నాతికన్బొమలె
యందించె నాయూహ నక్క, కామెతను
గ్రందు కొన్నది చింత కడకొక్కనాఁడు
చెలియలినొంటిగాఁ బిలిచి - లేనగవు
లలనల్లఁగంటి తెప్పల నప్పళించి
కొనుచుఁ జెల్లెలిచెక్కుకొనగోట మీటి
వనిత యల్లడఁబల్కె - బ్రాయమే నేర్ప
వలెనమ్మ! యన్ని యూహలు బేలమాడ్కిఁ
దలఁకుదురే! యిట్టి చెలువంబు నడవి
పాలుసేయగ నీకు బోలునే! మగలు
జాలిఁగొందురె! చెల్వ! సమయమీకున్న
నగవుల నడపుల నవలోకనముల
బిగువుఁల బ్రియురాండ్రు బ్రియులగరంచి
కరమర్థి సుఖియింత్రుగాని నీమాడ్కి
యడిమిడి నుందురే యనుచు నాలోనఁ
జేరిన నగవొక్కసారిగాఁ బొంగి
నిరేజముఖి కండ్లనిండెను నీరు
కరుణాభరితయక్క! కడువడినీర
చెఱఁగున నాసీటి కణగలనొత్తి
వచియించె నీరేయి - భావైకనిపుణ
ప్రచుర విలాస సంపదలు దట్టాడ
దరిఁజేరి నీదుచిత్తమ్ములఁగూడఁ
దరళ విపీల నిష్ఠుర కటాక్షములఁ
బూనిచి - చూడుము వానిపై వునకు

చానరో! నీకోర్కె సఫలమౌననుచుఁ
గలకంఠి యారాత్రి కమనీయగాత్రి
చెలువుగాదిద్దిన తిలకంబుతోడ
నలతినవ్వులతోడ నపుడప్డునిక్కి
జలదరించెడునట్టి చనుదోయితోడ
వడఁకు నడుముతోడ - వాలారుఁగండ్లఁ
బొడమూపు చూపుతూపులతోడ, నెదుట
నిలచినఁ - దలయెత్తినెలఁత వీక్షించి
తలఁపునెఱింగి కన్నుగామూసెవాఁడు,
నిదురించె నాయమ నిట్టూర్పుగాడ్పు
పెదజల్లి తనయక్క - వీపునఁగ్రుమ్మి
తెలవాతె మనసులో నిలువగలేదు
కలఁత యథార్థకుఁ గాంతుని దరిఁ
నిలచిన దాతండు - మెలఁత యలంత
తెలిసి తెలియనట్లు మెలఁగుచున్నాడు
ఇకఁగాదటంచుఁ బ్రశ్నించినదామె
వికసితస్మేరయై - వింతవాలకము
గనుఁగొన మెఱుఁగు ముక్కెఱగదలాడఁ
గనుచూపులందు నిక్కపురక్తిపొదల
నన్నుముట్టనటంచునానపెట్టితివి
నన్నెకాఁద! ఋణాను బంధమ్ముదీరి
నది నీకు నాకు నావంతశోకింప
మదిలోన కాని కుమారుండులేని
కొఱఁత చిత్తము గ్రుచ్చుకొనుచున్నదోయి
పరిపూర్ణ యౌవన భరముతో, మధుర
మమృత కుంభము బోలినట్టియామగువ
సుమగాత్రమైన నీచూడ్కికినితవు
గలిగింపదో! దానికర్మంబుగూడ

బలిసినదో! యింతవరకొక్కసారి
చూడ, వేగతి! యింకఁ జేదియకన్న
వాఁడు మందస్మిత ఫలితవక్త్రేందు -
వలన గంభీరంబులఖిలనెత్తి
యదాని మొగమున నిలిచి భాషించె
తెలియని దానవే తెలుప! నీకింత
పలుకంగ వలయునే! పరిపరిరీతు
లిలఁబుట్టినట్టి జీవుల కర్మగతులు
నిలుపంగఁదరమగునే! మన శీల
బేలపై యీరీతి విభ్రాంతిమునుఁగ
లోలాక్షి! విన్మనాలోఁ దప్పులేదు
పరిణయంబైన తర్వాత మీతండ్రి
వరిగాఁగఁజూడు మిద్దఱవంచుఁబలికె
నవునంటి నామాటవాత్మలోనున్న
భువనేశ్వరుఁడె చెప్పెఁబూనిక దాని
కిఁకలేదు తిరుగు, వేయివిధాలనైన
పకియ! నీచెల్లెలి సంపూర్ణపేయఁ
దగవానా! నాకు, నిద్దఱయందుభేద
మగవడదెట్లు - నేనంటినదాని!
పఁదుడుగుమటన్న నలివేణితనువు
జలదరించినది - మిన్నులు భూమిగూడఁ
దిరిగినట్లైనది దిరదిరఁదిరిగి
ధరణిపైఁబడినదా తెలవ యాలోన
చెలియలు వచ్చిచూచె దురంతశోక
దళితయై పన్నగ తరుణియువోలె
నిలఁగ్రుంగి మేనెల్ల మెలికలుపోవఁ
బలుమాఱు - నూర్పుమంటలు గ్రక్కుదాని
మొకమొల్లఁ గప్పిటిముద్దయై హృదయ

మీఁకిఁదాళ లేదంచు నెత్తిచాటంగఁ
దనుపెల్లఁజెమట చిత్తడిగ్రమ్మ - ధరణిఁ
జనఁదెంచినట్టి యా జలదేవతయనఁ
గననగు దాని, నక్కను దోడనామె
మనమెల్లఁగుమిలి పోయానది దుఃఖమున—
ననలేదు నముభవింపనులేదు, ఒలిత
వనజాక్షి పుడమిపైఁ బడినట్టియక్క—
శిరమును గ్రహాయించి కుఱువునఁజేర్చి
తుఱుముపీడ్వడుచుఁ బెన్నెఱులు నటింపఁ
దలవంచి కనులఁజెక్కులఁ బెదవులను
జలములు జాల్గట్టి వలపింపఁ దొడఁగె—
నటనుండి తొలఁగె నిరస్త సమస్త
కటువికారుడు కుంభకారభక్తుండు
వంతలింతల వారలదియేమటంచుఁ
జెంతకుఁజేరి ప్రశ్నింపరు భక్తి
తెల్లమైనదటంచుఁ దీంద్రగాఁబలికి
త్రుళ్ళింతతోడఁ జేతులు ద్రిప్పనవ్వి
రాపళువులకెట్టులవ గతంబగును
శ్రీపతి విరచించు చిద్విలాసములు!
గడచె దినంబెల్లఁ గమల నేత్రలకు
నెడఁదలు గదలించు నేడ్పులతోనె—
చనుదెంచెను ప్రదోషసమయంబు - నెఱపె
వినువీధినెల్లెడఁ బెల్లఁజీకటులు
ప్రమదా విలోచన బాష్పసంకులము
సమరంగ భుజియించె సన్నంబుమగఁడు
భుజియించిరోలేదొ! పూఁబోఁణు లేమి
భుజియింత్రు—దుఃఖమే భుక్తివారలకు,
నదియేమి చిత్రమో! యా కుంభకారు

వదనంబు నేటికి వాడుదేఱినది!
కనుగొనలందుఁ జిక్కని ముత్తియమ్ము
లనునట్లు బాష్పమ్ములలమినిల్చినవి
యిఁకఁజూడగాలేదు నిల్లాంద్రతీరు
తికమకలాడుచు దేవురించుచును—
గడువడి నొక్కయేకాంతమౌచోటఁ
దడవి కూర్చొనియె— బాధా విపన్నుండు
నిట్టూర్పు గాడ్పులు నిబిడమైరేగ
దట్టపు వగపు చిత్తమ్ము గ్రుమ్మంగ
తలపులు తీగలై మెలికెలు దిరుఁగఁ
దలపోసె నీగతి దళిత చిత్తుండు—
ఇంక దాళలేనోయి యిందిరాజాని!
సకలేశ! తారకాక్షర గుహోహరిత!
యిగఁబరీక్షించిన నిలనాదు బ్రదుకె
యగును శూన్యంబు మాయాతీతవృత్తి!
జనులకునన్నుఁ బాషాణ ప్వరూప
మునుఁజేసినావు నా పుణ్యముల్పండి
వచ్చిన భార్యల బ్రదుకెల్ల వడవి
విచ్చిన కెందమ్మి విరులఁజేసితివి—
నాయింటికొక దీపమైయుండినట్టి
యాయిసుంగును గూడ నార్పివేసితివి
యేమి చేయుదునోయి! యింత మారమణ!
నామానసంబెల్ల నలిగి పోయినది
యిగ భరియింపను బ్రదుకెట్టులనైన
వగఁదీర్చి తీసికో! పండరీనాథ!
రాతినాతిగఁజేసి రక్షించినావు
నీతియే! నమఁజేయ నిలువుబాబండ,
మనసున్నదే నాకు మగువా! యటందుఁ

బనవి చెప్పితిని నా భార్యకుఁగాని
నమ్మదు, దానిని నమ్మనిచ్చితివా!
నమ్మునెట్టులు! నామనమ్మున్నదాని
కిని గుఱుతేమిరా! వనజాయతాక్షి
చనినట్టి మతునికై వనటగుందంగ
నొకసారి గాకున్న నొకసారియైన
నకటా యటంచు నన్ననిచ్చినావా!
తలముక్కలయ్యెను త్తలపాటు బ్రదుకఁ
దలము గాదింకనెట్టులనైన నఁ - జి త్త
శాంతినొనంగు వేదాంత విహార!
పంతంబు నతునిల్పి భరియింప భ్రాఁతి
యనినంత హృదయంబు నందుండి యొకటి
వినవచ్చె వాక్కు 'పండితనది నీకర్మ
తడలేదు ధైర్యంబు దలగకు - మొట్టు
విడువకు మని దాని విన్నాఁడొలేదా!
ననచెల్లనెట్లుపోయినదా! సంతోష
మునను జెంగించెను తనువునే మఱచి
నందుకొన్నాఁడంతఁ బండరినాథ
మందింత చిత్తంబు, మదినున్నవంత
యంతరించిన నిద్రనందె నాతండు—
చింతాతిరేక నిర్జిత బుద్ధుతైన
పడతులేమేమి పంభాషించుకొనిరొ
యొడలెఱుంగక నిద్రనొందినయట్టి
ప్రాణనాథున కిఱువ్రక్కలఁజేరి
వానిపాణి యుగమ్ముఁబట్టి పేరెదల
నదిమికొన్నారు మాయల మన్మథుండు
మదిరాక్షులను మొత్తిమానసంబుగనుఁ
గనువగలనుఁ దారకలు నుఱ్ఱుజొట్టెఁ

దనువులఁ బులకల దండడిరేగెఁ—
జనుమొనలుబ్బెఁ బంబిన నవోద్రేక
మున, తైకవిడెఁ దటుక్కునఁ గనుల్దెఱచె
మగ డెవ్వరో నిద్రనగపడి దురుసు
మగువల చెయిది సూటిగఁజెప్పనట్లు
తన హస్త తలములు తడయకఁబట్టి
చనులపై నిడికొన్న చానలఁజూచి
తటుకున దెమలించి తన హస్తములను
కటకటా! మీరెట్టి కట్టడికార్య
మునకొడఁగట్టితిరనుచునె లేచి
మనమున కోపంబు మల్లడి గొనఁగ
బలవంతమున నగ వెలయించి – యింట
నలుమూలలనుఁజూచి తళ తళలీను
కొడవలిఁదెచ్చి యీఘోరావచార
మడఁగంగఁ దగిన ప్రాయశ్చిత్తమమచు
రెండుచేతుల నప్డెఖండించి కొనియెఁ
బండరి నాథుని బానకై వాఁడు
కుండలతోఁదెచ్చి క్రుమ్మరించినటు
నిండె – గేహమునింత నిబిడమైనల్ల
వానికాబాధగాఁబట్టనేలేదు
మానన విష్టర మధ్యంబునందు
శ్రీ పాండురంగఁని జెలువుగా నిలిం
పాపాప నోదనప్రవణ! నాయఘము
ద్రోవరాయనుఁచు జేతులనెత్తి లోక
పావన వాక్కులఁ బ్రార్థించుచుండె
చూచిరిబ్బరుగూడ సుదతులు మదుల
గ్రాచెడు వాకుంభకారుని చెయిది
వకవకమనినవ్వ – వట్టినినవ్వ

వెతలినవ్వెదనెల్ల వెతలించునవ్వు
పెద్దయిల్లాలికిఁ బిచ్చిపట్టినదా!
తద్దర్శనంబునఁ దలగనినవ్వు!
నవ్వుతోడనె యేడ్పునారంభమయ్యె
కెవ్వుమంచని చావుకేక వేసినది
నిలువలేదింక నానెలఁత కేమేమి
తలఁపులు దోచెనో! తలమోదుకొనుచుఁ
బరువెత్తఁదొడఁగెను పండరిపురికిఁ 5
దఱుముచున్నట్లులెవ్వరో! వెన్కనిలచి
రమణి వెన్వెంట గోరా బారె వెఱ్ఱి
ప్రమదంబుతో రక్తరంజితమూర్తి!
యాయుర్వ్వరి పరుగునందుకోలేకఁ
గాయంబు తూగంగఁ గమలదళాక్షి
వెనువెంట నంటిపోయెను చిన్నభార్య
ఘనతరావేశవి కంపితదేహ
దళితసర్వాశ క్రోధోజ్జ్వలదగ్నికుండ
తులిత హృదయ నీలజలధరహారి
కచగుచ్ఛ కలిత జఘనభాగ బాష్ప 10
నిచయ పీరంధ్రితనేత్ర యథ్యార్థ
పదరుపల్లంబని పాటింపకొక్క
యెదటువఁబోవుచున్నది తనసుఖము
తుడిచివేసినయట్టి శోయజనేత్రు
వడుగుట కౌఁగొన్యాయాన్యాయములను!
తెలతెలవాఱె దిక్కులఁగాంతిగూఱె
కలువలకందు లోకమ్ములవిందు
జిక్కవ కవలకాయ్యోక్కడుమందు
నిక్కకెందమ్ములనిబిడకౌతుకము
గగనంబుతోడవు దిక్కునినీరమణుఁ 15

దగదగఁగమలాప్తుఁడంతరిక్షమునఁ
దళతళమనివెల్గెఁ దరుణార్కకిరణ
కలితంబులౌచు రంగనిగుడిగోపు
రముల దీపించు హిరణ్యకుంభములు
ప్రమదమ్మునిండార భక్తులందఱును
జేరిరి వాకిటఁ జిత్సుఖాధారుఁ
గోరికలూరఁగఁ గన్గొనువాసతోడ —
నామదేవుఁడు భక్తనలిన బాంధవుఁడు
నామదేవుఁడు దీన నవపీరదమ్ము
నామదేవుఁడు లోక నాయకసఖుఁడు
నామదేవుఁడు మోక్షకామినీధవుడు
నామదేవుండు విజ్ఞానసాగరము
నామదేవుండు రంగని యరిగాపు
పాండురంగని లెంక పండరీశ్వరుని
గుండె పండరినాథుఁగూరిమికొడుకు
రంగండు జరియించుశృంగారవీధి,
రంగనినవ్వులు సింగారచోటు
నామదేఁడు మహానందపూరితుఁడు
శ్రీమానినీచిత్త సేవధియైన
గోవిందునకు మేలుకొలుపులు పాడ
భావంబు చిగురింప వచ్చియున్నాడు
పలుకుపల్కున సుధాభరితంబొనర్చి
పలుకుచున్నాఁడు ప్రాఁబలుకులకోవల
మెలఁగు భావములెల్ల మిళితముల్గాగఁ
బలుకులచెలికిఁ జెక్కిలి పుల్కరింప
పరమపూతమ్ములభంగ గీతములు,
పరిపూర్ణ భక్తిభావమున మేన్మఱచి
యాడుచున్నాఁడు లయానుసారముగ

బోధిమి తనకరంబునం దట్టితట్టి,
చేరినజనులెల్ల శ్రీకాంతభక్తి
వీరుని సదమలాచారుని నామ
దేవునిఁగనుఁగొని - దేహమ్ములుబుక
భావించి, తదభంగ భవ్యవర్ణమ్ము
లనువాదమొనరించి యాతనితోన
ఘనమోదకలితులై కరములుతట్టి
నర్తించుచున్నార, నలినాక్షకీర్తి
కీర్తనారతులు గ్రిక్కిరిసినవారు
నారదాదులగు సన్మౌనులు దేవ
వారంబు - నభమున వారలుదీరి
యంతటఁజేరిన దాగుంపులోనఁ
జింతాపరాధీన చిక్కణబాష్ప
కర్దమితాంగి శ్రీకామినీరమణ
దుర్దమ మాయావిధూతవివేక—
కడుపడిగాఁ గుంభకారునిపత్ని
పడినవి చెవులలోఁ బండరినాథు
నుతులు సహింపలేదతివయొడంద
యతనినిష్కరుణతో సంగలార్చినది
యొక్కచేసారిగ హోయంచు సకల
దిక్కులు బదులివ్వఁ దివిరియార్చినది
పరమభాగవతుల భణితులునమ్మి
కరుణావిదూరు రంగనిఁబూజసేసి
చెడినాము మీరింకఁజేయకుండయ్య
దుడుకురంగనినామ దుగ్ధపానమ్ము
నాకన్నకొడుకున నామనోధనము
నాకోరికలపంట నాచికొన్నాఁడు
నాధైర్యమెల్లను నష్టమయిపోవ

నాధవుహస్తముల్నఱికించినాఁడు
నాచెలియలి యౌవనంబెల్ల బీటఁ
గాచిన వెన్నెలగాఁజేసినాఁడు
నాయిల్లుగూలిచి నాసుఖమెల్ల
మాయంబుగావించి మర్మంబులేని
గోలవిధాన యీగుడిలోనఁజేరి
మూలనక్కినవాఁడుప్రముచ్చు నేవిడుతు
వనుకొన్నవాఁడా! యేమయినఁగానిమ్ము
వనజోదరునిగుట్టు బైటికీడ్చెదను
నిటలభాగంబు నాయింతివీక్షించి
కటుకునవెల్లరు దలఁగిరంతటనుఁ
గలపెనాతలమునఁ గంజాక్షపాద
కలితచిత్తుఁడు కుంభకారభక్తుండు—
కారుచున్నది రక్తపూరంబు - తెలియ
నేరండుకుమ్మరి నిష్ఠురభక్తి
మునిగి పూజారులు చనుదెంచియపుడు
వనజాక్షమందిర ద్వారంబుదెఱచి
రాగమావేద్యు! దివ్యజ్ఞానబోధ్యు
యాగస్వరూపుని - యోగప్రదీపు
సచ్చిదానందు విశంకటభక్తి
మచ్చిత్తభక్తనిర్మలభావసౌధ
శయనై కళలు శాశ్వతుని - విజ్ఞాన
మయుఁ బాండురంగనిమరులుదొలంకఁ
గనుఁగొనెనో లేదొ! ఘనసమ్మదంబు
పెనఁగొన సురలెల్లఁ బిచ్చలింపంగ
గళమొత్తిభజన బిగ్గఱగాఁగఁజేసె
నలతయన్నదెలేని నామదేవుండు
కోదనజనులు చేతులుదట్టికొనుచుఁ

బాడిరి - పెక్కు, వ భంగకీర్తనలు,
అప్పుడుకుమ్మరి యానందభరము
కుప్పలెప్పలుగాఁగ గొంతెత్తిపాడి
కరములుదట్టఁబోఁ గరములెక్కడివి!
నఱికికొన్నాఁడు దెప్పరమైనభక్తి—
కరములులేనట్టి కొఱతకన్పడియె
పరమభక్తునకు, నెవ్వగదలకొనియె
కటకటా! నేఁడుశ్రీకాంతునిభజన
నటుసేయరాకుండ - హస్తయుగమ్ము
దొలఁగితి నని - యెంతకరుణాకరుండొ!
పరమేశ్వరఁడు భక్తుభావంబునందు
తలపోత బొదముచే తరవుగానొసఁగె
మొలవించనట్లుఁజేతులు, వానిఁజూచి
యరుదొందినాఁడు.కుమ్మరి గాఢమోద
భరమునవిలావెల్ల విరులువూయంగ
దడదడఁబరువెత్తి తడుణార్కనేత్రు
నడుగులఁబడినాఁడు హస్తముల్మోగిచి
కనఁగొనెనీవింత కమలదళాక్షి
కనులనమ్మఁగలేదు గనుకనిపాటి
ముట్టుకొన్నది శయంబులు గాత్రమందె
పుట్టినవే! యింకఁబువ్వారుఁబోడి
మనసునిల్వఁగలేదు వనజాక్షుపాద
వనజంబులందల్ల వ్రాలిపోయినది—
యలనల్లనటఁజేరెఁ జెలువంపుబరణి—
యలనశరీర ఎచ్చిలఁజ్జ కుంభ
కారునిరెండవకలికి యాశ్చర్య
పూరితయై పూర్ణపూరుషునెదుట
విలచినదూరకొదలవంచి యేమి

సలుపంగఁదోచక చంచలహృదయ—
సలుపుగానప్పుడు నారాయణుండు—
పలికెఁగుమ్మరి పెద్దభార్యను గూర్చి
తలనెత్తిచూడుము - తలిరాకుఁబోడి
చలువవెన్నెల నవ్వు సొరు గుల్కంగ
నిలిచికొన్నాఁడు నీ నెనరులపంట
జిలిబిలిపలుకుల చిన్నిపాపండు
మెచ్చికొన్నాను నీ యచ్చంబుబత్తి
కిచ్చుచున్నాను గతించినశిశువు
కై కొనవమ్మ! నీ కరములసాచి
శోకంబు విడువుము శుద్ధవిచార
సందేహమేటికి సర్వలోకంబు
లందుఁబ్రసిద్ధమైనట్టి సత్యమ్ము
పండరినాథుని భావించువారి
కుండగారాదెట్టి యుమ్మలికమ్ము
అనిపల్కి శిరమెత్తి యంతగౌరాంగి
వనజనాభునిఁజూడ వానికౌగిటను
ఘలుఘల్లుమని చిఱు గజ్జెలుమ్రోయ
చిలిపినవ్వులతోడఁ జెక్కులపూయఁ
గలకలమనుచు మేఖలనవ్వ పైడి
మొలత్రాడు నడుమున మురువుగుల్కాడ
కరములగొవలు కంకణములు మెరయ
నెఱయఁగుంతలములు నిటలంబుపైనఁ
గనుదోయినెఱిమిక్కు కాటుకపెఱుఁగఁ
దనమహానందంబు - తనకోర్కెపంట
తనదుముద్దులగుత్తి - తన భక్తిఫలము
తనపాండురంగడు తనయుండు చేతు
లెత్తి చాచుచు నుండె నెనగిన ప్రేమ

తత్తఱంబున లేచి తల్లి - బాలకుని
గరములఁగొని బిగ్గఁగౌఁగిలించినది
యరులున నిలువెల్లఁ గరగిపోయినది
చిప్పకూఁకటిదువ్వి చిబుకంబుపుడికి
యప్ప! యెన్నిదినంబులయ్యెరా! నిన్ను
నెడఁబాసి నేటికిఁగదకుఁ జిక్కితివి
యదజడియెల్ల మాయంబయ్యె ననుచు
జలజాక్షి సంతోష పులకిత యగుచుఁ
దలఁపులు మఱచి మిన్నులఁదేలియాడు
కరణి - బొంగురపట్లు గిర గిర దిరిగె
సురలెల్ల నమ్మోద పరవశులగుచు
కరతలమ్ములు మోడ్చి శిరములల్లార్చి
కురియించి రంతటఁ గ్రొవ్విరివాన—
నారదుండు సగతానందుండు బాష్ప
పూర పూరితుఁడౌచుఁ బొగడంగ దొడఁగె
నిఖిల మహర్షులు - నిబిడ ప్రమోద
ముఖరిత ముఖులు - నిమ్ముల జయాకార
ములు సల్పిరధ్యాత్మ బోధరూపునకు
ఫలితావ తారుండు - పాండురంగనికిఁ
జేరిన జనులెల్ల చిక్కఁజాశ్చర్య
నీరధిమగ్నులై నిడుగమల్వెట్టి
కనుచుండిరీవింతఁ గలిసులావహుండు
నమితసుపర్వుండు నామదేవుండుఁ
జిలువవెన్నెలలకు సైదోడులైన
యలఁతినవ్వుల ముఖమందగింపంగఁ
జనవుగుల్కఁగవచ్చి - వనజాక్షుపాద
వనజంబులందున వ్రాలినవాని
వరినరజ్ఞానంబు మఱచినవానిఁ

పరమ భక్తులకొజ్జ బంతియౌ వాని
గోరాఁ గనుంగొని కూర్మితొల్కాడ
సారస ప్రతిమ హస్తములఁదాకి
లేఎన భక్తి నిర్వేల బాష్పములు
దీపించఁ గన్నుల తీరుతో లేచి
నిలచినంతనే వాఁడె పీసుతుం డనుచు
బలికె మాధవుఁడు సుత్పలగంధి కొమరు
నందింపబోయిన డెందంబుకలఁగి
కందుఁగై కొనక శ్రీకాంతునిఁజూచి
యారీతి విలపించె నారంగరంగ
యేర మానవు దండ్రి! యింకఁబరీక్ష
నీకందునాకేల! యాశ్చర్యమేల!
నా కంఠమునఁ జుట్టినావేల మాయ!
తాళలేనిఁక మహోద్దామ! నాయోర్పు
ప్రేలినదోయి! నీశ్రీధామమునకుఁ
జేరిచి కొమ్మంచుఁ జిన్మయమూర్తి
నీరజ నాభుండు నిరుపమజ్ఞాన
పరిణత చిత్తుని భక్తునీక్షించి
పరమగుహ్యంబైన వైష్ణవమాయఁ
బరపెదుఁ జిరునవ్వువాతెఱకొనల
నరుదారుచుండంగ ననుపమజ్ఞాన
పేవధి! నీకేలచింత నావనుపుఁ
గావింపు మావంతఁగలుగదు గొఱఁత
నిత్యముక్తులుమీరు - నిత్యపవిత్ర
మత్యదీర్ఘులు - పాపమల దూషితములు
భువనంబులోమంగఁబూని - నాయిచ్చ
నవతరించెదరు మీకపవర్గ సుఖము
సందిగ్ధమగునె! నిస్సంశయమోయి!

మందబుద్ధుల లోక మర్త్యులనెల్ల
నమృత ధారాపూర్ణమైన నీ బోధఁ
గ్రమముగాఁబూతులగావించి   ఎదవ
వత్తువులే నా నివాసంబునకును
నుత్తమశీల యీ యువిద - యీ బాల
నే, నన్ను గానెంచె యెలమిఁ బ్రేమించెఁ
గాన - నీమెకుఁగూడఁ గలుఁగును ముక్తి—
నీచిన్న భార్యను  నిన్ను జేఁపట్టి
నోచిన భాగ్యంబె  బ్రోచును బొమ్మ
వికలితమానును  వెలఁది మిన్నలను
నిఁక విఁగింపకు మీ యొట్టుఁబెట్టి
యన్ని యొట్టులు నేటి కంతరించినవి
నన్నుత గుణుల నీ సకియలఁగూడి
యనుభవింపుము ధర్మ్యమైనట్టి సౌఖ్య
మనిపల్కి ప్రశ్రయ వినమితుఁడైన
యాకుంభ కారుని యొదలపైన
శ్రీకామినీ క్రీడసీమ కుంకుమము
దలకొన్నయట్టి హస్తంబుంచె, నంత
నలువొప్పఁగాభక్తనామదేవుండు
కరములు దాచి విగ్గుఁగౌగిలించె
ధరణికిఁ దొడవు కుమ్మరిబత్తుఁబ్రేమ,
దివిదీటుకొన మ్రోసె దివిజ దుందుభులు
దవులొలికించె నచ్చరల నాట్యములు
చేరిన జనులెల్లఁ జిన్మయానంద
పూరితులై —జన్మములఁ దరియించి
రచ్చెరువేల! ప్రత్యక్షదైవంబు
నచ్చరిత్రుల నేల కవతంబుబూని
కొలువిచ్చియున్నాఁడు కలియుగంబందు

బలహీనులకు దిక్కు పండరీశ్వరుఁడు
పాండురంగా యందుఁ బల్కినఁజాలు
నండనేయుండి సర్వాపదల్బాపు
వాని నామము భక్తభాగ్యరూపమ్ము
వాని నామము సర్వపాప మారకము
వాని నామము శ్రుతి ప్రవవగంధమ్ము
వాని నామము సుధావర్ష పూరితము
వాని సేవించెదు భక్తవర్యులకుఁ
గాని కార్యములేదు కల్పవృక్షమ్ము
కామధేనువు భక్తి కలితంబులగుచు
నామహాత్ముని నామ మనయంబు దలఁచు
కలియుగంబందు రంగఁడె దిక్కు వాని
వలలిత నామంబె సౌఖ్యంకరంబు

(గోరాకుంభారు కథ సమాప్తము)

———

# పండరీ భాగవతము

## నరహరి చరిత్రము

తరుణేందు ధరుని పాదంబులు దప్ప
స్మరియింపఁడెన్నండు పెఱదైవతముల—
ఫలికనేత్రుని కథాకలనంబు దప్పఁ
దలపండితర దైవతముల గాథలను—
పంచాక్షరీమంత్ర పఠనతత్పరుఁడు
పంచకేంద్రియ దర్పవారణ మల్లుఁ
డనుపమ పుణ్య కర్మాసక్తబుద్ధి
ప్రణుతింపఁ దగువాఁడు భక్తవర్యుండు
వీరమాహేశ్వ రాచారవ్రతుండు
ధీరచిత్తుఁడు సమధీత విద్యుండు
శివభక్తపద రజశ్ఛ్రిత మౌళి
భవిజన సంసర్గపాప దూరగుఁడు
సదమలవృత్తి కంసలబత్తుఁ డొకఁడు
విధిఁజేసి పండరి వీటవసించు—
నరహరి యని వాని నామంబు నైక
పురటభూషణ విధాపరిణతబుద్ధి,
వీక్షింపడింతడు, విర్గ శేశ్వరుని
దక్షవిజేతృ భక్తుం మన్యుదఁతఁడు
పాండురంగని పాదభజనంబు వినఁడు.
పండరినాథు రూపంబు గనండు
తారకమను కుహూ కారకోకిలము
తారకప్రాణుండు తరుణేందు ధరుఁడు
కరుణించునేమి? శ్రీకరరామచంద్ర
చరణాంబుజమ్ములు మఱచిన భట్టి

దురితుల శివమవస్సరసిజ భృంగ
మరయందు శ్రీగంటనై వమ హరుని
నిరవంచువారల, నిఖిలవేదాంత
పరిధిస్ఫురన్మూర్తి పాండురంగండు!!
హరిహరాద్వైత భావానందపరులు
దరియింత్రు జన్మబంధమ్ముల వలన—
ప్రతి దినమ్మును చంద్రభాగ లో శ్రుతివి
హిత భంగిఁ దానమ్ము నిమ్ముగఁ దీర్చి—
మొదలినిండుగ, బూది యొనరంగదిద్ది
మడిగట్టి, రుద్రాక్షమాలలు దాల్చి
చెలువంబుగాఁ గొండె ఎగవైచి కర్ణ
ముల రుదురాక తోగులు చలియింప
మల్లికార్జునదేవ మహాశాలయంబు
నల్లన చేరి బిల్వార్చన చేసి
వచ్చు నింటికిఁ బ్రజ మెచ్చి చూడంగ
నచ్చంపు భక్తితో నంగముల్దూగ
ఆనందవాః పూరితాక్షుండు పులక
లానిన దేహమై, యడుగడుగందు
హరహరా! మురహరాభ్యర్చిత చరణ!
తరుణ చంద్రకలాప, ధర్షితపాప
కైవల్య కోటీర! కరుణాపటీర!
భావుక భక్తహృద్వనజకాసార!
గిరిజామనోహర! గిరిశా! యటంచు
పురహరభక్త శేఖరుఁడై నవాఁడు,
వానిజీవేశ్వరి, పతిహృదయజ్ఞ
మానినీతిలకమ్ము, మన్మథవైరి
చరణనిష్ఠావిశస్వరవృత్తి, వాని
పరమపుణ్యమ్ములు, పడఁచనరూప

మిట్టుల శితికంఠునే కాంతభక్తి
పట్టిన పుణ్యదంపతులకుఁ గొన్ని
సమములు గడచె, నిశ్చలమైన నిష్ఠ
క్రమముగాఁ బాండురంగనిఁ జేరె వీరి
కొలిచిన కొలుపు ప్రాఁబలుకుల కొనల
వెలుగు దీపంబైన విర్ఠలేశ్వరుని
రూపాంతరంబె హరుండు నిక్కంబు—
ఆపదుద్ధారకుండైన రంగండు
తనభక్తు నజ్ఞాన జనితమై మోక్ష
మునకు బాధకమైన మురపురహరుల
ద్వైతభావము వాపఁదలఁచి వేచియుండె
నాతని యచ్చిక నన్యథాత్వంబు
గలుగునే! మఱియట్లు గలుగువయేని
నిలుతురే బ్రహ్మాదినిఖిల దేవతలు!
పండరిపురి నొక్కబిచ్చ ప్రార్థించి
యుండె, పండరినాథు నొడికంబుగాఁగ
దీనావన వ్రతాధీన చారిత్ర!
నానావివిధ లీల! నాదావతార!
నిన్నుఁ గొల్చెదు భక్తుడెన్నండుగాని
కన్నుల నీర్వెట్టఁ జన్నెయోచింపు!
పున్నామ నరకంబు వోఁగొట్టుకొనఁగ
నెన్న సూనుఁడుగాదె హేతువు, వాఁడు
లేకున్నచో గతిలేదు జన్మకును
నాకొక్కసుతునిచ్చి నా సోదె దీర్పు
మీ కోర్కె దీర్చి తివేని లోకేశ!
నీకొక్క నవమణినిచితమైనట్టి
మొలత్రాడు చేయించి మ్రొక్కుఁ జెల్లింతు
ఫలియింపఁజేయరా! పండరినాథ!"

యనుచు - రంగఁడు తథాస్తని వాఁడు బచ్చు
జనకుఁడై వాఁడు చక్కని కుమారునకుఁ—
గనులలోఁ దెలికాంతి గదలియాడంగ
మనము హరించు నిర్మల హాసలవము
పెదవిపై మెదలాడ వదనంబుగమిచి
పొదివిన యలకలు ముద్దులు గురియ
లలితశిరీష పేశలములు చెక్కు-
లెలవిచ్చి యరుణకాంతులఁ గ్రుమ్మరింప
పండరినాధుని పరమాను కంప
పండిన యట్లున్న బాలు వీక్షించి
యమిత సమ్మోద భారాక్రాంతుడగుచు
క్రమ విహీనములు వాక్యములు బాష్పంబు
భరితముల్గన్నులు పదములు చలన
పరములు - పులక సంపద్వ్యాప్త తనువు
మనము సాంద్రానంద మత్తంబు రంగ
ఘృణకు జీవనము పరిక్రీతమయ్యె—
నడుగులఁ జిఱుగజ్జెలల్లనసులియ
బుడి బుడి నడలఁ బాపఁడు నడయాడ
పాండురంగని దయాభరముగేహంబు
మందనమైచుట్టు మాడ్కి-భావించు
కిలకిలమనుచు నవ్వుల బండివోలె
చిలిపి పాపండు ముద్దులు జారి వోవ
నవ్విన యప్పు, డానంద నందమని
మువ్వలు మ్రోగిన నవ్వడి వినుచు,
కరతాళములకమగలముగఁ దరుణ
చరణముల్నర్తింప - శారద పద్మ
పరిభవ కారియౌ వదనంబునందుఁ
బరుగిడఁ జిఱునవ్వు బాలుండు పొందు

రంగని గుడిచి యభంగముల్వాడి
చెంగున నాట్యంబు చేసెడు వేళ
తన యింటి దీపమై దయచేసినట్టి
సనకాది ముని మనస్సంవేద్యుడైన
వేదవేద్యుండైన విఠ్ఠలేశ్వరుఁడు
బోధస్వరూపుఁడా పురుషోత్తముండు
తనసృష్టి దిలకించి తానెసంతోష
మున నాడుచున్న చొప్పున సమీక్షించు,
వణిజుఁడు తనకోర్కె ఫలియించె నేటి
కని రెండు గన్నుల నినుచు నీరములు—
నీరంబులందాడు నిర్జరపుణ్య
సారమ్ము సాత్వత, సత్త్వమహమ్ము
పాండురంగని రూపు భక్తజీవనము
పాండురంగని రూపుభవరోగహరము—
సొగసులే పులకించు మొగమెల్లనెత్తి
బిగువుగా తడిముద్దు పెట్టికొన్నపుడు—
అళినీలములు కుంతలములనొత్తి
చిలుపని ముత్యాలు జిందించునపుడు—
కలకల చలువ నవ్వులు విరియించి
తెలిపల్లెలను చంద్రకాంతినిఁ జెందునపుడు
వలపు సంపెగల ఱేకులఁబోలు కనులఁ
బొలపంబు మొలయఁజూపులఁ జూపు గలిపి
చూచిన యప్పుడు - సుమనోమనోర
ఖచితపేటి బ్రహ్మానంద వార్ధి
దివ్యబృందావన దీపప్రరోహ
మవ్యయ మోక్ష విద్యాదేశకుండు
మురళీస్వనాయితమూర్తి సద్భక్త
తరణైకయానపాత్రంబు విఠలుఁడు

తననోము పంటగా దరిసెన మొనఁగె
నని పొంగుఁగోమటి యాపొంగులోనఁ
బడవెత్తుఁ జిఱుగాలి పొరలనఁబోలి
పరమేశ్వరుని ప్రేమ బంధురాశయము—
తనసుతునకుఁ సఖిభావంబొనర్చె
వణిజుండు విర్ధబండ మను పేరిటి
వానికోరిక మోక్షపదవికే మార్గ
మైనది రంగని యవ్యాజ కరుణ
వాని యిల్లాలును వాత్సల్యభక్తి
నూని సేవించె పుణ్యోజ్జ్వల మూర్తి—
ఫలియించినది కోర్కె - పాండురంగనికి
మొలనూలు చెల్లింపవలయునో కాదో!
వారిని వీరి విచారించి బచ్చు
వీర మాహేశ్వరాచారుని స్వర్ణ
కారుని దఱిసి కాంక్షనుఁ దెల్పినంత
నూఱట దక్కి యర్ధోక్తులలోనె
హరహరా యనిలేచి యాలంబొనర్చి
హరభక్తునకు నిట్టులసమతి గూర్చ
వచ్చిన యీ పశుప్రాయుడెవ్వండు
చిచ్చరకంట విచ్చిన మంటగముల
భస్మ సాత్కృతిసేయు పశుపతి! వెగడ!
యనస్మద్విధుల తోడనా! బాల్యఖేల!
ప్రాణలింగ సమర్చనా నిమ్నవృత్తి
ప్రాణముల్వోయిననైనఁ దదన్య
సేవలు సేయునే! చిత్తజారాతి
భావింప నేర్చిన పరమ భక్తునకు
మదికెక్కునే! యన్యమత హీనకథలు
సదక వాదముసేయ వచ్చినావేర!

నందికేశ్వర పదాళిందంబునందు
డెందంబు సొగియునా వందంబులవము
శోలునే! తక్కొరుఁ బూన్చిన భక్తి!
కూళ! యెగుండెతోఁ గొనకొనవచ్చి
నావుర! రుద్రు కన్నను జగంబందు
దైవంబు వేఱున్నదా! వక్రబుద్ధి
హరి విరించులు శివు నరిగాపులనుచుఁ
బరువడి వేదముల్వలుకుట లేదా!
పరమేష్ఠి గర్వంబు పావంగఁ దలలు
తఱిగి శోపెనా! లేదా! యురగభూషణుఁడు
హాలాహలపు చిచ్చులబరం బెల్లఁ
గ్రోలంగ దివుర సురాళిఁ బ్రోవంగ
నదలించి దాని హమ్మని యాని జగము
బ్రదికించినట్టి యాఫాలాక్షు కరుణ
గోరని వారలెవ్వారుర! జడవి
చారులు నీవంటి వారలు దక్క
పశుపతి కరుణకు బాహ్యుఁడవైన
పశువ! మహేశ్వరు ప్రతినముఁ జెఱుపఁ
దలఁచి వచ్చితివి నా తల యెత్తుధనము
గొలిచిన శివుఁదప్పఁ తలయెత్తిచూడ
ననిరోష సంభృతుండయి యదలింప
విని కన్నుగోనల తనువునయందు
వినయంబు దొలుకంగ - విద్వత్తముండు
వణిజుండు చెఱునవ్వు వాతెఱయంచు
లనునిల్వ, నిట్టులల్ల వఁబల్కెమృదుల
ఫణితులు —— భవుసేవ భవరోగములనుఁ
దొలచిన పుణ్యమూర్తులు మీకు నీతి
పలుకఁగఁ బ్రాతె మావంటి మూర్ఖులకు!

నేనేమియంటినంచెదఁ గ్రుళ్ళరోష
మూనెద! రా శివునిపైని దోషంబు
నెంచితినేమి! ముగ్ధేందు ధరుండు
పంచాక్షరీమంత్ర పరదైవతంబు
దైవంబు కాదంటినో! వక్రబుద్ధి
కావరమూని భక్తప్రతారణము
సేసితినో! దేవభూసురజాతి
గాసిఁబెట్టితినో! నిష్కారణమేల
యలిగెదరయ్యా! దివ్యావతారునకు
మొలనూలు సేయించి - మ్రొక్కఁజెల్లింపఁ
దలఁచితి మిమ్ముల దక్షిణాకోర్కి
తెలియఁజెప్పితిని - ప్రార్థించితిఁదమ్ము—
కనకదామము పెట్టఁదని దీననేమి
వినయంబు కొఱయయ్యె! విఠ్ఠలేశునకు
మీసేవ గొనఁగఁ గామింపఁగారాదా!
యీసకలంబున శేలినవాఁడు
దేవేంద్ర కోటీర దీధితిస్తోమ
లావణ్యనికషోప లపద విభ్రాజి
పరమేష్ఠి భావనాంబర దివాకరుఁడు
పరమదైవంబైన పాండురంగండు
తన యలంకృతులకుఁ దగఁడా! శంకరున
కుమకు, నే పరమాత్ముఁ డౌరవడివాని
నెందింపఁజెల్లునా! నిటలనేత్రుండు
సందేహమేటి కంశమ్ము శ్రీహరికిఁ
బాండురంగని, కిదె పందెంబు సఱము
పాండురంగనియందె శివమూర్తి దోచు
శోఎంతుటో! నేను చూపింపనేని
నీపాదములు పట్టి నిటలంబునందు

ధరియించు భూతి తథ్యంబు స 'మ్మనుడు
చరణతాడితమైన సర్పంబువోలె
మొగమెల్ల జేవురింపఁగ మంటగ్రక్కి
భుగభుగ మనుచును పూత్కార మెగయ
కుపిత తీవ్రంబు భ్రూకుటి సుడివడగ
నపరాద్ధునకు నల్గి హాయనియార్చి
పలికె మాహేశ్వర భక్తుండు బత్తు
నిలుపు మీ మాటలు నిలుపుము ప్రతిన
నిలుపు మీ యిలవేల్పు నిందు గౌరవము
పలుకు నెగ్గుటయన్న పరహానమేమి?
పాండురంగనియందు భవమూర్తి చూప
కుండపీడను మఱియొండు మాటలను—
నీమడి ఫలియించునేని వైష్ణవము
మానుదు తప్పుదు నా! నిజంబన్న
కానిమ్ము! నీచేయు కనకదామమ్ము
పూనిన నియమమే పురుషోత్తముండు
గజకృత్తి ధరియించి కరపద్మమందు
వటకపాలముబూని యఱుతనెమ్ములను
హారముల్దాల్చి చంద్రాభరణమ్ము
దీరిచి చటులకార్తి యీకలోచ
నముతోడ హస్త సన్నద్ధ త్రిశూల
డమరులతోడ విట్ఠలముగఁదోచి
కొలువిచ్చునంచు నా కోమటి తనదు
పలుకుల మఱి యనువాదంబు సేసె
వీరమాహేశ్వరాచారంబు గురువా!
వీరవైష్ణవమొ నపార మీనాడె
తేలిపోవలెనోయి! తేటతెల్లముగ
బాలభాషణముల పనియేమి! తెల్పు

కనకమ్ము, తెచ్చిన మణులు, చెక్కడను
పనిఁబూని కలుదుచూపులకు వ్రేఁగుగను
మలచితి రంగని మధ్యప్రమాణ
మెఱుఁగను నీవు చెచ్చెఱఁదెచ్చి కొలత
యిచ్చినఁ దీరిచ యొత్తు పీఠము—
చిచ్చుల కనుగల్గు శివమూర్తి దక్క
పరికింప నన్యదేవతలనేనంచు
నెఱుగుదు పేరదు! మఱతువో! యేమొ!
సలిచిన పందెంబు సత్యంబుగాఁగ
నలకొల లేకుండనట్టులయున్న
దనిపల్కి యిచ్చు, తత్తస్తని నవ్వి
కనుఁగ్రేవలనఁ దృప్తి కనుపంపమ్రొక్క
పండరినాథుని పాదపద్మముల
యందమఁజేరి దుఃఖాక్రాంతుఁడగుచుఁ
దరులచే దండింపఁబడిన బాలుండు
పరువెత్తి తనతల్లి దరిఁజేరి సనవి
సనవి యేడ్చెడుభంగి వణిజుఁడు రెండు
కనులలోఁ గన్నీరు కావేరిగాఁగ,
సనకాది మునిమనోధనములు గోప
గణహృదయాహ్లాద కౌముదీరాత్రు
లంధకాంతక మానసాబ్జ భృంగములు
సింధుకన్యా మనశ్శ్రీరవి మూర్తు
లసురనాయక జీవహంతలు భక్త
వసుదానచణములు వల్లవీమాన
వశ్యతోహరములు వసుమతీమధుర
కైశ్యమండనములు కలికల్మషఘ్న
ములు రంగవిభు పదంబులు కౌగిలించి
విలపించె - నీగతి వివశాత్ముఁడగుచు

పరమదుఃఖితులు మామొఱలాలకించి
నెఱిదీర్చు ప్రభుఁడవు నీవుగాకున్న
నెవ్వరున్నారురా! యింకలోకేశ!
యెవ్విధినైన నీవే కటాక్షించి
యాపద దొలగింపరా! పాండురంగ!
యాపదుద్ధారకుండని పేరుమోచి
కడగి భక్తగణంబె కావలైతేని
కడలేని కన్నీరు తుడువవైతేని
నిలుచునా! నీకీర్తి నిర్మలమూర్తి!
తలమేదు నీ దొడ్డతనమును నమ్మి
చేసితి ప్రతిన  నాచేసిన బాస
నీసమంతైనఁ దప్పింపఁబోకోయి!
పాండురంగఁడు భక్తపరతంత్రుఁడనెడు
నిండు సమాఖ్యను నిలుపుకొమ్మోయి!
హరవిరించులకును నాదికారణము
పరదైవతమ్ము మా పండరినాథుఁ
డనెడు ప్రస్తవము తథ్యంబుగాఁజూపి
కనులకుఁబండువు గావింపుమోయి
యని మ్రొక్కి  కన్నీట నడుగులు కడిగి
వనజాక్షు మధ్యమ్ము పరిమాణముగొని
వీరమాహేశ్వరాచారునకొసఁగి
చేరె గృహమ్ము నిశ్శంకముఖుండు—
కనకదామము దీర్చెగంనలబిత్తు
మణిగణమ్ములు సెక్కిమహితమౌరీతి
నెఱసంజతేకులు నెగడెను మింట
సురమందరీ పదకోకిలాక్ష ప్ర
సరణంబువలె  కల్పశాఖి శాఖాగ్ర
తరుణకిసాలయ తతకాంతకాంతి

పరగినయటు లక్ష్మీభామినీ లలిత
చరణ తులాకోటి సంబద్ధశోణ
మణిమరీచులు మింట మసలినయట్లు,
వణిజుండు నై కథావా విష్టహృదయుఁ
డయియల్ల నల్లన నడుగులు దూల
కయిమోడ్చి యాస్వర్ణకారుని దరిఁ
నిలచినఁ జిఱునవ్వు మొలకలై పోవ
మొల నూలుచెల్లించి మొగమున పొగరు
కుప్పతెప్పలుగాఁగఁ గోమటిచూచి
యెప్పుడు దర్శనంబిచ్చెంతువన్న!
యని బిట్టు నవ్విన – నా నవ్వుతోన
మనముపత్రాచులు మలఁపవచ్చైన
కనులూరఁబారు పఱంపర బాష్ప
కణములు నారుక్మకారుని చరణ
తలములు దడుపంగఁ దలవంచి వినయ
కలితమ్ము కాంతిరేఖా మండితమ్ము
పలుకులో నుపనిషద్భావంబు మ్రోయ
పలికె నీగతి నన్నా! భవరోగహరుఁడు
పాండురంగఁడు నూత్న పల్లవకాంతి
మండితమురు జటా మధురమస్తమున—
తారకాకమన సుందర భూషణమున
హారి విపీల కంఠాబద్ధ మనుజ
కీకస హార వికీర్ణ కాంతులను
ప్రాకట ప్రమథ గర్జార్భటీ పుల్లి
తోల్లాన వాసుకి పేల్లనంబులను
మల్లికా విశదసు మధురగాత్రమున
నివ్విధ దర్శనంబిచ్చెడు నీకు—
తప్పదు దివిజ సంత్రాణ హారకుఁడు

భవమూర్తి నిక్కంబు పండరినాథుఁ
డవతంస గుచ్ఛ ఎంభాచిత మౌళి
యనుమాటతోన భక్త్యావేశ మెసగి
తనువు కంపింప నా తవకదామంబు
గొని యాలయముఁజేరి కోరికలూర
వినతాతనయ ప్రాణవిభుఁ జూచిచూచి
చూచు చూపులతోన సొగసు డెందమున
వాచా మగోచర వైభవుఁడైన
రంగవిపదముల వ్రాలి దుఃఖంబు
పొంగంగ గద్గదపూర్ణమౌ నెలుఁగు
వెడల కందదుకులై విఱుచుకొనంగ
నెడఁద చుమ్మలుచుట్ట - నేచిన యూర్పు
మంటలు తీవ్ర జిహ్వాగములై వెడల
కంటి నీరూరగ గండరువట్టు
లోరంత బ్రొద్దుండి ఓయీ! విఠోబ!!
వోరాని శోకలఁ బోయితినంచు
చేయరానిది బాప చేసితినంచు
నాయందు దయతప్పినావేమి తండ్రి!
శ్రీకాంత! నాబాస చెల్లింపకున్న
నీకు నాకునుఁగూడ నేటితోఁ దీరు
బాంధవంబని యఱవలుకులోఁ దెలిసి
బంధుర దుఃఖ సంబాధ్య మానంబు
హృదయంబు వహ్నిపరీతమైనట్లు
బెదరి, తల్లడపడి వివశుఁడై నిలచి
నిలువని దుఃఖమ్ము నిలువంగలేక
నలగి రంగనిదయ నాపైని నేడు
తప్పునేమోయని తలరి, యట్లగునె
తప్పదంచని, లేని ధైర్యంబుపూని

కరములు వడకంగఁ, గనకదామంబు
పరమపూరుషుఁడైన పాండురంగనికి
ధరియింపఁజేసిన ద్వ్యంగుళీమాన
మరుదుగఁ దక్కువయైన, వీక్షించి
తనువు కంపింప చింతాజర్జరితము
మనము వాత్యాచంక్రమణములఁ జిక్కి
పల్లటిల్లిన నవపల్లవంబువలె
వల్లాడ, నిటలపర్యస్తమౌ చెమట
యల్లన కాలువయై చెక్కు-లంట
మల్లంబు గ్రుమ్మినయోజ కలంగ—
రోదనోచ్ఛూన మశ్రుపరీత గర్భ
మా దీనవావ లిప్తాపాంగ తరము
పంకజచ్యుతివు ఋగ స్తమిత తేజమ్ము
శంకా విమూఢ నిశ్చల తారకమ్ము
కనుదోయి నిలపంచి - కర్తవ్యమేది
తన భవితవ్య నిర్దాక్షిణ్య వృత్తి
దలచి రంగవిదయ తప్పనదేమి
కలుషంబు లంటిన కారణంబుననొ
నన్నుఁ బరీక్షించునా! విర్ధలుండు
నన్ను దూరముసేయునా! పాండురంగఁ
డని యార్చి - నా పూజయందె లోపంబు
గనపడెనో! యంచు కరము చింతించి
గుండెలోనెక దట్టుకొన్న దుఃఖమ్ము
మండు నిప్పులయేటి పూడ్కిఁ బొంగంగ
గళము వగులగ, బిగ్గఱగాగ నార్చి
యిలఁగూలి విలపించె నిట్టులాబిడ్డ—
నీమాయ దాటంగ నేనెంత వాఁడ
శ్రీమానినీ మనస్సేవధి! కృష్ణ!

హర విరించులకు నూహ్యముగాని యట్టి
పరమ గుహ్యంబైన భావత్కచరిత
మెఱుగంగఁ దగునట్టె! యీకదర్యుండు
పరమపూరుష! నీదు భక్తులకింక
గతి యెవ్వరోయి! నిష్కరుణ చిత్తమున
వాతమేది నీవే పరీక్షింపఁ బూన—
లౌకిక దుఃఖ విప్లవములఁ జిలికి
లోకేశ! నీసేవలోనైన శాంతి
యనుభవింతమటంచు నాసలు పెంచు
కొనిన నీ భక్తులకోర్కెలు ద్రెంచి
యెందుకీరీతిగా రించెదవోయి!
కొందలపడు సాధుకోటి కన్నీరు
యాదవీ మధురాధరామృతా స్వాద
మేదుర రుచికన్న మిక్కిలియగునె?
హరిభక్తి వర్జితులౌ మూఢ జనులు
తరమిడి పెట్టు బాధలనెల్ల నోర్చి
యవమానములకోర్చి హాస్యంబులోర్చి
చవిలేని లౌకిక సంగతి కోర్చి
నీయందఁ జేరిన నీవు కన్గానవు
మా యంతరంగమే మాడ్కి శాంతించు!
తీరని యగ్నిచే దీపితమగుచు
భారాయమాణ జీవనమున యందు
శ్రీకాంత! విధుర చిహ్నితమైనట్టి
నీ కటాక్షములేక నిల్వంగ గలమె!!!
నా మనోధనమూర్తి! నా కంటి జ్యోతి!
నామోద రూపంబ! నా ప్రాణఫలమ
నా కష్టముల పంట! నా యార్తుగ్రోవి!
నా కల మృదు భావనాంబర చంద్ర!

నా మాతృదేవత! నా యదృష్టంబ!
నా మాన మాణిక్య! నవరుచి స్తబక!
యేలరా! నాపైని నింత కోపంబు
చాలురా! నాయోర్పు జర్జరితమ్ము
పలుకరా! నాతోడ పండరినాథ—
మొలనూలిలో రత్నములు చెక్కలేదా!
చెక్కిన రత్నము చెలువుగాలేవా!
చెక్కడమున నేర్పు చిక్కగాలేదా!
చాలదా! రత్నసంచయ ముకుందనము
బోలదో! యేలరా! మూగతనంబు
నా యెదనే గోతునా! ఖండములుగ
చేయింతునా! వాని చెక్కిడామంబు
నాయుష్ట బాష్పసంతాన రత్నములె
మాయయ్య! చెలువుగా మాటింతునేమి?
ఏమి నీకోర్కె దేవేశ యటన్న
కామితార్థములిచ్చు ఘనమూర్తి నుండి
వార్షుక మేఘనిస్వన ధీరవృత్తి
తర్ష విహీన భక్త ప్రమోదమ్ము
ఈ షల్లసితహాస చామశీతలమ్ము
ఘోషితామృత రస పూర్ణతాగుణము
పరిమితాక్షరభావ పరిమళాసార
పరిపూరిత దిగంత వలయమ్ము! పలుకు
వెలువడె నీరీతి వినవోయి! నేత్ర
ములనుష్ణ బాష్పముల్ పొంగులు వోవ
నేల యేడ్తువు? భక్తుఁడెదఁ గ్రుళ్ళినంత
జాలయి పొఱునా సరళచిత్తమ్ము,
గోవు వెన్నంచెడి కోడెవిధాన
భావంబు దొంగిలి పరచిన ప్రయుని

వెనువెంట మనమంటు వేదురఁజిక్కి-
చను, గతత్రప, యభిసారికమాడ్కి-
యనుసరించెదను భక్తౌఘమ్ము నేను—
మనసిజ శితపుష్ప మార్గణ దూయ
మానసై యుపపతి మార్గమ్ముసూచి
వాని రతంబులోపలి చవులెంచి
తలపోయు పుంశ్చలీ తరుణిమోహంబు
కొలదికి మిగుల భక్తులయందు నాకుఁ
గల ప్రేమ నావాని కాంత కపోల
తలముల నిరెండ దాకి కందినను
సహాయింపలేను నిశ్చయముగ నేను
మహిత దేవేంద్రాద్యమర కోటికన్న
గరుడుని కన్నను కమలజుకన్న
పరమప్రియంబు నా ప్రాణంబుకన్న
నాకు దగ్గఱివాఁడు నా భక్తవరుఁడు—
నేకాంత భక్తసమీక్ష బుభుక్ష
దలకొనవాని తెన్నులు చూచిచూచి
కళవళపడు నాదు కన్నులు వాని
పూతాంఘ్రి ధూళిని పూయంగఁ దలఁచి
యాతనపడును దేహము, వానితోడ
పలుకుటవలని తత్పరత వక్త్రమ్ము
కలగుందుపడును నిష్కలుషమ్ము వాని
నామమ్ము జపియించు నమపుతోఁ బొగులు
నామన మనిశమ్ము నాకును భక్త
వరునకు ద్వైవిధ్య భావమ్ములేదు
పరమేశ్వరుఁడె లేఁడు భక్తుఁడు లేక,
నన్నాశ్రయించిన నాభక్తు నెవఁడు
కన్నుల గర్వంబు గప్పుకారించు

వానిపై నలుగుదు, వాని శిక్షింతుఁ
గాని సంస్తుత్య మేకాంతమ్ము భక్తి
లేక బాహ్యాచార లిప్తుడై యెన్ని
లోకలఁబోయినఁ బుట్టదునాకుఁ
గరుణ, సద్భక్తిదీక్షా గురుఁడైన
పరమ పూజ్యులమేలు బంతివౌ నిన్ను
నేను పరీక్షింతునే! యేటి మాట!
యా నిటలాక్ష మహాభక్తుఁడైన
కంపలబత్తు - నిష్కారణవైర
పాంసులుఁ డైనాఁడు భ్రమితుఁడైనాఁడు
వాయందు గాన, నజ్ఞానంబు దీర్చి
యోయన, నే వాని నుద్ధరించుటకె
పన్నితి, వింత యుపాయంబు వొమ్ము
పన్నగాభరణ దివ్య స్వరూపంబు
నేన చూపింతు పీకేల పీవంత
నా వదుమునకును నవ్యదామంబు
పదులైన దనినొక్క పలుకు పటన్న
ముదితుఁడై వాఁడు నమోవాక మనుచు
తలవంచి, తత్పద తామరసముల
కిలబాగి, మ్రొక్కి గ్రహించె మధ్యంబు
కొలత క్రమ్మఱ క్రొత్త కుతుకంబుమేన
పులక సస్యంబులఁ బూరింప మగిడె
పండరినాథుని భవ్యరూపంబు
రెండు కన్నులను న త్రింప భక్తుండు—
మధుమన్మరార్ద్రి పమ్మాన సంజాత
మధురత మానంద మాధ్వీక మత్తుఁ—
డవిరళ పులక పుష్పాచిత దేహుఁ
డపదాత లలిత హాసాత్యంత శీత

ల కపోల దీప మాలాయిత కర్ణ
వికచ కుండల ప్రతిబింబిత కాంతి—
శ్రీనికేతన భద్ర సింహాసనాయ
మాన నిటాల క్రమ తరోర్ధ్వ పుండ్ర
ధవళిత సకల భక్తతతి చిత్తుండు—
శివకేశవాద్వైత శీలుండు, రుక్మ
కారుని దరికి కంకాళ భూషణుని
కారుణ్యమునుఁగోరు కంసలబత్తుఁ
డల్లంత దూరంబునందె వీక్షించి
యల్లన నగ్గి, దక్కొనని చిట్టమిడిచి
చిదిముడి పడుచున్న చిత్తదావలము
గడవనేరక తన కన్నులయందు
నవహాస్యభరము నాట్యములాడ పెదవి
కపటాదరంబను గరళంబు దొలుక
నెదురుగఁ జనుదెంచి యేమోయి! ఇంద
విధుశేఖరు వియోగ వేదన నలిగి
కాచుకొన్నాము నీ కరుణకుఁ దండ్రి!
మాదనవుల మంచి మమ్ము నీవారి
తటఁ ద్రోవకున్న దుస్తరభవ వార్ధి
తరియింప నెయ్యది తరణిఁ, విర్గుఁడు
గ్రహాయించెనే కదా! కనకదామమ్ము
నహహా! దర్శనంబిప్పనే మాకు
నబ్బకుండిన వైష్ణవాచరణంబు
దబ్బరకదా! శైవ తంత్రంబు స్వీక
రింతువే కదా! చంద్రభృద్గాధ భక్తి
మంతుఁడవై వీర మాహేశ్వరులను
సేవింతువే కదా! చేసిన ప్రతిన
భావింపవో! సత్యవాక్యము దప్ప

ఘోర రౌరవ బాధ గూలంగఁ దలఁతొ!
యేర! పల్కవటంచు నెకసక్కెమాడ
నంఁటి నవ్వుల పెరలక్షుల కొక్క
చెలువంబు ఘటియింపఁ, జేతిలో నున్న
కనకదామము చూచి కంసలబత్తు
మనము తీవ్రాశ్చర్య మగ్నమ్ముసేఁ——
పలుకు పల్కవ నిల్చి పాండురంగండె
పలికింప——నీమాడ్కి భాషించెవాఁడు
నీ వచించినదెల్ల నిజము! నా ప్రతిన
బోవదు - సత్య సమ్మూఢమ్ము గాదు
పాండురంగనిఁ గొల్చు భక్తుని బ్రతుకు
పండీశ పాద కంజాత సేవనము
భవ తరణంబు తద్భక్తులు ప్రమథ
నివహంబుగాక దన్నే! మర్త్యులనగ
మాహేశ్వరులపాద మధుర తీర్థంబు
బూహోతిగ పవిత్రితో జ్జ్వలితములు
శంకర భక్తభాషణము సమ్మోహ
సంకట దావాగ్నిచయము! తదంఘ్రి
సంపర్క పుణ్యసంచయ వాఞ్ఛితము, ని
లింప దుష్ప్రాప్య ధూళిపాళి నైక
భవ్యతపః పరిపాకాయితంబు——
సేవ్యుఁడౌ శంకరు సేవింపఁ గలిగి
వాని చింతనయందె వర్తించుకంటె
మానవునకు నింక మహానీయమెద్ది!!
యావేశభరమున నన్నానె కాని
మీవంటి భక్తుల మృదులాంఘ్రి సేవ
పావనభూతి సంభరణంబు! దేవ
దేవ శంకరపద దీక్ష——నా పుణ్య

ఫలమదెంతటి దయాభరము నాపైని
గలవో! పల్కరు జ్ఞాపకంబెలయించి
పురికొల్పుచున్నావు! భూతేశ చరణ
పరిపూజ నాచార భద్రసంగతికి
నీవె సద్గురుఁడవై నిలచి, కావించి
నావు, నాపాలి దివ్యావతారుఁడవు—
కంపల బత్తుని కనుగొనలకవ
తంపమైనది దృప్తరదహార రేఖ
గమనించివాడు భక్తకుల మండనము
విమలదయాభర విపళజీవనుఁడు
వినయశస్త్రుండు సంవిన్మూర్తివైశ్యుఁ
దనయకళాదుని యవలేపభరము—
మఱివల్కెనో! వీరమాహేశ్వరుండ!
హరిహరులకు భేదమజ్ఞాన కృతము
పరమేశ్వరుఁడు గొల్చు పండరీనాథు
పరమేశ్వరుని గొల్చు పండరీశుండు—
పరమపూరుషుఁడైన పాండురంగండు
పరదైవతము, ఖండపరశువు సతత
సక్తులు కావి పుష్పంబునుఁబోలె—
రిక్తవాదములతో [illegible]—
శివమూర్తి సగుణమై చెలగినయపుడు
భవనివారకుఁడైన పండరినాథు
కలుముల చెలి చెలికాని విఠ్ఠలుని
దలఁచు నిర్గుణునిగా తాను విఠ్ఠలుఁడు
పరిపూర్ణరూపుఁడై భావించినపుడు
పరమేశు మదిలో నుపాసించుచుండు
నిజపురకును రూప మెన్నంగలేదు
నిజపురు రూప సమేధితుల్నిజము

హరిహరు లిఱువురటన్నదే మిథ్య
హరియె హరుండు నా హరుఁడే హరియును
ప్రళయకాలమునందు భయదంబుగాఁగ
చెలరేగి జీవుల శిక్షించునపుడు
హరుఁడంచు, ప్రాణిసంహతుల నిర్మించు
తరుణంబునందు విధాతయటంచు
ధరణి సర్వము దయార్ద్రమనస్కుఁడగుచు
భరియించునపుడు విశ్వంభరుఁడనుచు
నానావిధంబులు నామరూపములు
గాని సర్వేశుఁడొక్కండె నిశ్చయము—
వాఁడె నా తండ్రియౌ పాండురంగండు
వాఁడె లోకమ్ముల పతితపావనుఁడు
వాఁడె ఫల్గున రథప్రాదీతపనుఁడు
వాఁడె గోపీ మానసశ్యతోహరుఁడు
వాఁడె శ్రుతిస్మృతి వనమత్తగజము
వాఁడె దీనావన వ్రత దీక్షితుండు
సహాయింపలేదు కంసల బత్తుచిత్త
మహామకుటాన్య దైవాభివర్ణనము
చాలింపవోయి! ప్రజ్ఞావాదములను
గోల! భట్టువిధాన కొఱమాలి పలికె
దేది దామంబునందిమ్మన్న భక్తి
మాధుర్య భృశకంపమానంబు - కరము
దాచి వివేకముద్రా ముద్రితములు
పూచిన చిఱునవ్వు పూతలువెలయ—
నొవగుటతోన దామోదరుమధ్య
మనదు సీచేఎన యట్టిదామంబు
పదులైన దిదెకొమ్ము పట్టితెచ్చితిని
మధువైరి మధ్య ప్రమాణమ్ము మఱల,

తొలిసారి పొరపాటు తోచినదేమొ!
చెలువమునకుఁగూడ చెలువమౌ విరలు
నాకృతి తోచినయంత చిత్తమ్ము
నాకవశమ్ముగా నాట్యముసేయు
నేనేమిసేయుదు నెంతకు దింపఁ
బూనిన నిలువదు ముగ్ధకురంగ
చపలమ్ము నా యీదోసంగు మన్నించి
యుపకృతి గావింపు మురగ భూషణుఁడు
సంతోషమొనఁ దర్శనమిచ్చునీకు
సంతాపముడుగు మేచక్కటినైన
నీసేవ నీచేతనే పొందవలయు
భామరమూర్తియౌ పండరినాథుఁ
డనివచించిన హృదయాంతరతాప
విని గూహనైక ప్రవిష్టయత్నమ్ము—
వలన నిశ్వాస ధూమ్యాశ్యామవర్ణ
కలితమ్ము శశ్వద్వికారావ గుప్త
తర్షతదంతరోద్గారితకృతక
హర్షావదాత పర్షాంకురభరము
తిలతండులన్యాయదీప్తమ్ము పెదవి
పెలవుల నెలనవ్వచిత్తడి గురియ—
మొలనూలుగొని, రేపుప్రొద్దున రమ్ము
చెలువుగ దీర్చియిచ్చెదనని పలుకఁ
దలవంచి భాగవతావతంసాయ!
దళితపాపాయ శీతకరకోటీర
చరణతులాకోటి సౌమ్యచిత్తాయ
పురుషోత్తమాయ నమోనమ యంచు
పుడమిపై సాష్టాంగపడి దండమెఱిగి
యడుగడుగున మాధవాను చింతనము

చెలగంగ గృహమునఁజేరెనాబచ్చు—
నలికలోచన పదాబ్జాళింద రంగ
వల్లికాయిత సర్వవాసనామయుఁడు
తల్లీనవృత్తి సంధ్యాకాలపూజ
చేసె కంపలబత్తు శివునకు, సర్ప
ఖానురాంగదునకు, ప్రమథనాధునకు
పాటలిత ప్రత్న పల్లవాకార
జాటజూటునకు, చంచచ్చంద్రకిరణ
పరిణాహ సంపదాపాదితాపాంగ
కరుణావివృద్ధికి కందర్పదర్ప
సాగరాచామ భీషణ కుంభసంభ
వాగాధ కందరదగ్ని నేత్రాంత
రుద్యదంగా రచ్చటోచ్చలద్ధ్వాన
సద్యోవిజయమురజాయిత దిక్కు-
నకు తద్దిగానిస్వ నత్ర స్తకర్ణ
వికలప్రసంపత్కాద్ర పేయకోటీర
శశ్వదుద్బంధనాస క్త హస్తునకు
విశ్వేశ్వరునకును వివిధప్రకార
శోష్ఠూయ్యమాన క్రతుభుజా ఘమాన
పేష్టపూరునకును నిందిరారమణ
మానస వనపుల్ల మందారమూర్తి—
కావత వైరికి - వఖిలైకగతికి—
ప్రణతపాలకుఁడైన భవమూర్తి చెన్ను
కనుల యానలు దీరగాంచెదు నపుడు
తరుణేందు కరవికస్వర జటాపాళి
కరవిరి దండల వలరించునపుడు
పరదైవతము, ఖండ పరశునామంబు
పరమకౌతుకమునఁ బరియించునపుడు—

అష్టమూర్తికి జగదవనైకరతికి
శిష్టరీతుల సమస్కృతి సల్పునపుడు
కనులనిండుగ సీరు కరములనిండ
పెనుగొన్న రోమాంచ వీరున్నివహము
గళము నిండుగదైన్య గద్గదవృత్తి
కల శరీరమునిండ కంపమ్ముపుట్టె
వీరమాహేశ్వరాచారభక్తునకు
గౌరీశ పాదపంకజ లగ్నచిత్త
వరమ పాతివ్రత్య భరితవిచార
శిరములు మొగిచి – శంకరుఁదేవి చూచి
యర్థించె భర్తృమోక్షానంద వరము
సార్థకీకృతనిజ జన్మ, తత్పత్ని—
తదనంతరమ్ము శీతల చిత్తవృత్తి
సుదతి వడ్డింపగ శూలినివేది
తంబైన యన్నంబు తనివిదీరంగ
సాంబ నామావళీ జప తత్పరతను
భుజియించి, పదునాల్గు భువనంబులందు
గజకృత్తి వాసుఁడే ఘనుఁడైనదైవ
మనుపూన్కి చెల్లించు నడియాన పూని
కనకమేఖల చెక్కఁగడఁగొని బత్తు—
పండరినాథ దివ్యరసానుభూతి
మండిత చిత్తుండు మధుర జన్ముండు
సంతత బాష్పవర్ష స్నాపితాక్షిఁ
డాంతర దుఃఖకంపాయమానతనుఁ
డవనత శీర్షుఁ డాహ్లాదవి యుక్తుఁ
డవజిత గాఢ దర్పాంధ కారుండు
శాంతి స్వరూపుఁడక్రాంత గోవింద
చింతనాఖ్యాన నిశ్రేయస పరిధి

పరమవైష్ణవుఁడైన బిడ్డ, గృహంబు
పరువడి చేరఁబో - బాలుండు లలిత
వలితముల్ - ముగ్ధభావ ప్రేంఖితములు
కలమందహాస వికస్వర రూప
ములు కౌతు కాక్రాంతములు క్రమవర్తి
తల పటచ్చూర్ణకుంతల బర్హభార
మృదు విభేదన పరిక్లిన్న నిర్గమము
లధర మాణిక్యచ్ఛటాసార గుంభి
తములు - చూపులవల్లి తరుణారవింద
కమనీయములు పదక్రమములు ముగుద
చిఱుగజ్జియల నవ్వు చిందులు మీర
పరుగెత్తుకొని వచ్చి బాహువులెత్తి
యాకలి కన్నుల నప్పుడీక్షింప—
లేక లేక తపః ఫలితము భాగ్యమ్ము
గాఁగ జన్మించిన కందునఁ జూచి
యాగ నేరక కన్నులందు ప్రేమాశ్రు
వులు దూకినవి మేనపులకలునిండి
మొలకలైనవి కరమ్ములు సారె సారె
చలియించినవి సుధాసారంబు పోలి
నిలువెల్ల నాక్రమించిన ప్రేమవృత్తి
జనకున కంత హస్తమ్ములు చాచి
తనయు గ్రహించి కుంతలములు దువుక
కరములు జడములై కంఠమ్ము దైన్య
భరితమై నా స్వామి! పండరినాథ!
యని పల్కఁబోయి పల్కను నోరురాక
తనమది లోననే తలఁచుకొన్నాడు
పరమ ధన్యంబైన వాత్సల్య భక్తి
పరిపాక మిట్టిదెవ్వరు నేర్పినారు?—

చిఱునవ్వు తొడవు దాల్చిన మోమునందు
పరమ గంభీరతా భావంబు దోప
వినయ సౌరభభార వీక్షణ పంక్తిఁ
దననాథు పాదముద్రల పీడలొలుక
ననురాగ కలితమైనట్టి చిత్త
మునకు వశిత్వమ్ము ప్రోది వెట్టంగ—
తరుణ సుందరమైన తనమోవియందు
పరమ పాతివ్రత్య భంగిమలలర
పలు పల్లవను మాదిగములు ప్రాణేశు
నలలిత నామంబు జపియించుచుండ—
వెలుగుచునవ్వు మంజీరముల్దనకుఁ
గల భాగ్యమునకు వ్యాఖ్యానముల్వాలుక
పుడమికి దిగిన వేల్పుల గోవువోలె
నడచుచు వచ్చు మందాకిని వోలె
తనువు దాల్చిన సతీ ధర్మంబు వోలె
వనజాక్షి—కోమటివానియిల్లాలు
నెదురేగుదెంచి ప్రాణేశ్వరు దివ్య
పదధూళి ఫాలమ్మపై ఘటియించి
జలములఁ గడిగి తత్సలిలము శీర్ష
తలమున భక్తితత్పరతనఁ జల్లి
కొని గంగకును కోటి గుణములు హెచ్చు
తనపతి తీర్థపాదములావమించి
మ్రొక్కి- నిల్చినను, వికుండింద యనుచు
నక్కుమారుని చేతికందివ్వ - కన్న
లను కుచంబుల పయస్స్రవణంబులుబుక
కొని వెంట నడువ, భక్తుఁడు ప్రవేశించెఁ
దనయాల్లు, హరినివేదన పూత మన్న
మును భుజించెనొ లేదొ పుణ్యాంతరంబు

పాండు రంగని నామభజనంబు చేత
గండరించినది సకల మందిరమ్ము—
సతియును పతియు నిశ్చలమైని నిష్ఠ
పతిత పావన మైన పండరి నాథు
నామముల్ పాడుచున్నారంత పూర్వ
కామినీ కుంకుమాంకమ్మును వోలె
కమలినీ హృదయకాంక్ష దివ్యమహము
తిమిర భ్రమల్లోక దివ్యాంజనంబు
ధేనుభూసుర తపోదీక్ష ఫలంబు
భానుండు దోచె నభ్రంబునయందు—
స్నాన సంధ్యాద్యను ష్ఠానంబు దీర్చి,
మానినీమణి నమ్రమ స్తయై మ్రొక్క—
పెలపుల కొనల విచ్చిన చిఱునవ్వు
మొలకల తోడుత, మురహరభ క్తి
ర క్త ని దీపించి యా పాండురంగ
హ స్త నిష్పైక మోక్షానంద కాంక్షఁ
దపగతే తరనిందితాఖిలాఘుండు—
క్షపితాంతరిక శత్రు సంచయుఁ డతుల
నామ పారాయణానంద మగ్నుండు
భూమికిఁ దొడవైన పుణ్యపూరుషుఁడు
కడువడి నడచుచు కంపలబ త్తు
కడప త్రొక్కినయంత, కల కల నవ్వి
ప్రత్యూషకాల నిర్వ ర్తిత భూత
పత్యుపాసన బిల్వపల్లవ స్పర్శ
పరమ పవిత్రంబు పాణితలంబు
నరమదినె త్తి యాహ్వానంబొనర్చి
జాగరారుణ కటాక్షమ్ముల యందు
సాగెడు ప్రౌఢ హాస్యమ్ముతోఁ జూచి

పండరినాథ భావస్నిగ్ధభక్తి
భండార! భక్తిదర్పణభూత! నీదు
కరుణకు నవకులై కాచికొన్నాము
తరుణేందు కోటీరదర్శ నోత్సవము
ఈనాటికైన పేయింతువో! లేదో!
దీనావన ప్రతాధీనంబుగాదో
త్వాదృశ పురుష జీవనమిదె బోయి
మాధవునకును దామంబు చెల్లించి
పాండురంగఁడు తాను పరదైవమేని
చండీశుమూర్తి దర్శన మిమ్మటంచు
పలుకుమటన్న నా పలుకులయందుఁ
జిలికిన విషము చూచియు రంగనాథు
వచనంబులోని భావంబు నూహించి
యచలుఁడై లేతనవ్వధరంబునందు
దొలుకాడ - నా తళాదుండిచ్చినట్టి
మోలిమాల గ్రహియించి పుష్కరంబులకు
నమగులౌ కరముల నంజలిగూర్చి
ఘనకేశ చరణసంగత పావనాయ
ప్రమథస్వరూపాయ, భక్తిప్రదాయ
సమధిక జన్మనే శాంతిప్రదాయ
పురుషాయ తుభ్యం నమోనమ యంచు
పరమవినీతుఁడై పలికి విఠ్ఠలుని
దతిఁజేరి పెదవుల దొరకొనసూర్పు
విరిదమ్మికన్నుల నెఱసిన నీటఁ
బదములు గడిగి భువన మాతయైన
ధుసూదనుని మనోమందిరమైన
;ల రుక్మిణీపతి కంజలివట్టి—
ియించు కరముల శ్యామసుందరుని

దరిఁజేరి మొలనూలు దరియింపఁజేయ
నరుదారగా నొక్క యంగుళమంత
బిగువైన వీక్షించి భీతుఁడై మఱల
నగధారి వాత వచనంబులు దలఁచి
ఫలియింపనేరక భావంబునందె
బలిసిన తన మ్రొక్కుబడి నూహసేయ—
యురియాడ మానస మెక్కింత తడవు
కర చరణంబులు గదలింపకుండి
పలవలనై నట్టి వదనంబునూర్పు
తలకొని వాడిన తరుణాధరంబు
గలిగి గాల్గద్దు వఖంపద బాష్ప
కలితార్ద్రిములు కటాక్షములతోఁ బాండు
రంగని వీక్షించి, రాజీవనేత్రి
మంగళమయి దయామధురిమసీమ
సకలైక జనని వైష్ణవి యోగమాయ
యకలుష బ్రహ్మ విద్యామంత్రమూర్తి
నల రుక్మిణీపతి నార్తుఁడై చూచి
గళము చలింపంగ నిలువెల్ల వణక
తరుణ రాజీవ సుందరములు దుఃఖ
పరితప్త భక్త జీవాతువుల్ మోక్ష
సేవధు లార్తుల చిత్తముల్ సొగియు
తావులు లలిత పాదంబులు కౌగి
లించి యన్యజ్ఞానమేది శోకించెఁ
బంచ భూతమ్ములు ప్రతినాద మీన
తల్లి! నీకైనను దయ గల్గలేదా!
ముల్లోకముల నేలు మురసూదనుండు
కరుణ దప్పెనదేమి కారణంబననా
పరకభావమున విచారింపవమ్మ!

నీదయ లేకున్న నీరజనేత్రు
సాధింపవచ్చునే! జనని! భావత్క-
కరుణా కటాక్ష, కింకరుఁడు విష్ణుండు
పరదేవతవు - నిన్ను భావించుటందె
పరవశమ్మయ్యె దివ్యత్రయీమూర్తి
హరవిరించాదుల కందనియట్టి
భవదీయమతుల వైభవము రాగాంధు
లవివేకు లర్హులే యభినుతి సేయ
జనకుని హృదయమీ షత్కఠినంబు
జనని చిత్తమ్ము పుష్పసమాన మనుచు
జగములో పదుగురి సంభాషణములు
నగుబాటొనర్తువే! నాయెడ నేడు—
ధరణికి పుత్రకు నరయంగవచ్చు
ధరణికుమాతయెం దరయవలేదు—
నాదోష మేమని నాయందు నేడు
ఖేదంబు గల్గె సంవిన్మయీ! పాప
మలినచిత్తులకు దుర్మానబద్ధులకు
కొలదులే యఘములు! కోట్యర్బుదములు
నిక్కంపు దయ మాకు దిక్కుగాకున్న
నెక్కడఁ బోయెదమే! జగద్ధాత్రి!
నని యేడ్చి తనుదానె యాత్మ శాంతించి
మనము గూడగఁదెచ్చి మాధవుఁజూచి
దీన దీనము శుభాధిగత సంతోష
భావమ్ము, విస్మయభావ చుంబితమై
పెదవుల యంచులు విరుచుకపోవ
సదవదయగు వెట్టిహాసంబు చేసి
తనలోపమే యున్నదనుకొని మరల
వనజాక్షి కటి సూత్రపట్టి గ్రహించి

యలస నేత్రములతో—నధిగతాయాస
మలిన ముఖమ్ముతో మాధవ విరహ
చింతాపరాధీన చిత్తమ్ముతో – ని
రంతర ప్రకట తీవ్రతర నిశ్వాస
శబలితాధరముతో స్వప్నమ్ము వోలె
నిబిడ నిదాఘ సన్నిపాత మధ్యాహ్న
శీతశీకరము మందవాతమ్ము పోల్కి
నేతెంచె భక్తుని యింటి చక్కటికి—
పరమభక్తుని దీన వదనంబుపైని
గిరికొన్న శోక పంకిలత – కళాదు
మొకమున నవ్వుగా మొనసి బింబించె
నొకరి యేడుపు మఱియొక్కరి నవ్వు
చిత్రముల్ మానవ చిత్తప్రకృతులు!
నేత్రాంచలంబుల నిండిన కపట
వృత్తి, కోమటి మది వికలంబుసేయ
బత్తు బొమ్మలువంచి పల్కెడులోనె
కనుల నీరూరగఁ గరములు దాచి
కనకదామముఁ జూపఁ గంపలవాని
యానందమొక నిమిషార్ధంబులోనె
మ్లానమై నిట్టూరుపై నిలచినది,
వెక్కిరింపగఁ బోయి వెలికిలఁబడ్డ
చక్కటియై మనస్సద్మంబునందు
బరువడి కనకోకపై నిలుచుండి
పరవళ్ళుద్రొక్క దుర్వార మాత్సర్య,
మారయు కన్నులయందున తెల్వి
యారగాఁ జూచని యట్టులు చూచి
కళలుడి పోయి శుష్కించైన మొగము
వలవలనై యూర బయలుమఁ బోలి—

పొడమి లేనట్లున్న పొడినవ్వు నవ్వి
కడివోయనట్ట వాక్యమ్ములతోడ
జరిగినదేమన్న, స్వర్ణదామంబు
ఖరకరనేత్రుని కటిబంధమునకు
నొక్క యంగుళమంత నిక్కంబుగాను
తక్కువైన యది సూత్రంబిదె కొమ్ము
కొలచి తెచ్చితినన్న కోపంబు పెదవి
నెలవులనే యాఁప చేతిని దాచి
పన్నగాభరణునిపై దైవమొక్క
డున్నదో! లేకున్నదో! నిర్ధరింప
వలెనను నడియాస పండరినాథు
తలఁచిన పూనిక తన హృదయంబు
తరుమంగ గాంగేయదామంబు గొనుచు
మఱునాడు రమ్మని నెఱినెచ్చరించి
హరశుభాకార నిధ్యాన పీయూష
పరిణతచిత్తుఁడు, బత్తుఁడేకాగ్ర
తనుఁబూని కాంచనదామంబు చెక్కి
వనిఁబూని మరుపటి వాసరంబుననుఁ
జనుదెంచినట్టి యా పరంజనేత్ర
ప్రణుతి శీలునకు నప్పనముసేయంగ
నాతండు గొనిపోయి యఖిలైకగతికి
ప్రీతితోడుత సమర్పించిన మణిల
ద్వ్యంగుళీ మానంబు వదులైన నెగులు
పొంగగనేడ్చి - యేమో విచిత్రంబు
జరిగెడునంచు నిశ్చయముగాఁదెలిసి
తిరిగి కంసాలి దగ్గరి ప్రశ్రయమున
వినమితుఁడై యెల్ల వృత్తముసెప్పి
కనుదోయి భాష్పసంకలితముగాఁగ

కరములు ముకుళించి కంజాక్షభక్త
వరుఁడు, ముగ్ధమ్ముగాఁ బ్రార్థనసేసె.—
పరమేశ్వరైక జీవన! యెంతచక్క
పఱచిన మొలనూలు - పంకజాక్షునకు
పరిపోవదేమి యాశ్చర్యమో! వాని
పరమ పవిత్ర రూపమ్ము నాకంటఁ
బడిన తక్షణమ నాయెడ విస్మరించి
బడుతనై పోదును, బుద్ధివశంబు
గాదు నాకెచ్చెడు కటిబంధమాన
మాదరణీయమైనదియో! కాదేమొ?
వివరింపలేను, నీవే యొక్కపారి
భువనపాలకు పుణ్యమూర్తి వీక్షించి
వచ్చిన, నీచిక్కు వదలునో కాదో!
మచ్చిత్తతాపంబు మాననో లేదో!
దయసేయవన్న! భక్తకులకోటీర!
నయహితాచార! దీనత్రాణవివశ
ములు యథార్థంబు! మీబోంట్ల హృత్పద్మ
ములు భవదుపకృతిమొనప భావించి
భావత్కచరణ రజంబుగాఁ బుట్టి
సేవింతువిను, పూజసేయు పుష్పంబు
గానిలఁ బుట్టి నిష్కలుష వాసనల
వేమపచరియింతుఁ - జేతు నీజన్మ
మందె త్వచ్చరణ దాస్యంబు రమ్మన్న!
డెందంబు కలుచఁ డింద్రింపంగ శిరము
వందు వజ్రాఘాతమైనట్లు మిడిఁ
తుందుడుకున తోకత్రొక్కిన త్రాచు
నాకృతి చిరచిరలాడుచు, నిప్పు
దాకిన కోతివిధమ్మున నెగిరి

కనుల రుణమ్ముమఁ గ్రక్కపీడించి
తనువు కంపింపంగ దంతముల్గొటికి
కటకటమ్మంత నుత్కటముగ వణక
నిటల దేశమ్మననెఱయఁ జెమ్మటలు—
పదతలంబున బిట్టు వసుధ దట్టించి
యదయుఁడై పలికె నా హరభక్తుఁడపుడు
ఛీఛీ, యెంతటి భక్తుండవోయి
తెలిసెలెమ్మింక, నీ తెక్కలితనము
లావలించిన ప్రేవులన్ని యెంచెదవు
భావంబె యొకతీరు పలుకొక్కతీరు
నంగిటబెల్లంబు నాత్మలో విషము
దొంగ! నా వ్రతమును దోచవచ్చితివి—
కులశీలుఁడై వచ్చి గోష్ఠివై కూఁ
చిలువవై - వడినన్ను చెఱుపనెంచితివా!
చాలుచాలింక లజ్జావంద్య వృత్తి
కూళ! నిన్గనుఁగొన్న ఘోరపాపంబు—
వీరశైవాచారవిధి దీక్షితుండు
తారకా రమణసుందర భిన్నదర్శ
నై నంబు భరియించునని యెంచినావొ?
దీనునివలె తరి తీపులువల్కి
యెంతకు దిగితివోయీ! మొనగాడ!
వంతుకు వచ్చితివా! మెచ్చవచ్చు
కదలరా! యింక నాగడవ ద్రొక్కకుము
విధుతలఁ గూర్చిన విశ్వేశు భక్త
వరునితో తగునని పరిహాసమాడఁ
దరమౌనె! నీకు వృధా ప్రయత్నుండ
యమమ, గద్దించి బొమ్మనుచునుఁ దరుమఁ
దనయభాగ్యమునకుఁ దామదిఁగనలి

కాళ్ళీడ్చు కొంచు రంగని గుడిఁజేరి
తల్లీన వృత్తి పాదంబులు పెనిచి
పడియుండె, భక్తుని భావంబుదెలిసి
కడతేర్చు ప్రభువు - రంగఁడు దక్కఁయున్నె!!
ఖరకరుండంతట గగనమధ్యమున
ఖరకరంబుల విచ్చి కనకనవెలిఁగె,
పండరినాథ దేవస్థాన శృంగ
మండితమ్ములు, హేమమయములు కలశ
ములు సూర్యకరజాలములఁదోఁగి క్రొత్త
కళల గన్నవి దిదృక్షాసక్త భక్త
జనముల సందడి శాంతించుతోనె
కనక ఘంటల కలకల నినాదములు
నిలచిన నర్చక నికరంబు సుంత
యలత గూరిన క్రాంతి నందంగఁగోరె
దిక్కాఖిపీ మణుల్దిగ్గురుమనఁగ
చక్కఁగ మధ్యాహ్న శంఖంబుమ్రోసె,
కనులలో బాష్పముల్ కాలువగట్ట
మనమున దుఃఖమున్మత్తమై రేఁగఁ
దనమ్రొక్కుఁబడి వితథంబయ్యెననుచుఁ
జనవియేడ్చుచెగాని భావంబునందుఁ
దలఁపడతండు మధ్యాహ్నమయ్యెనని
తలఁపఁడు తనకూన తరళితాపాంగ
ములతోడ నెదురు తెన్నులు సూచుననుచు
తలఁపడు దుఃఖపేతము ద్రొక్కుచున్న
మనముతోఁ బావిత్ర్య మధురిమపీన
తన బహుఃప్రాణంబు తరుణి! స్వకీయ
భక్తశేషోత్సుకబుద్ధియై మోద
రిక్తదృష్టులను, నిరీక్షించుననుచు,

నెంతభావోద్రేక మెంతటితాల్మి
యెంతటి సన్నిష్ఠ, యెవ్వరికంటె
కడిది భక్తుండు, జగంబులయందుఁ,
బడఁతి దైవంబైన భర్తరాకున్న
కడునొచ్చి జాగేల గల్గెనోయనుచు
నొడలెల్లనుద్వేగ ముప్పతిల్లంగఁ—
దలఁచుచుండు రునది తనయునిఁ, దండ్రి
తలఁచి యేడ్చెడువాని తతబాష్పపూర
లలితనేత్రుని, ధరాలులిత శరీరు
కలిత ధూళీపాళి కబళితాలకుని
యూరార్చువెరవేది యువిద వితంబ
భారకాంచీ కలక్వణనమ్ము చెలఁగ
నలసాలసములు రమ్యమ్ములనైన
లలితముల్ పాదముద్రలు నంచలముల
యందె యడంగు ప్రేమామృతసార
తుందిలములు హవిర్ధూమ పవిత్ర
ములు, మేచక కటాక్షములు నిత్యతృప్తి
దులకించు చిఱునవ్వు దోపంగవచ్చి
లక్షించె నాత్మవల్లభు భక్తిమయుని—
లక్షించి బాష్పమాలా పరిక్లిన్న
గళ భర్తృభావ విఘ్నవిశంకి చిత్త—
పలుకనేరక బొమ్మవగిది నిల్చుండె
జనకుని గన్నంతతనయుండు కనులఁ
బెనగొనునాసలై, ప్రీతి హస్తములు
దాచి యొడ్చిన పరంధాముని పరము
పూచిన బోడపైన పుత్రుని, హృదయ
మున కత్తుకొని, చిన్నిముంగురుల్దవి
వనజనాభునిపైఁ బంగందుపైఁ

బలుమారు చూచి తీవ్రంబైన దుఃఖ
జలధి కట్టలు దూఁ సంభ్రమింపంగఁ
గావంగలేక గద్గద కంఠుఁడగుచు
భావంబు వివరించి పలుకంగలేక
నిలువె బాష్పములుగా నిలచినవాని
తలము గావట్టి చిత్తక్లేశమునకు
లోఁగి యంగమ్ములు లోలముల్గాఁగఁ
దూగెడు వాని నిర్ధూత కల్మషునిఁ
బతిఁజూచి, ధీరతాస్పద చిత్తవృత్తి
యతివ, కన్నులనె బాష్పంబువులప్ప
ళించి, శిరంబు వంకించి యోచించి
కించిద్విలాస వక్రీకృతమైన
వదనంబులో, లేత పరియాచకంబు
గదియంగఁ బలికె నెక్కడి చేతలివ్వి
మధుసూదనునకు మీ మధ్య నిదేన
యొదిగిన చెలిమి! సర్వోత్తముచిత్త
గతినింతయనదుగా గ్రహియించినారొ!
యతనికి భక్తుని యాపదఁబాపు
నంతకుఁ, గన్నుల కంటునే నిద్ర!
సుంత! వాఁడే దీర్పఁజూచును మ్రొక్కు
బడి! మనకేటికీవంత! మానవున
కొడఁగూడునెల్ల దైవోపాత్తమగుచుఁ
బోయినఁ బోవును పురుషుఁడు రెంటఁ
బాయంగవలయు దౌర్బల్యమ్ము నందు
రందు బోవుదము బిడ్డండు రోషల్లె
పాండురంగఁడు మనభక్తి వాగురము
నందుండి యొరితి యువతలఁ బడునొ!
కందముగా కని, కంజాయతాక్షి

ముసిముసి నగవులు మెగమున నుబికి
నసలేని నాధు వక్షమ్మునఁ జింది
యమృత సేచనము సేయఁగ లేవనెత్తి
కొమరుని గ్రహాయించి కుటిలకటాక్ష
చారు పాతంబుల శ్యామసుందరుని
పేరెదఁ గ్రుచ్చి—యీప్సితములు వాక్య
భంగుల భర్తృ భావము పల్లవింప
నింగిత మెఱఁగి భాషించుచు గృహము
చేరెఁ. దోడుత నస్త శిఖరంబు పేరె
నీరేజ మిత్త్రుండు నెగడెను మింట
సంజకెంజాయలు చండికారమణ
మంజుల తాండవ మహావిస్ఫురము
లైన కటాక్ష విన్యాసములొప్పెలి—
కాననై వది చంద్రకళ తూర్పునందు
భయద భూతేశ్వర పాదవిక్షేప
రయగళితమ్ము సూర్ధ్వప్రేంఖమాణ—
మర్ధదృశ్యము - జిల్గుటందియఁబోలి
స్వర్ధుని దరగళ శ్యామలదీప్తి
పుంజముల్ దిశలలోఁ బొలసినవనఁగఁ
బుంజుకొన్నవి - లేతమొలక చీకటులు
గజవైరి కనకశృంఖలకాంతి దిక్కు-
లఁజెదిరి వచ్చియల్లనఁ జేరికొనఁగ
వెలిఁగెనో యనదీప కళికలు చెలఁగె
నలపై భమావకాంతులు పరవర్ణి
పీకందనమములు - నిలయంబులందు
ప్రాకట భక్తి సంభ్రమ పుల్లచిత్తఁ
డవదాత భస్మ కాంత్యాలింగి తాంగుఁ
డవగత శైవసిద్ధాంత రహస్యుఁ

దపగతేతర దర్శనాకాంక్షి - శైవ
జపతంత్ర నిష్ణాత, చండీశభక్త
మహేశ్వరార్చా సమధిగతమహామఁ
దీహా వివర్జితు డింద్రియజేత
యలికనేత్రునకు సాయంకాలపూజ
సలిపి తద్దర్శ నాశాసముచ్ఛ్వాస
ములు రెండు కన్నుల వెలలి బాష్పములు
తలముగా కెగఁదట్టి తనువెల్లఁ దడుపఁ—
గరములు చేర్చి వికస్వర పులక
భరితమ్ము వార్ధకాభ్ర పరాహతమ్ము
హరిత సుందరమైన యవనీ తలమ్ము
సరియగు - దేహమీషత్కంపితముగ—
నెఱఁగు వణంకగ నెదచలింపంగ
పలుకు రావడగ నీవగిది వచించె
జయతాండవోద్దండ జయధృతరుండ!
జయమహాకాల! భీషణరమ్యలీల!
జయనిటాలాక్ష! సంశాసిత దక్ష!
జయపార్వతీనాథ! సకలైకనేత!
త్వజ్జటాజూట పర్వతము మాధుర్య
సజ్జిత చంద్రభాస్వత్కైశ్యభూష!
భవదీయ చారుచాపల వామభాగ
మవనమితాన్యరసాస్వాద మధురి
మమ్మ! సురాసుర మంగళ ఫలము
తమ్మని కడగంటఁ గ్రాలెడు చూపు
పులకాంచిత స్తన కలశ సంరంభ
మిళపస్పృహానమున్మేషసంవలన
పరము దక్షిణ తనూభాగంబు, హాస
గరిమ దయారస కల్లోల సాంద్ర

మనవరతమ్ము తీయని కలలందు
కనుఁగొంచు గాత, నా కన్నులయందె
నిలుచుగావుత మల్లె పీడలఁబోలి
ప్రళయకాలమున సర్వము గ్రసియించి
యేకుఁడై యుండి యనేక ధాత్వంబుఁ
జేకొనునప్డు నీ చిత్తమ్మునుండి
వెలిగె నీసర్వంబు విష్ణుండు విధుఁడు—
ఘలుఘల్లుమని పాదకటకముల్ మ్రోయఁ
బలికె వేదమ్ములు బహుళ శాస్త్రములు
ఫలియించె సర్వదేవతల నోములును
నీకన్నపురు మహాత్మాకల్ప మూర్తి
నీకన్న కారుణ్య నిచితనీరదము
నీకన్న దుష్ట సన్నిహాత మృత్యువును
నీకన్న గతియెందు నిక్కంబు లేదు
నీకన్న కానుపు నిబిడశోకంబు
శోకార్చి, కన్నులముందు నిల్చుండి
పలికింపవేమిరా! పార్వతీరమణ!
చిలికింపరానవ్వు చిలుత వెన్నెలలు
ఎంతవి నిన్నుఁ బ్రార్థింతురా! తండ్రి
యెంతని తలపోసి యేడ్తురా! జియ్య!
యీ వియోగంబు సహింపగాలేను
దావాగ్ని కన్నసుద్భుటము నీ వాక్కు
వరి నన్నుఁజూచి ప్రపంచమ్మునందె
పురుగుగాఁ బుట్టింపుము కలం లేదు
కాని నీ యమృత వీక్షణములేకున్న
నీ నవ ఖండ ధాత్రీశ్వర పదవి
యబ్బినలేదు నా కావంత సుఖము
దబ్బరగాదు! సత్యంబు నీతోడు

నీవు వచ్చెదునని యెలిచినానోయి!
నీ నవ్వుర్వీక్షకై నిత్రుపాసమున
కనలుచున్నవి నీ కనులు, నీతోడఁ
దనలోని కోటిచింతలు చెప్పుకొనగఁ
దహదహలాడుఁ జిత్తమ్ము! త్వత్పాద
గ్రహణంబునకు నాదు కరములుమిడుకు
నెన్నడు నీవు వీక్షింతువో! కాని
నన్నతాస్యంబు, నీ చరణ నీరేజ
ధూళికై వగఁగొన్నదో! లింగమూర్తి
చాలుమేలము మనఁజాలనో స్వామి!
యని పల్కి తన వసనాంచలమ్మునఁ
గనులొత్తుకొని నీలకంధరభక్తి
భరభుగ్న చిత్త తత్పరిత్న ప్రకాశ
పరిణాహాకారకా పరితఃప్రపూర్ణ
నయనావకాశ! వినయనయదీప్త
మయ! తనభాగ్యంబు మాఱిఁజూచి
సుదతి! గంగాంబు సంశోభితజూటు
నెదలోన నిల్పి పూజించితే యనినఁ
జిఱునవ్వు మొగముపై చిత్తడి గురియఁ
బరిపూర్ణరేఖ నీశ్వరుఁడు మద్భావ
సదనంబు మగఁడుగా - సాక్షాత్కరించి
ముదముతో నేనిచ్చు పూజలనంది
కొనుచున్న వాఁడింక కొదువనాకేమి?
యనె! నామె పతిభక్తియది యద్దిదానా!!
హర నివేదితమైన యన్నంబు గుడిచి
పరుపుపై తన మేను వ్రాల్చినయంత
పంచాక్షరీజప ప్రణవ చిత్తమ్ము
వంచించి నిద్దురవట్టె నానాడు

కలయది కలలోన కాలగళుండు
తలవని తలఁపుగా దర్శనంబిచ్చి
యోయి! మద్భక్తి భావోద్రిక్త హృదయ!
నీయుపాసనము సన్నిహితఫలమ్ము
పండరినాథుని భవ్యరూపమ్ము
పండించు నీ కోర్కె వాఁడుగా నేను
నేనుగా వాఁడును నిఖిల లోకముల
పూని రక్షింతుము ముంతుము సుమ్ము
తరలు ముగుడికిఁ బ్రాంతఃకాలమందు
పరమ భక్తుండైన బచ్చుని గుఱిచి
పరుషమ్ములాడితి! ప్రమథులకన్న
పరతత్త్వమెఱిఁగిన బసవనికన్న
నగరాజ సుతకన్న నా కన్నవాఁడు
జగదఖిలవంద్యుండు — చక్రి పూజకుల
నిటు నటుఁ బలుకఁ జన్నె ! యంచుఁ బలికి
నటులైన, నల్లన నఱలు విప్పి
వివిధ భావమ్ము లుద్వేగమ్ములగుచుఁ
గవగూడి పెనగ వికారంబు పొంది
యోచించి యోచించి యోరిమిఁ జెంది
వాచాతిగంబైన భవమూర్తి చెన్ను
తలపోసి తలపోసి తద్దయునలరి
పలికిన పలుకుల భావంబు దలఁచి
కలదని లేదని కడఁగి శంకించి
కలయని నిజమని కళవళమంది
జవరాల మేల్కొల్పి స్వప్న వృత్తంబు
వివరింపనెమ్మోము విరిసె నామెకును —
కనిపించినాడటే! ఫణిభూషణుండు
మనపూజ నేటికి మదికెక్కె నేమొ

పాండురంగని కొక్కవరి సేవదీర్చి
రండు చూతము నిశారమణ కోటీర
నానతి గద! యన్న సర్వోత్తములందె
ప్రాణేశు కుడికంటఁ బరిఢవిల్లినది
లలిత కిసాల కల్పంబైన కొత్తు,
పులకరించినది సంపూర్ణశరీర
మలివేణికతని భయంబుచేనానా॥
మలయమరుత సంగమమునవోశాక
విరిసెను చీకటుల్ విరియఁగలేదు
పరిపూర్ణములుగ దిగ్భాగంబులందు
కంసలవాని హృత్కంజాతమందు
సంశమపాస్తంబు సంశావపాస్త
మైనట్టి యజ్ఞానమట్లు, చంద్రుడు
దీనుఁడై వాడు సతీనాధుబోధ
గూడ కంసాలి చేకొనఁడేమొయంచు
పీడంబులను మెడల్నిక్కించి కూసె
పులుగుల దళము లభూతపూర్వంబు
నలరింపనొక్క బ్రహ్మానంద భరము
చరణాయుధమ్ములు చైర్చి నాదముల
సరమోత్కటో బరాబరులు సేసనవి
విశ్వరక్షకుడైన విఠలేశునకు,
శశ్వత్ప్రమోద బాష్పవ్యాప్తమైన
హారి గద్గద మంద్రధీరమ్మునైన
యూరుజభక్తలోకోత్తర పాండు
రంగ గీత స్తుతి, ప్రత్యూషపవన
సంగ దీక్షి కృత సంచారమగుచు
నెఱనెల్లవారల నిదురవేసనది,
వరమదైవంబైన పండరి నాధు

గుడిగోపురంబులఁ గొమరారుచున్న
పడగల కమరిన పసిఁడిమెఱుంగు
చిఱుగంట లల్లన చెలఁగి నవ్వినవి—
కరుణా నిబద్ధ శంకరంవాత వచన
పరిబాధ్యమాన హృత్పద్ముండు, గూఢ
తరదుర్మదుఁడు శోక దళితుఁ డాబత్తు
తలరి కింకర్తవ్యతా మూఢుఁ డగుచు
మలవారుఁ డై పట్టి మల్లికార్జునిఁ
బూజించి తత్పాదముల నీరుగ్రోలి
యోజననేకథా యోజించికొనుచు
తడఁబడు పాదముద్రలతోడ గర్వ
ముడివోవుదాన దైన్యోద్విగ్నమైన
మనముతో వరచచ్చి ప్లావ బాష్పముల
కొనగోట మీటుచుఁ గోమటియింట
నడుగుపెట్టినయంత నాతండు లేచి
యడుగుల కెఱగి సాష్టాంగమ్ముగాఁగ
యెంత య్యదృష్టమో! యీ నాడు హరుఁడ
నంతామ కంపగృహమ్ముకే వచ్చి
దరిసెన మొసఁగెఁ, దథ్యముగ నాభవము
తరియించె నంచు పాదమ్ములు గడిగి
జలములు గ్రహియించి సతియునుఁదాను
కులవర్ధమండగు కొమరుతో శోత
వెట్టించి మొగమెల్ల వినయంబుదొలఁక
కట్టెదుటను నిల్చి కరములు మొగిచి
యానతియేమన్న! నా విర్ధలేళు
కానిఎంపుము నేనె గ్రహియింతుఁగొలత
మొలమాలుకని' వ్యథామగ్నుఁడై పలుకఁ—
బలుకును దానిలో భావంబుగూడ

తెలిసి, తెలియనట్లు తిన్నగా నవ్వి
కలవికస్వరములు కడగంటిచూపు
కోపులు పరిఁజుట్టు కొనువట్లు దారిఁ
జూపిన శైవుండు శూన్యమవన్కుఁ
డై వెనువెంటనే యభిగమియించెఁ—
దీవెలు గొనుచున్న దృక్కులు నిటల
పరిరంస్వమాణముల్ పల్లవసామ్య
ధరితోష్ఠ రుక్పరిష్వక్తముల్ చూర్ణ
కుంతలమ్ములు మీరకోమటి బిడ్డఁ
దంతఁ జంపకదామ హస్తముల్సాచి
తరుణ మనోహరి చరణనీరేజ
ఏరటాయితమ్ములు పాదాంగదములు
స్వనియింప వెనువెంటఁబరివ విల్లాలు
తన పసిబిడ్డ రోదనమును హృదయ
కుతుకంబు గెడఁగు దికొనుచుఁ బ్రేరేప
పతివెంటనే నీడవలె నడచినది
యూరి వారెల్లరు నుబ్బరపోయి
చేరి యీ వార్తయే చెప్పుకొన్నారు
పరసిజనేత్రి, కంసలవాని భార్య
తరుణార్క నేత్రుని దరిసించువేడ్క
కలసికొన్నది ప్రాణకాంతుని తోడ
పలిమానసైక భావక్రాంతుఁడైన
పీరశైవుఁడు కనులివ్వనేలేడు
పార్యత్నరమ్ము పంచాక్షరీజపము
విడువనేలేదు నాపెలఁది ప్రాణేశు
నడుగుల మఱచిన యదియునులేదు
రంగనిధ్యాన సారపు మత్తుఁడతఁడు
త్వగత్పుతంగాయిత మదనకాయ

సారజ్ఞ విషమాక్ష చటచటద్వహ్ని
పూర, రుద్రధ్యాన భూషితుండితఁడు
విశదభస్మ ప్రభావేష్టితుఁడతఁడు
కృశతను పుండ్రాంక కీర్ణుండితండు
తులసికాదామ గంధిల కంఠుఁడతఁడు
లలిత రుద్రాక్షమాలా రమ్యుఁడితఁడు
హరిహరాభిన్నత్వమ మరినయట్లె
హరిహర భక్తులకైక్య మబ్బినది
వీక్షింపరో! మరుద్వీధులనుండి
యక్షుల మోదబాష్పాళితో సురలు!
వారేమి? రంగఁడే పరవశుఁడగుచు
కారుణ్యమునకోటి కన్నుల తోడఁ
గురియించినాడు దిక్కోమలుల్ కనుల
విరియించి చూచిరి వింతదృశ్యమ్ము —
కిరణ దళమ్ములు క్రిక్కిరియించి
కరమర్థిఁ దనలోనె కలకల విరిసి
తరుణత్రయీమూర్తి తానె కెందమ్మి
విరియయి, పూజింపనేచియున్నాడు —
తలల నలార్చి ముద్రతి వనస్పతులు
చిలికించినవి రస చిక్కణ మధువు
లానంద వికసితమైనట్టి వేళ
నానంద నందను నాలయమందు
కనక ఘంటికలు మంగళము పాడినవి
మనములు సమ్మోద మధురముల్గాఁగ
దరిసినారిర్వురు తటిదంబరుగుడి
పరమేశ్వరై కాంతభక్తునిఁ జూచి
నవ్వుకొన్నాఁడు లోననె విఠలుండు
నవ్వులే పువ్వులైనవి, విగ్రహమున

పండరినాథుని భద్రరూపంబు
దండఁ జేరిన యంతతనువు విస్తృతము
బచ్చిన కీశావ భక్తుని మేన
చిచ్చునాల్కలు దాచి చెరలాడినదియు
శ్రీ మనోహరు భక్తు చిత్తమ్మునందు
కామధేనువు పాలుకరుడు గట్టినవి
పచ్చవిత్తునిదాయ భక్తునెడంద
పచ్చినెత్తురు లొల్క పాయవిచ్చినవి
నందనందన భావనాబద్ధమతిని
నందనారామంబు విచ్చిపోయినది
భోగిభూషణ పాదవ్రాజకు హృదిని
నాగులు తలలెత్తి నాట్యమాడినవి—
కోమటి కన్నుల క్రోవుల నిండ
ఆమోద బాష్పంబు లావర్షించినవి
కంసాలి మీలితాక్షమ్ములనుండి
స్రంసమానమ్ము పశ్చాత్తాపజలము
కమలాక్షభక్తశేఖరుఁ దూరజానకు
ప్రమదమ్ముతోమేను పరవశించినది
గౌరీధవార్చనై కరటికి శోక
భారంబుచేమేను పల్లటిల్లినది,
వలపుచే విర్దలు పరమభక్తునకు
పులకలు నిలువెల్ల పూచి పొంగినవి
కలితకుగ్భురితాప ఘనకళాదునకు
పులకలు కంటకంబులుగ నిల్చినవి
కంఠమ్ముమోద విక్లబము కోమటికి,
కంఠమ్ముదైన విక్లబము బత్తునకు,
కలితోష్ఠబింబపురు చారుకపోల
కలద్రవస్రవత్స్వేదతతి రూషితులును

నిశ్వాస మాలికా నిభృతులిర్వురును
నశ్వర భవవాసనావి యుక్తులును
పరమ భక్త్యుద్రేకభరితులిర్వురును
పరమాత్మ వీక్షణ పరమానసులును
గమనించె గోమటి కన్నులు విచ్చి
కమలనాభుని దివ్యరమణీయ మూర్తి
దోచినధనములు దొరికినయట్లు
వాచాతిగము వైభవము దక్కినట్లు
తన భాగ్యమెల్ల ముందఱ నిల్చినట్లు
తన కలలెల్ల తథ్యములైన యట్లు
కటితట విన్యస్త కరములతోడ
నిటుకపై నిలుచున్న యిందిరా రమణు
చరణముల్ గమిచి విస్రబ్ధగాత్రముల
ధరనొరగిన తన ధవుని వీక్షించి
కనులలో, గన్నీరు గ్రుక్కుచు జాయ
తనయుని డించి యాత్త చిత్తమున
నలరుక్మిణీ ప్రతి యదుగులదోయి
చిలికించినది కోకచిక్కణాశ్రువులు
బాలుండు ముగ్ధభావంబుతో నింద్ర
నీలకటాక్షముల్ నించినవాఁడు
లాలితా కారుఁడౌ లక్ష్మీశుమేన,
ప్రాలేయ కన్యకాప్రాణేశచరణ
పరిపూజనైక జీవనుఁడైన బత్తు
తెరువడు కనులు హృద్దేశంబునందు
పెనగొని యున్నవి వివిధభావములు
వనితా శిరోమణి వానియిల్లాలు
సేవించుచున్నది శ్రీ నికేతునుని
భావభవాంతకు భవ్యరూపమ్ము

చిన్నిలేమైనఁ దోచిన వేమి! యామె
కెన్న జ్ఞానములకేమి! యీ విభేదములు?
అబ్బురపోయినా రర్చకులెల్ల
గిబ్బ తత్తడి బత్తు కృపణదీక్షలకు
పది నడివేళ, దేవాలయమందు
గదిఎకొన్నది కాంతి ఘంటికాధ్వనులు
నిలచెను భక్తులు నిలయాళి ముఖ్య
చలితులు కతిపయ జనము లాశ్చర్య
కలితులందే దిదృక్షా కౌతుకమున
నిలచిరి, వారిలోపల నొక్కఁడేని
విగత సంస్కారుండు వెదకిన లేఁడు,
ఖగకేతనైక కాంక్షలులితుండు
పరమార్థ తత్వ దివ్యస్వరూపంబు
పరమభక్తుఁడు కొంతవడికినిఁ దెలిసి
కనులు విప్పని వాని కఠిన పాషాణ
మునుఁబోలు కంసాలి మొనసి వీక్షించి
కరుణాశ్రువులు జడికట్ట! నో యన్న!
యరయని దేమి? దివ్యానంద భూమ
మైన రంగని చెలువదెకటీరంబు
మానుగాఁగొనుము ప్రమాణమంచనినఁ
గరము దాపగఁ బోయి కనులిల్లెయున్న
పరవశత్వమునఁ జాపల్యమ్ముగలిఁగి
తెరతువో యనెడు సందియమున మునిఁగి
పరమశైవుండు సంవ్యానమ్ము తోడఁ
గనులు గట్టికొని, డగ్గరి కటీరంబు
మునిప్రేళ్ళఁ బుడికిన భుజగోపవీత
ఫణము కన్పింప, దిగ్భ్రాంతుఁడై వాఁడు
తమదానె నమ్ముకఁ, దరుణాబ్జ నేత్రు

నాపాద చూడంబు నంటిన సర్ప
నూపురంబును గజనూతన కృత్తి
వ్యత్యస్త పాద విన్యాసంబు, సారి
తాత్యంత పీన భుజార్గళ యుగము
గళవలత్కీకస కమనీయహార
ములు కపాల తరళమును తిగకన్ను
జటిల జటాజూట జాహ్నవీ పూత
తటవికచిత చంద్రతరుణ సుమమ్ము
భుజగమండల నైక పూత్కారకోష్ణ
రణితగండస్థల భ్రాజిష్ణుమూర్తి
దోచిన నాశ్చర్య ధూత వివేకుఁ
డై చిత్రపట్టుల పాస్తచేష్టుండు
నిలుచుండి మదిలోన పలుపలు గతులఁ
దలపోసి, చంద్రావతంసుడే యనెడు
భావంబు తిరపడి, బహుళ విషాద
మావేశము గాఁగ నయ్యయో యిన్ని
దినములు తథ్యంబు తెలియనిదాన
వినతసురాసుర విమలకోటీర
మణిగణ చుంబిత మహనీయ పాదు
భణితి మండను నిన్నుఁ బండరినాథుఁ
దని యెంచి, యపరాధుఁడై నాను తండ్రి!
నను దయ మన్నించి నాయఘంబులను
క్షమియింప వలయు నిష్కారణ బంధు!
భ్రమిత చిత్తుఁడనంచు బాష్పజాష్టంబు
లశ్రులు విప్పన, నా క్షణంబుననె
పక్షివాహనుఁడైన పాండురంగండు
సమచరణములతో, శారద వికచ
కమలముఖమ్ముతోఁ, గటితటన్యస్త

కరములతోఁ, పీతకౌశేయ కాంతి
హరిత సుందర లలితాంగంబుతోడ
కరుణా వికస్వర గండ ప్రదేశ
పరిణత తాటంక భాసురకాంతి
చయముతో, సాధురక్షయత్న దీక్ష
శయధృత మధుర వంశమ్ముతో మృదుల
చరణ తులాకోటి సామబుగ్గావ
భరముతోఁ, దదను రవవ్యగ్రయజుర
ధర్వణ హస్తాంగదంబుల, లలిత
సర్వమనోహారి సరసహాసమున
దరిసెన మొనఁగినఁ దల్లడమొంది
శిరమునల్లార్చి యాస్సీయని రోప
తనువు తీవ్రద్వేష దళితమై తూఁగఁ
గమలత్తై మూయుచుఁ గరములు దాచి
పుడికిన, మఱి యదే భుజగభూషణము
నొడలిపై గజకృత్తి నిడుంద ముక్కన్ను
వలమాన వికట కపాలహారమ్ము
తలపైని రేఖేఁడు, తధ్యమ్ముగాఁగ
నచ్చు గ్రుద్దిన యట్టులమరినఁ జూచి
మెచ్చి యఱుల విప్పు మృదుల మయూర
ఎంభ గుచ్ఛాపీడ పీనకై శ్యుండు
వంచక దూరవై భవుఁడు, గోపీ దృ
గుత్సవ మంజు గుంజోద్భాసితుండు
వత్సవత్సలుఁడు దివ్యనిగమశాఖ
శాఖాగ్ర పల్లవ చరణయుగ్మండు
పౌఖశాయనిక విష్వపరిష్వక్త
సనకాదిశేంద్రియ చషకపీయూష
కనదుదారస్మృత కలితుండు, విధృత

నవతులసీ వాసనా మృషకుండు——
శివమనో మందార జీవపుష్పమ్ము
పాండురంగఁడు దయాభరితుఁడై దోవ
రెండు కన్నులయూం రేగినగాం
హరహర యని మూర్ధమైనట్టి చిత్త
మురియాడఁ గన్నుల నూరు బాష్పముల
నిలచినఁ గంసాలి, నిబిడ నిశ్వాస
చలితాధరోష్ఠు, వేష్టనైక భావ
పరిపూర్ణ మానస హృత్పద్మునిఁ జూచి
మురహర భక్తుండు మొనసి ప్రశ్నించు
వంతి వజ్ఞానాంధ కాసురహంత
సంతత భక్తరక్షా బద్ధ బుద్ధి
ప్రత్యక్ష దైవమ్ము పండరి నాథుఁ
డత్యంత మధుర వాక్యముల నీరీతి
పలికెను, భూతేశ భక్తుని గురించి
కలిమలా విషయి సంకల్ప! గిరీశ
చరణాక్రమితము యుష్మద్హృదయంబు
నిరవకాశమె! కాశ నిమిషంగనైన
నావంత యవకాశమబ్బునో! మాకు
రావచ్చునో! యుడు రాజధరుండు
కోపగాడట నన్ను గూర్చి నీపేవ
నోపఁడో! గ్రహాయింప నూకొట్టవేమి?
యని తిన్నగా మేల మాడినఁ——గోల
గొని ప్రేపటులైన ఘోరతాపమున
నదరు శరీరంబు నల్లాడు నెలుఁగు
వదవదయైనట్టి యంగముల్గల్గి
కను దమ్ములను నిండి కవియుచీకటుల
మనము చీకటియు ముమ్మరముగఁ బెనఁగ

నిలిచెఁ గళాదుండు నిండెను పులక
లల పంకజాక్ష సేవాయత్త మతికి
దచ్చిన శానంద పరవశత్వమున
తచ్చపలాక్షి ముగ్ధంబైన హరిణి
వడువున సర్వేశుఁ పండరినాథు
నెడఁద నల్లని చూపు నింపవేసినది
మతిపల్కె నాశ్రిత మాయానిరోధ
పరిపూర్ణ హృదయుఁడౌ పాండురంగండు
పరమార్థ భావనా వంధ్యులు, వాద
పరిణత బుద్ధులు, వక్రప్రవృత్తు
లత్యల్ప సంస్కారు లజ్ఞాన చక్ర
వాత్యా విధూత తత్త్వజ్ఞానులైన
కుటిలులు గల్పించు కొరమాలినట్టి
నటనలు గాక యున్నదె మాకు మాకు
భేదలేశంబు, నోబేల! పీవేల
వాదంబులకుఁ జిక్కి వసమఱచెదెదు!!
హరిగిరీశులు భిన్నులమువారు వారి
పెరవుమాలిన పల్కు వినువారు ఘోర
నరక కూపంబున నవయుచుండుదురె?
హరుఁడు నాయాత్మ పశ్యాత్పులు మదిని
దివిరి పెల్గొందెదు దివ్వెను నేమ
దివస కరుండ ద్వితీయుఁడై యున్న
వివిధ శరీరుఁడై వెలిఁగెదు భంగి
నవని మర్త్యులకు శ్రేయస్కాముఁ డగుచు
నానా విధంబుల నామరూపములఁ
బూని వర్తింతును నేవ! యీజ్ఞాన
మలవడనట్టి వారందఁగలేరు
కలిగృహీతులు మోక్షకమనీయ పదవి

నా శివాంశమున కనసూయా భక్తి
సేసినదాన, నీ సేవల కలరి
నిన్నుద్ధరించు పూనిక మదిఁ బూని
సన్నుతి నింత యుపాయమ్ము సుమ్ము,
అత్రి మహాముని యనఘుండు తొల్లి
పుత్రార్థియై తపంబునఁ జరియించి
నన్ను పాలించిన నన్నున మేము
నన్నుగ మువ్వురు ప్రత్యక్షమైన
నచ్చెఱు వడుచు నేనాది విష్ణువున
కిచ్చగించిన, నెట్టులివు దొక్కపారె
మువ్వురు ననుకంపఁ బూని తిరనఁగ
నవ్వి యో సువ్రత! నామ రూపములు
భిన్న రూపములైన బేలు తోయితివి
కన్నులు గాక, లోకన్నులు దెఱచి
కనుమోయి! సత్యంబు గందువుగాని
గణుతింప నొక్కఁడే గలదు దైవంబు
నిరుపాధికంబది, నిర్వికల్పంబు
నిరుపమానంబు వినిర్గతాద్యంత
సీమ లోకావవశీలమై భిన్న
నామరూపంబుల నైకప్రకార
ములవెల్గు కూటస్థ పురుష నర్పింప
కలదు వందఱఁ గొల్వఁగలుగు ఫలమ్ము
వాసుదేవ స్వరూపమునకు భక్తి
చేసితిఁగాదొ! నీ చేసిన తపము
వరున మువ్వుర కనువర్తించె సుమ్ము
వరమౌని! మాయంశభవుల నీకుఁ
దోఁచ దత్తాత్రేయ దుర్వాస చంద్రు
లిడిత మతులు జన్మింతురు సత్య

మునివర మొసఁగితి నాయుదంతంబు
వినలేదా! నీ వన్న, వీరశైవుఁడు
మనమువిచ్చినది రమాపతి కరుణ
తనువెల్లఁ బులక సంతానమ్ము విరిసె,
పాండురంగనిఁ గొల్చు పరమ భక్తునకు
పండు వెన్నెలకాంతి - వాని యిల్లాలు
పుణ్యజీవిత మంచుఁ బొంగిపోయినది
గణ్యవిచార యాకంపాలి భార్య
శ్రవణముల్ విచ్చి యాశ్చర్య సంతోష
వివశయై విన్నది విర్గలు వణకు
దిక్కులన్నిట నొక్క దివ్యసందేశ
మక్కజంబు గనిండి నొక్కిపల్కినది,
యలపాలసంబైన యమృత మారుతము
జిలిబిలి యనువదించినది భాషణము
గగన మార్గమునుండి కదుపులై సురలు
నగుమొగంబులఁ జూచినారు, ధరిత్రి,
ప్రముదితమతి చంద్రభాగాప్రవంతి
గమనమ్ములో వింతకళలు చిమ్మినది,
మల్లికార్జున శిరోమాల్యమౌ - గంగ
యుల్లాసమున సుధనొలుకఁబోసినది,
గోరూప ధారిణి క్షోణీపవిత్రి
శ్రీ రమ్యములు, చనుశ్చేపు ఎండినది
పుల్లతంత్రీస్వన భూప్రణాహృదయ
వల్లకు లొక్కచే భంగి మ్రోగినవి
తపముచే బ్రహ్మంబు దర్శింపుమనెడు
నుపనిషత్తుల యమృతోపమ వాక్కు——
వీరశైవుని పుణ్య వీథి - విచ్చినది
వీరశైవుని కంచె వెలుఁగు విచ్చినది

నవ్వుచున్నాఁడు నటరాజు వెన్ను
పువ్వుల యెదలోని పొందమ్మియందు
నవ్వుచున్నాఁడు నందనందనుఁడు
మువ్వన్నె పులితోలు ముసుఁగులఁదాగి
హరిహరులేక మూర్తి నైక్యమ్ము నెంది
దరిసెన మొసఁగిరధ్యాత్మధామములు
గళసీమ గద్గదాకలితమై వణక
పులకలు తంగేడు పూలుగాఁబూయఁ
గనుల నానందమే కాలువగాఁగఁ
దనువెల్ల జడము చిత్తము రాగ పూర
పూరితమును గాఁగ ముఖముల్లసిల్ల
వీరశైవుఁడు భక్తి వివశుఁడై కోటి
భవముల పుణ్యంబు పండినయట్టు
లవనీసతీ కుంకుమాంక చిహ్నములు
చంద్రికానిటల కాసార పద్మములు
ఖండిత నిజభక్త కలుషముల్ నిగమ
వీధీవిహారుండు విర్ఠలు పదము
లాదర మెదురమగు చూడ్కి ద్రావు
కైవడి చూచుచుఁ గరములు చేర్చి
భావంబు సంభ్రమ భ్రమితమై తూఁగ
వలికె నాయపరాధ భరము సహించి
కలిమల జుష్టుని, గర్వాంధమతిని
కాలిఎంచి కొన్నదే కోటి దీవెనలు
తలమానె! తండ్రి నీ దయ యింతయనఁగ
భవమంతయును వృథా భ్రాంతిలో మునిగి
యవివేకినైన నాయందు నీకెంత
మమకారమోయి! రమానాథ! నన్నుఁ
దమియించు నీ తీయదనపు వేదనలు,

హరిహరీ! శిక్షార్హుడైన నాయందు
కరుణ గుప్పితివి, నీ కఠిన విచిత్ర
శిక్ష నా హృదయమే చీల్చివేసినది—
దక్షాధ్వర ధ్వంస! తావకీనంబు
సలలిత ధీర దర్శనముతోపాటు
కలుపుకోరా నన్ను! కైలాసమునకు
తాంభ ఎంభ నందానిత మౌళి!
గోప గోపీ మనః కుట్మల సురభి!
తారకా కమన సుందర జటాశాలి
తారక! చంద్రికాధవళ శరీర!
హరిహరరూప దివ్యానంద వార్ధి
పరిపూర్ణ విగ్రహ! భాగ్యైక ఫలమ!
యనినుతియించి - సాష్టాంగంబుగాఁగ
వినమితుఁడైన ద్యోవీధిలోనుండి
కురియించె నిర్జరకోటి ప్రమోద
భరితమాశీర్వాద భద్రభాగ్యములు
పండరినాథుని భాగ్యంపుమోవి
నిండె వెన్నెలతావు నిచిన నవ్వు
కోమటి భక్తుని కోర్కెలు పండి
యామోదములు దిక్కులందుఁ బంచినవి
నెఱఁ బరస్పరమును నిండు కౌగిళుల
కరగిపోయిరి బిచ్చు కంసలభక్తు
మొలనూలు కట్టిరి ముప్పిరిపుల్లితులు
నిలినాక్ష భక్తులు నడుమునకటికి
పరిపోయినది కాలసర్పపట్టంబొ
చిఱుగజ్జియలమ్రోత చిందుదామంబొ—
యాకళాదుని భార్యయర్యాని యువతి
శోక కన్నుల విరి చూపులతోనె

కలిసికొన్నారు నిష్కలుష బాంధవము,
చిలిపిచూపులనవ్వు చిందఁగ ద్రొక్కఁ
బడిబడి నడలతో ముందుకు వచ్చి
బడుతఁడు కంసాలి పుట్టంబుఁ బట్టి
యెత్తి కొమ్మని - చేతులెత్తుచున్నాఁడు
హత్తినయాశ్చర్య మంతరంగముల
కెచ్చుగాఁ గన్నులనిసుఁ జింతలాఁడ
నచ్చంపు గంధర్వులైరి పూజరులు,
కలకలమని గుడిగంటలు మ్రోసెఁ
గలుగుమోదము వెళ్ళఁ గ్రక్కెడు భంగి
తరలెభక్తయుగమ్ము దళ్ళతీమణులు
దరలిరి, వెనువెంటఁ దరకాయకాతు
లవ్వారిపోయెడు నర్ఘ్యమ్ములందు.
నవ్వారి, వినమితంబైన మస్తములు,
కాలాంతరంబునఁ గల్మషదూరు
లోలనమోక్షంబు నొందిరివారు
సందేహమేల! యీ సర్వలోకంబు
లందు, విర్ధలుఁడు, ప్రత్యక్షదైవమ్ము,
వాని నామముకలి పాపమారకము
వానిరూపము భక్తభావమందార
మనియిట్లు, ప్రశ్రయధనుచేత వైష్ణ
వవతమస్తకుచేత పండరినాథ
చరణనీరేజ సంచరమాణ, భృంగ
పరివారని భవర్వవాసనుచేత
నైకభాషాపరిజ్ఞాన దుగ్ధాబ్ధి
శీకరమృదువచస్సేచనుచేత,
ఘన గిరి తిర్మలగణ్యకాకార్య
జననపవిత్రిత ఘనవంశజనన

చిరపుణ్య పరిణాహపరిమళుచేత
నిరతశబ్ద బ్రహ్మనిధ్యానసన్మ 25
నోరమకీర్తి కర్పూరునిచేత
పారణీయగుణుండు, పండరీశ్వరుని
కృతినాథుఁ గావించి, కీర్తింపఁబడిన
ప్రతిలేని పండరీ భాగవతమ్ము
శ్రీమహాత్మాకారు, చిత్సుఖాధారు
సామజరక్షకు, సర్వసురేడ్యు
పై జయంతీమాలవలె, సర్వసేవ్య
మై, జగమ్ములఁదావులందించుఁ గాఁత, 829

(నరహరి చరిత్రము సమాప్తము)

పండరీ భాగవతము సంపూర్ణము

---

